Viicika (Essays on Literary Criticism)
Written by
Dr. Darla Venkateswara Rao

Lecturer (Sr.Scale),
Department of Telugu,
School of Humanities,
University of Hyderabad,
Gachibowli, Hyderabad-500 046. A.P.

Home Page: www.vrdarla.blogspot.com
Email: darlash@uohyd.ernet.in, vrdarla@gmail.com,
Phone: 09989628049, Office: 04023133563, Res: 040 2313 6006

First Edition: March, 2009
Copy Right: Author.
Copies: 500
Price: 75/-

---

The Book has been published with the Financial Assistance under the UGC-Unassigned Grants given by the UNIVERSITY OF HYDERABAD.

---

For Copies:
M.Manju Sree, Govt, JR. Lecturer in Telugu,
House No: 4-8-89, Alamapally, Vikarabad, Ranaga Reddy Dist.

M.Manju Sree, Govt, JR. Lecturer in Telugu,
Unit:6, University Quarters, Near Ladies Hostel Compound,
University of Hyderabad Campus,
Gachibowli, Hyderabad-500 046.

Dr. Darla Ravi Kumar, Telugu Pandit,
Cheyyeru Agraharam, Via: Anathavaram (S.O.)
East Godavari Dist., A.P., India - 533 222.

www.societyandeducation.org
(Free download, Ph: 9396202960)
Samantara Book House, Hyderabad.
Prajasakti Book House, Hyderabad.
Visalandhra Book House, Hyderabad.

Cover Page Design: Kiran

DTP Settings: Majji DurgaRao. Mobile:09848248003

Printed at : Prajasakti Daily Printing Press, Hyderabad.

# అంకితం

నా జీవితంలో కొత్త వెలుగులు ప్రసరించిన
ప్రముఖ భాషా శాస్త్రవేత్త
మా గురువు గారు



ఆచార్య పరిమి రామనరసింహం గారికి
కృతజ్ఞతలతో, వినయంతో, భక్తితో
సమర్పిస్తున్న
ఓ పుష్పం!

- దార్ల వెంకటేశ్వరరావు

# కృతజ్ఞతలు

సాహిత్యం పట్ల ఆసక్తి పెంచిన గురువు గారు డా।। ద్వానా శాస్త్రి గారికీ...

హైదరాబాదు విశ్వవిద్యాలయంలో అధ్యాపకుడిగా అవకాశం కలిగించి సాహిత్యంలో కృషి చేసేందుకు ప్రోత్సహించిన విశ్వవిద్యాలయం వారికీ...

నన్ను ఆశీర్వదించి నన్ను ఎంతగానో ప్రోత్సహించిన గురు వర్యులు, భాషాశాస్త్రవేత్త, సహృదయ సాహితీ వేత్త ఆచార్య పరిమి రామనరసింహం గారు ఈ పుస్తకాన్ని అంకితం తీసుకోవడానికి అంగీకరించినందుకు వారికీ...

ఈ పుస్తకానికి 'వీచిక' అని పేరు పెట్టి 'లహరి' పేరుతో ముందుమాట రాసి ఆశ్వీరదించిన హైదరాబాదు విశ్వవిద్యాలయం తెలుగుశాఖ అధ్యక్షులు, ప్రసిద్ధ సాహితీ వేత్త ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గారికీ...

ఎం.ఏ. నుండి పిహెచ్.డి. వరకు పాఠాలు చెప్పి సహ అధ్యాపకుడిగా ఆదరించిన గురు వర్యులు ఆచార్య పరిమి రామనరసింహం గారికి, ఆచార్య శరత్‌జ్యోత్స్నారాణి గారికి, ఆచార్య ఎన్.ఎస్. రాజు గారికి, ఆచార్య కె.కె. రంగనాథచార్యులు గారికి, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారికి, ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య గారికి, ఆచార్య రవ్వా శ్రీహరి గారికి, ఆచార్య జి. అరుణకుమారి గారు, డా।। పిల్లలమర్రి రాములు తదితరులు అందరికీ...

పుస్తకానికి అభిప్రాయం రాయమనగానే లోతైన విశ్లేషణతో అభిప్రాయాలను రాసి పంపించిన ఆచార్య కె. కుసుమా రెడ్డి గారికి, ఆచార్య బన్న అయిలయ్య గారికి, డా।। ద్వా.నా. శాస్త్రి గారికి, అలాగే మిత్రుడు డా।। అద్దంకి శ్రీనివాస్ గారికీ...

ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయం చేసిన హైదరాబాదు విశ్వవిద్యాలయం అధికారులకీ, ఆర్థిక సహాయం ఇవ్వవచ్చని సిఫార్స్ చేసిన ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారికి, ఆచార్య కె. కుసుమా రెడ్డి గారికీ...

నన్ను ఎల్లప్పుడు ప్రోత్సహిస్తున్న ఆచార్య గుజ్జర్లమూడి కృపాచారి గారికి, ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి గారికి, ఆచార్య చేకూరి రామారావు గారికి, ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య గారికి, ఆచార్య ఆకురాతి పున్నారావు గారికి, ఆచార్య కొలకలూరి ఇనాక్ గారికి, ఆచార్య ఎండ్లూరి సుధాకర్ గారికీ...

ఈ వ్యాసాలను ప్రచురించిన వాఙ్మయి, తెలుగు వైజ్ఞానిక త్రైమాసక పత్రిక, ప్రజాసాహితి, అరుణతార, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, విశాలాంధ్ర, హైదరాబాదు మిర్రర్, వార్త మొదలైన పత్రికల యాజమాన్యాలకీ...

ఈ పుస్తకంలోని వ్యాసాలను ఇంటర్నెట్ పత్రికలు ఈ-మాట, ప్రజాకళ, దట్స్ తెలుగు, ప్రాణహిత మొదలైన మాస పత్రికలలో ప్రచురించినందుకు ఆ యా యాజమాన్యాలకీ...

ఈ పుస్తకంలోని వ్యాసాలను ముందుగా ఆ యా పరిశోధన ప్రత్యేక సంచికలలో ప్రచురించిన వారికీ...

1980 తర్వాత స్త్రీవాద నవల పుస్తకంలో 'మనసున మనసై' నవల గురించి రాసిన వ్యాసాన్ని ప్రచురించినందుకు ఆ సంపాదకులు ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి గారికి, డా।। కె. లక్ష్మీనారాయణ గారికీ...

'కులవృత్తి'పై రాసిన వ్యాసాన్ని కొలకలూరి ఇనాక్ సాహిత్య విమర్శపై ప్రచురించిన పరిశోధన గ్రంథంలో ప్రచురించిన డా।। కొలకలూరి మధుజ్యోతి గారికీ...

ఈ వ్యాసాలు రాసేటప్పుడు వివిధ చర్చలలో పాల్గొన్న 'ఈమాట' ఎడిటర్స్ (అమెరికా) కొలిచాల సురేష్, ఇంద్రగంటి పద్మ, ఆర్. సీతారామయ్య తదితరులకూ... వివిధ సాహితీ చర్చల్లో పాల్గొని నా ఆలోచనా పరిధిని మరింత విస్తరించుకోవడానికి సమయం కేటాయించే హైదరాబాదు విశ్వవిద్యాలయం, తులనాత్మక సాహిత్యంలో అధ్యాపకుడుగా ఉన్న డా।। జె. భీమయ్య గారికీ...

తెలుగుశాఖలో నాకు ప్రశాంతమైన వాతావరణాన్ని కలగజేస్తూ సహకరిస్తున్న డా।। పిల్లలమర్రి రాములు, ఆచార్య తుమ్మల రామకృష్ణ, డా।। రామకృష్ణ శాస్త్రి, డా।। పమ్మి పవన్ కుమార్, డా।। డి. విజయలక్ష్మీ, డా।। భుజంగ రెడ్డి, డా।। అద్దంకి శ్రీనివాస్ గార్లు అందరికీ ...

నా సుఖ దు:ఖాలలో నాతో సమానంగా పయనించే నా సహధర్మచారిణి, నా జీవిత భాగస్వామి మంజుశ్రీకీ...

నా కుటుంబ సభ్యులకూ.... తమ్ముడు డా।। దార్ల రవికుమార్‌కీ...

నాకు ఎప్పుడు అందుబాటులో ఉండే నా పరిశోధక విద్యార్థి మజ్జి దుర్గారావుకీ...

పుస్తకం రావడానికి వివిధ రకాలుగా సహకరించిన కిరణ్, రవి కుమార్, శివరామ్ ప్రసాద్ గార్లకూ మరియు జరుపుల రమేష్, మద్దిరాల సిద్ధార్థ, దార్ల సుధీర్ కుమార్, దార్ల మురళీలకూ...

ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించిన ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్ వారికీ...

పుస్తకాన్ని అందంగా ముద్రించడానికి సహకరించిన జయరామ్, మధు, ఉపేంద్ర గార్లకూ...

ముఖ చిత్రాన్ని అందంగా డిజైన్ చేసిన కిరణ్ గారికీ, ఇంకా రక రకాలుగా సహకరించిన వారందరికీ కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

# విషయ సూచిక

ఆచార్య పరిమి రామనరసింహం
తెలుగు శాఖ
హైదరాబాదు విశ్వవిద్యాలయం
హైదరాబాదు 500046

# అందుకోలు

నిత్య అధ్యయన శీలి, నిశిత పరిశోధనా వ్యవసాయి, నా సహ అధ్యాపకుడు డా।। దార్ల వెంకటేశ్వరరావు తన అధ్యాపకులకు గర్వకారణమైన విద్వత్తును సాధించాడు. ఆ విద్వత్తుకు నిలువెత్తు నిదర్శనమే ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న ఈ విమర్శ వ్యాస సంపుటి వీచిక. ఇందులోని ప్రతి వ్యాసం అతని నిశితమైన విమర్శ దృష్టికి, విషయ అవగాహనకు అద్దం పడుతుంది.

ఆధునిక సాహిత్యం పట్ల మంచి అవగాహన కలిగించి మంచి విమర్శనాత్మక దృష్టిని అలవరుచుకోవటానికి విద్యార్థులకు ఎంతగానో ఉపయోగపడే ఈ గ్రంథంలో మిత్రుడు, సహవ్రతుడు డా।। దార్ల నా పేరుకు ఎంతో ఆదరంతో కల్పించిన చోటును ఆనందంగా అందుకుంటున్నాను.

ప్రామాణికమైన విమర్శకుడుగా ఎదుగుతున్నందుకు డా।। దార్లను అభినందిస్తూ మున్ముందు అతను విమర్శలో ఉన్నత శిఖరాలను అధిరోహించాలని ఆశిస్తున్నాను.

పరిమి రామనరసింహం

12 ఫిబ్రవరి 2009
హైదరాబాదు

ఆచార్య బేతవోలు రామబ్రహ్మం
తెలుగు శాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం
హైదరాబాదు- 500046

# లహరి

అనారతాధ్యాపన తత్పరుడు మా సహవ్రతుడు డా।। దార్ల. అధ్యాపనం సంతృప్తికరంగా సాగాలంటే అనారతాధ్యయన తత్పరత ఉండాలి. ఈ రెండు గుణాలూ పుష్కలంగా ఉన్నాయి వీరిలో. ఇక్కడితో సంతృప్తి చెందకుండా తరగతి గదికి వెలుపల ఉండే అసంఖ్యాక సాహితీ ప్రియులకు తన ఆలోచనలను, విశ్లేషణలను, సమన్వయాలను, అవగాహనలను అందించి స్వీయాభివృద్ధికీ, సాహిత్యాభివృద్ధికీ రచనా వ్యాసంగాన్ని ఒక వ్యసనంగా సాగిస్తున్న విమర్శకుడు ఈయన. సంప్రదాయ ఆధునిక సాహిత్యాలలోని అన్ని రూప భేదాలనూ, వాద వైవిధ్యాలనూ ఆకళింపు చేసుకుని విలువైన వ్యాసాలూ, సమీక్షలు, గోష్ఠి పత్రాలూ పుంఖాను పుంఖంగా వెలువరిస్తున్న సాహితీ కృషీవలుడు ఈయన. వీటి అన్నింటికీ నిదర్శనం ఈ వ్యాస సంపుటి.

పరిశోధకుడిగా పింగళి లక్ష్మీకాంతం గారి వరివస్యను మదింపు వేసినా, వల్లంపాటి వారి విమర్శ దృక్పథాన్ని విశ్లేషించినా, జ్ఞానానందకవి, మల్లవరపు జాన్ గార్ల పద్యకృతులను అనుశీలించినా, సాహిత్యంలోని ప్రాంతీయతలనూ, మానసిక స్థితిగతులనూ మూల్యాంకన చేసినా, నానీలూ, కథలూ, నవలలూ, అనువాద నవలల్లోని రూప వైవిధ్యాన్ని ఆవిష్కరించినా, దళిత వాద, స్త్రీవాద, మైనారిటీ వాదాల నేపథ్యంలో ఆయా రచనల విలువలను నిర్ధారించినా డా।। దార్ల - తలస్పర్శి అవగాహనతో, నిష్పాక్షికతతో చేసి తన ఉత్తమ విమర్శక లక్షణాన్ని నిరూపించుకున్నారు. ఈ సంపుటిలోని ప్రతివ్యాసమూ పాఠకుల అవగాహన పరిధులను విస్తరించేదే. ఏదో ఒక కొత్తదనాన్ని ఆలోచనాత్మకంగా అందించేదే. మామూలు మాటల్లో చెప్పాలంటే చదువరి శ్రమకు ప్రతి వ్యాసమూ గిట్టుబాటు అవుతుంది.

ఇది ఇలా ఉండగా వీరిలోని మరో విశిష్టత ఏమంటే - ఈయన ఒక నెటిజన్. ఆధునిక సాంకేతికతను సాహిత్య చర్చలకు సద్వినియోగం చేసుకుంటున్న యువతరం ప్రతినిధి. భూగోళం మీద ఏ మూల ఉన్న తెలుగు సాహితీ ప్రియుడికైనా తన రచనలను అందిస్తున్నారు. ఆలోచనలను పంచుతున్నారు. చర్చలను సాగిస్తున్నారు. ఇది బహుధా ప్రశంసనీయం.

నిజానికి - లబ్ధ ప్రసిద్ధుడైన ఈ విమర్శకుడి రచనలకు నా కితాబు అవసరం లేదు. అయినా వృద్ధోపసేవీ రాఘవ: అన్న తీరున నన్ను నాలుగు ముక్కలు రాయమని అడిగారు. సహవ్రతులం. వీరి సాహితీ గురువులు ద్వా.నా. శాస్త్రి, రమణ మూర్తి ప్రభృతులు నా చెలికాండ్రు. పైగా ఈ వ్యాసాలు చదివి లబ్ధిపొందిన వాణ్ని. అభినందించకుండా ఎలా ఉండగలను! మరొక విషయం - నానాటికీ అన్ని రంగాలలోనూ విలువలు దిగజారిపోతున్న నేటి తరుణంలో వీరు ఈ గ్రంథాన్ని గురు ఋణ మీగు పొంటె ఆచార్య పరిమి రామనరసింహం గారికి అంకితం చేశారు. ఎంతటి ఆనందమోహిని ఈ సన్నివేశం! ఇన్నింట ఇలా నన్ను భాగస్వామిని చేసిన సోదరుడు డా।। దార్లకు పున: పునరభినందనలతో - సెలవు.

20.02.2009 బేతవోలు రామబ్రహ్మం
హైదరాబాదు.

ప్రొ.కె. కుసుమా రెడ్డి
అధ్యక్షులు, తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వ విద్యాలయం
హైదరాబాదు.

# అభినందన మందారాలు

చిరంజీవి దార్ల వెంకటేశ్వరరావు రచించిన ''వీచిక'' అనే గ్రంథం అత్యున్నత ప్రమాణాలతో ఈ తరం పరిశోధకులకు మార్గ దర్శకంగా ఉంది. ఈ పుస్తకంలోని ఒక్కొక్క వ్యాసం ఒక్కొక్క దృక్పథంతో సాహితీ విలువలను ఆవిష్కరిస్తున్నది. ఇందులోని వ్యాసాలన్నీ ఆణిముత్యాలవంటివి. ఈ వ్యాసాల్లోని విశ్లేషణ, వివరణ, విమర్శ, వివేచన, పరిశీలన, అనుశీలన, సమీక్షా విధానాలు విశిష్టంగా ఉన్నాయి.

''వీచిక''లోని వ్యాసాలన్నీ వివిధ సందర్భాల్లో రచింపబడినవి కావడం వల్ల వైవిధ్యం అనే లక్షణం ఈ పుస్తకానికి సహజంగానే అబ్బింది. విశ్లేషణలో శాస్త్ర సమన్వయం, వివరణలో సమగ్రత, విమర్శలో నిజాయితీ, వివేచనలో ఆలోచనాశక్తి, పరిశీలనలో నిశిత దృష్టి, అనుశీలనలో క్రమ వికాసం, సమీక్షలో స్పష్టత దార్ల ప్రత్యేక లక్షణాలని ఈ వ్యాస సంకలనం వల్ల తెలుస్తుంది.

ఇక దార్ల వెంకటేశ్వరరావు వ్యక్తిత్వాన్ని గురించి చెప్పాలంటే ఇతను పరిశోధనలో దిట్ట. భాషలో పట్టు ఉన్న ఉపాధ్యాయుడని నా అభిప్రాయం. విమర్శ గ్రంథమైనా, సిద్ధాంత గ్రంథమైనా ఇతను సాహిత్య పరిమళంతో గుబాళించే శైలితో రచించగలడు. భవిష్యత్తులో ఇతను మంచి విమర్శకుడుగా పేరు తెచ్చుకొనే అవకాశముంది.

ఉత్తమ విమర్శకుడి లక్షణాల్లో ముఖ్యమైంది నిర్మొహమాటంగా ఏ విషయాన్నైనా ధైర్యంగా చెప్పటం. ఈ లక్షణం దార్ల వెంకటేశ్వరరావులో పుష్కలంగా ఉంది. ఆరుద్ర సాహిత్య యుగ విభజనలో కొంత వెలితి కనిపిస్తుందనీ, దాన్ని సమర్థించుకోవడానికి ఆయన చాలా ప్రయత్నం చేశాడు కాని ఎర్రన యుగం ఆధునిక యుగం వంటి వాటిలో ఆయన సమర్థనలు అందరికీ ఆమోద యోగ్యం అనుకోవటానికి వీల్లేదని దార్ల నిర్మొహమాటంగా చెప్పాడు.

'మనసున మనసై' అనే నవలలో రచయిత్రి ప్రయోగించిన పలుకుబడులను. జాతీయాలను ప్రస్తావిస్తూ వాటిని సహజత్వం కోసం ప్రయోగించినా అలాంటి వాటిని ప్రయోగించటానికి సమయం సందర్భం కూడ ముఖ్యం కదా! అని ప్రశ్నించటంలోను దార్ల ధైర్యం స్పష్టమవుతుంది.

రచయిత ఆత్మను, అతని రచనలోని ఆంతర్యాన్ని అర్థం చేసుకొనే సహృదయత విమర్శకునికి ఉండాలి. అలాంటి సహృదయం కలిగిన వాడు దార్ల వెంకటేశ్వరరావు. వ్యాకరణ దీపం కంటే విమర్శ దీపం చిన్నదనీ ఆ దీపాన్ని పెద్దది చేసే ప్రయత్నానికి తనవంతు కృషి చేస్తానని వల్లంపాటి వారు చేసిన ప్రకటనలోని వినమ్రతను గుర్తించి విమర్శ దీపం కాంతివంతంగా వెలగటానికి ఆయన చేసిన కృషిని వివరించిన దార్ల అభినందనీయుడు.

భాషలో విలక్షణత దార్ల ప్రత్యేకత. స్పర్శించడం, కవిత్వీకరించటం, దళిత వేదన, తియ్యని బాధ వంటి పద ప్రయోగాలు దార్ల వెంకటేశ్వరరావు భాషా ప్రయోగ వైశిష్ట్యాన్ని స్పష్టం చేస్తున్నాయి.

విమర్శకుల అభిప్రాయాలను గౌరవించడంలోను పరిధులను గుర్తించడంలోను దార్ల నేర్పరని తెలుస్తుంది. ''ముస్లిం స్త్రీవాద కవిత్వం అంటే ముస్లిం స్త్రీలు రాసిందే అవుతుంద''న్న ప్రముఖ విమర్శకుడు ఎండ్లూరి సుధాకర్ గారి అభిప్రాయాన్ని గౌరవించి, ముస్లిం స్త్రీల కవితా విశ్లేషణ వరకే తన పరిధిని దార్ల నిర్ణయించుకొన్నాడు. ఇలాంటి వివేచన, విచక్షణ అతని సునిశిత బుద్ధికి నిదర్శనం.

సాహిత్య వికాసానికి దోహదం చేసేవి ప్రక్రియలు. సాహితీ విలువలను పెంచేవీ ప్రక్రియలే. ఆధునిక యుగంలో అత్యాధునికంగా అడుగుపెట్టిన సాహితీ ప్రక్రియ ''నానీలు''. ద్వానా శాస్త్రి గారి నానీలను సమీక్షించటంలో దార్ల పరిశీలనా పటిమ స్పష్టమవుతుంది. చమత్కార రచనా శిల్పం వెల్లడి అవుతుంది. ఛందో బందోబస్తులను ఛట్ ఫట్మనిపించి, చమక్కులను, చమత్కారాలను, రస గుళికలను మెరిపించే కవిత్వాన్ని నానీలలో పండించి ఆహా అనిపించేటట్లు రాయగలిగే ప్రయత్నం మాత్రం నానీలలో కనిపిస్తుందని దార్ల పేర్కొనడంలో అతని శైలీ శిల్పం తెలుస్తుంది.

ప్రతి రచయితా తాను చేపట్టిన ప్రక్రియకు గౌరవాన్ని తెచ్చే నైపుణ్యం కలిగి ఉంటాడని ఒక్కొక్కసారి ఆ నైపుణ్యం కొరవడినా వస్తువుని బట్టి ఆ ప్రక్రియ ఆదరణకు పాత్రమవుతుందని, గోర్కి రాసిన 'అమ్మ' నవలలో ఆ రెండూ ఉన్నాయని చెప్పటంలో దార్ల సునిశిత పరిశీలనా దృష్టి స్పష్టమవుతుంది.

మొత్తం మీద దార్ల వెంకటేశ్వరరావు ఈ వ్యాసాల్లో వివిధ ప్రక్రియలను తీసుకొని విమర్శ చేశాడు. దీన్ని లోతుగా గమనిస్తే అది ఒక ప్రణాళికా బద్ధంగా కనిపిస్తుంది. ఆ విమర్శ వ్యాసాల్లోని ప్రత్యేకతలను ఇలా విశ్లేషించవచ్చు.

1) సర్వ సాధారణంగా ప్రతి వ్యాసంలో ఒక విషయాన్ని ప్రతిపాదిస్తాడు. ఆ ప్రతిపాదనకు అవసరమైన ఆధారాలను అన్వేషిస్తాడు. కేవలం దొరికిన ఆధారాలతోనే తాను ప్రతిపాదించే అంశమే కరక్ట్ అనే ధోరణిలో కాకుండా, ఈ పద్ధతిలో కూడా ఆలోచించవచ్చనే విమర్శనాత్మక దృష్టి దార్ల వెంకటేశ్వరరావు రాసిన వ్యాసాల్లో కనిపించే మౌలికాంశాల్లో ఒకటి.

2) విమర్శలో అనువర్తన కత్తి మీద సాము లాంటిది. ప్రక్రియను అనుసరించి అనువర్తిత మార్గాలు వేర్వేరుగా ఉంటాయి. ఈ వ్యాసాలన్నీ ఇంచు మించు అనువర్తిత విమర్శ పద్ధతిలోనే సాగాయి. ఒక్కొక్క ప్రక్రియకు ఒక్కొక్క పద్ధతిని అనుసరించాడు.

3) వ్యాసంలో ముందుగా తన పరిధిని స్పష్టంగా గుర్తిస్తాడు. దాన్ని వివరించటంలో స్పష్టంగా వ్యవహరిస్తాడు.

4) భారతీయ ఆలంకారికులు సహృదయతకు ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చారు. అనౌచిత్యాలను లేదా దోషాలను పేర్కొంటూనే, కవి/రచయిత ఆత్మను దర్శించి, దాన్ని పాఠకులకు చూపటంలో విమర్శకుని సహృదయత వెల్లడవుతుంది. సహృదయ విమర్శకుడుగా దార్ల ఈ వ్యాసాల్లో కనిపిస్తాడు.

5) నవలపై రెండు వ్యాసాలు ఉన్నాయి. ఒకటి తెలుగు నవల. మరొకటి తెలుగులోకి అనువాదమైన నవల. విమర్శకుడు మూల రచనను విమర్శించడంలో అనుసరించిన పద్ధతినే తీసుకుంటే అనువాద రచనకు కుదరదు. మూల రచనను కూడా చూసి, రెండింటినీ పోల్చి రచయిత ఆత్మను ఆవిష్కరించగలగటం ఉత్తమ విమర్శగా పేర్కొనవచ్చు.

6) పరిశోధనను పింగళి లక్ష్మీకాంతం గారి పరిశోధనతో అనువర్తించి, సమకాలీకులైన, రాబోయే పరిశోధక విద్యార్థులకు మార్గ దర్శనం చేసే పద్ధతి కనిపిస్తుంది.

7) తన విశ్లేషణలో వస్తు, రూపాల్ని సమన్వయిస్తున్నట్లు కనిపించినా, సామాజిక, సాంస్కృతిక అంశాల పైనే అధికంగా దృష్టిని కేంద్రీకరించేలా చేశాడు.

8) నిర్ణయాలను ప్రకటించేటప్పుడు సమన్వయాన్ని చేసి, సంయమనంతో వ్యవహరించడం ఒక మంచి లక్షణం.

అలా రెండు భాషల్లోని రచనలను పరిశీలించడం కుదరనప్పుడు, ఆ పరిధిని నిర్ణయించుకొని విమర్శ చేయాలి. కనుక, ఇవన్నీ విమర్శలో ఎదురయ్యే సమస్యలు. వీటిని దార్ల సునిశితమైన పరిశీలనతో విమర్శ చేశాడు. ఇలా రెండు నవలలను ఎన్నుకోవడంలోనే విమర్శకుడిలో విలక్షణత, ప్రత్యేకతలు స్పష్టమవుతున్నాయి.

9) ప్రాంతీయతలో విశ్వజనీనతను చూడగల విశాల దృక్పథం దార్లలో కనిపించే మరో ప్రత్యేకత. వెనుక బాటుతనం అన్ని చోట్లా ఉంటుందని దానిపై పాలకులు దృష్టి సారించాలని ఆయన చేసిన సూచనలో సర్వమానవ సౌభ్రాతృత్వం అవగతమవుతుంది.

మొత్తం మీద 'సాహిత్యం' హితంతో కూడిందనే నిర్వచనాన్ని సార్థకం చేస్తూ విమర్శ రచనలోనూ దాన్ని పాటించిన దార్ల వెంకటేశ్వరరావు అభినందనీయుడు. ఉత్తమ విలువలతో రచింపబడిన "వీచిక" సాహిత్య లోకంలో అత్యుత్తమంగా ఆదరణకు పాత్రమవుతుందని భావిస్తున్నాను.

30-07-2008 కె. కుసుమా రెడ్డి
హైదరాబాదు.

డా।। ద్వా.నా. శాస్త్రి
1-1-428, గాంధీనగర్
హైదరాబాద్ - 500080
ఫోన్: 9849293376

# సహృదయ విమర్శ

నా జీవితంలో గర్వించే సన్నివేశాలు చాలా వున్నాయి. నాకున్న శిష్య సంపదకి ''నాలోన నేనే గర్వించుకొందు!'' అటువంటి సంపదలో డా।। దార్ల వెంకటేశ్వరరావు ముఖ్యుడు. అమలాపురం - శ్రీ కోనసీమ భానోజి రామర్స్ కళాశాలలో దార్ల నా శిష్యుడు. ''స్పెషల్ తెలుగు'' విద్యార్థిగా నాకు బాగా దగ్గరయ్యాడు.

దార్ల సోదరుడు, సోదరి కూడా నా శిష్యులే. డిగ్రీ విద్యార్థిగా ఉండగానే దార్ల వెంకటేశ్వరరావు ప్రతిభావంతుడని గుర్తించి ప్రోత్సాహపరిచేవాడ్ని. ఆ రోజుల్లోనే గ్రంథాలయాన్ని ఉపయోగించుకొనే అతి కొద్దిమందిలో (అధ్యాపకుల కంటె మిన్నగా) దార్ల ఒకడు. సమకాలీన సాహిత్యాన్ని అధ్యయనం చేసి పరిశీలించటం అతడికి కళాశాలలోనే అలవడింది.

ఆ తర్వాత ఒక సంఘటనలో దార్ల పక్షాన నిలబడి నా ఆత్మీయ మిత్రుడికి శత్రువునయ్యాను. దార్ల వెంకటేశ్వరరావు అంటే నాకు అంత ఇష్టం! కేంద్రీయ విశ్వ విద్యాలయంలో జేరమని సలహా ఇచ్చాను. అలాగే అక్కడ ఎం.ఏ. తెలుగు చదివి, ఎం.ఫిల్, పి.హెచ్.డి.లు కూడా సంపాదించాడు. అంతేకాదు ఇవాళ అదే విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో అధ్యాపకుడు కూడా! గురువుకి ఇంత కంటే సంతోష సమయం ఏమి వుంటుంది?

మా దార్ల ''*జ్ఞానానందకవి ఆమ్రపాలి పరిశీలన*'' అనే ఎం.ఫిల్, సిద్ధాంత వ్యాసాన్ని ప్రచురించాడు. ''*దళిత తాత్త్వికుడు*'' అనే కవితా సంపుటి తెచ్చాడు. నాగప్పగారి సుందర రాజుతో కలిసి మాదిగల పక్షాన అక్షర సమరం చేశాడు. సుందర రాజుకి నేనంటే చాలా ఇష్టం. కానీ, దురదృష్టం ఏమిటంటే ఆ ఉద్యమ శీలి ఒక ప్రేమ వ్యవహారంలో భీరువులాగా తనువు చాలించాడు! అటువంటి నాగప్పపై దార్ల ''*ఒక మాదిగ స్మృతి: నాగప్పగారి సుందర్రాజు పరిచయం*'' అనే పుస్తకం రాశాడు. ''*సృజనాత్మక రచనలు చేయడం ఎలా?*'' అనే మరో రచనలో సృజనాత్మక రచనలు చేయడానికి తాను గమనించిన మెలుకువల్ని వివరించాడు. ''*దళిత సాహిత్యం: మాదిగ దృక్పథం*'' గ్రంథం లో కొన్ని చర్చనీయాంశాలను పెట్టాడు. వివిధ పుస్తకాలకు రాసిన సమీక్షలను ''*సాహితీ సులోచనం*'' పేరుతో ప్రచురించాడు.

ఈ 'వీచిక' అనేది విమర్శ గ్రంథం. దీనిని నా సహాధ్యాయుడు, గొప్ప విద్వాంసుడు, భాషా శాస్త్రవేత్త ఆచార్య పరిమి రామ నరసింహానికి అంకితమివ్వడం నాకు అమితానందం!

'కవి'గా పేరు తెచ్చుకోవటం కంటే, కథా రచయితగా మెప్పు పొందడం కంటె - విమర్శకుడిగా ప్రశంసలు పొందటం కష్టతరం. అందరూ విమర్శకుడ్ని విరోధిగా లేదా అననుకూలునిగా చూస్తారు. విమర్శను సహించలేని వారే అత్యధికం. విమర్శను స్వాగతించే వారు చాలా చాలా తక్కువ. ఈ రంగంలో వున్న నాకు ఇటువంటి అనుభవాలు ఎన్నెన్నో! అయినా మా దార్ల ధైర్యంగా విమర్శను చేపట్టాడు.

దార్ల విమర్శలో సంయమనం వుంది. విశ్లేషణ వుంది. తార్కికత కూడా వుంది. అందుకే ఇతని విమర్శను 'సహృదయ విమర్శ' అంటున్నాను. కవి లేదా రచయిత మనసును గ్రహించి తదను గుణంగా విమర్శించడమే సహృదయ విమర్శ. దార్ల ప్రధానంగా దళిత రచయిత. అయితే అందులోనే చక్కర్లు కొట్టే సంకుచిత స్వభావం అతనికి లేదు. సాహిత్యాన్ని సాహిత్యంగానే చూసే సహృదయం కూడా వుంది. ఈ ''వీచిక'' ద్వారా ముమ్ముందు మనకి మరొక మంచి విమర్శకుడు రాబోతున్నాడని తెలుసుకుంటాం. ఇది శిష్య పక్షపాతంతో అంటున్న మాట కాదని ఈ పుస్తకం చదివితే మీరే తెలుసుకుంటారు.

'వీచిక'లోగల అన్ని విమర్శ వ్యాసాలు వైవిధ్యమైనవి. విశిష్టమైనవి. విలక్షణమైనవి. అంతేకాదు - విశ్లేషణాత్మకమైనవి కూడా. ఈ విమర్శను ఇలా వింగడించవచ్చు.

సాహిత్య చరిత్రకి సంబంధించిన విమర్శ, విమర్శపై విమర్శ, పద్య కవితా విమర్శ, ప్రాంతీయ అస్తిత్వ విమర్శ, దళిత విమర్శ, కథా విమర్శ, నవలా విమర్శ, నానీల విమర్శ, ముస్లిం, స్త్రీవాద విమర్శ.

వీటిని బట్టి దార్ల ఎక్కువగా సమకాలీన సాహిత్య విమర్శనే చేపట్టాడని తెలుస్తుంది.

దార్ల వెంకటేశ్వరరావు విశ్లేషణా శక్తి, వివేచనా శక్తి తెలుసుకోవాలంటే ''పరిశోధకుడుగా ఆచార్య పింగళి లక్ష్మీకాంతం'' అనే వ్యాసం పరిశీలిస్తే చాలు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు ప్రతిభా మూర్తి అనటంలో సందేహం అక్కరలేదు. తమ ''నోట్సు'' ద్వారా మార్కులు వచ్చేలా చేసి ఎంతోమంది ఎం.ఏ. తెలుగులో ఉత్తీర్ణులయ్యేలా అయన ఒక మార్గం వేశారు. చాలా సంవత్సరాలు ఆంధ్ర విశ్వ విద్యాలయంలోనే కాదు - మిగిలిన విశ్వ విద్యాలయాలలో కూడా అప్పటికి లక్ష్మీకాంతం గారి ''నోట్సు'' ఒక్కటే శరణ్యంగా వుండేది.

నిజానికి పింగళి వారి 'ఆంధ్ర సాహిత్య చరిత్ర'ను అంత గొప్పగా భావించని వారే ఎక్కువ. కానీ, దార్ల వెంకటేశ్వరరావు సుమారు ఇరవై పుటలలో లక్ష్మీకాంతం గారి పరిశోధనా ప్రతిభను నిష్కర్షగా, లోతుగా మూల్యాంకనం చేశాడు. లక్ష్మీకాంతంగారిని

కొంత 'అతి'గా ప్రశంసించాడేమో అనిపిస్తుంది కానీ - తెలుగులో మొదటగా సాహిత్య చరిత్రను ఎలా అధ్యయనం చేయాలో - విశ్వ విద్యాలయాలలో సాహిత్య చరిత్రను ఏ విధంగా బోధించాలో, ప్రశ్నా పత్రాలను ఎలా రూపొందించాలో పింగళి వారే మార్గం చూపారు. ఆ రీత్యా దార్ల ప్రతి పాదనలను ఆహ్వానించవల్సిందే. కానీ, ప్రబంధ లక్షణాలుగా పింగళి లక్ష్మీకాంతం గారు చెప్పినా, జి.వి. సుబ్రహ్మణ్యం గారు చెప్పినా అవి సహేతుకమూ సంపూర్ణమూ కానే కాదు. కావ్యం, ప్రబంధం సమానార్థకాలు కాగా, ఆయన రెండూ వేర్వేరుగా చెప్పి సంక్లిష్టతనీ, అస్పష్టతనీ ప్రకటించారు. దీనిని దార్ల గుర్తించి ఉండవల్సింది. ఇదలా వుంచితే ఈ వ్యాసం చాలా రకాలుగా ప్రామాణిక విమర్శ వ్యాసం అనడం ఉన్నమాటే అవుతుంది.

వల్లంపాటి వెంకట సుబ్బయ్య మార్క్సిస్టు విమర్శకులు. చాలా వరకు హేతు బద్ధంగానే ఆలోచిస్తారు. నిబద్ధత (కమిటెడ్) అనగానే విమర్శలో వక్రీకరణ తప్పదు. మధురాంతకం రాజారాం కథల్లో వర్ణన ఎక్కువనీ, రావిశాస్త్రి కథల్లో వ్యాఖ్యాన చాపల్యం వుంటుందనీ వల్లంపాటి అనడం సమంజసం కాదు. కథా రచనలో ఇవి విభిన్న శిల్పాలు. కొత్తగా వ్యాఖ్యానించాలన్న తాపత్రయమే దీనికి కారణం. ఈ లోపాలను దార్ల పసిగట్టగలిగితే మరింత బాగుండేది. అయినా దార్ల విశ్లేషణ నవ్యాతి నవ్యం!

మల్లవరపు జాన్ కవి గారి కవితా శక్తిని సరిగ్గా అంచనా వేసి కవి సామరస్య వాతావరణాన్ని వాంఛిస్తున్నాడనటం అత్యంత సముచిత వ్యాఖ్య. ''కళ కళ కోసమా? ప్రజల కోసమా?'' అనే చర్చలో జాన్ కవి ఉభయుల కోసమనే వర్గానికి చెందుతారనటంలో దార్ల తీర్పు సమంజసంగా, కవి సహృదయపరంగా వుంది.

కళింగాంధ్ర కవిత్వంపై రాసిన విమర్శ వ్యాసం దార్ల సునిశిత పరిశీలనకి మచ్చు తునక. మంచి విమర్శ వ్యాసమే. అయితే చివరిలో ఒక ప్రశ్న లేవనెత్తి అసమంజస వ్యాఖ్య చేశారు. తూర్పు గోదావరి జిల్లాను కళింగాంధ్రంలో పరిగణించటం సమంజసం అనటం అసమంజసం. భాషా శాస్త్ర వేత్తల ప్రకారమే కాదు చారిత్రకంగా కూడా కళింగ ప్రాంతం వేరు. మొదట్లో కళింగాంధ్రను కూడా కోస్తాలో కలిపారు. ఆ తర్వాత కోస్తా వేరు, కళింగాంధ్ర వేరు అయింది. కళింగాంధ్ర కవులు, రచయితలు తమ రచనలలో గోదావరి జిల్లాల వారి ఆధిపత్యాన్ని ప్రశ్నిస్తూనే వున్నారు. విశ్వ విద్యాలయం ఏర్పాటుకీ ఈ ప్రాంత విభజనకీ ఎటువంటి సంబంధమూ లేదు. కొత్తగా చర్చకి తేవటం అనవసరం గదా!

కాసుల ప్రతాపరెడ్డి కథ ''వెంటాడిన అవమానం'' పై విమర్శ వ్యాసం సహేతుకంగా, ప్రామాణికంగా, విశ్లేషణాత్మకంగా సాగింది. నేటి కథల్ని ఎలా విమర్శించాలో ఈ వ్యాసం చెప్తుంది. విశ్వ విద్యాలయాల్లో కథలపై పరిశోధన చేసే వారికి ఈ వ్యాసం ఆదర్శం. ఆమ్రపాలి కథపై తులనాత్మక పరిశీలన చేసిన తీరు ప్రశంసనీయం. డి కామేశ్వరి గారి ''మనసున మనసై'' నవలపై దార్ల విశ్లేషణ కూడా ఔచిత్యంతో కూడుకొని ఆలోచనాత్మకంగా వుంది.

''దళిత సాహిత్యం - మౌలిక భావనలు'' అనే వ్యాసం సమగ్రమైనది. ఎన్నో వ్యాసాలు వచ్చినా -వాటి కంటె సమగ్రంగా వుంది. పోటీ పరీక్షల అభ్యర్థులకి, సివిల్స్ అభ్యర్థులకి, అధ్యాపకులకి తోడ్పడే వ్యాసమిది. నేను రాసిన ''నానీలలో సినారె'' కవితా సంపుటిపై కూడా వ్యాసం వుంది. ముస్లిం 'మైనారిటీ కవిత్వంలో స్త్రీవాద దృక్పథం' వ్యాసం ఎంతో కొత్త సమాచారం ఇస్తుంది.

మొత్తం మీద మా దార్ల వెంకటేశ్వరరావు విమర్శనా రంగంలో కలం కదపడం స్వాగతించదగినది. ఇదే పరిశీలననీ, అధ్యయనాన్ని ముందు ముందు కూడా ''నిష్కర్షగా'' కొనసాగిస్తే తెలుగు సాహిత్యానికి మరొక సహృదయ - సద్విమర్శకుడు లభించినట్టే!

హైదరాబాదు

ద్వా.నా. శాస్త్రి

ఆచార్య బన్న అయిలయ్య
ఎం.ఏ., పిహెచ్.డి
ప్రొఫెసర్
తెలుగు విభాగము, కాకతీయ విశ్వవిద్యాలయం,
విద్యారణ్యపురి, వరంగల్.
సెల్ నెం: 9949106968

# సూక్ష్మ వివేచన

అధ్యయనం, అధ్యాపన, అభివ్యక్తి, పరిశోధన విశ్వ విద్యాలయాచార్యుల విధి. విశ్వ విద్యాలయంలోకి అడుగిడడం గొప్ప అవకాశంగా భావించిన వారెవరైనా ఈ విధిని నిర్వర్తించాల్సిందే. విశ్వ విద్యాలయానికి సమాజానికి అనుసంధానంగా ఉన్న ఆచార్యులు సమాజాన్ని చైతన్యంతో గమనించడం, అది ఎట్లా ఉందో వ్యాఖ్యానించడం, అవసరమైతే పరిష్కారం చూపడం ఒక జీవన విధానంగా మలచుకోవాలి. వృత్తిలో నిబద్ధత చూపే వాళ్ళకే ఇది సాధ్యం. డా।। దార్ల వెంకటేశ్వరరావు గారి ''వీచిక'' విమర్శ వ్యాస సంపుటి చదివాక అతనెంతగా నిబద్ధత కలిగిన ఆచార్యులో అర్థమవుతుంది. పద్నాలుగు వ్యాసాలతో దార్ల ప్రకటిస్తున్న సాహిత్య విమర్శ గ్రంథమిది.

వల్లంపాటి వారు జగమెరిగిన మార్క్సిస్టు విమర్శకులు. అయితే వీరు సంప్రదాయ మార్క్సిస్టు విమర్శకులుగా నిలిచిపోక కాలంతో పాటు తన దృక్పథాన్ని విస్తరించుకున్న విమర్శకులుగా దార్ల వ్యాసం చదివితే అర్థమవుతుంది. మార్క్సిస్టులు కేవలం వస్తువుకే ప్రాధ్యాన్యమిస్తారు. శిల్పానికివ్వరనే అభిప్రాయాన్ని వల్లంపాటి విమర్శ చూసాక మార్చుకోక తప్పదు. వారు కథా శిల్పం, నవలా శిల్పం పేరుతో చేసిన లోతైన పరిశోధనలే కాకుండా; వస్తు శిల్పాల్లో ఏ ఒక్కదానికి ప్రాధాన్యమిచ్చినా సాహిత్యం తన ప్రత్యేక అస్తిత్వాన్ని కోల్పోతుందనే వారి ప్రతిపాదన పూర్తి విశ్వాసాన్నిస్తుంది. ఇంకా కాల్పానిక సాహిత్యం మూలాలు పాశ్చాత్య సాహిత్యంలోనే ఉంటాయని; అగ్ని పురాణంలో కథానిక మూలాలు వెదకడం సరికాదని; అట్లాగే 'ఆఖ్యాయిక' అంటే నవల కాదనే వల్లంపాటి అభిప్రాయాల్ని దార్ల వ్యక్తం చేసాడు. అట్లాగే అలంకార శాస్త్రం పరిధి, పరిమితి తెలియని వాళ్ళు దాన్ని విమర్శగా భావించడాన్ని వల్లంపాటి ఒప్పుకోరు.

అలంకార శాస్త్రం రాచరిక కాలంలో ప్రభవిస్తే, విమర్శ ప్రజాస్వామ్య యుగంలో జనించింది. అలంకార శాస్త్రం రచనకు నిరంకుశంగా డైరెక్షనిస్తుంది. రచన ఎలా ఉండాలో చెప్పుతుంది. విమర్శ రచన ఎలా ఉందో చెప్పుతుంది. అయితే, అలంకార శాస్త్రం - విమర్శను అధ్యయనం చేయడం జ్ఞాన ప్రపంచంలో భాగమని గుర్తించాలంటారు వల్లంపాటి. వారు చేసిన రాయలసీమ సాహిత్య సామాజిక

సాంస్కృతిక విశ్లేషణ ఆంధ్ర ప్రాంత స్థితిగతులను అధ్యయనం చేయడానికి అదొక ఆకరంగా దార్ల భావించారు.

వల్లంపాటిలోని మరొక అరుదైన ప్రతిపాదనను దార్ల స్పష్ట పరిచారు. ఒకే సామాజిక నేపథ్యం కలిగిన కవులు, ఒకే ప్రాంతీయ నేపథ్యం కలిగిన రచయితల రచనలు ఒకేలా ఉండవు. అందుకు జాషువా - జ్ఞానానంద కవులు, విశ్వనాథ - కుటుంబరావులను ఇలాంటివే మరికొన్ని ఉదాహరణలు వల్లంపాటి అందిచారని దార్ల నిర్ధారించారు. మార్క్సిజం చలనశీలత గలిగిన ఒక మెథడాలజీగా ఉపయోగిస్తే దానిలో వర్గంతో పాటు వర్గ నిర్మూలన ఉందనే వల్లంపాటి అభిప్రాయాన్ని దార్ల నిర్ద్వంద్వంగా ఖండించారు. ఇలా అనేకమైన ఆసక్తికర అంశాలను దార్ల చర్చించారు.

'మల్లవరపు జాన్ కవిత్వంలో మాధుర్యం' ఆలంకారికులు చెప్పిన మాధుర్యం కంటే మించి ఉన్నదని దార్ల అంటున్నారు. ఇది కొంచెం అతిశయోక్తిగా అన్పించినా, నిజం కూడా లేకపోలేదు. భిన్న ధ్రువాలు కలిగిన వ్యక్తులను వస్తువులుగా స్వీకరించినా, భిన్న భిన్న వస్తువుల స్వీకరణ వల్ల, కఠిన వాస్తవాలను కవిత్వీకరించడం వలన మాధుర్యం వస్తుంది. అంతేకాదు ఇంకా పద్యం చదవడం వలన, శైలి వలన కూడా మాధుర్యం వస్తుందన్నారు.

కుల వ్యవస్థ అమానవీయమైనదని అంబేద్కర్ అంటే, ప్రపంచంలోనే అత్యుత్తమమైనదని గాంధీ అభిప్రాయం. జాన్ కవిత్వంలో ఈ ఇద్దరూ కన్పిస్తారు. అంటే తనకు తెలియకుండానే ఇరువర్గాల పాఠకులను రంజింప జేసే కవిత్వం జాన్ రాసారు. రెండు వర్గాలు ఏకం కావాలంటే 'సహృదయత' ఉండాలి. సహృదయత సామరస్యానికి బీజం వేస్తుంది. సామరస్యం కవిత్వంలో మాధుర్యాన్నిస్తుంది. దార్ల తార్కికంగానే ఈ విషయం చెప్పాడు. అట్లాగే జాన్ కవిత్వం 'కళ కళ కోసం' కాదనే విషయాన్ని నొక్కి చెప్పాడు.

ప్రపంచీకరణకు సరిగ్గా వ్యతిరేకమైనది స్థానీయత. స్థానీయతను సెంటిమెంటుగా చేసికొని వచ్చిన కవితా సంకలనమే ''కళింగాంధ్ర'' సంకలనమని దార్ల అభిప్రాయం. తమ మూలాలను తాము కాపాడుకునే క్రమంలో కోస్తాంధ్ర ప్రాంతంపై ఇతరులకున్న భ్రమలను ఇది తొలగిస్తుందన్నారు. భూతల స్వర్గంగా పేరున్న ఈ ప్రాంతం, అందరికి అంది వచ్చిన స్వర్గం కాదనే ధ్వనిని తెలియజేసారు. తెలంగాణాకున్నంత చైతన్యం కళింగాంధ్రకు లేకపోవడానికి కారణాలు వేరే ఉన్నాయన్నారు. ప్రాంతీయతలో విశ్వజనీనత ఇమిడి ఉన్న సంకలనంగా 'తూరుపు' కళింగాంధ్ర కవిత్వం పుస్తకాన్ని దార్ల ప్రకటించారు.

కులం, అస్పృశ్యత రెండూ సామాజిక వాస్తవాలే. కులం వల్ల కొందరు అదనపు సౌకర్యాలు అనుభవిస్తుంటే, మరికొందరు అవసరాలు తీరక విలవిల్లాడుతూ అవమాన భారంతో బతుకీడుస్తున్నారు. తరాలు మారినా ఈ విషయంలో మార్పు రాకపోవడం 'వెంటాడే అవమానం' కథలో కన్పిస్తుంది. ఉత్తమ కథలో సంఘర్షణతో పాటు,

అనుభూతి ఐక్యతలు గుణాలుగా చెప్పుకోవాలి. వెంటాడే అవమానంలో ఇవి తగిన విధంగా పోషింపబడ్డాయని వీరు అంటున్నారు.

మూడు విధాలైన సంఘర్షణలున్న ఈ కథలో - దళిత దళితేతరుల మధ్య సాంఘిక అసమానతల సంఘర్షణ; వారు కలిసి మెలిసి ఉండేటప్పుడు సాంస్కృతిక సంఘర్షణ; వీరు కలిసిమెలిసి జీవిస్తే భౌతిక భావ వాద సిద్ధాంతాలలో వాళ్ళు దీన్ని అనుసరించి జీవించడంలో సంఘర్షణలున్నాయని కథలోని పాత్రల ఆధారంగా దార్ల విశ్లేషించారు.

కథను విశ్లేషించే క్రమంలో అంబేద్కర్ తాత్వికతను అన్వయించడంలో వీరి విమర్శా నైపుణ్యం బహిర్గతమవుతుంది. కులం, అస్పృశ్యతలు నిర్మూలన జరగడానికి ఇంకెంతో సాంఘిక ప్రక్రియ రావాలని, అవి శాస్త్రీయ దృక్కోణంలో అమలు పరచాలని, కాని శాస్త్రీయతకు కూడా రుజువు కానివెన్నో ఉన్నాయన్నారు. నేడున్న పరిశోధనల ఫలితాల మీదే ఆధారపడితే కులం - అస్పృశ్యతల నిర్మూలన జరగదని దార్ల అభిప్రాయ పడ్డారు.

ఈ దేశం నుండి బౌద్ధం కనుమరుగైయ్యాక భారతీయ సంస్కృతికి విఘాతం కలిగిందనేది అభివృద్ధి కాముకుల అభిప్రాయం. తరువాత తరువాత ఈ దేశంలో మానవతా విలువలు అడుగంటాయి. బుద్ధుని జాతక కథల్లో 'ఆమ్రపాలి' కథ కూడా ఒకటి. ఆమ్రపాలిని వస్తువుగా చేసుకొని తెలుగులో జ్ఞానానందకవి, కరటూరి సత్యనారాయణలు కావ్యాలు రాస్తే, లల్లాదేవి నవల రాసారు. జ్ఞానానందకవి కావ్యం శాంతానికి, కరటూరి కావ్యం కరుణకు ప్రాధాన్యమిస్తే, లల్లాదేవి రచన సామాజికాంశాలకు ప్రాధాన్యమిచ్చారన్నారు. ఈ మూడు రచనల్లోని తండ్రి పాత్రలను గూర్చి తెలియజేస్తూ, జ్ఞానానందకవి తండ్రి పాత్ర నైతిక విలువలకు పట్టం గట్టితే, కరటూరిది దేశభక్తి పూరితంగా ఉందని, లల్లాదేవి తండ్రిని భయస్తుడిగా చిత్రించినట్లు దార్ల తెలిపారు.

ఆమ్రపాలి గణభోగ్యగా మారిన తర్వాత ఆమె తండ్రి పాత్రలను జ్ఞానానందకవి, కరటూరి బాగా చిత్రించారన్నారు. వీరిద్దరికంటే లల్లాదేవి చిత్రించిన ఆమ్రపాలి భిన్నంగా ఉందని, ఆమె నిర్బంధ వేశ్యగా మారాకా, ఆమెను బౌద్ధ బిక్షువుగా చూపడంతో విలువలకు పట్టం గట్టినట్లున్నదని వీరు భావించారు. ఈ ముగ్గురి రచనల్లో దార్లను బాగా ఆకట్టుకున్నది జ్ఞానానందకవి ఆమ్రపాలని తెలుస్తుంది. ఇందుకు కారణం కావ్యం చారిత్రక తత్త్వ లక్షణాలతో, బౌద్ధం బోధనలతో నిండి ఉండడమే. జ్ఞానానందకవి కావ్యంలో అన్ని పాత్రలు ఆమ్రపాలివైపు కదలగా, ఆమ్రపాలి మాత్రం బౌద్ధం వైపుకు నడవడం జరుగుతుందన్నారు. వర్తమాన కాలానికి బౌద్ధం ఎంతో అవసరమని జ్ఞానానందకవి భావించటం వల్లే, ఎంతో ఔచిత్యంతో దీన్ని తీర్చి దిద్దారనే అభిప్రాయాన్ని దార్ల వ్యక్తం చేసారు.

సాహితీ లోకంలో ఒక వాదం ప్రచలితంగా ఉన్నప్పుడు తత్ కాలంలో వచ్చిన సాహిత్యం ఆ వాదానికి ఎంత దగ్గరగా ఉంటుందో విమర్శకులు తేల్చే పనిలో

ఉంటారు. సాధారణ మధ్య తరగతి స్త్రీల జీవితాన్ని ఇతివృత్తంగా చేసుకొని వచ్చిన 'మనసున మనసై' నవలలో స్త్రీవాదం ఏ మేరకుందో దార్ల పరిశీలించారు. స్త్రీ జీవితం చుట్టూ చదువు, ఉద్యోగం, పెళ్ళి, పిల్లలు, పితృ స్వామ్య ఆధిపత్యం, ఆర్థికాంశాలుంటాయి. ఈ నవలలో కూడా పై అంశాలను పాత్ర గతంగా రచయిత్రి మలిచిన తీరును వివరిస్తూ పరిష్కారం దిశగా వచ్చాక దీనిలో లిబరల్ రాడికల్ ఫెమినిజం ఉందని దార్ల తేల్చారు. జీవిత దృక్పథాన్ని బట్టి హక్కులు, బాధ్యతలు వ్యక్తులే సాధించుకుంటారని, నవలలోని దమయంతి - జయంతి పాత్రల ఆధారంగా దార్ల తెలిపారు. దమయంతికున్న జీవిత దృక్పథం జయంతికి లేకపోవడం వల్లనే జీవితాన్ని సాఫీగా గడపక పోయిన విషయాన్ని వీరు గుర్తించారు.

గమ్యం స్పష్టంగా లేకపోతే గమనం కూడా స్పష్టంగా ఉండదనేది జయంతి పాత్ర ద్వారా తెలిపే ప్రయత్నం చేసారు. దాంపత్య తఫః ఫలమే సంతానం. దాంపత్య వ్యవస్థపై గౌరవం, అవగాహన లేకపోతే సంతానం విలువ కూడా తెలియదని జయంతి పాత్రను బట్టే తెలుస్తుంది. భర్త మీది కోపం చేత అబార్షన్ చేయించుకొన్న జయంతి, భర్తది ఆధిపత్య భావజాలంగా భ్రమపడి విడాకులు తీసుకున్నది. మొదలు ఏ వ్యక్తినైతే భర్తగా పనికిరాడని తిరస్కరించిందో అదే వ్యక్తిని భర్తగా పొందాలని అనుకుంటుంది. కాని ఆమె కోరిక నెరవేరదు. అట్లాగే ఏ సంతానమైతే వద్దనుకుందో మళ్ళీ అదే సంతానంపై మమకారం కలుగడం అనివార్యమైంది. ఈ అంశాలనన్నీ దార్ల హేతు పూర్వకంగా, తర్క బద్ధంగా చర్చించారు.

జయంతిలో ఇంతటి చాంచల్యం ఉండడానికి కారణం ఆమెలో సర్దుబాటు మనస్తత్వం లేకపోవడమనే విషయాన్ని దార్ల నిర్ధారించాడు. ఈ సర్దుబాటును దార్ల మనోవిజ్ఞాన శాస్త్రంలోని అనుగుణ్యతకు అన్వయించారు. దీని ప్రకారం, సమాజానికి అవసరమైన సర్దుబాటు, అభివృద్ధి నిరోధకమైన సర్దుబాటులుంటాయని; దమయంతికి అవసరమైన సర్దుబాటు ఉంటే జయంతికి అభివృద్ధి నిరోధకమైన అనవసరమైన సర్దుబాటుందని దార్ల చక్కగా విశ్లేషించారు.

'దళిత సాహిత్యం - మౌలిక భావనలు' అనే వ్యాసం ఇప్పటి వరకు వచ్చిన దళిత సాహిత్య వ్యాసాలన్నింటి కంటే సర్వ సమగ్రమైనది. దళిత సాహిత్యం ప్రక్రియా వైవిధ్యంతో గేయం, పద్యం, వచన కవిత, నవల, కథ, విమర్శ, నాటకంగా వచ్చిందనేది ఈ వ్యాసం స్పష్టం చేస్తుంది. ఈ వ్యాసం చదివాక దార్ల చేసిన ప్రతిపాదనలు గతంలో ఎవరూ చేసి ఉండరేమో అనిపిస్తుంది. కొత్త ఆలోచనలకు కూడా ఈ వ్యాసం వీలు కల్పిస్తుంది. 1910లో వచ్చిన మాలవాండ్ర పాటతో దళిత సాహిత్యం ప్రారంభమైనదని గత పరిశోధకులు తెలిపినా, దళిత పాటకు వందేళ్ళుంటాయనే నిర్ధారణకు రావచ్చు (ఒకటి రెండు సంవత్సరాలను విషయంలో పట్టింపు లేకపోతే).

తొలి దళిత నాటకం బోయి భీమన్న రాగవాశిష్టంగా దార్ల నిర్ధారించారు. కారంచేడు సంఘటన తరువాత వచ్చిన సాహిత్యంలో అంబేద్కర్ ఆలోచనా విధానం కన్పిస్తుందని దార్ల నొక్కి చెప్పారు. దళిత కథలో వస్తు విస్తృతి, శిల్ప పరమైన మార్పులున్నాయి

కాని దళిత తాత్వికతను విస్మరించకుండా, అంబేద్కర్ భావజాలాన్ని అందించేలాగా కథా సాహిత్యం రావాలనేది దార్ల సూచన. మరాఠి, కన్నడ భాషల ద్వారా దళిత సాహిత్యం దేశ వ్యాప్తంగా విస్తరించిందనేది వాస్తవం. దార్ల వ్యాసం చదివాక శివసాగర్, గద్దర్, మాష్టార్జి, కత్తి పద్మారావు వంటి కవులు, గేయ రచయితలు, ప్రజా వాగ్గేయకారులు, తాత్వికులు మరాఠి, కన్నడ భాషల్లో ఉన్నారా? అన్పిస్తుంది. తులనాత్మక అధ్యయనం చేస్తే ఈ అంశాలు బయట పడ్తాయేమో చూడాలి. ఏది ఏమైన తెలుగులో వచ్చిన దళిత సాహిత్యం ప్రక్రియా వైవిధ్యమే కాకుండా, సంపద్వంతమైనదిగా ఈ వ్యాసం చదివాక అన్పిస్తుంది.

అంబేద్కర్ భావజాలం ఆలస్యంగా తెలుగులోకి రావడానికి కారణం ఒకటి గాంధీయిజం, రెండోది మార్క్సిజం. మొదటి తరం, రెండో తరం దళిత విద్యావంతులు, మేధావులు కొంచెం అటు ఇటుగా ఈ రెండు మార్గాల్లోనే పయనించారు. కాలం గడిచిన కొద్దీ ఈ మార్గంలోని ఫలితాలు వికటించడంతో, అంబేద్కర్ ఆలోచన వైపు మళ్ళారు. వర్గంతో పాటే వర్ణాన్ని నిర్మూలించే శక్తి మార్క్సిజానికుందన్న వాళ్ళే ఆచరణలో రెండింటికి ఆటంకం కల్పించే చర్యలు చేపట్టారు. దీన్ని గమనించే ముఖ్యంగా ఎనభైయ్యో దశకంలో దళిత రచయితలు, మేధావులు ఈ మార్గాలనొదిలి అంబేద్కర్ ఆలోచనవైపుకు దృష్టి మరల్చడం జరిగింది. ఈ నేపథ్యం నుండే శంబూక కవిత్వాన్ని అర్థం చేసుకోవాలి. అంబేద్కర్ తాత్త్విక భూమికను, మార్క్సిజాన్ని దేశీయ పరిస్థితులకు అనుగుణంగా చేసుకోవాలనే శంబూక మాటల్ని దార్ల స్పష్టపరిచారు. శంబూక వర్తమాన దళిత ఉద్యమ భావాలన్నింటితో అంగీకరించక పోయినా, వర్గ వాదులు మాత్రం శంబూక చెప్పిన అంశాలను గుర్తించేలాగున్నాయన్నారు.

ఇక శంబూక కవిత్వంలో శిల్పం సరిగ్గా ఉండదనే వాళ్ళ వాదనను దార్ల తేలికగా కొట్టిపారేసారు. శంబూక కవిత్వం దళితుల కోసం రాసారు; సిద్ధాంతాన్ని ప్రచారం చేసారు. కనుక వస్తువుకే ప్రాముఖ్యమిచ్చారు శంబుక. అయితే అటు వస్తువుకు ఇటు శిల్పానికి సమ ప్రాధాన్యమిచ్చి అద్భుత కవిత్వం రాసిన దళిత కవులున్నారనే విషయం కూడా గమనించాలన్నారు.

తెలుగు సాహిత్యంలో నానీలు ఎన్నో బాలారిష్టాలనెదుర్కొని ఒక ప్రక్రియగా స్థిరపడ్డాయి. ద్వా.నా. శాస్త్రి ద్వారా అవి ప్రయోగ దశకు చేరుకున్నాయి. వంద సంఖ్య ఉంటే శతకం అంటారు. కాని 75 నానీలు రాసిన ద్వా.నా. దీన్ని శతకమే అనాలంటున్నారు. తెలుగు కవిత్వానికి పర్యాయ పదమైన 'సినారె' పైనే ఈ 75 నానీలుండడం విశేషం; నానీల నాన్న గోపికే వీటిని అంకిత మివ్వడం మరో విశేషం. ఈ నానీల నిండా 'సినారె' సంస్కారమే కన్పిస్తుందనేది దార్ల భావన. ద్వా.నా. శాస్త్రి గారు ఆధునిక కవితా ప్రక్రియలో చెప్పి, సంప్రదాయాన్ని, ఆధునికతనూ ముడివేసే ప్రయత్నం చేసారని ''ప్రయోగాల పల్లకిలో నానీలలో సినారె'' వ్యాసంలో దార్ల తెలిపారు.

రష్యన్ విప్లవ చరిత్రను కళాత్మకంగా మలచినది మాక్సిం గోర్కీ 'అమ్మ' నవల. పీడనను ఎదుర్కొనేందుకు కాలంతో, దేశంతో నిమిత్తం లేకుండా 'తమదే' అని ఫీలయ్యేటట్లు రచయిత నైపుణ్యంతో దీన్ని తీర్చి దిద్దారన్నారు. మార్క్సు భావజాలాన్ని మాత్రమే ప్రచారం చేసిన నవలగా కాక, మనసుల్ని కదిలిస్తూ ఇంద్రియానుభూతుల్ని సుఖ దు:ఖాలతో నింపేసింది కనుక వందేళ్ళయినా 'అమ్మ' నవల సజీవంగానే ఉందని దార్ల అంటున్నారు.

'కులవృత్తి' కథ భౌతిక మానసిక కోణాల నుండి విశ్లేషించారు దార్ల. కులం ఆవిర్భావానికి కారణం హిందూ మతం. హిందూ మతానికున్న బలం, బలహీనతలను దార్ల చర్చించారు. నాటి లోకాయతుల నుండి నేటి హేతువాదుల దాకా హిందూ మతం చర్చోప చర్చలకు తావిస్తుందంటే కారణం ఈ రెండింటి వల్లనే. మారుతున్న కాలానికి అనుగుణంగా మారే స్వభావం హిందూ మతానికున్న బలమైతే, ఆ మతానికున్న ప్రామాణిక గ్రంథం ఒక్కటి కూడా చూపలేక పోవడం దాని బలహీనత. ఈ బలహీనత, బలములే ద్వంద్వ ప్రమాణాలకు ఆస్కారమిస్తుంది.

రామాయణంలో వాలీ, సుగ్రీవుల కథ; భారతంలో పాండవుల జన్మ వృత్తాంతం ఈ ద్వంద్వ ప్రమాణాలకు అవకాశమిస్తుందని దార్ల ఉదహరించారు. దీనికి కారణం దేవుడా మానవుడా (పూజారా?) అనేది దార్ల చర్చించారు. మానవులకు ఏది ప్రీతి పాత్రమైతే అదే దేవుడికి ఆపాదిస్తారనే వాస్తవాన్ని దార్ల నిర్ధారించారు. పవిత్రత, కులం, అస్పృశ్యతలు కూడా మానవ కల్పితాలే అనేది 'కులవృత్తి' కథ ఇస్తున్న సందేశంగా దార్ల తెలిపారు. భగవంతుడికి, భక్తుడికి మధ్య పూజారి అవసరం లేదనేది కులవృత్తి కథ ప్రతిపాదించిన అంశం. ఇంత చర్చకు అవకాశమున్న ఈ కథను 'కళ కళ కోసమే' అనే సిద్ధాంతం కోసం రాసినదనే వాదాన్ని దార్ల తిరస్కరిస్తున్నారు.

ముస్లిం స్త్రీవాద కవిత్వంలో స్త్రీవాద దృక్పథాన్ని దార్ల పరిశీలిస్తూ, ముస్లిం మైనార్టీ కవిత్వం రాసిన వాళ్ళంతా స్త్రీవాద కవిత్వం రాయలేదని దార్ల తెలిపారు. వివక్ష ఆధారంగానే ముస్లిం స్త్రీవాదం ఆవిర్భవించిందన్నారు. ఈ స్త్రీవాదంలో ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక అంశాలు అంతర్గతంగా ఉన్నా, బహు భార్యత్వం, సంతానోత్పత్తి, లైంగిక హింస, కట్టుబాట్లను ముస్లిం స్త్రీవాదం ప్రశ్నిస్తుందన్నారు. ఈ స్త్రీవాదంలో షాజహానాను శక్తివంతమైన కవయిత్రిగా వీరు గుర్తించారు. అంతేకాదు ముస్లిం స్త్రీవాదమంతా షాజహానా చుట్టే తిరుగుతుందని దార్ల నిర్ధారించారు.

ఒక తరం మరో తరానికి చేసిన త్యాగమే నాగరికత అంటారు. దీన్ని సాహిత్యానికి అన్వయిస్తే, ముఖ్యంగా తొలి తరం సాహితీవేత్త పింగళి లక్ష్మీకాంతం గారికి అన్వయిస్తే పరిశోధకుడిగా, సాహిత్య చరిత్ర నిర్మాతగా, విమర్శకుడిగా వారెంత కృషి చేసారో, దాని ఫలితమే నేడు తెలుగు సాహిత్యంలో కన్పించే వెలుగు బాటలని దార్ల వ్యాసం చదివాక అర్థమవుతుంది.

ఆంధ్ర మహా భారతం, రంగనాథ రామాయణం, పల్నాటి వీర చరిత్రల కర్తృత్వ నిర్ణయంలో సప్రామాణికమైన ఆధారాలు చూపుతూ వాటిని నన్నయ్య, గోన బుద్ధారెడ్డి, శ్రీనాథులు రాసారని నిరూపించారు. అట్లాగే 'మార్గ - దేశీ'లను వివరించే క్రమంలో సంగీత, నాట్య శాస్త్ర పరిభాషను ఉపయోగించి అన్వయించడం పింగళి నిశిత పరిశోధనను తెలియజేసేదే. అట్లాగే సాహిత్య చరిత్రలో కావ్య సమీక్ష, విమర్శ లక్షణాలుండడం వలన తత్ పూర్వం చరిత్రల కంటే విశిష్టమైనదిగా గుర్తింపు పొందినది. ఇంకా పింగళి వారు ప్రాచ్య, పాశ్చాత్య సమన్వయ దృక్పథంతో విమర్శ చేసారని దార్ల గుర్తించారు. తొలి తెలుగు కథానికపై బండారు అచ్చమాంబ కథలను తొలిసారిగా చర్చలోకి దార్ల తీసుకొచ్చారు.

ప్రతి విషయాన్ని పాక్షిక దృష్టితో కాకుండా సమ వీక్షణంతో దార్ల దర్శిస్తారని ఈ వ్యాసాలను చదివితే అర్థమవుతుంది. ప్రతి వ్యాసం ఒక ప్రామాణిక పత్రంగా భాసిస్తుంది. పరిశీలనా పటుత్వం, సూటిదనం, అధ్యయన శీలం వ్యాఖ్యానించే చతురత దార్లలో ఉందని 'వీచిక'లోని ప్రతి వ్యాసం సాక్ష్యమిస్తుంది. ఇలాంటి చక్కని వ్యాస సంపుటిని అందించిన డా।। దార్ల వెంకటేశ్వరరావును మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

బన్న అయిలయ్య

రాజ గృహం,
హన్మకొండ

డా॥అద్దంకి శ్రీనివాస్
లెక్చరర్, తెలుగు శాఖ,
హైదరాబాదు విశ్వవిద్యాలయం
హైదరాబాదు 500046

# తొలి 'వీచిక'

విమర్శ వ్యాసాలు రాయడంలో మిత్రుడు 'దార్ల'ది ఒక ప్రత్యేకమైన దారి. ఆ దారిలో అతనికి కొన్ని ప్రమాణాలున్నాయి. విశాలమైన రహదారుల్లాంటి విశ్లేషణలున్నాయి. చదువరులను ఆపి మరీ ఆలోచింపజేసే మజిలీలున్నాయి. ఇలా సాగే విమర్శ ప్రయాణానికి గమ్యం తీర్పు. ఇది విమర్శకో సల్లక్షణం. Hudson తన "Literary Criticism"లో "In its straight sense the word criticism means Judgement" అంటాడు. నిజమైన విమర్శకుడు తన వ్యక్తిగతాభిరుచులను సంపూర్ణంగా త్యాగం చేసి విషయ విశ్లేషణపై భీష్మించుకొని కూర్చుంటాడు. సరిగ్గా తూకం వేసినట్లుగా తన లోచూపు ప్రసరించిన పరిసరాల్లోని చీకటి కోణాల్ని, వెలుగు రేఖల్ని సమానంగానే ఆవిష్కరిస్తాడు. ఈ సమస్థితి మీదే విమర్శ తాలూకూ స్థితి కూడా ఆధారపడి ఉంటుంది. ఈ నేపథ్యంలో కావ్య స్రష్టలు విమర్శకుని చేతిలో పూర్తిగా అస్తిత్వాన్ని కోల్పోతారు. విమర్శకునికి కావలసింది కావ్యమే. అందుకే ఇలియట్ అంటాడు "The real criticism is based not upon the poet, but upon the poetry" అని! అందుకే కళింగాంధ్ర కవిత్వం వెలువరించిన కవులు కన్నా ఆ కవుల కలాల్లో ప్రతిధ్వనించిన అస్తిత్వవేదనలే ఈ విమర్శకుడికి ముఖ్యమయ్యాయి.

'విమర్శ' అంటే ఒక మథనం. మనం ఒక దాని కోసం చిలకడం మొదలుపెడితే ఊహించనివెన్నో చేతికి తగులుతాయి. అప్పుడు గనుక విమర్శకుడు కొంచెం అటో ఇటో అయ్యాడంటే, ఇంక ఆ విమర్శ ఎటు పోతుందో చెప్పలేం. సమ్యగ్వీక్షణం, నిరంతర ప్రయత్నం విమర్శకు ఎంతో అవసరం. ఈ రెండూ పుష్కలంగా పండిన వ్యాసాలు రెండున్నాయి. అవి వల్లంపాటి, పింగళి లక్ష్మీకాంతాలపై రాసిన వ్యాసాలు ఒక కవిత్వం మీదో, ఒక కథా సాహిత్యం మీదో విమర్శ చేయడానికి విమర్శకుడికి చేతినిండా ముడి సరుకు ఉంటుంది. కానీ విమర్శపై విమర్శ చేయడం అంత ఆషామాషీ వ్యవహారం కాదు. దీనిలోనూ ముడిసరుకు ఉంటుంది. అయితే అది నివురు కప్పిన నిప్పు.

భాషలో కొన్ని మధురమైన శబ్దాలుంటాయి. అవి భావ మాధుర్యాన్ని పిడికిట బట్టిన కవి కలం లోంచి జాలు వారతాయి. భాష, భావం జంట ప్రవాహాలుగా సాగే మాధురీ భరిత కావ్యంలోని మాధుర్యాన్ని పట్టుకోవాలంటే విమర్శకుడు ఆ ప్రవాహంతో పరుగుతీయడం కాదు. అవసరమైతే కవి కన్నా, కవితా మాధుర్య రస ప్రవాహం కన్నా కొన్ని సార్లు ముందు ఉండగలగాలి. ఈ లక్షణం కోసం చేసిన ప్రయత్నానికి రూపమే మల్లవరపు జాన్ కవిత్వంలో మాధుర్యం వ్యాసం.

ప్రక్రియా వైవిధ్యం, విషయ వైవిధ్యం, ఉద్యమ నేపథ్యాలు కల రచనల్ని వివేచించి, వాటి విలువల్ని నిర్ణయించే వ్యాసాలిందులో ఉన్నాయి. ఆధునిక ఉద్యమాల మూలాలను స్పృశిస్తూ, వాటి ప్రభావాలతో వచ్చిన రచనలను విశ్లేషించిన తీరులో లాక్షణికత ఉంది. 'దళిత సాహిత్యం - మౌలిక భావనలు', ''ఆమ్రపాలి కథలు - మార్పులు ఔచిత్యపు తీర్పులు''ఈ రెండు వ్యాసాలూ ఈ లాక్షణికతకు నిదర్శనంగా నిలుస్తాయి. విమర్శకుడు విషయ వివేచన గావించిన తర్వాత ఆ రచనపట్ల ఒక తీర్మానానికి వస్తాడు. ఆ తీర్మానంతో పాటు తన అభిప్రాయాన్ని నిర్ద్వంద్వంగా ప్రకటిస్తాడు. ఆ అభిప్రాయమే ఆ రచనకు కల విలువను నిర్ణయిస్తుంది. మాక్సిమ్ గోర్కీ అమ్మ నవల రచనా నైపుణ్యంపై విమర్శకుడు వెలువరించిన అభిప్రాయాలు, ఆ నవల చిత్రించాలనుకున్న లక్ష్యాలను, చిత్రించిన జీవన వాస్తవికతను నిరూపిస్తున్నాయి.

సమకాలీన సమాజంలో మారుతున్న సాహిత్య వాతావరణాన్ని చూస్తూ విమర్శకుడు ఊరుకోలేడు. అందుకే దార్ల వెంకటేశ్వరరావు ఆధునిక ప్రక్రియగా ఈ మధ్య కాలంలో కవుల కలాలను ఎక్కువగా ఆకర్షించిన నానీ ప్రక్రియ నేపథ్యంగా ''ప్రయోగాల పల్లకిలో నానీలలో సినారె'' వ్యాసం రచించారు. ఈ వ్యాసం వర్తమాన సాహిత్య వాతావరణానికి నిలువుటద్దం. ఒకవైపు ద్వానాశాస్త్రి గారు సినారెపై రాసిన నానీల శతకాన్ని విశ్లేషిస్తూనే, హైకూ, నానీ ప్రక్రియల స్వరూప స్వభావాల్ని, సమకాలీన సమాజంలో వాటి స్థితిని, కవుల అభిప్రాయాలను, వాటిపై వచ్చిన విమర్శల్ని సాహితీ లోకానికి పరిచయం చేశారు.

స్త్రీవాద సాహిత్యం భూమికగా నిలిచిన ఒక నవలను, సమాజంలో ఒక వర్గంగా బలమైన గొంతుకతో కవిత్వం చెప్పిన ముస్లింవాద కవిత్వాన్ని విమర్శించిన తీరులో వైవిధ్యం ఉంది. 'మనసున మనసై' నవల స్త్రీవాద తాత్త్వికతను ఎలా ప్రతిబింబించిందో నిరూపించారు. ముస్లిం మైనారిటీలలో స్త్రీలు తమ అస్తిత్వం కోసం, సమానత్వం కోసం స్పందించిన తీరు, వారి అంతరంగం వంటి తాత్త్విక అంశాలను విశ్లేషించారు. ముస్లిం మైనారిటీని ఒక వాదంగా, ఆ వాదం నేపథ్యంగా వెలువడ్డ సాహిత్యాలను నిర్వచించి నిరూపించిన తీరు సహేతుకంగా ఉంది. పూర్వ విమర్శకుల వాదాలను సమగ్రంగా ప్రస్తావిస్తూ చేసిన ప్రతిపాదనలు భావి విమర్శకులకు ఆదర్శంగా నిలుస్తాయని చెప్పవచ్చు. తొలి తెలుగు కథానికపై రాసిన వ్యాసంలో ఆ కథలను పరిచయం చేసి, విశ్లేషించడం వల్ల పాఠకుడు కూడా తన దైన నిర్ణయానికి రాగలుగుతాడు.

మొత్తం 14 వ్యాసాలతో 'వీచిక' రూపంలో సాహిత్య లోకంలో విస్తరించుకొంటున్న డా|| దార్ల వెంకటేశ్వరరావు గారిది విమర్శ రంగంలో తొలి వీచిక. స్థూలంగా విషయాన్ని ఒడిసి పట్టుకోగల నేర్పు, సూక్ష్మంగా నిశితమైన పరిశోధన స్పర్శలు మిక్కుటంగా కన్పించే ఈ వ్యాస సంకలనం సాహిత్యాభిలాషులకు విమర్శపట్ల ఒక సదభిప్రాయం కల్గించేందుకు దోహదం చేస్తుందనడంలో సందేహం లేదు. ఈ తొలి 'వీచిక' మున్ముందు నా మిత్రుడు డా|| దార్ల వెంకటేశ్వరరావు వెలువరించ బోయే మరిన్ని మలి వీచికలకి శుభ వీచిక కావాలని ఆశిస్తూ...

హైదరాబాదు　　　　　　　　　　అద్దంకి శ్రీనివాస్

# 'వల్లంపాటి'
# సాహిత్య విమర్శ దృక్పథం

సాహిత్య విమర్శను ఒక ప్రాపంచిక దృక్పథం కలిగిన సాహితీవేత్తలు నిర్వహించే సామాజిక బాధ్యతగా చాలా మంది భావిస్తుంటారు. అలాంటి బాధ్యత గల సాహిత్య విమర్శకులలో వల్లంపాటి వెంకట సుబ్బయ్య గారు ఒకరు. తెలుగు సాహిత్య విమర్శకు భారతీయ, పాశ్చాత్య సాహిత్య విమర్శ దృక్పథాలను సమన్వయించిన విమర్శకుడు. సిద్ధాంతాలకు వక్రభాష్యం చెప్పకుండా, మౌలికంగా ఆ సిద్ధాంతాలు చెప్పిన విషయాలను అవగాహన చేసుకోవాలని భావించే పండితుడు కూడా!

భావజాలం సిద్ధాంత ప్రభావాల్లో కొట్టుకు పోకుండా సాహిత్యానికి ఉండవలసిన కళావిలువలను, వస్తు శిల్ప ప్రాధాన్యతలను గుర్తించాలని భావించే బాధ్యత గల సాహితీ వేత్త. విమర్శలో అభిప్రాయ భేదాలు తప్పవని అంగీకరించే సంయమనం గల వాస్తవికవాది. తెలుగునకున్న వ్యాకరణ దీపం కంటే, విమర్శ దీపం మరింత చిన్నదని ఆ దీపాన్ని పెద్దది చేసే ప్రయత్నానికి తన వంతు కృషి చేస్తానని ప్రకటించిన వినమ్రశీలి.

సాహితీవేత్తలు మార్క్సిస్టు సాహిత్యంలో 1937వ సంవత్సరాన్ని చిరస్మరణీయమైనదిగా భావిస్తారు. క్రిష్టఫర్ కాడ్వెల్ రాసిన ఇల్యూషన్ అండ్ రియాలిటి, అలెక్ వెస్ట్ రాసిన క్రైసిస్ ఇన్ క్రిటిసిజమ్, రాల్ ఫాక్స్ రాసిన నవల్ అండ్ పీపుల్ గ్రంథాలు ఆ సంవత్సరంలోనే ప్రచురితమయ్యాయి.పెన్నూ, గన్నూ పట్టి తాను నమ్మిన ఆదర్శాల కోసం రాల్ ఫాక్స్ ప్రాణాలర్పించిన సంవత్సరం కూడా అదే. ఆ సంవత్సరంలోనే వల్లంపాటి వెంకట సుబ్బయ్య గారు చిత్తూరు జిల్లా రొంపిచర్లలో మార్చి 15, 1937వ తేదీన పుట్టారు.

ఆంగ్ల సాహిత్యంలో ఎం.ఏ., చేశారు. బోధనా రంగానికి అవసరమైన బి.ఇడి డిగ్రీని, ఇంగ్లీష్ టీచింగ్‌లో డిప్లొమా ని అందుకున్నారు. *"The Role of Indian Sensibility in the Teaching of English Literature"* అనే అంశంపై సీఫెల్ (Central Institute of English and Foreign Languages) లో పరిశోధన చేసి M.Litt పట్టా పొందారు. శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం (తిరుపతి); ఆంధ్ర విశ్వ విద్యాలయం (వాల్తేర్); సీఫెల్ (హైదరాబాదు) లలో విద్యాభ్యాసాన్ని కొనసాగించారు. బెసెంట్ థియోసాఫికల్ కళాశాల, మదనపల్లిలో చాలా కాలం పాటు ఆంగ్లోపన్యాసకుడుగా పనిచేశారు. విమర్శ రంగంలో విశేషంగా కృషి చేసిన వల్లంపాటి వారు అనారోగ్యంతో జనవరి, 2, 2007న మరణించారు.

**వల్లంపాటి విమర్శ నేపథ్యం:**

విమర్శ రంగంలోకి రాకముందు వల్లంపాటి వారు కొన్ని సృజనాత్మక రచనలు చేశారు. సుమారు 70 కథలు, 4 నవలలు రాశారు. కవిత్వాన్ని రాసే ప్రయత్నం కూడా చేశారు. అలా రాసిన కొన్ని పద్యాలను ఒకసారి పుట్టపర్తి నారాయణాచార్యులు గారికి చూపించారు. అప్పటికే పుట్టపర్తి వారు వల్లంపాటి వారి నవలలు, కథలను చదివారు. నవలల్లో కొన్ని తార్కిక ఆలోచనలను గమనించి, ఆ విషయాన్నే వల్లంపాటి వారికి చెప్పి, విమర్శ రంగంలో కృషి చేస్తే బాగుంటుందని సూచించారు.

విమర్శ రంగంలో నిలబడాలంటే సామాన్య విషయం కాదు. నిష్పాక్షికమైన మనస్తత్వంతో పాటు, విస్తారమైన జ్ఞానం, అనువర్తన, విశ్లేషణ సామర్థ్యం కావాలి. ఇతర భాషలతో పరిచయం ఉండాలి. అందుచేత ముందుగా బాగా చదవుకోవాలనుకున్నారు. అందుకు కేవలం సాహిత్యం, వాటిపై వచ్చిన వ్యాఖ్యానాలు, సమీక్షలు, విమర్శలు మాత్రమే చదివితే సరిపోదు. లక్షణ గ్రంథాలతో పాటు ప్రాచీన, ఆధునిక రచనలను చదవవలసి ఉంటుంది. విమర్శకుడు ఇంకా సాహిత్య సంబంధ శాస్త్రాలను కూడా అధ్యయనం చేయవలసి ఉంటుందని వల్లంపాటి భావించారు. ఆ దిశగా అధ్యయనాన్ని కొనసాగించానని ఆయనే ఓ చోట (వల్లంపాటి వెంకటసుబ్బయ్య1985: iii) చెప్పుకున్నారు.

అప్పటి వరకూ రాయడం కంటే చదవడంపైనే ఎక్కువ దృష్టిని పెట్టిన వల్లంపాటి వారు, విశ్వనాథ సత్యనారాయణ గారి శ్రీమద్రామాయణ కల్ప వృక్షంలోని 'శూర్పణఖాఖండం' మీద తాను రాసిన ఒక వ్యాసాన్ని కృతి కర్తకే చూపించారు. దాన్ని చదివించుకొని విన్న విశ్వనాథ సత్యనారాయణ గారు "ఫరవాలేదోయ్, నా కవిత్వం కూడా నీకు కాస్త కాస్త అర్థమైంది" అన్నారట! ఆ మాటతో వల్లంపాటి వారికి విమర్శరంగంలో కొంత కృషి చేయవచ్చు అనిపించింది.

పుట్టపర్తి వారు విమర్శ రంగంలో కృషి చేయమని సలహానిస్తే, విశ్వనాథ వారు ఫర్వాలేదంటే, కేతు విశ్వనాథరెడ్డి, త్రిపురనేని మధుసూధనరావు, కె.వి.ఆర్ వంటి విమర్శకులు ప్రోత్సహిస్తేనే ఈ రంగంలో కొచ్చానని చెప్పుకున్నారు. తన విమర్శ నేపథ్య ప్రస్థానాన్ని అలా చెప్పుకున్న వల్లంపాటి వారి విమర్శను లోతుగా పరిశీలిస్తే ఆయన విమర్శలో మార్క్సిస్టు విమర్శ ప్రభావం అధికంగా కనిపిస్తుంది. అయితే, ఆర్.ఎస్. సుదర్శనం గారు చేసిన విమర్శ పట్ల వీరు ఎక్కువ ఆలోచించినట్లు అనిపిస్తుంది.

**విమర్శపై అనువాద ప్రభావం:**

వల్లంపాటి వారికి కన్నడ భాష కూడా తెలుసు. కన్నడ నుంచి తెలుగులోకి, తెలుగు నుంచి ఆంగ్లంలోకి కొన్ని వ్యాసాలను అనువదించారు. చరిత్రకు సంబంధించిన కొన్ని గ్రంథాలను ఆంగ్లం నుంచి తెలుగులోకి అనువదించారు. ఆ అనువాద ప్రభావం వీరి విమర్శపై కూడా కనిపిస్తుంది. తెలుగు నవల, కథల గురించి రాసిన విమర్శలో ఈ ప్రభావాన్ని చూడవచ్చు. అయితే, ఆ అనువాద ప్రభావం తెలుగు విమర్శ రంగాన్ని

పరిపుష్టి చేయడానికే ఉపయోగపడింది. తాను చెప్పే విషయాలు ఫలానా రచయిత / గ్రంథంలోనివి అయితే, ఆ విషయాన్ని తప్పకుండా ఆయన చెప్తారు. అలా కాకుండా తానే ఆ విషయాన్ని చెపుతున్నానని భావించరు. కానీ, తనదైన భాషలో ఆ విషయాలను చెప్పారు. అలా చెప్పడంలోనే అనువాద ప్రభావం కనిపిస్తుంది. ఆ ప్రభావాన్ని గుర్తించడానికి వారు అనువదించిన రచనలను కింద పేర్కొంటున్నాను.

**అనువాద రచనలు:**

| క్ర.సం | రచయిత/త్రి పేరు | గ్రంథంపేరు | అనువాద గ్రంథం పేరు | సంవత్సరం |
|---|---|---|---|---|
| 1. | E.H.Carr | *What is History* | *చరిత్ర అంటే ఏమిటి?* | 1983 |
| 2. | Gorden Child | *What happend in History* | *చరిత్రలో ఏమి జరిగింది?* | 1985 |
| 3. | Chris Brazier | W*orld History* | *ప్రపంచ చరిత్ర* | 1986 |
| 4. | S.G. Sardesai | *Progress and Conservative in Ancient India* | *ప్రాచీన భారత దేశంలో ప్రగతి, సంప్రదాయ వాదం* | 1998 |
| 5. | R.S. Sharma | *Ancient India* | *ప్రాచీన భారత దేశ చరిత్ర* | *2002* |
| 6. | Ralph Fox | *Novel and the People* | *నవల ప్రజలు* | 1992 |
| 7. | Devanaru Mahadev | *ఒదలాలా (కన్నడ)* | *బతుకంతా... (నవల)* | 1994 |
| 8. | Taslima Nesreen | *lazza* | *లజ్జ (నవల)* | 1996 |

. వీటిలో 'నవల-ప్రజలు' నవలా సాహిత్య విమర్శకు ఉపయోగపడే గ్రంథం. అదీ మార్క్సిస్టు దృక్పథంతో నవలా సాహిత్యాన్ని అవగాహన చేసుకోవడానికి ఉపయోగపడే గ్రంథం. ఈ గ్రంథంలో కనిపించే భావాల ప్రభావం వల్లంపాటి వారి నవలా శిల్పం గ్రంథంలో అక్కడక్కడా కనిపిస్తుంది. అలాగే, మార్క్సిస్టు దృక్పథంతో చరిత్రను అవగాహన చేసుకోవడానికి వారు అనువదించిన చరిత్ర గ్రంథాలు చాలా వరకూ ఉపకరిస్తాయి. లజ్జ నవల బాబ్రీ మసీదుని కూలగొట్టిన తరువాత మత పరంగా జరిగిన సంఘర్షణలను నమోదు చేయగలిగింది. ఒక రకంగా 'లజ్జ' నవల చరిత్ర పద్ధతిలో రచన కొనసాగింది. ఆధునిక సాహిత్య విమర్శకు, ఆధునిక సామాజిక మనస్తత్వం కలిగి ఉండాలని ఒక సందర్భంలో వల్లంపాటి వారు చెప్పారు. వీరి అనువాద రచనలను చూస్తే అందుకు అవసరమైన (తన పరిధిలో సాధ్యమైనన్ని) రచనలను అందించగలిగేందుకు అనువాదాన్ని ఉపయోగించారనుకొనే అవకాశం ఉంది.

**విమర్శ రచనలు:**

వల్లంపాటి వారు ఇలా వివిధ భాషాసాహిత్యాల్లో పాండిత్యాన్ని సంపాదించారు. సాహిత్య, సాహిత్యేతర గ్రంథాలను అధ్యయనం చేస్తూ, కొన్ని వ్యాసాలను అప్పుడప్పుడూ పత్రికలలో ప్రచురణకు పంపించేవారు. *భారతి, అభ్యుదయ, అరుణతార, జనసాహితి, స్రవంతి* వంటి తెలుగు పత్రికలతో పాటు *Literary Criterion, Literary Endevour, Literary Half Yearly, Indian Review, Indian Literature* వంటి ఆంగ్ల పత్రికలలోనూ విమర్శ వ్యాసాలను ప్రచురించారు. వాటిలో గల కొన్ని వ్యాసాలను ఎంపిక చేసి, 1985లో అనుశీలన *(సాహిత్య వ్యాసాలు)* పేరుతో

ఒక వ్యాస సంపుటిని ప్రచురించారు. అంతకు ముందే, 1963లో ప్రాచీన తెలుగు కవుల జీవిత చరిత్రల్ని 'నాటి కవులు' అనే పేరుతో ఒక చిన్న పుస్తకాన్ని రాశారు. ఆ తరువాత *వల్లంపాటి సాహిత్య వ్యాసాలు (1997), నవలా శిల్పం (1989), కథా శిల్పం (1995), విమర్శా శిల్పం (2002)* అనే గ్రంథాలను రాశారు. తెలుగు విశ్వ విద్యాలయం వారిచ్చే ఉత్తమ సాహిత్య విమర్శ గ్రంథంగా *కథాశిల్పం* 1996-97లో ఎంపికయ్యింది. అలాగే 1999లో కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతిని కూడా పొందింది. ఇవన్నీ విమర్శకు సంబంధించిన గ్రంథాలు.

పరిశోధన మిళితం కాకుండా విమర్శ ఉండదు. ఆధునిక విమర్శకులు ఈ రెంటినీ భిన్న అస్తిత్వం గల ప్రక్రియలుగానే గుర్తిస్తున్నారు. ఇది ప్రక్రియా వివేచన పెరిగిన తరువాత మరింతగా ప్రాచుర్యంలోకి వచ్చింది. వల్లంపాటి వెంకట సుబ్బయ్య గారు స్థానీయ చైతన్యంతో రాయలసీమ కవులూ, రచయితలూ, విమర్శకులూ చేసిన సాహిత్య కృషిని అధ్యయనం చేస్తూ ఒక పరిశోధన చేశారు. *A Socio-economic Analysis of Modern Telugu Literature in Raayalaseema* పేరుతో తెలుగులో ఆ పరిశోధనను కొనసాగించి, దాన్ని 2006లో *రాయలసీమలో ఆధునిక సాహిత్యం సామాజిక సాంస్కృతిక విశ్లేషణ* అనే గ్రంథంగా ప్రచురించారు. దీనిలో పేర్కొన్న కొన్ని విషయాలు అంతకు ముందు వెలువరించిన వారి విమర్శ గ్రంథాలలో అక్కడక్కడా ఉన్నాయి. రాయలసీమ సాహిత్య స్వభావాన్ని సైద్ధాంతికంగా అవగాహన చేసుకోవడానికి ఆ విడి విడి వ్యాసాల వల్ల అంత సులభ సాధ్యం కాదనిపిస్తుంది. అవి ఆయా రచనలను, రచయితలను అంచనా వేసే స్థాయిలో ఉన్నాయి. కానీ, ఈ పరిశోధన గ్రంథం వల్ల ఆంధ్రప్రదేశ్ లోని ఒక ప్రాంత స్థితి గతులను అధ్యయనం చేసే పద్ధతిని సూచించినట్లయ్యింది. ఇలా, సుమారు అర్ధశతాబ్దం పైగా బోధన, రచనానుభవం గల వల్లంపాటి వారి విమర్శలో ఒక స్పష్టమైన దృక్పథం కనిపిస్తుంది.

**వల్లంపాటి విమర్శ దృక్పథం:**

విమర్శకుడికి కూడా దృక్పథం ఉండాలని చాలా మంది మార్క్సిస్టు విమర్శకులు భావించారు. కానీ, వడలి మందేశ్వరరావు వంటి విమర్శకుల అభిప్రాయంలో విమర్శకుడికి ఎలాంటి దృక్పథం ఉండకూడదు. కానీ వ్యాఖ్యానం, నిర్ణయం అనేవి విమర్శలో దృక్పథాన్ని పట్టిచ్చే అంశాలని లోతుగా పరిశీలిస్తే తెలుస్తుంది.

*"ఒక రచన వెలువడిన తరువాత విమర్శకుని దృక్కోణాన్ని బట్టి పాఠకునిలో కొత్త దృక్పథం ఏర్పడుతుంది. రచనాతత్త్వం మీదా, రచయిత మీదా పాఠకునికి స్వతహాగా ఏర్పడే దృక్పథం కంటే, విమర్శ చదవటం వల్ల పాఠకునిలో ఉండే దృష్టి మార్గాన్ని విమర్శ దృక్పథం లాగేసుకుంటుందని" పరిశోధకులు భావిస్తున్నారు.* ఇలాంటి ఆలోచనలను ముందుగానే గమనించిన వల్లంపాటి వారు పాఠక కేంద్రిత విమర్శను కూడా పరిశీలించాలని, దాన్ని ఒక దృక్పథంగా పరిగణించడంలో లోతైన ఆలోచన చేశారు. నిజానికి దృక్పథం లేకపోవడమనేది సాహిత్యం పట్లా, జీవితం పట్లా సరైన అవగాహన లేకపోవడమేనని వల్లంపాటి వారి అభిప్రాయం.

విమర్శను నాలుగు దృక్పథాలతో విశ్లేషించే అవకాశం ఉంది. ఆ దృక్పథాలతోనే ఇంచుమించు అన్ని సాహిత్య ధోరణులను అనువర్తన చేయవచ్చునని తన విమర్శ ద్వారా నిరూపించారు. అవి

i) సమాజ కేంద్రిత విమర్శ దృక్పథం. ii) రచయిత కేంద్రిత విమర్శ దృక్పథం.

iii) కృతి కేంద్రిత విమర్శ దృక్పథం. iv) పాఠక కేంద్రిత విమర్శ దృక్పథం.

పైన పేర్కొన్న మొదటి దానిలో మార్క్సిస్టు, స్త్రీవాద, దళిత సాహిత్యాలు రెండవ దానిలో జీవిత చరిత్ర, మనోవిశ్లేషణ మూడవ దానిలో ప్రక్రియా, ప్రతీక, రూప, శైలీశాస్త్ర విమర్శలు చేరతాయని నాలుగవ దానిలో పాఠకుడే విమర్శకుడని వాటిని ఇంచు మించు అదే పద్ధతిలో విశ్లేషించి తన విమర్శను కొనసాగించారు. సంజీవమ్మగారి అభిప్రాయంలో మూడు దృక్పథాలతోనే సాహిత్య విమర్శ చేయవచ్చు. సంప్రదాయ (ఆలంకారిక), మార్క్సిస్టు, పాశ్చాత్య దృక్పథాలుగా సంజీవమ్మ గారు వాటిని విభజించారు. కానీ, వల్లంపాటివారి విభజనలో సమాజం, రచయిత, కృతి, పాఠకుడు అనే నాలుగు కోణాలు కనిపిస్తున్నాయి. అంతే కాకుండా ప్రాచీన, ఆధునిక ప్రక్రియా విమర్శల గురించి వల్లంపాటివారు ఒక కొత్త విశ్లేషణను అందించారు.

ప్రాచీన విమర్శ నిర్దేశాత్మకం (Prescriptive) గాను, ఆధునిక విమర్శ వర్ణనాత్మకం (Descriptive) గాను, విశ్లేషణాత్మకం (Analytical) గాను ఉంటుంది. ఈ భేదాన్ని తెలుసుకున్నప్పుడు ఆధునిక ప్రక్రియా విమర్శలో నవల, కథా సాహిత్య విమర్శకు ఒక ప్రత్యేకత ఉందని తెలుస్తుంది (వల్లంపాటి వెంకటసుబ్బయ్య, 1997-58). ఇటువంటప్పుడే, భారతీయ అలంకార సూత్రాల స్థానంలో కొత్త సూత్రాలు రూపొందించుకోవలసి వస్తుంది.

నవలానుశీలనకు అవసరమైన కథ, కథా వస్తువు, కథనం, నేపథ్యచిత్రణ, మనస్తత్వ చిత్రణ, దృష్టి కోణం, కంఠ స్వరం(టోన్), శైలీ శాస్త్రం భారతీయ అలంకార సూత్రాలలో లేవు. ఈ వాస్తవాన్ని అంగీకరించడం తప్పు కాదని వల్లంపాటి అన్నారు. కల్పనా సాహిత్య మూలాలను పాశ్చాత్య సాహిత్యంలో చూడవలసిందిపోయి, 'అగ్నిపురాణం' దగ్గరకు వెళ్ళడం సరైంది కాదన్నారు. చెప్పడంలో తేడా ఉంది గాని, వడలి మందేశ్వరరావు గారు కూడా ఒక సందర్భంలో ప్రాచీన ఆలంకారిక లక్షణాలను ఆధునిక శాస్త్రాలకు అన్వయించి చూడకూడదన్నారు. కనుక వీటిని అన్నింటినీ పరిశీలిస్తే, విమర్శకుడికి దృక్పథం అవసరం. అలాగే, విమర్శలో కాలానుగుణ్యత, తద్వారా వచ్చే ప్రమాణాలను సహృదయతతో స్వీకరించడం చాలా అవసరం. అందుకనే, భారతీయ ఆలంకారిక, పాశ్చాత్య విమర్శ సూత్రాలను సమన్వయించుకోవలసి ఉందనేది వీరి విమర్శలో కనిపించే సమన్వయ దృక్పథం. దీన్ని వివరించటంలో సాహిత్య శాస్త్రానికి, విమర్శ శాస్త్రానికి మధ్య ఉన్న భేద సాదృశ్యాలను గుర్తించాలన్నారు.

**సాహిత్య సిద్ధాంతం- సాహిత్య విమర్శ:**

భారతీయ అలంకార శాస్త్రాన్ని 'భారతీయ సాహిత్య మీమాంస'గా పిలిచి, దీన్ని ఒక సాహిత్య సిద్ధాంతం గానే గుర్తించాలనీ, పూర్తిగా సాహిత్య విమర్శగా భావించే వీలు లేదనీ వల్లంపాటి అభిప్రాయం. సాహిత్యం ఎలా ఉండాలో చెప్పేది సాహిత్య సిద్ధాంతం (Literary theory), ఎలా ఉందో చెప్పేది సాహిత్య విమర్శ (Literary criticism) అవుతుంది. అయితే, వీటి మధ్య సరిహద్దులున్నా, అవి స్పష్టంగా లేవు. దీన్ని ఒక సాహిత్య శాస్త్రంగానే గుర్తించాలి. రాజరికం వల్ల, ప్రజాస్వామ్యంలో ఉండే స్వేచ్ఛాపూరిత వాతావరణం లేకపోవడం అనే సామాజిక చరిత్ర ప్రభావం భారతీయ సాహిత్య శాస్త్రంపై ప్రధానంగా కనిపిస్తుందని నిరూపించే ప్రయత్నం చేశారు. ఈ నిరూపణ హేతుబద్ధంగా సాగింది.

పాలక వర్గాలను తృప్తి పరిచే పద్ధతిలో కొన్ని వర్ణాల, వర్గాల ప్రయోజనమే ధ్యేయంగా భారతీయ సాహిత్య సిద్ధాంతాలు పుట్టాయి. ఇలాంటి పరిస్థితి పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలలోనూ కనిపిస్తుంది. సాహిత్యాన్ని సృష్టించే కవులు కూడా దైవాంశ సంభూతులుగా పరిగణింపబడ్డారు. అత్యధిక సామాన్య ప్రజలు మాట్లాడే ప్రాకృతాది భాషలను నిరాదరించి, కొద్ది మంది వినియోగంలోనే ఉన్న సంస్కృత భాష ద్వారా, సాహిత్య ఉత్పత్తి జరిగి, సాహిత్యం ఉన్నత వర్గాల, వర్ణాల సొత్తుగా మార్చుకున్నారు. దీనికి అనుగుణంగానే ఆలంకారిక సిద్ధాంతాలు తయారయ్యాయి. రసం, అలంకారం, ధ్వని, ఔచిత్యం, వక్రోక్తి, వక్రత, రీతి వంటి సిద్ధాంతాలను పరిశీలిస్తే, ఇవి రచనా నిర్మాణానికిచ్చినంత ప్రాధాన్యత, రచనా వస్తువుకివ్వలేదు. పైగా వస్తువును అన్ని సామాజిక వర్గాలనుండి తీసుకోవాలనే సామాజిక దృక్పథం కనిపించదు.

ఆనాటి పండిత సభల, రాజాస్థానాల కనుసన్నలలోనే చాలావరకు భారతీయ ఆలంకారిక సిద్ధాంతాలన్నీ రూపొందాయి. దానితో అవి 'సాహిత్య సిద్ధాంతాలు'గానే మిగిలిపోయాయి తప్ప, సాహిత్య విమర్శ సిద్ధాంతాలుగా రూపొందలేక పోయాయనేది వీరి విశ్లేషణ. ఈ విశ్లేషణలో విమర్శకుడికి ఉండవలసిన లోతైన అధ్యయనం తెలుస్తుంది. అయితే, వీటిని లోతుగా అధ్యయనం చేయవలసిన అవసరం ఇంకా ఉంది.

ప్రాచీన భారతీయ సాహిత్య సిద్ధాంతాలలో రసం, కావ్య విలువలను ఉత్తమ, మధ్యమ, అధమ కావ్యాలని నిర్ణయించే పద్ధతిని కథా సాహిత్యానికి అనువర్తించి చూస్తే, ఆ సిద్ధాంతాలు ఆధునిక కాలంలో ఎలాంటి ఫలితాలను ఇస్తాయో తెలుస్తుంది. భారతీయ అలంకార శాస్త్రాన్ని కొన్ని ప్రయోజనాల నిమిత్తం రూపొందించారనేది ముందుగా గుర్తించాలి. అప్పుడు వాటిలోని చాలా విషయాలను విమర్శకు ఉపయోగించుకోవచ్చు. కానీ, మౌలికంగా అవి సాహిత్య సిద్ధాంతాలన్నది గుర్తించవలసి ఉందన్నారు.

భారతీయ అలంకార శాస్త్రాన్ని 'విమర్శాశిల్పం' గ్రంథంలో సంక్షిప్తంగా చెప్పినా, చాలావరకు సమగ్రంగా చెప్పిన తీరు పాఠకులకు ఆశ్చర్యాన్ని గొల్పుతుంది. భారతీయ అలంకార శాస్త్రాన్ని గురించి వల్లంపాటి కొన్ని ముఖ్యమైన అభిప్రాయాలను

ప్రకటించారు. వాటిని గమనించడం ద్వారా భారతీయ సాహిత్య శాస్త్రంలో సిద్ధాంతాలే ఉన్నాయో, సాహిత్య విమర్శ ఉందో తెలుసు కోవచ్చు. అవి

i) భారతీయ సాహిత్య శాస్త్రంలో 'రసం' వస్తువుకీ; 'ధ్వని' శిల్పాని (అభివ్యక్తి విధానాని)కీ చెందింది.

ii) భరతునికి ముందు వేదాల్లో 'రసం' అనే మాట ఉన్నా, అది సాహిత్య పరంగా వాడబడలేదు. భరతుని అభిప్రాయంలో 'రసం' నాట్య రసం మాత్రమే. రస సిద్ధాంతానికి భరతుడు పునాది అయితే, అభినవగుప్తుడు శిఖరం.

iii) రస సిద్ధాంతాన్ని చర్చించేటప్పుడు ఉదాహరణలుగా తీసుకొనే పాత్రలు ఉన్నత వర్ణాలకు, అవీ ప్రధానంగా బ్రాహ్మణ, క్షత్రియ వర్ణాలకు చెందినవే. అందులో నిమ్న వర్ణాల, దళిత జీవితాలకు ఎటువంటి ప్రాధాన్యత లేదు. వర్గ దృష్టితో చూసినప్పుడు ఈ పాత్రలు పాలక, పురోహిత వర్గాలకు చెందినవే.

iv) ఈనాటి సాహిత్య విమర్శలో 'రసం'' అనే మాట ఉపయోగంలో ఉన్నా, దానికప్పటి అర్థం వేరు. దాన్నిప్పుడు 'ఆర్ద్రత'' అనే అర్థంలో వాడుతున్నారు. ఆధునిక సాహిత్య విమర్శకుల ప్రయోగంలో 'రసం'' అనే విషయాన్ని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి.

v) సాహిత్యంలో ధ్వని గురించి భారతీయ ఆలంకారికులు చేసినంత లోతైన కృషి పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలలో కనిపించదు. కానీ, వర్గీకరణ వ్యామోహం వల్ల సుమారు 5304 రకాల ధ్వనులను తేల్చటం కంటే, ప్రధాన ధ్వనుల వర్గీకరణ చేస్తే సరిపోయేది.

vi) ఆనందవర్ధనుని ధ్వనిని వర్ణ, పద, వాక్య, ప్రబంధ ధ్వనులుగా విభజించుకుంటే సరిపోయేది. ప్రబంధ ధ్వనికి సాహిత్య సిద్ధాంత సరిహద్దులను దాటి విమర్శ సూత్రంగా ఉపయోగపడగల శక్తి ఉన్నా, కుంతకుడు ''ప్రబంధ వక్రత''గా పిలవటం తప్ప, గొప్ప విమర్శ సూత్రంగా మార్చే అభివృద్ధికి ప్రయత్నించలేదు.

vii) ప్రతిభ నవ నవోన్మేషశాలిని అంటూనే, సమకాలీన జీవితాన్ని నిరాదరించి, రచయితల ప్రతిభను బహు ముఖాలుగా వికసించడానికి ఆలంకారికులు ప్రతిబంధకంగా నిలిచారు.

viii) భారతీయ సాహిత్య శాస్త్రం, సాహిత్య విమర్శగా మారితే గతానుకత్వమూ, విలువల పతనం తగ్గేది. కానీ, రాజాస్థానాలలోని పండిత సభలు కూడా ఆలంకారిక సంప్రదాయానికే ప్రాధాన్యతనిచ్చాయి.

ix) అలంకారశాస్త్రం విడిగా పద్యాలను తీసుకొని వాటిలోని అలంకారాలనూ, ధ్వనినీ, వక్రోక్తినీ, శ్లేషనీ, చమత్కారాన్నీ వివరించే కార్యక్రమాన్ని మాత్రమే చేసింది తప్ప, కావ్యాన్ని మొత్తం ఒక యూనిట్‌గా గ్రహించి విమర్శించలేదు.

x) ప్రజాస్వామిక వాతావరణం లేకపోతే, పాలక వర్గ భావజాలానికి వ్యతిరేకమైన భావాలు పుట్టవు. ఒక వేళ పుట్టినా అవి బతికి బట్ట కట్టడం కష్టం. దీనివల్లే భారత దేశంలో 'సాహిత్య సిద్ధాంతం' సాహిత్య విమర్శ కాలేకపోయింది.

పైన పేర్కొన్న వల్లంపాటి వెంకట సుబ్బయ్య గారి అభిప్రాయాలను పరిశీలిస్తే, *అపారే కావ్య సంసారే కవిరేవ ప్రజాపతిః యథా స్మైరోచతే విశ్వమ్ తదేతమ్ పరివర్తతే...* వంటి అభిప్రాయాల ప్రకారం కవికి ఉన్న స్వేచ్ఛ సామాన్య మానవుణ్ణి కావ్య నాయకుడుగానో, ఉత్తమ పాత్రగానో వర్ణించగలిగేది కాదు. అది తమ ప్రతిభా ప్రదర్శనకు, ఇంకా చెప్పాలంటే తమ పాండిత్య ప్రదర్శనకు ఉపయోగపడేదే! కానీ, కావ్యాన్ని మొత్తం ఒక యూనిట్‌గా స్వీకరించకపోతే ఉత్తమ, మధ్యమ, అధమ కావ్యాల నిర్ణయానికి భారతీయ ఆలంకారికులు ఎలా రాగలిగారనేది ప్రశ్నార్థకంగానే మిగిలి పోతుంది. పైగా భరతుని దగ్గర నుండి దృశ్య, శ్రవ్య కావ్యాల లక్షణాలను రూపొందించే ప్రయత్నంలో భామహుడు, దండి, వామనుడు, కుంతకుడు, క్షేమేంద్రుని వంటి వారంతా కృషి చేసినట్లు వారి వారి ప్రతిపాదనలు తెలుపుతూనే ఉన్నాయి. అలాంటప్పుడు చర్చలు, సిద్ధాంత భేదాభిప్రాయాలు కలగలేదని అనుకోవడానికి అవకాశం లేదు.

స్త్రీవాద, దళిత ఉద్యమాలు వచ్చిన తరువాత, మార్క్సిస్టులు తమ వర్ణ దృక్పథాన్ని విశాలతర సిద్ధాంతంగా నిరూపించే ప్రయత్నాలు చేశారు. కానీ, మార్క్సిజంలో వర్ణ దృక్పథం లేదనే తేలుతుంది. కొంతమంది విమర్శకులు దళితులను పీడిత వర్గంలోనే కలిపి సిద్ధాంతీకరించే ప్రయత్నాలు చేస్తున్నారు. వల్లంపాటి వారు కూడా మార్క్సిస్టు సిద్ధాంత బలంతో దళిత సాహిత్యాన్ని కూడా అనువర్తన చేయవచ్చుననే ప్రతిపాదన చేయడానికి ప్రయత్నించారు.

*'మార్క్సిజాన్ని ఒక నిశ్చల సిద్ధాంతంగా కాకుండా చలనశీలత ఉన్న ఒక ''మెథడాలజీ''గా ఉపయోగిస్తే అది భారతదేశం వంటి తూర్పు దేశాల సమాజాలను కూడా విశ్లేషించగలదు. ఉదాహరణకు భారతదేశంలో వర్గంతో పాటు వర్ణం నిర్వహించిన, నిర్వహిస్తున్న పాత్రను పొరపాటు లేకుండా గుర్తించగలదు' (వల్లంపాటి వెంకటసుబ్బయ్య, 2002:116).* అని ఒకచోట వల్లంపాటి వారు వ్యాఖ్యానించారు.

ఈ అభిప్రాయాలను గమనించినా సిద్ధాంతాన్ని కాలానుగుణంగా మార్చుకొనే అవకాశానికి కొన్ని ప్రత్యేక పద్ధతులు అనుసరించ వలసి ఉంటుంది. సాహిత్య సిద్ధాంతాలు కూడా నూతన ప్రతిపాదనలో కాలానుగుణంగా మార్పులకు గురవుతుంటాయి. భారతీయ సాహిత్య సిద్ధాంతం కూడా దీనికి అతీతంకాదు.

సిద్ధాంతాల నుండి సూత్రీకరణలను సమకాలీన విమర్శకులు తయారు చేసుకోవాలి. అయితే, ఆ సిద్ధాంతాలన్నీ అన్ని సాహిత్య ధోరణులను అనువర్తించడానికి వీలవుతాయో లేదో గమనించవలసి ఉంది. ఏది ఏమైనా వల్లంపాటి సాహిత్య వ్యాసాలకు రాసిన ముందుమాటలో రాచపాళెం చంద్రశేఖరరెడ్డి గారు, వల్లంపాటి వారు చేసిన సాహిత్య సిద్ధాంతకారులు సాహిత్య విమర్శకులు కారనే ప్రతిపాదనను పండితులు లోతుగా ఆలోచించాలన్నట్లు, దీన్ని పరీక్షకు పెట్టవలసిన అవసరం ఉంది. వల్లంపాటి విమర్శలో ఇదొక పార్శ్వం. శిల్పానువర్తన మరో పార్శ్వం. అందుకనే, మార్క్సిస్టు విమర్శకుల గురించి మాట్లాడేటప్పుడు శిల్పానికి కూడా ప్రాధాన్యత ఉండాలనే వర్గంలో ఉన్న

విమర్శకుడిగా వల్లంపాటిని చాలా మంది భావిస్తుంటారు. కనుక శిల్పం గురించి వీరేమి చెప్పారనే ఉత్సుకత కలగడం సహజం.

**వస్తు శిల్ప వివేచన:**

వస్తు, శిల్పాల విషయ చర్చల్లో Aesthetic Values, Aesthetic Distance ల గురించి వల్లంపాటివారు చాలా చోట్ల ప్రస్తావించారు. మంచి రచనలో వస్తువు, శిల్పం విడదీయ లేనంతగా కలిసిపోవాలి. రచనను అర్థం చేసుకోవడానికి, అనుభూతి కలగడానికి, పాఠకుని సామర్థ్యాన్ని క్రియాత్మకం చేసేందుకు Aesthetic Distance, ఉపకరిస్తుంది. వల్లంపాటివారి కంటే ముందునుండే చాలా మంది ఈ వస్తు, శిల్పాల గురించి చాలా కాలంగా చర్చిస్తూనే ఉన్నారు. సంజీవమ్మ, త్రిపురనేని మధుసూధనరావు, పాపినేని శివశంకర్ వంటి వారంతా వీటి గురించి చర్చించినవారే!

మార్క్సిస్టు విమర్శకులు శిల్పం వస్తువుకి ఉపయోగపడాలనీ, తద్వారా కళ కళ కోసం అనే పలాయన వాదం నుండి బయటపడి, కళ ప్రజల కోసం అనే సామాజిక బాధ్యత వైపుకి పయనింపజేయడానికి ప్రయత్నించినవారే. అయితే, కొంతమంది మార్క్సిస్టు విమర్శకులు శిల్పానికి ప్రాధాన్యతనివ్వకపోవడం వల్ల సాహిత్యం తన ప్రత్యేక అస్తిత్వాన్ని కోల్పోతుందని భావించే వారూ ఉన్నారు. అలాంటి వర్గంలో ఉండదగిన వారు వల్లంపాటి.

వల్లంపాటి వారు వస్తు, రూప, శిల్పాల గురించి చెప్పిన కొన్ని ముఖ్యాంశాలను కింది విధంగా పేర్కొనవచ్చు.

i) *"కథా వస్తువు యొక్క మూర్త రూపమే (concrete shape) కథ". కథా వస్తువును కథగా మార్చేది రూపమే. "కథా రూపాన్ని పాత్రలు (plot), వాతావరణం (setting), దృష్టి కోణం (point of view), కంఠస్వరం (tone), కథన పద్ధతి (mode of narration ) అనే ఆరు అంశాలను కలిపి స్థూలంగా 'శిల్పం' అని వ్యవహరించటం కూడా జరుగుతుంది"* (అ.శీ: 37-38).

ii) *కథా వస్తువు కళ కాదు. కానీ కళగా మారుతుంది. కథా వస్తువును కళా విలువ కలిగిన కథగా రచయిత నైపుణ్యం రూపొందిస్తుంది. శిల్పం లేని కళ ఉండదు. కానీ, ఉత్తమ శిల్పం సహజంగా, ఆడంబరం లేకుండా, అదృశ్యంగా, నాజూకైన అలంకరణ లాగా ఉంటుంది. కథా వస్తువు యొక్క అవసరాలకు మించిన శిల్పం శిల్పాడంబరం కథ యిచ్చే అనుభూతిని పాడుచేస్తుంది.*

iii) *"కథా వస్తువుకు కళగా మారిన కథా వస్తువుకు మధ్యనున్న సంబంధమే సాహిత్య శిల్పం"* (అ.శీ:70). (వ.సా.వ్యా: 90).

*v) వస్తువు(content)కేవలం భావజాలం, చారిత్రక జ్ఞానం కాదు. (అ.శీ: 80).*

*vi) భావవాద కళాశాస్త్రం వస్తువు, రూపం వీటి మధ్య ఉన్న సంబంధం శాశ్వతమంటే, మార్క్సిజం ప్రకారం అది శాశ్వతం కాదు. (అ.శీ: 80 81)*

*vii)* రచయిత తాను మంచివని నమ్మిన సామాజిక వ్యవస్థలను ప్రాచీన రుషికవులు కూడా బాహాటంగానే నమ్మారు (అ.శీ: 83). ఇది నిబద్ధతకు సంబంధించింది. దీన్ని కళావాదులు వ్యతిరేకించారు.

*viii)* సాహిత్య శిల్పంలోని అంశాలని భావించే ఛందస్సు, అలంకారాలు, ప్రతీకలు మొదలైనవన్నీ సామాజిక ఒప్పందాలే (వి.శి: 6). అలాగే, భాష, భావాలు కూడా సామాజిక ఒప్పందాలే.

*ix)* సాహిత్య రచనకూ, సాహిత్యం కాని రచనకూ మధ్య ఉన్న తేడా ఏఏ అంశాలలో ఉంటుందో భారతీయులు పాశ్చాత్యులు లోతుగా చర్చించలేదు. ఆధునిక సాహిత్య చర్చలో ఆ తేడాను *Aesthetic Value* (కళాత్మకత లేదా కళా విలువ) అనీ, సాహిత్యంలోనైతే *Literariness* (సాహిత్యకత) అనీ అంటారు. సాహిత్యంలో 'సాహిత్యకత' శిల్పం వల్ల మాత్రమే సిద్ధించదు. మొదట వస్తువుకు సాహిత్యంగా రూపొంద గల అర్హత ఉండాలి. వస్తువుకూ, రచయితకూ మధ్య ఆత్మీయతా, నిజాయితీ కలిగిన సంబంధం ఉండాలి. దానికి శిల్పం కలవాలి. అప్పుడు సాహిత్యకత అబ్బుతుంది (వి.శి: 8).

*ix)* వస్తువుకి, శిల్పానికి సంబంధించిన ఆ ప్రమాణాలు రచన విలువను నిర్ణయించడానికి ఆధారంగా ఉంటాయి (వి.శి: 18).

*Xi)* విమర్శ సంపూర్ణమైన కళ కాదు శాస్త్రమూ కాదు. కళగా ప్రారంభమై శాస్త్ర లక్షణాలను సంతరించుకుంటూ ఉన్న సాహిత్య ప్రక్రియ (పు. వి. శి. 21).

''ఉద్దేశాన్ని కళగా మార్చే పరుసవేది శిల్పం లేదా రూపం'' అని శిల్పానికీ, రూపానికీ మధ్య వల్లంపాటి వారు పెద్ద వ్యత్యాసాన్ని చూపలేదు. వస్తువును కళగా మార్చేది రూపం (వ. సా. వ్యా: 60). వస్తువుకు ఆకారం లేదు. తగిన రూపాన్ని సంతరించుకున్న వస్తువు మాత్రమే కళ (వ.సా.వ్యా: 48). 'రూపం అంటే కథ, కథాకథనం, పాత్రలు, వాటి మానసిక పరిణామం, అల్లిక, శైలి మొదలైన అనేక అంశాలుంటాయి. రూపాన్ని కొంతమంది విమర్శకులు 'శిల్పం' అని కూడా పిలుస్తుంటారు. (న.శి:16). 'నవలలోని కథకు, నవల బయట ఉన్న వాస్తవిక జీవితానికి ఉన్న సంబంధమే ఒక రకంగా కథా వస్తువు (న.శి: 22) అని అన్నారు.

'శిల్పం' అని తన గ్రంథాలకు పేరు పెట్టుకున్నంత మాత్రం చేత కళ కళకోసం అనే కళావాదిగా కాకుండా, కళాత్మకమైన సాహిత్యం ప్రజలకు ఉపయోగపడుతూనే, కళా విలువలను కాపాడేదై ఉండాలని వల్లంపాటి భావించారు. శిల్ప వాదుల ప్రకారం ఎలాంటి వస్తువునైనా రసభరితం చేయవచ్చు. వస్తువు కంటే నిర్మాణమే ప్రధానమవుతుంది. ''రమ్యం జుగుప్సితముదార మదాపినీచం ఉగ్రం...'' అని ధనుంజయాది భారతీయ ఆలంకారికులు భావించినట్లుంది. కానీ, వల్లంపాటి 'వస్తువుకు' సాహిత్యంగా రూపొందగల అర్హత ఉండాలంటారు. అంటే, శిల్పం వస్తువుకి ఉపయోగపడాలనేది వీరి దృక్పథం. వస్తువుని బట్టి రూపం సిద్ధిస్తుంది. ఇలా వస్తు,శిల్ప విమర్శలో ఒక ప్రత్యేకత ఉన్నట్లే, వల్లంపాటి కల్పనా సాహిత్య విమర్శలో కూడా ఒక విశిష్టత ఉంది.

**నవల కథా విమర్శ:**

వల్లంపాటి వెంకట సుబ్బయ్యగారి పేరు చెప్పగానే ఈయనను విమర్శకుడుగా సాహితీవేత్తలు గుర్తించగలిగినా, నవల, కథలపై చేసిన విమర్శను ప్రముఖంగా ప్రస్తావించడం ఒక విశేషం. నవల, కథల గురించి వివరిస్తూ రెండు గ్రంథాలు కూడా రాశారు. ముదిగొండ వీరభద్రయ్య గారు ఈయనను Fine critic of fiction గా పేర్కొన్నారు (ముదిగొండ వీరభద్రయ్య 1998:45).

వల్లంపాటి కంటే ముందు కొంత మంది నవల, కథా విమర్శ రంగాలలో కొంత కృషి చేశారు. కానీ, పాశ్చాత్య భావాలను తులనాత్మకంగా పరిశీలించి, ఆ భావాలను తెలుగు రచనలకు అనువర్తింప జేయడంలో ఈయన విమర్శకు ప్రత్యేకత ఉంది. నవల, కథ అనేవి పాశ్యాత్య భావాల నుండి రూపుదిద్దుకున్న సాహిత్య ప్రక్రియలు. ప్రతి విషయాన్నీ వేదాల్లోనో, పురాణాల్లోనో ఉన్నాయని చెప్పే నమ్మకాలను సిద్ధాంతాలుగా విశ్వవిద్యాలయ స్థాయిలో కూడా ప్రచారం చేయడాన్ని తీవ్రంగానే వ్యతిరేకించారు. దానికి కావలసిన నిరూపణలనూ బలంగానే చూపగలిగారు.

కొంతమంది ఆధునిక విమర్శకులు, భారతీయ ఆలంకారిక సిద్ధాంతాలలో గల 'ఆఖ్యాయిక' నవలేనని అనడం సరికాదు. సామాజిక నవల ఉద్భవించడానికి పందొమ్మిదో శతాబ్దం ఉత్తరార్ధం వరకూ ఆగవలసిన అవసరమే, ఋగ్వేదం నుండి నవల ఆవిర్భవించలేదని చెప్పడానికి ప్రబల హేతువుగా ఊహించవచ్చు.

సాంస్కృతిక పునరుజ్జీవనం, రాజాస్థాన సాహిత్యం మీద ఉన్న తిరుగుబాటు, మధ్యతరగతిలో వచ్చిన మార్పు, పారిశ్రామిక విప్లవం, సామాజిక సంబంధాలలో వచ్చిన మార్పుల వల్ల నవల ఆవిర్భవించింది. '*వాస్తవికతా, వాస్తవికతా పునాదిగా కలిగిన కల్పనా తగుపాళ్ళలో కలిసిన ప్రక్రియ నవల*' (వల్లంపాటి వెంకటసుబ్బయ్య: 1989: 11).

ఇలా నవలకు, కథకు ఒక ప్రత్యేక చారిత్రక నేపథ్యం ఉందని, దాన్ని విమర్శకుడు గుర్తించవలసి ఉంటుందన్నారు. కల్పనా సాహిత్య విమర్శకుడు సంప్రదాయ పాండిత్యంతో పాటు మరి కొంత పరిజ్ఞానాన్ని కలిగి ఉండాలన్నారు. ప్రపంచ కల్పనా సాహిత్యాన్ని గురించిన అవగాహన, ఆధునిక శాస్త్ర పాండిత్యం, ఆధునిక మనస్తత్వాన్ని కలిగి ఉండటం, ఆధునిక కల్పనా సాహిత్య సిద్ధాంత అవగాహన కలిగి ఉండటం వంటివన్నీ అవసరమన్నారు.

ఉన్నవ, బుచ్చిబాబు, గోపీచంద్, విశ్వనాథ, రావిశాస్త్రి, కొడవటిగంటి, ఆర్.ఎస్. సుదర్శనం వంటి వారి నవలలను చాలా వరకూ పరిశీలించారు. వల్లంపాటి సాహిత్య వ్యాసాలలో రాసిన 'తెలుగులో కల్పనా సాహిత్య విమర్శ' వ్యాసం ప్రామాణికమైంది. నవలా విమర్శ పేరుతో వచ్చిన పరిశోధనలను, విమర్శలను పరిశీలించి, వాటిలో గల అశాస్త్రీయ విషయాలను సోదాహరణంగా వివరించారు. 1870 దశకంలో తెలుగు

నవల, 1910లో కథ వచ్చింది. కానీ, విమర్శ రావడానికి మాత్రం చాలా కాలం ఉండవలసిన కారణాలను శాస్త్రీయంగా వివరించే ప్రయత్నం చేశారు.

నవల ప్రాదుర్భావం మొదలుకొని నవలలో ఉండే జీవితం, వివిధ ప్రధానాంగాల గురించి నవలా శిల్పంలో విపులంగా చర్చించారు. నవలలో ఉండే కథనం గురించి చెప్తూ, దృష్టి కోణంలో ఉండే భిన్న పార్శ్వాలను వివరించారు. వీటిలో సర్వసాక్షి, ఉత్తమ పురుష, ప్రథమ పురుష, నాటకీయ దృష్టి కోణాలను సమగ్రంగా చర్చించారు. కథా ప్రణాళికను తయారు చేసుకున్న తరువాత ఎదురయ్యే సమస్య కథాకథనం. ఇది లేఖ, దినచర్య, చైతన్య స్రవంతి, న్యూస్ రీల్ వంటి కథా కథన పద్ధతులుగా తెలుగు నవలల్లో చిత్రితమైన విధానాన్ని వివరించారు. కథా కథనంలో కొన్ని చవకబారు పద్ధతులు కూడా ఉన్నాయన్నారు. శైలిని వివరించేందుకు భాషాశాస్త్రవేత్తల అభిప్రాయాలను ఉపయోగించుకున్నారు.

నవలా వర్గీకరణ అనేది సౌలభ్యం కోసం జరుగుతుంది. దాన్ని అనుసరించి సమాజ, వ్యక్తి, తాత్త్విక, రాజకీయ, చారిత్రక నవలలుగా నవలలను విభజించుకోవచ్చు. ఇలా విభజించి తెలుగులో అస్తిత్వవాద నవలల పేరుతో సంసారవృక్షం వంటివి నవలలుగా ప్రాచుర్యం పొందటం ఆశ్చర్యాన్ని గొలుపుతుందన్నారు. "*ఈ నవలలో సమాజం, ఆధునిక భావాల చిత్రణ లేవు. అవి ఉన్నాయన్న భ్రాంతి మాత్రమే*" (వల్లంపాటి వెంకట సుబ్బయ్య 1985: 55) అనీ వ్యాఖ్యానించారు.

నవల, కథలకు కొన్ని సమాన లక్షణాలున్నా, రెండూ భిన్న ప్రక్రియలు. భిన్న చారిత్రక నేపథ్యాల నుండి వచ్చాయి. అయితే రెండింటిలో కథ, కథనం, పాత్రలు, సన్నివేశం, వాతావరణ చిత్రణ వంటి విషయాలలో కొన్ని సమాన లక్షణాలు ఉండటం వల్ల, రెండింటినీ తులనాత్మకంగా పోల్చి చూపించడం కనిపిస్తుంది.

ఒక జీవిత పద్ధతినీ లేదా పాత్ర జీవితాన్ని, ఒక ప్రాంత ప్రజల జీవిత విధానాన్ని నవల చిత్రిస్తుంది. ఒక పాత్ర మీదనో, ఒక సంఘటన మీదనో, ఒక భావం మీదనో ఆధారపడి కథ ఉంటుంది. ఇతర పాత్రలూ, సంఘటనలూ, భావాలూ ఉన్నా అవి కథావస్తువును వ్యక్తంచేసే కేంద్ర బిందువు ప్రాధాన్యతను నిరూపించడానికే ఉపకరిస్తాయన్నారు. అలాగే, నవలిక, స్కెచ్, గల్పికల మధ్య కూడా తేడాలను వివరించారు.

"*మధురాంతకం రాజారాం రాసిన 'వేతనశర్మ కథ' వంటి కొన్ని కథల్లో క్లుప్తత లోపించింది. శిల్ప నైపుణ్యం ఉన్న రావిశాస్త్రి కొన్ని కథల్లో వ్యాఖ్యాన చాపల్యం ఎక్కువైంది. శ్రీశ్రీ, కోనేటిరావు కథల ద్వారా చైతన్య స్రవంతిని ప్రవేశపెట్టారు. బుచ్చిబాబు చైతన్య స్రవంతి శిల్పం మీద మోజుపడి అనవసర పాండిత్య ప్రకర్షకి ప్రయత్నించాడు.* ఇలాంటి వల్లంపాటి వారి వ్యాఖ్యలను ముదిగొండ, ద్వానాశాస్త్రి వంటి విమర్శకులు విమర్శించారు. విమర్శలో భేదాభిప్రాయాలు తప్పవని వల్లంపాటి వారు తన రచనలలో పేర్కొన్నారు.

సాహిత్యంలో సరైన వాతావణంలో చర్చ జరగడం ప్రజాస్వామిక వాతావరణంగా భావించారు. కథా శిల్పంలో వాస్తవిక కథ, ప్రతీక, ఎపిఫనీల గురించి చక్కని అనువర్తిత విమర్శను అందించారు. రావిశాస్త్రి 'పిపీలికం' కథలో గల అంతరార్థ కథనాన్ని వివరించిన తీరు ప్రశంసనీయంగా ఉంది. శ్రీపాద, పతంజలి వంటి వారి కథల్లో ప్రతీకలను చక్కగా వివరించారు. విశ్వనాథ భావజాలం యొక్క విశ్వరూపం వారి 'వేయిపడగలు' నవలలో కనిపిస్తుందన్నారు.

కథా సాహిత్యానికి ఉపయోగపడే ఆలోచనలు తెలుగు కల్పనా సాహిత్య విమర్శకులంతా తెలుసుకోవలసినవి కొన్ని ఉన్నాయి. అలాంటి వాటిలో వల్లంపాటి వారి కొన్ని అభిప్రాయాలు.

i) మంచి కథకు క్లుప్తత, అనుభూతి, సంఘర్షణ, నిర్మాణ సౌష్ఠవం అవసరం.

ii) కథకు సూచనే ప్రాణం.

iii) పరిష్కారం కథలో నుంచే రూపొందాలి.

iv) కథ యొక్క అర్థం రచయిత సృష్టించిన "కల్పిత" ప్రపంచానికీ, కథకు బయట ఉన్న "వాస్తవ" ప్రపంచానికి మధ్య నున్న సంబంధంలో ఉంటుంది. కథ అర్థం కావడమంటే, ఈ సంబంధం అర్థం కావడమే.

v) పాత్ర మానసిక జీవితానికీ, భౌతిక జీవితానికి మధ్య ఉన్న సంబంధాన్నీ, లేదా వైరుధ్యాన్నీ చిత్రించడమే నిజమైన వాస్తవికతావాదం.

vi) వాస్తవికతా వాదం ఆధారంగా అనేక రకాలైన ఊహాకల్పనలు చేసి, వాస్తవికతను స్ఫురింప చేయవచ్చు. కథ వాస్తవిక సరిహద్దులను దాటి వెళ్ళినప్పుడే దాన్ని ఊహా కల్పన- ఫాంటసీ అంటారు.

vii) ఊహాకల్పనను నాలుగు రకాలుగా విభజించవచ్చు.

1. దేశ కాలాలను మార్పు చేసే కల్పన.
2. పునః సృష్టి చేసిన పురాణగాథలు (Mythss).
3. జంతు గాథలు (Animal Fables).
4. విజ్ఞాన శాస్త్ర కల్పనలు (Scientific Fiction).

viii) తెలుగులో అంతరార్థ కథనం గల కథలు చాలా తక్కువ. వాటిలో రా.వి.శాస్త్రి 'పిపీలికం' అత్యుత్తమ కథ.

ix). ఒకే కథలో ఒకే కథన శిల్పం ఉండాలన్న సిద్ధాంతం ఏమీ లేదు. అది కథా స్వభావాన్ని బట్టి, రచయిత దృక్పథాన్ని బట్టి మారుతుంది. ఇలా కథకు సంబంధించిన విలువైన సూత్రాలను వల్లంపాటివారు అందించారు.

కాళీపట్నం రామారావు, రా.వి.శాస్త్రి, చా.సో, కొడవటిగంటి, మధురాంతకం రాజారాం వంటి వారి కథలలో గల వస్తు, శిల్పాలను కూలంకషంగా చర్చించారు. అంగాంగ సమన్వయాన్ని సాధించలేక పోయిన కథలను విశ్లేషించి, అవి అలా తయారుకావడానికి రచయితలలో శిల్పదృష్టి లోపించడమేననీ వ్యాఖ్యానించారు.

చాలా వరకూ నవల-కథలను తులనాత్మక పద్ధతిలో వివరించారు. నవలకు సంబంధించి ఆయన చెప్పిన కొన్ని విషయాలను గుర్తించవలసి ఉంది.

i) తొలి తెలుగు నవలల్లో కథ బలహీనంగా ఉండేది. కథా నిర్మాణంలో కూడా నేర్పు కనిపించేది కాదు. ఆంగ్ల నవలలతో, బెంగాలీ మొదలైన భారతీయ నవలా సాహిత్యాలతో పరిచయం పెరగడంతో తెలుగు నవలా శిల్పంలో చాలా మార్పులొచ్చాయి (న.శి: 26).

ii) మన కల్పనా సాహిత్యంలో ఉన్నవ, విశ్వనాథ, చలం, రా.వి.శాస్త్రి ప్రారంభించిన నాలుగు శైలీ సంప్రదాయాలున్నాయి (న.శి: 94).

iii) విశ్వనాథ ''పురాణ వైర గ్రంథ మాల'' పేరుతో రాసిన పుస్తకాలు చరిత్రా కావు, నవలలూ కావు.
చరిత్రనూ, నవలా ప్రక్రియనూ దుర్వినియోగం చేయటం మాత్రమే (న.శి:116).

iv) తెన్నేటి సూరి రాసిన 'చెంఘిజ్ ఖాన్'లో సంయమనం, చారిత్రక దృష్టి, నవలా శిల్పం ఉన్నాయి. అలాంటివి విశ్వనాథ ''పురాణ వైర గ్రంథ మాల''లో మచ్చుకి కూడా కనిపించవు (న.శి:116).

v) చారిత్రక నవలను రాయటం గతాన్ని విచక్షణా రహితంగా కీర్తించటం కోసమూ కాదు, తిరస్కరించటం కోసమూ కాదు. గతం వెలుగులో వర్తమానాన్నీ, వర్తమానం వెలుగులో గతాన్నీ అర్థం చేసుకోవటం కోసం. చారిత్రక ప్రస్థానానికి ''ప్రగతి'' మూల సూత్రం అన్న చైతన్యం నవలా రచయితకున్నప్పుడు అతడికి సరైన దృక్పథం కలుగుతుంది (న.శి:116).

vi) జీవితాన్ని చూపించటం మాత్రమే నవల బాధ్యత కాదు. జీవితాన్ని గురించి పాఠకుడికి తెలియని విషయాలను తెలియచెబుతుంది (న.శి:119).

vii) దేశ కాలాల చట్రంలో బిగించిన జీవితం నవలకు వస్తువు. ఆ జీవితాన్ని రచయిత అభివ్యక్తం చేసిన పద్ధతి శిల్పం అవుతుంది. మన దేశంలో నవల మన దేశంలో రాబోయే సామాజిక, రాజకీయ, సాంస్కృతిక పరిణామాల మీద ఆధారపడి ఉంటుంది. (న.శి:125).

ఇలా వీరి నవలా, కథా విమర్శ తెలుగు సాహిత్య విమర్శకు పరిపుష్టిని కలిగించిందని చెప్పవచ్చు. అయితే, ఈ గొప్పతనమంతా 'విమర్శ'లో సంయమనాన్ని, సమన్వయాన్ని చూపడంలోనే కనిపిస్తుంది.

**సమన్వయం:**

వల్లంపాటి విమర్శ సమన్వయంతో కూడింది. సిద్ధాంతాన్ని గురించి వ్యాఖ్యానించేటప్పుడు సంయమనాన్ని, వస్తు, శిల్పాలను వివరించేటప్పుడూ, నిర్ణయాలను ప్రకటించేటప్పుడూ సమన్వయంతోనూ విమర్శిస్తుంటారు. వల్లంపాటి వారి విమర్శ కొన్ని సూత్రాలను రూపొందిస్తున్నట్లు ఉంటుంది. ఆ సూత్రాలతో ఏ రచననైనా అనువర్తించవచ్చు అవకాశం అన్నట్లుంటుంది. అయితే, పాఠకుడికి కొన్ని అభిప్రాయాల మధ్య సమన్వయం లోపిస్తే మాత్రం, వల్లంపాటి వారు చెప్పిందాన్నే మళ్ళీ ఖండిస్తున్నట్లు అనిపిస్తుంది.

అ) "ప్రాంతం, కులం, శాఖ, మతం మొదలైన అంశాలు సాహిత్య విమర్శలోనూ, సాహిత్యానికి విలువ కట్టడంలోనూ ప్రవేశించకూడదు"(వల్లంపాటి వెంకట సుబ్బయ్య 2002: 21).

ఆ) "రచయిత నివసించిన కాలం, ప్రాంతం (Time and Space), రచయిత భావజాలం, విమర్శకుని భావజాలం, వీటి మధ్య ఉన్న సంబంధం లేదా వైరుధ్యం, రచయిత మీదా లేక రచన మీద ఉన్న మనస్తత్వ, ఆర్థిక, సామాజిక శాస్త్రాల ప్రభావం, రచనలోని ధార్మికత, నైతికత వంటి అనేక సాహిత్యేతర ప్రమాణాలు కూడా సాహిత్య విమర్శలో ప్రముఖమైన స్థానాన్ని కలిగి ఉంటాయి" (వి.శి:17).

ఇ) "రచయిత ఒక ప్రాంతానికీ, కులానికీ, వర్గానికీ అతీతమైన జీవితాన్ని చిత్రించలేడు. అలా చిత్రించాలను కోవటం నిజాయితీ లోపం కావచ్చు. బౌద్ధికమైన పిరికితనం కావచ్చు లేదా వ్యాపార సాహిత్య లక్షణం కావచ్చు"

ఈ) "జాషువా దళితుడు కావటం అతని సాహిత్యాన్ని తీవ్రంగా ప్రభావితం చేసింది. అలాంటి ప్రభావం జ్ఞానానందకవిలో ఎక్కడో కానీ కనిపించదు. విశ్వనాథ, కొడవటిగంటి ఒకే ప్రాంతానికీ, కులానికీ చెందిన వారే అయినా వారి సాహిత్య దృక్పథం ఒకటే కాదు."

ఉ)"రచయితల వ్యక్తిగత జీవితం రచనల్లోకి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రవేశించవచ్చు. కానీ, రచయిత వ్యక్తిగత జీవితాన్ని ఆధారం చేసుకొని రచనను వ్యాఖ్యానించటం చాలా బలహీనమైన విమర్శ విధానం" (వి.శి: 28).

'సంసారవృక్షం' గురించి వల్లంపాటి చేసిన విమర్శలో... కింది విధంగా వివరించారు.

ఊ) "డాక్టర్ వీరభద్రరావు పాత్ర ఆధునిక సామాజిక భావాల పట్ల సుదర్శనం కున్న అసహ్యతను, సహిష్ణుకతను ప్రదర్శించుకోవడానికి చిత్రించబడిన వికృత రూపం మాత్రమే" (అ.శీ: 55).

ఋ) "సుదర్శనం గురువుగారయిన అమియరాయ్ చౌదరి అమియ బాబాగా 'సంసారవృక్షం'లో దర్శనమిస్తారు. ఇలా ఈ నవలలో వస్తువుకు రచయితకు విడదీయరాని సంబంధం ఉంది." (అ.శీ: 62)

ౠ) "విశ్వనాథ ధర్మారావు రూపంలో చెప్పుకున్న వేయి పుటల స్వగతమే! 'వేయిపడగలు' (వ.సా. వ్యా: 71).

ఎ) "ఒకరకంగా అసమర్థుని జీవయాత్ర రచయిత ఆత్మకథనాత్మక నవల కూడా! తన తండ్రి నుంచి తనకు సంక్రమించిన హేతువాదాన్ని తన ఆలోచనలో నుంచి వదిలించుకోవటం కోసం గోపిచంద్ చేసిన ప్రయత్నం ఈ నవల" (న.శి: 105).

ఏ) "గురజాడ, శ్రీపాద ప్రధానంగా బ్రాహ్మణుల గురించే రాశారు" (క.శి:108).

ఇలాంటి అభిప్రాయాలను పాఠకుడు సరిగ్గా సమన్వయం చేసుకోకపోతే, ఒక దాన్ని మరొకటి ఖండించు కుంటున్నట్లు అనిపిస్తుంది. అంతే కాకుండా విమర్శకు ఉండవలసిన స్పష్టత లేనట్లు భావించే అవకాశం కూడా కలుగుతుంది. ప్రాంతం, కులం, మతం అనేవి సాహిత్య విలువల నిర్ణయంలో ప్రవేశించకూడదు అనేవి

విమర్శకు ఉండవలసిన వస్తు నిష్ఠకి సంబంధించిన అంశాలు. విమర్శకుడికి రాగ ద్వేషాలు ఉండకూడదు. సమదృష్టితో విమర్శ చేయాలి. అంతే తప్ప 'ఒక దృక్పథం' ఉండకూడదనేది కాదు. వీటిని గుర్తించాలనడంలో విమర్శకుడికి ఉండే నిబద్ధతకు, దృక్పథానికి సంబంధం ఉంది. ఇంకా చెప్పాలంటే, అది సామాజిక విమర్శకుడికి ఉండవలసిన ప్రధాన లక్షణం.

జాషువా, జ్ఞానానంద కవులను, విశ్వనాథ - కొడవటిగంటిలను కుల, మత కోణాల నుండి విమర్శ చేస్తే, ఒకే కులంలో ఒకే కుల, మత, ప్రాంతాలలో కూడా భిన్న వైరుధ్యాలు ఉండి, వాళ్ళ జీవితానుభవాలే వాళ్ళ రచనలకు ఆధారాలవుతాయని చేసే సాధారణీకరణ సూత్రాలు సరైనవి కాదని చెప్పడానికి చేసిన విశ్లేషణ. సుదర్శనం, విశ్వనాథ, గోపీచంద్‌లను వారి రచనల్లో గల పాత్రల స్వభావాన్ని చిత్రించడానికి చేసిన ప్రయత్నమని నిరూపించడమనేది, వారి జీవితంపై చూపిన ప్రభావాలు, తాము నమ్మిన విశ్వాసాల ప్రభావం లేదా వైరుధ్యాన్ని సృజనాత్మక సాహిత్యంలో వర్ణించే ప్రయత్నం సఫలమైందా, విఫలమైందా? అనేది నిరూపించడానికి జరిగిన విశ్లేషణగా గుర్తించాలి. రచయితకు ఉండే ప్రాపంచిక దృక్పథం తెలుసుకోవడానికి ఈ విశ్లేషణ ఉపకరిస్తుంది.

వల్లంపాటి వారి విమర్శ కృషిలో విమర్శ గురించి ఈయన వ్యక్తం చేసిన కొన్ని అభిప్రాయాలు ఈయన విమర్శకూ సరిపోతాయి. *'సాహిత్య విమర్శ వ్యాఖ్యానానికి వ్యాఖ్యానం. సాహిత్యం జీవితాన్ని వ్యాఖ్యానిస్తే, సాహిత్య విమర్శ సాహిత్యాన్ని వ్యాఖ్యానిస్తుంది'* (వల్లంపాటి వెంకట సుబ్బయ్య1985 : 22).

మంచి సాహిత్యం రావాలంటే, మంచి సాహిత్య విమర్శ రావాలనే ఆకాంక్ష కలిగిన వారు వల్లంపాటి. విమర్శకుడికి కొన్ని అర్హతలు-బాధ్యతలు ఉండాలి. వీటిని వివరించటంలో ప్రాచ్య, పాశ్చాత్యుల అభిప్రాయాలను క్రోడీకరించి, తనదైన పద్ధతిలో చెప్పారు. వీటిని విమర్శకుడుగా వల్లంపాటి వారికి కూడా అన్వయించి చూడవచ్చు.

(i) విమర్శకుడు ఉత్తమ పాఠకుడై ఉండాలి. భారతీయ సాహిత్య శాస్త్రకారుల్లో అభినవగుప్తుని 'సహృదయత' రచనను కవి/రచయిత దృక్పథం నుండి అవగాహన చేసుకోవడానికే తోడ్పతుంది. దీన్ని దాటి విమర్శకుడు ఉత్తమ పాఠకుడుగా ముందుకి వెళ్ళాలి (వి.శి: 10).

(ii) విమర్శకుడు ఉత్తమ విద్వాంసుడై ఉండాలి. నిరంతరం సంబంధిత సాహిత్య, సాహిత్యేతర సిద్ధాంత అధ్యయనం కొనసాగాలి. విమర్శకుడు సాధారణ రచయిత కంటే సంబంధిత రంగంలో ఎక్కువ పరిజ్ఞానం కలిగి ఉండాలి (వి.శి: 11-12).

(iii) భావాల చరిత్ర తెలిసినవాడై ఉండాలి. రచన పుట్టిన కాలం, ప్రాంతం పట్ల అవగాహన కలిగి ఉండి, రచన వచ్చిన నిర్దిష్ట చారిత్రక నేపథ్యాన్ని గుర్తించ గలిగే సామర్థ్యం ఉండాలి (వి.శి: 12).

(iv) రాగద్వేషాలు లేకుండా ఆరోగ్యకర మనస్సు కలిగి ఉండాలి. సత్యాన్ని నిజాయితీగా చెప్పగలగాలి. మత, కుల, వ్యక్తిగత సంబంధాలతో విమర్శ చేయకూడదు.

(v) విమర్శకుడు రచయితగా ఉండాలనేమీ లేదు (వి.శి: 12).

(vi) విమర్శకుడు రచనకూ - పాఠకుడికీ; పాఠకుడికీ - రచయితకీ మధ్య అనుసంధాన కర్తగా ఉండాలి (వి.శి: 14).

(vii) రచనను విశ్లేషించి పాఠకుని అభిరుచిని సరిదిద్దగలిగి (Correction of Taste), రచనానుభూతిని విలువ కట్ట గలగాలి (వ.సా.వ్యా: 4).

(viii) విమర్శకుడికి కూడా దృక్పథం ఉండవచ్చు. అయితే, ఆ రచనను రచయిత దృక్పథం నుంచీ, తన సామాజిక -ఆర్థిక దృక్పథం నుంచీ విలువ కట్టగలగాలి (వి.శి: 15-16).

(ix) శిల్పానికి సంబంధించిన సాహిత్య వస్తువుకి సంబంధించిన సాహిత్యేతర ప్రమాణాలను సాహిత్య విమర్శలో రచనను విలువ కట్టడంలో పరస్పర పూరకాలుగా గ్రహించవలసి ఉంటుంది (వి.శి: 17).

(x) కాలక్రమంలో విలువలు మారడాన్ని విమర్శకుడు గమనిస్తే, సాహిత్యాన్ని పునర్మూల్యాంకనం (Revaluation) చేయడానికీ వెనుకాడ కూడదు. అయితే, క్లిష్టమైన ఈ పనిని బాధ్యతాయుతంగా నిర్వహించాలి (వి.శి: 21).

(xi) రచయితకు ఉన్నట్టే, విమర్శకుడికీ నిబద్ధత ఉండవచ్చు. కానీ, రచనలో ఉన్న సిద్ధాంతాన్ని రచయితకు అనుకూలంగానో, వ్యతిరేకంగానో వక్రభాష్యాలు చెప్పే వరకూ వెళ్ళకూడదు (అ.శీ: 28).

ఇవన్నీ ఇంచుమించు విమర్శకుడుగా వల్లంపాటి పాటించినట్లు ఈయన రచనలే సాక్ష్యంగా నిలుస్తున్నాయి.

**వల్లంపాటి విమర్శలో గుర్తించవలసిన ప్రధాన అంశాలు:**

1. నవల, కథలను విమర్శించటంలో అనువర్తిత విమర్శకు అధిక ప్రాధాన్యత నివ్వటం.

2. విమర్శ సూత్రాలను గుర్తించటం వల్ల, వాటిని యువ విమర్శకులకు, సాహిత్యాన్ని అధ్యయనం చేయాలనుకునే వారికి మార్గ దర్శకంగా సాధారణీకరించి చెప్పటం.

3. సామాజ కేంద్రిత విమర్శ దృక్పథమే అయినా, కళావిలువలకు ప్రాధాన్యతను తగ్గించకపోవటం.

4. భారతీయ, పాశ్చాత్య సిద్ధాంత, విమర్శలను, వస్తు, శిల్ప విషయాలను సమన్వయించటంలో సంయమనం పాటించటం.

5. మార్క్సిస్టు సిద్ధాంతాన్ని సాహిత్యానికి అన్వయించటంలో వక్రభాష్యాలు లేకుండా, మూల సూత్రాలతో సాహిత్య అనువర్తనం జరగవలసిన అవసరం ఉందనటం.

6. స్థానికత, ప్రాంతీయ సాహిత్య విమర్శకు రాయలసీమలో ఆధునిక సాహిత్యం సామాజిక సాంస్కృతిక విశ్లేషణ అనువర్తన ద్వారా పునర్మూల్యాంకనం చేయగలిగే మార్గాన్ని సూచించగలగటం. రాయలసీమ సాహిత్యాన్ని గురించి, వారి గ్రంథాల్లో అక్కడక్కడా కొన్ని వ్యాసాలు రాసిన వల్లంపాటి, వాటిని ఒక సిద్ధాంతంగా

రాయలసీమలో ఆధునిక సాహిత్యం సామాజిక సాంస్కృతిక విశ్లేషణ గ్రంథంలో పొందుపరిచారు. స్థల, కాలాలను అనుసరించి సాహిత్యాన్ని అర్థం చేసుకునే విధానాన్ని గుర్తించడానికి వీలుగా ఒక నమూనాగా దీన్ని తీసుకొనే అవకాశం ఉంది.

7. సాహిత్యానికి విలువ కట్టడమనేది సాహిత్య, సాహిత్యేతర ప్రమాణాలను గ్రహించటంలోనే పరిపూర్ణత,స్వయం సమగ్రత సాధిస్తుందనటం. దీనికి ఒక విధంగా కట్టమంచి వారి కవిత్వ తత్త్వ విచారం వీరికి ఆదర్శంగా నిలిచిందని భావించే వీలుంది. అయితే, కట్టమంచి రామలింగారెడ్డి ప్రబంధాలను ప్రధాన కేంద్రంగా చేసుకున్నారు. వల్లంపాటి వారు రాయలసీమ రచనలను కేంద్రంగా చేసుకున్నారు.

8. అత్యాధునిక విమర్శ ధోరణులైన నవ్యవిమర్శ (New Criticism), నిర్మాణవాదం (Structuralism), ఉత్తరాధునికవాదం (Postmodernism), వంటి వాటిలో కొన్ని స్వీకరించవలసిన అంశాలూ ఉన్నాయనేది గుర్తించాలి. అలాగే, నవలా చారిత్రక వాదులు (Neo-Historists), వినిర్మాణ వాదుల (Deconstructionists)లో కొన్ని స్వీకరించవలసిన అంశాలు ప్రతిపాదించినప్పటికీ, సాహిత్య వస్తువుకి, చరిత్రకి, రచయిత్రలకు ఉన్న పరస్పర సంబంధాలను తిరస్కరించి, జీవితం కంటే, వాదాలకే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుందని ప్రచారం చేస్తారనీ, వీటిని విమర్శకుడు లోతుగా గమనించాలనే అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు

9. ఈయన విమర్శ ప్రాపంచిక దృక్పథం మీద ఆధారపడి ఉంటుంది. ప్రాపంచిక దృక్పథంలో ఇంద్రియ వాస్తవాలకే ప్రాధాన్యత ఉంటుంది. అతీంద్రియ శక్తులకు, లేదా ప్రభావాలకు దూరంగా ఉండి, భౌతిక సత్యాలకు ప్రాధాన్యతనివ్వటం అనేది ముఖ్యమవుతుంది.

10. Aesthetic distance పట్ల రచయిత అప్రమత్తుడై ఉండాలన్నారు. రచన చేయడం ద్వారా రచయితకీ, కథకుడికి (నేరేటర్) మధ్య, రచయితకు కథావస్తువుకీ మధ్య, రచయితకీ పాత్రలకు మధ్య తగు మాత్రంలోనే ఈ Aesthetic distance ఉండాలి. ఇది పాఠకునికి క్రియాత్మక ఊహాశక్తిని పట్టిచ్చేదిగా ఉండాలి. ఈ దూరం ఎక్కువైనా, తక్కువైనా రచన కళగా రూపొందదు.

11. కల్పనా సాహిత్య సిద్ధాంతాన్ని అధ్యయనం చేయడానికి పాశ్చాత్య విమర్శను ఆశ్రయించక తప్పదు.

12. వల్లంపాటి వారి సాహిత్య విమర్శ ప్రాచ్య, పాశ్చాత్య సాహిత్య శాస్త్రాలను అనుసరించి సమన్వయించేలా చేస్తుంది.

13. భారతీయ సాహిత్య సిద్ధాంతాల్లో మౌలికంగా కొన్ని విలువైన సిద్ధాంతాలు ఉన్నాయని చెప్తున్నప్పటికీ, పాఠకుడికి భారతీయేతర సాహిత్య శాస్త్రకారులపైనే ఆసక్తి పుట్టుకొస్తుంది. దీన్ని భారతీయ సాహిత్య సిద్ధాంతాలను, విమర్శను తక్కువ చేసే ఆసక్తిగా కాకుండా, జ్ఞాన పరిధిని పెంచుకోవలసిన అవసరాన్ని తెలిపేదిగా గుర్తించాలి.

14. ప్లాటో, అరిస్టాటిల్ వంటి వాళ్ళు సాహిత్యం, కళల గురించి చెప్పిన విషయాలు లోతైన ఆలోచనతోనే చెప్పారనే అభిప్రాయం వీరి విమర్శ కలిగించగలుగుతుంది.

15. అత్యాధునిక సాహిత్య విమర్శ మార్గంలో కొన్ని ధోరణులు ఉన్నా, అవి మార్క్సిజానికి వ్యతిరేకంగా, పెట్టుబడిదారీ సమాజ ఆధిపత్య భావజాలంగా స్పష్టం చేసిన విశ్లేషణ వీరి నిబద్ధతకు, పాండిత్యానికీ నిదర్శనంగా నిలుస్తుంది.

సాహిత్య విమర్శకు సాహిత్యేతర ప్రమాణాలు అవసరమని భావించే వారిలో మార్క్సిస్టు విమర్శకులు ప్రముఖంగా కనిపిస్తారు. Inter Disciplinary Methodలో సాహిత్య విలువలను నిర్ణయించాలని నమ్ముతారు. సామాజిక శాస్త్రాలను అవసరమైనంత మేరకు ఉపయోగించుకుంటారు. సమాజశాస్త్రం, చరిత్ర, రాజనీతి శాస్త్ర విభాగాలు, తత్త్వశాస్త్ర, మనో విజ్ఞాన శాస్త్రాల సమన్వయం సాహిత్య విలువల నిర్ణయంలో అవసరమని భావిస్తుంటారు.

త్రిపురనేని మధుసూధనరావు, కె.వి.ఆర్., కేతు విశ్వనాథ రెడ్డి, రాచపాళెం చంద్రశేఖరరెడ్డి వంటి వాళ్ళు సాహిత్య విలువల నిర్ణయానికి, సాహిత్యేతర శాస్త్రాల ప్రభావాన్ని చూడాలని భావించారు. ప్రాపంచిక దృక్పథం గురించి కూడా విస్తృతంగానే ప్రచారం చేశారు. ఈ ప్రభావం వల్లంపాటి విమర్శలో బలంగా ఉంది. ఇంకా అనేక నూతన ఆలోచనలను అందించిన విమర్శకుడుగా వల్లంపాటి వెంకటసుబ్బయ్య గారిని చెప్పుకోవచ్చు.

ఆధునిక సాహిత్య విమర్శలో విశ్లేషణ ప్రధానమైంది. ప్రతి వస్తువును, విషయాన్ని అంగాలుగా విభజించి, పరిశీలించి, తరువాత అందులోని అంగాంగ సమ్మేళనాన్ని (organic Unity) చూసి, ఆనందించటంలో ఆధునిక శాస్త్రీయ దృష్టి ఉన్నదని ఆధునిక విమర్శకులు నమ్ముతున్నారు అలాంటి పద్ధతిని వల్లంపాటి వారు తన విమర్శలోనూ పాటించారు. నిజానికి ఇలాంటి గుణమే విమర్శను శాస్త్రస్థాయిలోకి తీసుకెళ్ళడానికి ఉపకరిస్తుంది. అది వల్లంపాటి వారి విమర్శలోనూ ఉంది. వీరి విమర్శ పద్ధతిని లోతుగా గమనిస్తే, ఒక రచనను లేదా ఒక రచయితను తీసుకొని విమర్శ చేసేటప్పుడు central idea, artistic value, purpose of the work , content and form వంటి వాటిని ప్రధానంగా దృష్టిలో పెట్టుకుంటారని తెలుస్తుంది. విమర్శాశిల్పం సాహిత్య సిద్ధాంత గ్రంథంగా అందించారనిపిస్తుంది.

తెలుగు సాహిత్య విమర్శకు పాశ్చాత్య భావనలు, సిద్ధాంతాలను సమన్వయించటంలో ఒక విశిష్టతను సాధించారు. భారతీయ సాహిత్య సిద్ధాంతాల పట్ల వల్లంపాటి వారు చేసిన వ్యాఖ్యలను పండితులు లోతుగా అధ్యయనం చేయవలసిన అవసరం ఉంది. అయినా, సాహిత్యానికి సాహిత్యేతర శాస్త్రాల ఆవశ్యకతను కూడా నొక్కి చెప్పారు.

విమర్శనంతా పరిశీలించిన తరువాత మార్క్సిస్టు విమర్శకుడుగానే గుర్తించే వీలున్నా, ఆ సిద్ధాంత మౌలిక భావనలను వక్ర భాష్యానికి గురవుతున్నాయని తపించే సాహితీవేత్తగా కనిపిస్తారు. కావ్యాల కంటే నవల, కథల వైపే తన విమర్శదృష్టిని

కేంద్రీకరించి ఒక విశిష్టస్థానాన్ని పొందారు. ఒక్కమాటలో విమర్శకుడుగా వల్లంపాటి వెంకట సుబ్బయ్య గారి గురించి చెప్పాలంటే, తెలుగు విమర్శ దీపం మరింత కాంతి వంతంగా వెలగడానికి తన వంతు కృషి చేశారు.

**ఆధార గ్రంథాలు:**


మధుసూధనరావు,త్రిపురనేని. *సాహిత్యంలో వస్తు శిల్పాలు.*
(సంపా.) బి. తిరుపతిరావు, హైదరాబాదు: పర్స్పెక్టివ్ ప్రచురణలు. 1997.
మందేశ్వరరావు,వడలి. *అనుశీలన సాహిత్య విమర్శ.*
హైదరాబాదు: తెలుగు అకాడమి. 1992.
వీరభద్రయ్య, ముదిగొండ. *మేజర్ క్రిటిక్స్ ఆఫ్ మోడ్రన్ తెలుగు లిటరేచర్*
*(ఆంగ్లం).* విజయవాడ: పల్లవీ పబ్లికేషన్స్. 1998.
వెంకట సుబ్బయ్య, వల్లంపాటి. ఈ వ్యాసంలో పేర్కొన్న గ్రంథాలన్నీ.
వెంకటేశ్వరరావు, దార్ల. పరిశోధకుడుగా ఆరుద్ర.(పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం
(అముద్రితం). హైదరాబాదు: హైదరాబాదు విశ్వవిద్యాలయం. 2003.
సంజీవమ్మ. సాహిత్య విమర్శ *మార్క్సిస్టు దృక్పథం.*(వ్యా).
అభ్యుదయ విమర్శ విశేష సంచిక. తుమ్మల వెంకట్రామయ్య. (సంపా), విజయవాడ: అరసం ప్రచురణ, ఆగస్టు. 1980.
శివశంకర్,పాపినేని. *సాహిత్యం మౌలికభావనలు.*
విజయవాడ: పల్లవీ పబ్లికేషన్స్.1996.


***

# "మనసున మనసై" నవలలో స్త్రీవాదం

అమ్మాయిలకు ఉన్నత చదువులు అవసరమా! ఏ వయసులో పెళ్ళి జరిగితే బాగుంటుంది? ఆర్థిక స్వాతంత్ర్యం స్త్రీలకెంత వరకూ ప్రయోజనకరం? ఆశయాలకూ, ఆచరణకూ పొంతన కనిపిస్తుందా? జీవితంలో సర్దుబాటు తప్పదా? అయితే, అది ఎలాంటి సర్దుబాటైతే బాగుంటుంది? సర్దుబాటు స్త్రీ, పురుషుల్లో ఇద్దరికీ ఉండాలా? లేక ఒక్కరికే ఉండాలా? మొదలైన ప్రశ్నలు - వాటికి సమాధానాలు డి. కామేశ్వరి గారు రాసిన 'మనసున మనసై' నవలలో చాలా వరకు కనిపిస్తాయి. ఆ సమస్యలను నవల లోతుగా చర్చిస్తుంది.

'వార్త' దినపత్రిక ధారావాహికంగా ప్రచురించిన మనసున మనసై 'నవల' పుస్తకరూపంలో వచ్చింది. "*ఇది వరకటి తరాల స్త్రీలయితే తమ అదృష్టం యింతేనని సరిపెట్టుకుని భర్త తిడితే బాధపడి, భర్త ఆదరించిన నాడు పొంగిపోయి కష్టమైనా, ఇష్టమైన అదే జీవితం అనుకొని బతికేది. ఇప్పటి యువతరానికి ఆర్థిక స్వాతంత్ర్యం వచ్చాక స్వాభిమానం, ఆత్మాభిమానం, అభిజాత్యం ఎక్కువపాలై మేమేందుకు సర్దుకొని బతకాలి అన్న ధోరణి తలెత్తాక దాంపత్యంలో సర్దుబాటు ధోరణి తగ్గిపోయి కాపురంలో మనస్పర్ధలు తలెత్తసాగాయి. జీవితం అంటేనే సర్దుబాటు మ్యారేజ్ యీజ్ నథింగ్ బట్ ఎడ్జస్ట్‌మెంట్*" అని గుర్తించమంటూ రచయిత్రి రాసుకున్న "ముందుమాట"లో అన్నారు.

"*ఒక నెగెటివ్ క్యారెక్టర్ ద్వారా పాజిటివ్ థింకింగ్‌కి బాటవేశారు రచయిత్రి. ఆధునిక యువతి ఎలా ఆలోచించకూడదో, ప్రతీదీ వ్యతిరేక దృక్పథంలో ఎలా చూడకూడదో చెప్పారు. మనిషి ఎలా బ్రతకాలో ఎంత ఆదర్శవంతంగా జీవించాలో చాలామంది చెబుతుంటారు. కానీ, ఎలా ప్రవర్తించకూడదో పాఠకులకు పూర్తిగా కన్విన్స్ చెయ్యగల బహుకొద్ది మంది రచయితలో ఈమె ఒకరు. విద్య, ఉద్యోగం, ఆర్థిక స్వాతంత్ర్యం ఆధునిక స్త్రీని బాధ్యతాయుతమైన వ్యక్తిగా తీర్చిదిద్దాలేగాని, తలబిరుసుతనానికి తావివ్వకూడదు*" అని వ్యాఖ్యానించారు ఈ నవలకి అభిప్రాయం రాసిన మాలతీచందూర్.

"ఆలోచింప చేసే అలజడి చిత్రణ" పేరుతో ఈ నవలకి అభిప్రాయం రాసిన కేతు విశ్వనాథరెడ్డి గారు "*స్త్రీ పురుష సంబంధాల మధ్య వస్తున్న వాంఛనీయ, అవాంఛనీయ సనాతన, ఆధునిక, శుభ, అశుభ పరిణామాలని అంతోయింతో పట్టించుకొన్న రచన*"గా పేర్కొని "*సమష్టి కుటుంబాలు విచ్ఛిన్నమవుతున్నాయి. తరాల మధ్య అంతరం పెరిగింది. ఆర్థిక స్థితిగతులు సమతుల్యాన్ని కోల్పోతున్నాయి. పెళ్ళికాని, అయిన ఉద్యోగినులు రకరకాల సమస్యలను ఎదుర్కొంటున్నారు. అమ్మానాన్నలు, అత్తామామలు, బంధువులు, స్నేహితులు, సాంస్కృతిక వారసత్వం, అధికారం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో మహిళల జీవితం మీద ప్రభావం చూపుతుంది. మతం, కట్నం, అందచందాలు, హోదాలు, వినియోగదారీ సంస్కృతి వ్యక్తిత్వాలను*

*తారుమారు చేస్తున్నాయి. మానవసంబంధాల మధ్య అసహనం, అలజడి, ఆందోళన పెరిగిపోయాయి. పెంపకం, పెళ్ళి, ప్రేమ, దాపత్యం సర్వస్వం 'నిర్వహణశాస్త్ర' పరిధిలోకి వచ్చేశాయి. 'మనసున మనసై' నవల నిర్వహణ శాస్త్రదృష్టి నుంచి పరిశీలించ దగ్గ నవల"* అని వ్యాఖ్యానించారు.

పైన పేర్కొన్న వీరి అభిప్రాయాలలో కేతు విశ్వనాథ రెడ్డి గారు ఒక చర్చనీయాంశాన్నిపెట్టారు అది *"జీవితంలో అపజయాలు వ్యక్తిత్వాన్ని నిర్ణయించవు ఏ శక్తులతో పోరాడాలో తెలిసి పోరాడగలగాలి. లేదా గాలివాటుగాకాక, నచ్చిన సామాజిక జీవితంలో సేవలో శాంతిని వెతుక్కోవాలి జయంతిలాగ, ఇదీ యాదృచ్ఛికమేనా?"* అని నవల ముగింపుని చర్చనీయాంశం చేసే చక్కని వ్యాఖ్యను కేతు విశ్వనాథరెడ్డి గారు పాఠకుల ముందుంచారు. ఇది నవలా రచయిత్రి తన రచనను ముగించడంలో గల ఆంతర్యాన్ని తడిమి చూడగలిగిన వ్యాఖ్య. ఇదంతా చర్చించుకునే ముందు నవల సారాంశాన్ని తెలుసుకుంటే బాగుంటుంది.

**నవలా సారాంశం:**

పద్మావతి - వెంకటేశ్వరరావులకు వాసంతి, జయంతి, దమయంతి అనే ముగ్గురు కూతుళ్ళు ఒక కొడుకు ఉన్నారు. అప్పటికే తల్లిదండ్రులు వాసంతికి పెళ్ళి చేసి జయంతికి పెళ్ళిచేయాలనే ఆత్రుతతో ఉన్నారు. గోపాలకృష్ణ అనే బ్యాంకు ఉద్యోగిని చూస్తారు. అతను జయంతిని చూడ్డానికి వస్తాడు. నల్లగా, బట్టతలతో ఉన్న అతను జయంతికి నచ్చడు. ఆ విషయాన్ని అతనింకా బయటికి వెళ్ళకుండానే జయంతి అతని గురించి వ్యాఖ్యానిస్తుంది. అదే సమయంలో 'జాతక చక్రం' తీసికెళ్ళదామని తిరిగి వచ్చిన గోపాలకృష్ణ వినడం చిన్నబుచ్చుకొని వెళ్ళిపోతాడు.

జరిగిన సంఘటనకు మనస్తాపానికి గురైన గోపాలకృష్ణ ఒకరోజు జయంతి ఆఫీసుకు వెళ్ళి ఒక గిఫ్టు బాక్స్ ఇస్తాడు. దానిలో ఒక అద్దం పెట్టి, ఆమె అందాన్ని చూసుకోమని వేలాకోళం చేస్తాడు. అది జయంతిని అవమానించినట్లు ఫీలవుతుంది. ఆ విషయం ఇంటిలో చెబితే అలా చేసేముందు గోపాలకృష్ణ తమతో సంప్రదించే చేశాడనీ పైగా అతడు తన చెల్లెలు దమయంతిని చేసుకోబోతున్నాడని తెలుస్తుంది. ఈ పెళ్ళేగనుక జరిగితే ఇంట్లో తాను అతని ముందు చిన్నబోయినట్లు ఉండవలసి వస్తుంది. ఆ పెళ్ళి చేయవద్దనీ ఒకవేళ చేస్తే తాను ఇంట్లో నుంచి బయటికి వెళ్ళిపోతానని బెదిరిస్తుంది.

గోపాలకృష్ణను దమయంతికిచ్చి పెళ్ళిచేయడం జరుగుతుందనీ ఇష్టం లేకపోతే వెళ్ళిపోవచ్చుననీ కుటుంబ సభ్యులంతా జయంతికి చెబుతారు. దానితో తన ఫ్రెండ్ ఉషారాణి ఉంటున్న అద్దెగదిలో కొచ్చి కొన్నాళ్ళు ఉంటానని జరిగినదంతా వివరిస్తుంది. 'కొన్నాళ్ళే కాదు ఇష్టమైతే తనతో పాటు అద్దె చెల్లిస్తూ, పనులు పంచుకొని చేసుకొంటూ ఉండవచ్చని' ఆమె చెబుతుంది. ఆ ఒప్పందం బాగుందని అలాగే కొనసాగుతుండగా, ఉషారాణికి వివాహమై వెళ్ళిపోతుంది.

జయంతి ఒంటరిగా మిగిలిపోతుంది. జీవితం నిస్సారంగా మారిపోతుంది. ఒకసారి జయంతికి తీవ్రంగా జ్వరం వస్తుంది. ఆఫీసుకి కూడా వెళ్ళలేక మూసిన తలుపులు కూడా తెరవలేని పరిస్థితుల్లో గోపాలకృష్ణ వాళ్ళ కుటుంబం వాళ్ళే ఆమెను తీసికెళ్ళవలసి వస్తుంది.

ఈలోగా తాను పనిచేసే బ్యాంకులో తన కులానికే చెందిన దివాకర్ మేనేజర్‌గా వస్తాడు. జయంతి వివిధ పనుల వంకతో దివాకర్‌తో చనువుగా ఉంటుంది. అతనికింకా పెళ్ళికాక పోవడం, ఎర్రగా, ఎత్తుగా ఉండి తన కలల రాకుమారుడిలో కొన్ని లక్షణాలైనా ఉండటంతో అతడిని ఇష్టపడుతుంది. కానీ, అతడు ఉత్తర భారతదేశంలో ప్రసిద్ధ వ్యాపారి కూతురు మనీషా వెంటపడి వివాహానికి ప్రయత్నించి విఫలమయినవాడు. అప్పటికే దివాకర్‌ని చేసుకోమని జయంతి తరపున గోపాలకృష్ణ ప్రయత్నిస్తాడు. దివాకర్ ఆ పెళ్ళికి అంగీకరించడు. మనీషాతో పెళ్ళి జరగలేదు. కనుక జయంతిని చేసుకోవాలని దివాకర్ మళ్ళీ గోపాలకృష్ణ దగ్గర చెప్పి అంగీకరించేలా చేస్తాడు. కానీ, జయంతి దివాకర్‌ని తిరస్కరిస్తుంది. దివాకర్ గోపాలకృష్ణ మిత్రుడు కావడం, ఒకసారి తానే అడిగితే అంగీకరించక ధనవంతుల సంబంధం పోయినందుకే తనని చేసుకోవడానికి అంగీకరించాడని భావిస్తుంది.

ఇదిలా ఉండగా, గోపాలకృష్ణ చేసుకున్న దమయంతి చాలా అదృష్టవంతురాలని జయంతితో పాటు ఆ కుటుంబం కూడా భావిస్తుంది. గోపాలకృష్ణ జయంతికి చేసిన పనికి ఏదొలా సహాయం చేసి మంచి వాడనిపించు కోవాలని ప్రయత్నిస్తుంటాడు. ఆమెతో వివిధ సందర్భాలలో *"వదినగారూ!"* అంటూ సంభాషణలో పెట్టాలని చూస్తాడు. ఆమె మొదట ఇష్టపడదు కానీ, దమయంతిని ప్రేమగా చూసుకోవడం తన గురించి దివాకర్‌తో సంప్రదించటం వంటి పనులన్నీ మళ్ళీ జయంతిలో గోపాలకృష్ణ పట్ల సదభిప్రాయాన్ని కలిగిస్తాయి.

ఈలోగా ఇంట్లో వాళ్ళ పోరు పడలేకనో, లేక పెళ్ళి చేసుకోవడానికి తగిన అర్హతులున్న వాడు దొరకక పోవడం వల్లనో శేషగిరిని వివాహం చేసుకుంటుంది. శేషగిరి జయంతి కంటే పెద్ద ఉద్యోగి. ఎత్తుగా, ఎర్రగా ఉంటాడు. ఈ లక్షణాలకు తోడు తనని దివాకర్ తిరస్కరించడం వల్ల కూడా శేషగిరిని పెండ్లి చేసుకోవాలనుకుంటుంది. కానీ, శేషగిరికి తల్లిని చూసుకోవడం చెల్లెలు పెళ్ళి చేయవలసిన బాధ్యతలు ఉన్నాయి. పెళ్ళికి ముందే చెప్పినా, పెళ్ళి అయిన మర్నాడే నుండే ఇద్దరి మధ్య ఆర్థికపరమైన తగాదాలు మొదలై చిలికి చిలికి గాలివానై ఆ పెళ్ళి మూన్నాళ్ళ ముచ్చటగానే మిగిలిపోతుంది. తల్లిని, కూతురిని, తమ్ముడిని చూసుకోవాలని ప్రతి పైసా లెక్కప్రకారం ఖర్చుచేయాలనే మనస్తత్వం శేషగిరిదైతే ఇంటి దగ్గర కాకుండా హోటల్లో హనీమూన్ జరగాలనీ అవసరమైతే దానికి తన డబ్బే ఖర్చు చేస్తాననడం జయంతి వంతయ్యింది.

రోజు ఆఫీసుకెళ్ళి వచ్చి వంట చెయ్యడం కుదరదు. జీతం తెస్తున్నాను కనుక భోజనం చేసే హక్కు తనకుంది అందువల్లే తింటున్నానని తినేసి తిన్న కంచం కూడా కడగని జయంతి పట్ల అత్తగారు, శేషగిరి కూడా ఇబ్బందిగా ఫీలవుతారు. చివరికి వేరే

కాపురం పెట్టాలని జయంతి భావిస్తుంది. శేషగిరి విడాకులిచ్చే ముందు జయంతి తలిదండ్రులకు చెబుతుంది. గోపాలకృష్ణ వచ్చి సర్దిచెప్పే ప్రయత్నం చేస్తాడు. అయినా జయంతి ప్రవర్తనలో మార్పు రాకపోవడంతో జయంతి శేషగిరిలకు విడాకులు తప్పలేదు. శేషగిరి మళ్ళీ ఇంటర్ చదివి మానేసిన అమ్మాయిని పెళ్ళిచేసుకుంటాడు.

ఇంతలో నాటకీయంగా దమయంతి పిల్లలు జయంతికి మాలిమవుతారు. ముందు శేషగిరి మీద కోపంతో అప్పుడు జయంతి అబార్షన్ చేయించుకొంది. భవిష్యత్తులో పిల్లలు కలగరని తెలిసిన జయంతికి ఈ పిల్లలు దగ్గరవ్వడంతో వారి పట్ల ప్రేమ మరింత పెరుగుతుంది. ఒకరోజు ఏదో పని మీద బయటికి వెళ్ళిన దమయంతి హఠాత్తుగా యాక్సిడెంట్‌లో చనిపోతుంది. గోపాలకృష్ణ మాత్రమే కాకుండా అత్తామామలు కుటుంబం అంతా సొంత బిడ్డను కోల్పోయినంతగా బాధపడతారు. ఆ ఆత్మీయతానురాగాలు అర్థమయిన జయంతి మళ్ళీ పెళ్ళిచేసుకోవాలను కొన్నా మళ్ళీ ఎలాంటివాడు భర్తగా వస్తాడోనని అనుమానిస్తుంది. దగ్గరుండి గోపాలకృష్ణ ప్రవర్తనను గమనించడం వల్ల అతన్ని చేసుకొంటే బాగుంటుందని ఆమె భావించి అతనికి తన అభిప్రాయాన్ని చెబుతుంది. కానీ, దమయంతికి తప్ప మరెవరికీ తన హృదయంలో తన జీవితంలో స్థానం లేదని సున్నితంగా తిరస్కరిస్తాడు గోపాలకృష్ణ.

జయంతి ఉద్యోగం మానేసి మానసిక ప్రశాంతత కోసం నర్సరీ పెడుతుంది. తన పిల్లలను ఆ నర్సరిలో ఉంచడానికి గోపాలకృష్ణ అంగీకరిస్తాడు. జీవితంలో ఆర్థిక విలువలే అన్నింటినీ నిర్ణయించలేవనీ మనసునీ అర్థం చేసుకొని జీవించే జీవితానికి తోడు ఒకరుండాలని జయంతి అనుకొంటూ 'నర్సరీ'లోనే మిగిలిపోవడంతో నవల ముగుస్తుంది.

కథనిలా ముగించడంలో రచయిత్రి ఆశించిందేమిటనిపిస్తుంది. ఈ వ్యాస ప్రారంభంలో వచ్చిన ప్రశ్నలే మళ్ళీ వస్తాయి? మరి ఇలా కథా కథనాన్ని నడిపిన రచయిత్రి రచనా స్వభావం ఏమిటి? వీటిని తెలుసుకొనే ముందు రచయిత్రి గురించి తెలుసుకుందాం!

**రచయిత్రి పరిచయం:**

రచనకు ఏదొక సామాజిక ప్రయోజనం ఉండాలనే ఆశయంతో రాస్తున్నట్లు చెప్పుకొంటున్న శ్రీమతి దూర్వాసుల కామేశ్వరి 'డి. కామేశ్వరి'గా ప్రసిద్ధి. 1935 ఆగష్టు 22న కాకినాడలో పుట్టి, మెట్రిక్యులేషన్ వరకూ చదివారు. పెళ్లైన తర్వాత 1952 నుండి 1984 వరకూ భర్త చేస్తున్న ఉద్యోగ ప్రాంతం ఒరిస్సాలోనే ఉన్నారు. 1962లో అంటే 27వ యేట రచనా వ్యాసాంగాన్ని ప్రారంభించి ఒక దశాబ్దం గడవకుండానే ''కథేశ్వరి''గా కీర్తింపబడ్డారు. ఆమె సుమారు 250 కథలు, 20 నవలలు రాశారు. ''కొత్తమలుపు'' నవల ''న్యాయం కావాలి'' సినిమాగా రూపొందింది. వీరి కథలు, నవలలు కన్నడ, తమిళ, హిందీ భాషలలో అనువాదమయ్యాయి.

ఒక ఇంటర్వ్యూలో "రచయిత-వ్యక్తిత్వం" గురించి ఆమె తన అభిప్రాయాన్ని చెబుతూ *"సమాజంలో సంఘటనలను తన రచనా సామర్థ్యంతో పాఠకుల ముందుంచడం వరకే రచయిత బాధ్యత. చెప్పిందల్లా రచయిత ఆచరించాలని, రాసిందల్లా చేసి తీరాలని లేదు. నేను నా రచనలతో సామాజిక చైతన్యాన్ని, సాంఘిక విప్లవాన్ని సృష్టిస్తానని ఎన్నడూ అనుకోలేదు. రచనతో సాంఘిక విప్లవాలు వచ్చేస్తాయని నేను నమ్మను కానీ, ఆ రచన ఏదో ఒక సామాజిక ప్రయోజనం కలగడానికి ఉపయోగపడుతుందని నేను నమ్ముతాను"* అని అన్నారు.

ఈ అభిప్రాయాలలో వైరుధ్యం కనిపిస్తున్నా అవే వాస్తవాలనుకోవడానికీ లేదు. అలాగే వాస్తవం కాదనీ చెప్పలేం. అంటే రచనలన్నీ సాంఘిక విప్లవాలు సృష్టించకపోవచ్చు. రచనలు సాంఘిక విప్లవాలకు ప్రత్యక్షంగా దోహదం చేయక పోయినా పరోక్షంగానైనా కొన్ని రచనలు అలాంటి ప్రభావాన్ని చూపాయని చరిత్ర నిరూపిస్తునే ఉంది. అయితే, ఆ రచనలో ఉండే వస్తు, శిల్పాలను బట్టి ఆ ప్రభావమనేది ఆధారపడి ఉంటుంది. ఆ రచన ఉత్పత్తి చేసిన వారిని బట్టీ, ఉత్పత్తి శక్తులను బట్టీ కూడా ఆ ప్రభావం ఉండవచ్చు. రచయిత్రి ఒక రచన వల్లనే విప్లవాలు వచ్చేస్తాయని భావించకపోయినా రచన వల్ల ప్రభావం అయినా కలగాలనే ఆకాంక్ష లేకపోతే తరతరాలుగా వస్తున్న పురుషాహంకారం పూర్తిగా వదలడానికి ఇంకా కొన్ని తరాలు పట్టవచ్చు. భార్య అంటే జీవిత భాగస్వామిగా ప్రేమ, అనురాగం సానుభూతి పంచియిచ్చే భర్తలను ముందు తరంలో మనం చూడవచ్చు అని ఎలా ఆశించగలరు? ఈ మార్పులు కేవలం రచనలు రాసి ఊరుకొంటే వచ్చేస్తాయని భావించడం సరికాదనే స్పృహ రచయిత్రి అభిప్రాయంలో కనిపిస్తుంది.

ఉద్యమాలు అనేవి రచనా పరంగానే కాకుండా, క్రియాత్మకంగా కూడా జరగవలసి ఉంది. ఇక, రచయిత్రి ఈ నవల ద్వారా చెప్పదలచిన అంశాలను విశ్లేషించుకుంటే స్త్రీ సమస్యలని అర్థం చేసుకోవలసిన అవసరం పురుషులకీ అలాగే పురుషుల్లో తర తరాలుగా పేరుకు పోయిన 'అహంకారం' కూడా అర్థం చేసుకుని స్త్రీ సర్దుబాటు చేసుకొంటూ క్రమ క్రమంగా మార్పుని సాధించడం మంచిదనే సందేశం కనిపిస్తుంది. ఆశయాలు ఆచరణలోకి వచ్చేటప్పటికి కొన్ని జీవితాలు సంఘర్షణలతో కూరుకుపోవలసిన పరిస్థితి ఏర్పడి మానసికంగా, శారీరకంగా అశాంతికి కారణమై ఏకాకిగా మిగిలిపోయే ప్రమాదాన్ని గుర్తించమంటున్నారు రచయిత్రి. వీటిని 'జయంతి' పాత్ర ద్వారా దృష్టిని కేంద్రీకరించి వివరించే ప్రయత్నం చేశారు.

కొంత మంది రచయితలు/రచయిత్రులు తమ నవలలో పాత్రలను తమ తమ ఆశయాల సాధనకు అనుగుణంగా మార్చుకొంటూ ఉంటారు. అలాంటప్పుడు పాత్రలను చిత్రించడంలో ఏ మాత్రం రాజీపడరు. జయంతి పాత్రను చిత్రించడంలో రచయిత్రి ఆశయ ప్రతిఫలనం కనిపిస్తుంది.

నవలలో స్త్రీవాద దృక్పథం:

సమాజంలో స్త్రీ నైతిక, ఆర్థిక, రాజకీయ రంగాలలో మౌలికమైన మార్పులను ఆశించడం, వ్యక్తిగత అనుభవాలతో కలిగిన అవగాహనతో పరిష్కారాలని సాధించడం, జీవితాన్ని అర్థం చేసుకోవడానికి అనేక కోణాలను సూచించడం స్త్రీవాద ఉద్యమంలో కనిపించే కొన్ని ప్రధాన లక్ష్యాలు.

పురుషులతో పాటు స్త్రీలకు సమాన హక్కులు కోరుకోవటం వీటిలోనూ మరింత స్పష్టంగా చెప్పుకోవాలంటే స్త్రీ చదువు, స్వతంత్ర ఆలోచన, గర్భ నియంత్రణ నిర్ణయాధికారం, వివాహం, కుటుంబం, పిల్లలు, పురుషాధిపత్యం, ఇంటి చాకిరీ స్వభావం, పితృస్వామ్యం, మాతృస్వామ్యం పట్ల అవగాహన, శ్రమకు విలువ కట్టడం, లైంగికత్వంలో విచక్షణ, మాతృత్వానికీ పిల్లలను కనడానికీ మధ్య తేడాని గుర్తించడం, స్త్రీలు సున్నితంగా లలితమైన పదాలతో మర్యాదా రేఖలను అతిక్రమించకుండా రాయాలనడంలో కనిపించే జెండర్ విధానాన్ని గుర్తించడం, ఆలోచనలతో పాటు తిరుగుబాటు తత్త్వాన్ని పెంపొందించడం తద్వారా స్వేచ్ఛా జీవితాన్ని స్త్రీ అనుభవించగలిగే అవగాహనను కలిగించడం వంటివన్నీ తెలిసి విమర్శించమనడం కూడా స్త్రీవాద దృక్పథంలో కనిపిస్తుంది. వీటిలో ప్రాధాన్యతను వహించే లక్ష్యాలు స్వభావాన్ని బట్టే లిబరల్ రాడికల్ ఫెమినిజం వంటి విభజనలు వస్తున్నాయి. చాలా వరకూ ఈ అంశాలను 'మనసున మనసై' నవలలో తనదైన దృక్పథంతో చెప్పించే ప్రయత్నం చేశారు రచయిత్రి.

సమాన హక్కులు  బాధ్యతలు:

స్త్రీ పురుష సమాన హక్కులు అనేవి ఒకరిస్తే వచ్చేవికాదు. అవి పొందడం ద్వారా మాత్రమే వస్తాయి. అయితే వాటిని పొందడంలో సాధారణంగా ఒకవైపు నుంచి ఆటంకాలు ఎదురవుతాయి. 'ఆటంకాలను' అధిగమించినప్పుడే సాధించగలగడం సాధ్యమవుతుంది లేకపోతే హక్కులు కొందరి దగ్గర ఉన్నవి మరి కొందరికివ్వడమే అవుతుంది. కానీ తరతరాలుగా కొందరే అనుభవించడం వల్ల ఆటంకాలని అధిగమించి సాధించడం అనేది హక్కులను పొందడంగా, సాధించుకోవడంగా కొందరి దగ్గరే కేంద్రీకృతం అయిపోవడంలో ఆశ్చర్యం కూడా లేదు.

హక్కులు మగ వాళ్ళ దగ్గరే ఉండిపోవడం అవి తమకీ కావాలని కోరుకోవడం, పోరాడడం, లాక్కోవడం అనేవి క్రమానుగతంగా జరగవలసినవే! 'జయంతి' పాత్రను చిత్రించడంలో రచయిత్రి ఈ పరిణామాలు కొంతవరకు చిత్రించారు.

జయంతిని పెంచడంలో, చదివించడంలో, ఉద్యోగం చేయడంలో వచ్చిన జీతాన్ని తానే ఖర్చు పెట్టుకోవడంలో ఎక్కడా వివక్షను ప్రదర్శించలేదు. పైగా చదువుకొన్నప్పుడు గానీ, ఉద్యోగం చేసేటప్పుడు గానీ స్వతంత్రంగా ఓ పెళ్ళి కొడుకుని చూసుకోలేక పోయినట్లు కూడా చిత్రించారు. 32 యేండ్ల వరకూ పెళ్ళిచేయకపోవడానికి అవకాశం ఇవ్వడంలో తొందరగా పెళ్ళి చేసి పంపేయ లేదనీ తెలుస్తుంది. అయినా, ఆమె పెళ్ళి చేసుకోవడానికి స్వతంత్ర నిర్ణయాలు తీసుకోలేదు.

జీవితం పట్ల ఆమె అవగాహనా రాహిత్యమే దానికి కారణమని అర్థమవుతుంది. ఈ అవగాహన అనేది తన జీవితం పట్ల తాను చదివిన చదువులు అందించిన అవగాహనగానే తెలుస్తుంది.

దమయంతిని పోలుస్తూ జయంతిని ఎత్తి పొడుస్తూ తల్లి అంటున్న మాటల్లో ఇలాంటి స్వభావం వ్యక్తమయ్యింది. ''*ఇంగిత జ్ఞానం, తెలివి ఉంది కనుక దమయంతి తన అర్హత తాను తెలుసుకుని ఈ సంబంధం చేసుకుంటానంది. అతనూ సంతోషంగా ఒప్పుకున్నాడు. దానికి తల్లిదండ్రి పడే కష్టం తెలుసు మంచీ చెడ్డా తెల్సింది కనుక పెద్దకోరికలు పెట్టుకుని విర్రవీగడం లేదు*'' (పుట: 11) ఇక్కడ వయసులో చిన్నదైనా దమయంతి కంటే పెద్దదైన జయంతికి కనీస జీవితావగాహన లేదనే స్పృహ కలుగుతుంది.

ఇరవై ఎనిమిదేళ్ళ వయసు వచ్చినప్పటి నుండీ జయంతికి పెళ్ళి చేయాలని ప్రయత్నించి చివరికి ముప్పై రెండు యేళ్ళ నాటికైనా పెళ్ళి చేయగలిగారు. దాన్ని ఆమె నిలబెట్టుకోలేక పోయింది. పోనీ, మంచి సంబంధం తాము చేయలేదనడానికీ అవకాశం ఇవ్వకుండా పెళ్ళి చేసుకోవడంలో జయంతికీ స్వతంత్ర నిర్ణయానికి అవకాశమిచ్చినట్లు తల్లి మరొక సందర్భంలో అన్న మాటలే నిదర్శనం. ''నీ ఇష్టం వచ్చిన వాళ్ళని నీవు వెతుక్కో''మనే తండ్రి అభిప్రాయాన్ని తల్లి నోటితో చెప్పించారు రచయిత్రి. వీటన్నింటిలోనూ ''స్వేచ్ఛ''ను అనుభవించడంలో జయంతికి ఏ మాత్రం లోపం జరగలేదు.

స్వేచ్ఛ ఆమె జీవితంలో వాస్తవ జీవితావగాహన కలిగించ లేకపోయిందనీ తల్లిదండ్రులు మాట వినకుండా స్వతంత్ర నిర్ణయం తీసుకొని విడాకులిచ్చి అబార్షన్ చేయించు కోవడం వల్లనే ఒంటరిగా మిగిలిపోవలసి వచ్చిందని దాని కంతటికీ సర్దుబాటు లేకపోవడమే ప్రధాన కారణమనీ రచయిత్రి సూచించినట్లయ్యింది.

**స్త్రీ ఉన్నత విద్య తదనంతర పరిణామాలు:**

స్త్రీ ఉన్నత చదువులు చదివినా అవి కొన్ని తరగతులలో ముఖ్యంగా మధ్య తరగతి స్త్రీలలో స్త్రీ పురుషుల మధ్య కలిగించే ఘర్షణలు ఎలా ఉంటాయో 'జయంతి' పాత్రలో శేషగిరిని చేసుకోవడాన్ని బట్టి చిత్రించే ప్రయత్నం చేశారు. శేషగిరి ఎత్తుగా కొంచెం కలర్ ఉండి ఉన్నత చదువు, జీతం, హోదాలు ఉండటం వల్ల జయంతి పెళ్ళి చేసుకున్నా వివాహానంతరం తన కలలు కలలై పోయిన స్థితిని చిత్రించారు. రచనా దృక్కోణం మగ పాత్రను సమర్థించే ధోరణిలోనే కొంత వరకూ సాగింది. శేషగిరి సర్దుకుందామనుకొన్నా జయంతి సర్దుబాటు చేసుకోలేనట్లు చిత్రించడమయ్యింది. జయంతికి వివాహం అయిన తర్వాత హనీమూన్ వెళ్ళాలనే కోరిక ఉండటం, దాన్ని తీర్చుకోవడంలో ఆమె ఆధిపత్యాన్ని చెలాయించేటట్లు వర్ణితమయ్యింది తప్ప ఎక్కడా శేషగిరి మాటలని పట్టించుకొన్నట్లు లేదు. 'జండర్ విధానం' కొంత ఉన్నా జయంతి సున్నితంగా తన కోరికను చెప్పమనేది కాదిక్కడ!

శేషగిరి చేత సున్నితంగా చెప్పించడమే కాకుండా గిఫ్టులు తన కుటుంబం వారికే కొనడం అత్తగారి వైపు వారికెవరికీ కొనకపోవడం వంటివి చేసినట్లు రచయిత్రి వర్ణించడంలోని ఆంతర్యం కొంత సందేహాస్పదమే అవుతుంది. కానీ శేషగిరి ఏ పనీ చేయకుండా, జయంతి చేత వంట పనులు బలవంతంగా చేయాలని చూడడంలో సమాజంలో మానసికంగా స్థిరపడి పోయిన భావనను చిత్రించగలిగారనుకోవచ్చు. పైగా, ఆధిక్యతను ప్రశ్నించినట్లయితే వర్తమాన సమాజ పురుషాంకారానికి ప్రతీకగా శేషగిరి రెండవ వివాహం కనిపిస్తుంది. అదీ ఉన్నత చదువు లేని, ఇంటర్ మానేసిన, ఉద్యోగం చేయని అమ్మాయిని చేసుకోవడంలో ఆ కోణం కనిపిస్తుంది.

సర్దుబాటు లేని జయంతి వివాహాన్ని స్వేచ్ఛకు ఆటంకంగా మార్చుకొంటే అదే మధ్య తరగతికి చెందిన దమయంతి సర్దుబాటు చేసుకోవడం వల్ల జీవితాన్ని ఆనందమయం చేసుకొంది. గోపాలకృష్ణలో బాహ్య ఆకర్షణ కంటే ఆంతరంగిక సౌందర్యం ఉండటం కూడా కారణమయ్యింది. 'జయంతి - శేషగిరి'ల మధ్య కొరవడిన సర్దుబాటు 'దమయంతి - గోపాలకృష్ణ మధ్య పరస్పరం కలిగి ఉండటం వల్ల దమయంతి హాఠాత్తుగా చనిపోయినా మళ్ళీ పెళ్ళి చేసుకోవడానికి కూడా మనస్కరించని స్థితికి గోపాలకృష్ణ చేరుకోగలిగాడు.

**గర్భ నియంత్రణ మాతృత్వపు విలువలు:**

గర్భ నియంత్రణ, మాతృత్వం గురించీ స్త్రీవాదులకున్న అభిప్రాయాలను రచయిత్రి జయంతి పాత్రను ఆసరాగా చేసుకొని చర్చించే ప్రయత్నం చేశారు. శేషగిరిని చేసుకొని 'సుఖపడని' జయంతి అతని వల్ల వచ్చిన గర్భాన్ని తీయించేసుకొంది. ఇక పిల్లలు పుట్టరని తెలిసి చాలా బాధపడింది. రెండవ పెళ్ళి చేసుకోవడానికి ఇష్టపడే పరిస్థితి ఎలాగూ లేదు. మళ్ళీ ఎటువంటి వాడు భర్తగా వస్తాడో, దాని కంటే పెళ్ళి చేసుకోకుండా అలాగే ఉండిపోవడం మంచిదనుకుంది. కానీ, జీవితాన్ని దగ్గరగా పరిశీలించడం వల్ల తన చెల్లి దమయంతి చనిపోవడంతో గోపాలకృష్ణను చేసుకోవాలనుకుంది. కానీ, అతను అంగీకరించలేదు. పిల్లలను మాత్రం ఆమె నర్సరీలో డబ్బు చెల్లించి ఉంచడానికి అంగీకరించాడు. ఉద్యోగం మానేసి నర్సరీ పెట్టింది. పిల్లల పట్ల ఉండే మమకారం తీర్చుకోవడానికి ఇదో మార్గంగా చేసుకుంది.

కేతు విశ్వనాథ రెడ్డి గారు వ్యాఖ్యానించినట్లు జయంతి జీవిత వైఫల్యం నుండి యాదృచికంగా 'సేవ' పుట్టు కొచ్చిందా! చైల్డ్ నర్సరీ పెట్టడంలో ఒంటరితనాన్ని పోగోట్టుకోవాలను కోవడమే కారణమా? లేక దివాకర్‌ని ఇష్టపడినా అతడు మొదట ఇష్టపడి తనకంటే ఆర్థికంగానూ, శారీరకంగానూ అందమైన గొప్ప సంబంధం రావడంతో మనీషాని పెళ్ళి చేసుకోవాలని భంగపడి, మళ్ళీ జయంతిని పెళ్ళిచేసుకోవాలని అనుకోవడం దాన్ని ఆత్మగౌరవానికి భంగకరంగా భావించి తిరస్కరించడంలో జయంతి పాత్రలో అంతర్లీనంగా స్త్రీవాద భావాలున్నాయి.

ఒంటరిగా మిగిలిందను కోవడంలో కూడా కొన్ని సమస్యలున్నాయి. 'పిల్లలను కనడం' వేరు. మాతృత్వాన్ని అనుభవించడం వేరువేరుగా స్త్రీవాదులు భావిస్తున్నారా? దీనికి ఈ నేపథ్యాన్ని అనువర్తించుకొంటే ఒంటరితనం పోవడానికో, పిల్లలు పుట్టలేదు కనుక మాతృత్వానికి అవకాశం లేక 'మాతృత్వ భావం'తో జీవించడానికి నిర్ణయించిందనుకోవడమో సరికాదనే అవకాశం కూడా ఉంది.

స్త్రీవాదులు భావించినట్లు "*మాతృత్వాన్ని నిజంగా ప్రకృతి ప్రసాదించిన వరంగానో, అద్భుతమైన స్వభావంగానో చూడాలనుకుంటే అది స్త్రీలకు పునరుత్పత్తి స్వేచ్ఛ వున్నప్పుడే జరుగుతుంది. పిల్లలని కనటం, మాతృత్వం ఒకటి కాదు.*" అనే భావనతో చెప్పిన సందర్భంగా కాకుండా నవలలో "జీవితంలోనే కోల్పోయిన ఆనందం ఈ పసిమొగ్గల్లో వెతుక్కోవాలనే నా తాపత్రయం" అని (పుట: 195) అనడమే కాకుండా, "*నిన్ను నిన్నుగా ప్రేమించుటకు, నీ కోసమే కన్నీరు నింపుటకు నేనున్నానని నిండుగా పలికే తోడొకరుండిన అదే భాగ్యమూ... అదే స్వర్గమూ....*" తాను ఆ భాగ్యానికి నోచుకోలేదు. "*ఈ జన్మలో కన్నీటి పొరల మధ్యనుంచి గోపాలకృష్ణ కనుమరుగయ్యే వరకు చూసింది*" అని ముగించడం వల్ల నిరాశా, నిస్పృహల నుండి ఒంటరితనం పోగొట్టుకోవాలను కోవడం ఆ నేపథ్యం నుండి చైల్డ్ నర్సరీ ఏర్పర్చడం వంటివి స్త్రీవాదానికి బలమైన సమర్థతనిచ్చే ముగింపు ఎలా అవుతుందో ఆలోచించ వలసిందే!.

**ఆర్థిక సంఘర్షణలు - సర్దుబాటు మనస్తత్త్వం:**

ఈ నవలలో దివాకర్, మనిషా పట్ల పెంచుకొనే ఆకర్షణలో ఆర్థిక కోణమే ప్రాధ్యానత వహించింది. జయంతి, దివాకర్ పట్ల ఆకర్షణ పెంచుకోవటంలో ఆర్థిక కోణంతో పాటు, మానసిక అనుభూతులు, కలలు ఆశలు వ్యక్తమయ్యాయి. మనీషా, దివాకర్‌ని తిరస్కరించడంలో ఉన్నత వర్గం (తరగతి)లో కనిపించని సమస్యలు మధ్య తరగతిలో కనిపించాయి. ఉషారాణి అమెరికా సంబంధాన్ని చేసుకున్నా సర్దుబాటు తప్పలేదని తెలుస్తుంది.

మనోవిజ్ఞాన శాస్త్రంలో సర్దుబాటునే, 'అనుగుణ్యత' సిద్ధాంతం అంటారు. కొన్ని సర్దుబాటులు సమాజానికి అవసరమయితే, మరికొన్ని సర్దుబాటులు అభివృద్ధి నిరోధకాలవుతుంటాయని సైకాలజీ చెబుతుంది. ఆ సర్దుబాటు అనేది సమన్వయం కూడా సాధించవలసి ఉంటుంది. దీన్ని స్త్రీవాదానికి అనువర్తించే ప్రయత్నం 'మనసున మనసై' నవలలో కనిపిస్తుంది.

అవసరమైన సర్దుబాటుని గోపాలకృష్ణ - దమయంతి పాత్రల్లోనూ ఉండకూడని సర్దుబాటుని శేషగిరి-జయంతి పాత్రల్లోనూ చిత్రించారు. అయితే 'జయంతి' పాత్రలో రెండు కోణాలు పెట్టి అవసరమైన సర్దుబాటు కుటుంబ అవిచ్ఛిన్నతను కాపాడుతుందనీ, అనవసరమైన సర్దుబాటు స్త్రీలో ఆర్థిక పరమైన శక్తి సామర్థ్యాలతో పాటు ఆత్మ గౌరవాన్ని పెంపొందించుకోడానికి తోడ్పడుతుందనే స్పృహ కలిగించారు.

అన్నింటికీ సర్దుకుపోవడం కూడా మంచిది కాదు. అవసరమైతే సంఘర్షణ పడినా, ఆ సంఘర్షణలోనూ ఆనందం ఉంటుంది. సంఘర్షణ వల్ల వెంటనే ఫలితాలు రాకపోవచ్చు కానీ, భవిష్యత్తు తరాలు స్వేచ్ఛగా, ఆత్మ గౌరవంతో సుఖ సంతోషాలతో అన్ని వర్గాల వారూ జీవించడానికి కొన్ని సంఘర్షణలు కూడా తప్పవు. 'సంఘర్షణ' వల్ల కొన్ని జీవితాలు అశాంతికీ, ఒంటరి తనానికి కూడా గురై త్యాగాలకు సిద్ధం కావలసి వస్తుంది. వీటి నేపథ్యంగానే స్త్రీ ఉన్నత చదువు, వివాహ వయస్సు, కుటుంబం, లైంగికత్వం, ఆర్థిక స్వాతంత్ర్యం, ఉద్యోగ నిర్వహణ వంటి అంశాలు ప్రాధాన్యతను వహిస్తుంటాయి. ఇలాగే నవలలో వివిధ పాత్రలు ఒదిగిపోయాయి.

నవల చదువుతున్నప్పుడు కొన్ని అక్షర దోషాలు పఠితకు ఇబ్బందిని కలిగిస్తాయి. రచయిత్రి కొన్ని పాత్రల పేర్లని మార్చేశారు. శేషగిరి చెల్లెలు, తమ్ముడు పేర్లు అమాతంగా మారిపోయాయి. 'శశి' అని (పుట: 108,109) 'శాంతి' అనీ (పుట: 116,119) మార్చేశారు. సాంకేతికంగా కలిగిన ముద్రణా దోషాల వల్ల వాక్యాలు మళ్ళీ మళ్ళీ ముద్రితమయ్యాయి.

**నవలలో రచనాశైలి:**

రచయిత్రి శైలి విషయంలో కొన్ని జాగ్రత్తలు తీసుకొంటే బాగుండునేమో! ''*లొంగదీసుకోవడం,*'' ''*కొంగుని కట్టేసుకోవాలనుకోవడం*'' వంటి పదాలను ఎక్కువగా ప్రయోగించారు. తెలుగు పలుకుబడి, జాతీయాల ప్రయోగాలతో సహజత్వం కోసం అలాంటి శైలి పాటించినా, సమయం, సందర్భం కూడా ముఖ్యం కదా!

ఉత్తర భారతదేశం, దక్షిణ భారతదేశం అందులోనూ కొన్ని సాంస్కృతిక విషయాలను పదేపదే ప్రస్తావించడం తెలుగువాళ్ళు పొడవుగా ఉండరు, ఎర్రగా ఉండరు, అందంగా ఉండరు ఇలాంటి ప్రకటనలు రచయిత్రి అవగాహనను అనుమానించే విధంగా ఉంటాయి. ఇవి 'జయంతి' మనస్తత్వంగా చెప్పినా బాగుండేది. ఆలోచనల వల్ల రచనా శైలిలో రచయిత్రి ఆత్మాశ్రయత్వ గుణం తొంగి చూస్తుంది. సౌందర్య దృష్టితో చూసినపుడు సౌందర్యమనేది వస్తువులో ఉంటుందా? వస్తువుని చూసే వారిలో ఉంటుందా? అనేది పెద్ద చర్చనీయాంశం.

సౌందర్యం ఉభయగతమైన వస్తువుని బట్టి కూడా ప్రధానంగానే ఉండవచ్చు. పైగా 'సౌందర్యాన్ని' నిర్వచించడంలో కులం, ప్రాంతం, భౌగోళిక పరిస్థితులను కూడా పరిగణనలోకి తీసుకోవలసి వస్తుంది. అప్పుడే ఒక్కో అంశానికి ఒక్కోరకమైన సౌందర్య భావన వ్యక్తమవుతుంది.

తమ సంస్కృతి మాత్రమే గొప్పదని భావించే ''సాంస్కృతిక స్వవర్గవాదం'' గురించీ అన్ని సంస్కృతులూ ఆయా పరిస్థితులను బట్టి గొప్పవని భావిస్తూ, గౌరవించే ''సాంస్కృతిక సాపేక్ష వాదాన్ని'' కూడా ఈ నవలలో అధ్యయనం చేసే అవకాశం ఉంది.

ఒక కులానికే కట్టిపడేసి పరిశీలించే పరిమితి కూడా రచయిత్రి నవలకు కల్పించారు. 'బ్రాహ్మణ కులానికి' చెందిన అని సూచించడం వల్ల రచయిత్రి బ్రాహ్మణ మధ్య తరగతి కులానికి (వర్గానికి) చెందిన వారి జీవితాల్లో, అదీ చదువుకొన్న, మళ్ళీ భార్య భర్తలిద్దరూ చదువుకొని ఉద్యోగం చేసే వారికే పరిమితం చేస్తున్నారేమో అనే అనుమానానికి కూడా అవకాశం కల్పించేటట్లు నవలా రచన సాగింది. దీని వల్ల 'వస్తువు'ని 'ఇతివృత్తం'గా మార్చడంలో కొంత నైపుణ్యాన్ని సాధించలేని లోపం కనిపిస్తుంది. కొన్ని పరిమితులకు లోబడినా, చదువుకొన్న మధ్యతరగతి ఉద్యోగిని జీవిత సంఘర్షణను సమర్థవంతంగానే నవలలో ప్రతి ఫలించగలిగారు.

ఒక వాస్తవాన్ని కళాత్మక అభివ్యక్తిలో విస్తృతంగా చర్చించే అవకాశాన్ని కల్పించే నవలా ప్రక్రియలో 'మనసున మనసై' రాశారు. మిగిలిన ప్రక్రియల్లో ఈ విషయాన్ని ఇలా చర్చించే, ఆలోచింపజేసే అవకాశం లేదా? అని ప్రశ్నించుకుంటే 'కథ'లో సమస్యలని సంభాషణగానో, వర్ణనగానో సూచించేసి ముందుకి వెళ్ళి పోవడం జరగవచ్చు. కవిత్వంలో స్పందనకి ఉన్నంత ప్రాధాన్యత చర్చకి ఉందనలేం కానీ, దాన్నే 'విశ్లేషణ' పదంతో చెప్పుకున్నా నవలకి ఉన్నంత విస్తృత పరిధి లేదనే చెప్పుకోవచ్చు. 'నాటకం'లో కూడా కొంత వివరంగా చర్చించే అవకాశం ఉన్నా 'నవల'లో ఉండే సౌలభ్యం దానికి లేదు. కనుక, ఉద్యోగినైనా మధ్యతరగతి స్త్రీ పొందే కష్టాలను నవలలో రచయిత్రి బాగా చర్చించ గలిగారు.

ముఖచిత్రం కూడా రచయిత్రి ఉద్దేశించిన భావాన్ని వ్యక్తం చేసేటట్లుగానే ఉంది. బాలి ఆ ముఖ చిత్రాన్ని అర్థవంతంగా గీశారు. ఒక చెట్టు పచ్చని ఆకులతో నిండి, దాన్ని బలమైన కాండంతో చిత్రించారు. దాని కింద ఇద్దరు (ఒక పురుషుడు ‚ ఒక స్త్రీ) కూర్చొని ఉంటారు. అక్కడ కూడా పురుషుని శిరస్సు ఎత్తుగా ఉండి, స్త్రీ చిత్రం, ఆ పురుషునికి దిగువుగా కూర్చొని అన్యోన్యంగా ఉన్నట్లుంటుంది. ఇది ఒక చక్కని ప్రతీకాత్మక చిత్రం.

సంసారమనే (వివాహం) వృక్షం బలంగా ఉండాలంటే స్త్రీ పురుషుల మధ్య అన్యోన్యత ఉండాలి. రచయిత్రి అన్యోన్యత కాలమాన పరిస్థితులను బట్టి అనుగుణ్య (సర్దుబాటు)పై ఆధారపడి ఉంటుంది. సమకాలిన పరిస్థితులు పరిశీలించినట్లయితే, ఇంకా పురుషుని ఆధిక్యత కొనసాగుతూనే ఉంది. స్త్రీ అణకువతో, అనుగుణ్యతో నడుచుకొంటూనే ఉండటం చాలా వరకూ కనిపిస్తుంది. అలా కాకపోతే 'సంసారం' (వివాహం) అనే వక్షం కల్పించే ఆహ్లాదకరమైన ఛాయల్లో జీవించలేరనీ, దానికి 'జయంతి' పాత్రే నిదర్శనమనీ రచయిత్రి చెప్పిన సందేశాన్ని చక్కగా వ్యక్తీకరించగలిగింది. ఈ నవలలో రచయిత్రి చెప్పినట్లు పాత్రలు నడవడటం, తన ఆశయానికి అనుగుణంగా మలచుకోవడం వల్ల రచయిత్రి 'సమకాలిన వాస్తవాన్ని' గుర్తెరిగి మసలుకోమనే సందేశం ఉంది.

'జయంతి' పాత్రను సంఘర్షణాత్మక పాత్రగా చిత్రించినా, 'దృష్టికోణం' వల్ల 'పాత్రచిత్రణ'లో 'వాస్తవాన్ని' కల్పించేటప్పుడు ఆదర్శాల వైపు పయనింపజేసి, ఆ ఆదర్శాన్ని ఇంకా అందుకో లేని సమాజంలోనే నివశించడం వల్ల వైఫల్యాలు చెంది ఆమె ఒంటరిగా మిగిలినట్లు చేరిస్తే ఇది స్త్రీచైతన్యాన్ని మరింత పెంచగలిగేదేమో!

ఏది ఏమైనా తెలుగులో స్త్రీవాద ఆటుపోట్లను అవగాహన చేసుకోవడానికీ నవల ఎంతగానో సహకరిస్తుంది.

**ఆధార గ్రంథాలు:**


ఓల్గా (సంపా). *నీలి మేఘాలు*. హైదరాబాదు: స్వేచ్ఛా ప్రచురణ, (ప్ర.ము. 1993), రెం.ము 1996.

కామేశ్వరి, డి. మనసున మనసై. హైదరాబాదు: స్వీయ ప్రచురణ. 2000.

యాదగిరి రెడ్డి, ఎన్. సర్దుబాటు *(అనుగుణ్యత)*,హైదరాబాదు: తెలుగు అకాడమి. 1994.

వెంకటసుబ్బయ్య, వల్లంపాటి. నవలా శిల్పం. హైదరాబాదు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్. *1989.*

సుబ్రహ్మణ్యం, జి.వి. (సంపా). *స్త్రీవాద ధోరణులు: సమకాలీన సాహిత్యం.* హైదరాబాదు: యువభారతి ప్రచురణలు, 1994.


***

# అస్తిత్వ వేదనల కళింగాంధ్ర కవిత్వం

''ఎక్కడ్నించి లేచి వచ్చామో ఆ నేలను వెతుక్కునే పనిలో పడ్డాం. ఇప్పుడు అందరం. Again we are getting back to our roots, ఎవరి మట్టిని వాళ్ళు own చేసుకునే స్పృహ అందర్నీ ఊపేస్తుంది. ప్రపంచం నుంచి ప్రారంభమవ్వడానికి బదులుగా సొంత ఊరు నుంచి బయలుదేరడానికే ఇష్టపడుతున్నాం...'' అంటూ స్వీయ అస్తిత్వ గొంతులతో ''తూరుపు కళింగాంధ్ర కవిత్వం'' వెలువడింది. దీనికి అరుణ్ బవేరా, శ్రీ చమన్ సంపాదకులుగా వ్యవహరించారు. 'ఇవాళ జీవితం నిండా అలవికానంత వైవిధ్యం ఉంది. బతుకులోకి ఒకసారి తొంగి చూడడం మొదలు పెట్టామో మళ్ళీ తలతిప్పుకోలేమంటూ' ''సమూహాన్ని కోల్పోతున్న వాళ్ళం'' పేరుతో రాసిన ముందుమాటలో అరుణ్ బవేరా వ్యాఖ్యానించారు. నిజమే, ఇప్పుడు ప్రతి పల్లె తన పూర్వ గుర్తులను ఒకసారి తిరిగి చూసుకుంటుంది. కోల్పోయినప్పుడే వాటి విలువెంటో తెలుస్తుందంటారు.

పొద్దున్న లేచింది మొదలు నిద్రపోయేవరకు ప్రపంచీకరణ ప్రభావం నుండి ప్రతి పల్లె తప్పించుకోలేని స్థితిలో కూరుకుపోతుంది. ఇది ఒక భారతదేశానికి మాత్రమే వచ్చిన క్లిష్ట పరిస్థితి అనుకోవటానికి వీలు లేదు. ప్రపంచ దేశాలన్నింటినీ తన గుప్పెటలో పెట్టుకొని అమెరికా ఆడుతున్న నాటకంలో, అనివార్య పరిస్థితుల్లో కూరుకుపోయిన, పాత్రధారులవుతున్న దేశాలన్నింటిలోనూ ఇదే పరిస్థితి. ఈ పరిస్థితుల్లో ప్రజలు పోరాటాలు చేయక తప్పని పరిస్థితే తలెత్తిందనవచ్చు.

*''సిడ్నీ, బీజింగ్, ఢిల్లీ, శ్రీకాకుళం, చైనా,*
*క్యూబా, మెక్సికో, అర్జెంటీన, ఇథియోపియో*
*నికరాగువా... ఇంకా ఇంకా...*
*మనిషి బాధలొక్కటే, వెతుకులొక్కటే, కతలొక్కటే'* (వందనం - దుప్పల రవికుమార్, పుట: 97.)

ఆ సామూహిక కష్టాలే ఒకనాడెప్పుడో ప్రజలందరినీ ఏకం చేసి పోరాటాలకు సిద్ధం చేయకతప్పదు. ఒక దేశంలోని ఒక ప్రాంతం అభివృద్ధి జరగకపోవటానికి పాలనా ప్రభావం, కొంత మంది స్వార్థం, స్వలాభం ఎలాగైనా ఉన్నప్పటికీ, అన్ని ప్రాంతాల్లోనూ ఇలాంటి పరిస్థితే ఉంటే వాటి వెనకున్న ప్రత్యామ్నాయ ప్రభావాలను కూడా లోతుగా చూడాల్సిందే. ఆ ప్రభావాలు తెలుసుకోలేనప్పుడు వాళ్ళలో వాళ్ళే కుమ్ములాడుకోక తప్పదు. అంటే అభివృద్ధి చెందిన వాళ్లు, చెందని వాళ్ళు ఒకరిపై ఒకరు దుమ్మెత్తి పోసుకుంటూనే ఉంటారు. సమస్య మూలాల్లోకి వెళ్ళలేరు. మరొక వైపు రాజకీయ ప్రయోజకులు మేధావులను మాట్లాడనివ్వకుండా వివిధ మార్గాల్లో నోరు నొక్కేస్తుంటారు. కాని, కవి నోరు నొక్కటం అంత సులువుకాదు కదా! అందుకనే, కవులు అనేక అనుభవాలతో, అనుభూతులతో, ప్రయోగాలతో వాటిని అభివ్యక్తీకరిస్తూనే ఉంటారు. ఆ అభివ్యక్తీకరణలో భాగంగానే ఈ కవిత్వాన్ని చెప్పుకోవాలి.

మన రాష్ట్రంలో అభివృద్ధి చెందిన ప్రాంతంగా మధ్య ఆంధ్ర ప్రాంతాన్ని చెప్పుకోవచ్చు. ఇంకా చెప్పాలంటే కోస్తా ఆంధ్ర లోని కొన్ని జిల్లాలనవచ్చు. అయితే, వాటి అన్నింటినీ ఒకే గాటన కట్టేయడానికి వీల్లేదని మన ఆర్థిక సంఘాలిచ్చే నివేదికలే చెప్తున్నాయి. అలా చెప్పేవాటిని బట్టి చూసినా తెలంగాణ, రాయలసీమ, కోస్తాలలో కొన్ని ప్రాంతాలు అభివృద్ధికి ఆమడ దూరంలోనే ఉన్నాయి. అయినప్పటికీ తెలంగాణలో వచ్చినంత ప్రాంతీయ చైతన్యం ఇతర ప్రాంతాల్లో రాలేదు. వాటికి అనేక కారణాలున్నా గాని, ఒక ప్రాంతం వారికేమో నీటి సమస్య అంతగా లేదు.

మరొక ప్రాంతం వారికేమో నాయకత్వం వహించగలిగే అవకాశానికి ఆటంకాల్లేవు. ఇప్పుడిప్పుడే ఆ సమస్యలు, ఆటంకాలు బయటపడుతున్నాయి. అవకాశాలు ఉన్నా, ఆటంకాలు లేకపోయినా, అవన్నీ ఆ ప్రాంతాల్లో జీవించే అన్ని తరగతులకు కాదని ప్రజలంతా గుర్తిస్తున్నారు. ముఖ్యంగా సామాజికంగా కింది తరగతులుగా, వర్గాలుగా పరిగణనలో ఉన్నవారిలో చాలా చైతన్యం వచ్చింది. ఇతర ప్రాంతాలతో, ఇతర వర్గాలతో పోల్చుకున్నప్పుడు తమ లోటు పాట్లు గ్రహించగలుగుతున్నారు. ఆ లోటు పాట్లన్నీ తమ రాష్ట్రంలోని ప్రజల వల్లే అని కాకుండా ప్రపంచ దృష్టి కోణం నుండి చూడగలుగుతున్నారు.

తమ జాతి, తమ భాష, తమ సంస్కృతి, తమ పంటలు, తమ భూమి, చివరికి తామే పరాధీనం కావటాన్ని గమనించగలుగుతున్నారు. పరాయీకరణకు ఆందోళన చెందుతున్నారు. ప్రతీదీ వ్యాపారమయం కావటాన్ని జీర్ణించుకోలేక పోతున్నారు. ఇవన్నీ కవులు తమ కవితల్లో వ్యక్తీకరిస్తున్నారు.

ప్రపంచ బ్యాంక్ షరతుల వల్ల రైతులు పంటలు పండించలేని స్థితిలో కూరుకుపోతున్నారు. అందువల్ల కవులు తమ ప్రాంతాల్లో పండే పంటల వైభవాన్ని నెమరు వేసుకోవలసిన పరిస్థితులు ఎదురైయ్యాయి. అందుకనే కాగే మంటల్లో కాల్చుకు తిన్న కందికాయల తీయని జ్ఞాపకాలు దీనిలో కవిత్వమయ్యాయి. పెట్టుబడికే సరిపోక పండిన పంటంతా

"*అప్పుల పెనుగాలికి*
*కళ్ళం పొల్లు గింజై ఎగిరి పోయినప్పుడు*
*ఒట్టిపోయిన కళ్ళాన్ని చూస్తే*
*నాకిప్పుడు వల్లకాడో గుర్తొస్తుంది*" అంటాడో కవి (కళ్ళం - సిరికి స్వామి నాయుడు. పుట: 18) ప్రపంచ వ్యాప్తంగా ఎన్ని నిరసనలు ఎదురైనా కోకో కోలా వంటి కంపెనీలు ఇంచుమించు అన్ని దేశాల్లోనూ నీళ్ళను వ్యాపారంగా మార్చేస్తున్నాయి. ప్రజలకు కనీస అవసరాలను సమకూర్చవలసిన ప్రభుత్వాలకు కూడా వ్యాపార దృష్టిని కలిగించేశాయి. పాలు కంటే నీళ్ళకే అధిక సొమ్ముని వెచ్చించవలసిన దారుణమైన పరిస్థితులు నెలకొంటున్నాయి. ఈ పరిస్థితులు కేవలం నగరాలకో, పట్టణాలకో మాత్రమే కాదు. పల్లె పల్లెకీ విస్తరించబడ్డాయి. ఈ పరిస్థితుల్ని స్ఫురింపజేస్తూ....

''*వాళ్ళు సూర్య కిరణాల్ని అమ్ముకుంటారు*
*చంద్రుని వెన్నెల నమ్ముకుంటారు*
*నీళ్ళ నమ్ముకుని పొలాల పచ్చని ఊపిరి నాపేస్తారు.*''

అని తాగడానికే నీళ్ళివ్వని వాళ్ళు పొలాలకు నీళ్ళెలా ఇవ్వనిస్తారని, ఆ పరిస్థితిని ఎదుర్కోవటానికి పోరాటం తప్పదంటారు కవి (నిశ్శబ్ద విస్ఫోటనం - అద్దేపల్లి రామమోహనరావు, పుట: 20). పోరాటం జీవితంలో ఒక అనివార్యమైపోక తప్పదంటారు.

నగరంలో మనుష్యులుంటారు. కానీ, మానవ సంబంధాలుండవు అవసరాలుంటాయి.... ఆత్మీయతలుండవు. ఈ రెండింటికీ మధ్య చాలా వ్యత్యాసం ఉంది. అవసరాలకే ఇంట్లో వాళ్ళతో మాట్లాడుకోవాలి. బాతాఖానీ పెట్టుకుంటే ఎలా? అంటూ హెచ్చరిస్తుంటుంది నగర వాతావరణం. అదిప్పుడు గ్రామాల్లో ప్రవేశించింది. అదొక్కటే కాదు, కేబుల్ టి.వి తెచ్చిన మానవ సంబంధాల విచ్ఛిన్నత అంతా ఇంతా కాదు. సోమరితనం పెంచుతుంది. సులువైన మార్గాల్లో కష్టపడకుండా డబ్బు సంపాదించవచ్చని చెప్తూ విలువలను పాతర వేయటం నేర్పుతుంది. ఇప్పుడు పల్లె కూడా రూపాయి మయమైపోయింది.

''*పల్లె దీపం తల్లిలా పిల్లా పాపలను కౌగిలించుకొనేది*
*ఆకాశం వంక ఆశగా ఆపేక్షగా చూస్తునే పల్లె జనం*
*కలల్ని మొలకల్లా నాటుకుంటూనే*
*బంగారు లోకాలకి వలస పోయేవాళ్ళు*
*నాగరికత వలువలు చుట్టుకున్న పల్లె పల్లెతనం కోల్పోయి*
*సత్తు రూపాయి బిళ్ళలా మిగిలిపోయింది*'' (నా పల్లె తల్లి: బుద్ధి నాగేశ్వరరావు, పుట: 31) అని బాధను దిగమింగుకోవలసిన పరిస్థితిలో కూరుకు పోయింది. మరోవైపు మీడియా వాస్తవాల్ని దాచేసి, కొంత మంది చేతుల్లో నలిగిపోయి, ఉక్కిరిబిక్కిరిలో కూరుకుపోయింది. వాస్తవానికి - అవాస్తవానికి మధ్య తేడా తెలుసుకోవడం అంత సులువు కాని పరిస్థితులు ఆవరింపచేసి ఉన్నాయి. యాజమాన్యానికి అనుకూలంగానే వార్తా కథనాలు ప్రసారమవుతాయి. అలా కాదంటే, ఆ ఉద్యోగి తక్షణం తప్పుకోవలసిందే!

''*తిరగేసిన అద్దాల్లో చరిత్రను చూపిస్తున్నారు శ్వేత ముఖులు*
*తలకిందుల కథల్ని ఆక్రమించుకున్నారే క్రమంగా అతిరథ మహారథులు*
*భూతద్దం వాళ్ళదే ఆకాశవాణి వాళ్ళదే*'' (మళ్ళీ...మళ్ళీ డా।। మానేపల్లి, పుట: 34) ఇప్పుడు పల్లెటూరిలో జీవితం కూడా అస్తవ్యస్త పరిస్థితిలో ఉంది. ఒక తాత్కాలిక జీవనంలాగే ఉంది. నగర స్వభావం అక్కడ కూడా వేగవంతమైపోయింది. అక్కడ కూడా రియల్ఎస్టేట్, చేపల చెరువులు, ఎమ్సెట్ల ప్రభావంలోనే ఉంది.

ఇప్పుడు సాయంత్రం..

''*చిన్న సైజు జీవితంలాంటి*
*క్యారీబ్యాగులా ఉంది.*'' (పుట: 45)

రైతులకిచ్చే విత్తనాల్లో, కరెంటులో అన్నింటిలో ప్రపంచ దేశాల ఆధిపత్యమే కనిపిస్తుంది. టెర్మినేటెడ్ విత్తనాలు వద్దని ప్రజలు అప్పట్లో ఎంత మొత్తుకున్నా, మన

పాలకులు సైతం పెడచెవిని పెట్టి, ఇప్పుడు గగ్గోలు పెడుతున్నారు. రైతులకు తమ పంటంతా విత్తనాలు కొనుక్కోవటానికే సరిపోవట్లేదు. పోనీ, ఎలాగో కష్టపడి పండించినా ఒకవేళ ఎలాగోలా కొన్నా అవి నకిలీ విత్తనాలు. పోనీ, ఎలాగో కష్టపడి మంచి విత్తనాలు సంపాదించి పంట పండించినా అగ్రరాజ్యాలిప్పుడు మన దేశంలో పండే పంటలపై కూడా దృష్టి కేంద్రీకరిస్తున్నాయి. మేథో హక్కుల పేరుతో మన దేశ రైతు ఇప్పటికే అన్యాయానికి గురవుతున్నాడు. వీటితో పాటు...

*''కళలు, సంస్కృతి, సంపద*
*దోచుకెళ్ళిన వారే..*
*మన వృక్షాల్ని మోడు చేసిన వారే...*
*మళ్ళీ...*
*మన కళ్ళకు కనిపించని వలలు విసురుతున్నారు''* (సంకర విత్తులు శ్రీ చమన్)

సంకరవిత్తులు ఈ సంకలనంలో గొప్ప కవితల్లో ఒకటి. కృత్రిమంగా, అతికీ అతకనట్లు యాంత్రికమైపోతున్న జీవితాన్ని ప్రతీకాత్మకంగా వర్ణించారు.

పుస్తకానికి కళింగాంధ్ర కవిత్వం అని పేరు పెట్టినా, ఈ సమస్యలు ఇంచు మించు రాష్ట్రమంతటా ఉన్నాయి. భారత దేశమంతా ఉన్నాయి. ప్రపంచమంతటా ఉన్నాయి. అయితే, మనలో మనకి విభేదాలను సృష్టించటంలో విదేశీయుల పాత్ర ఎంతో ఉంది. విదేశీ పెట్టుబడుల పాత్ర ఉంది. విదేశీ కంపెనీల పాత్ర ఉంది. దీన్ని ఎంతో సమర్థవంతంగా కవిత్వానుభవాలతో నిరూపించగలిగారీ కవిత్వంలో.

*''మన దగ్గర మనమే పనిచేస్తూ*
*కనిపించని ప్రభువుల పల్లకీ మోసే*
*బోయీలయ్యేందుకు*
*కొట్టుకుంటూ... కుమ్ముకుంటూ. నీదిది. నాదిదని*
*భాగించి... విభజించి*
*సంకరజాతి మొక్కల్ని వాటాలు వేసుకునే''* పరిస్థితిని కళింగాంధ్ర కవిత్వీకరించింది. ఒక ప్రాంతం నుంచి, ఆ ప్రాంతం పేరుతో కవిత్వం వచ్చింది కనుక, ఇది ఆ ప్రాంతానికి సంబంధించిన కవిత్వమే అనుకోవటానికి వీల్లేదు. కానీ, ఆ రకమైన భావజాలాన్ని వివరించటంలో మాత్రం తొలి ప్రయత్నం చేసిన కవితా సంకలనం ఇదేనేమో!

అంతకుముందే ఇంచు మించు దీనికి దగ్గర భావనలతో మావూరు, అమ్మ కవితా సంకలనాలు వచ్చినా వాటిలో సెంటిమెంటికి ఎక్కువ ప్రాధాన్యతను ఇచ్చారు. దీనిలోనూ సెంటిమెంట్సు ఉన్న కవితలు కొన్ని ఉన్నా, స్థానీయతలో విశ్వజనీనతే ఇమిడి ఉంది.

ఇప్పుడు కోస్తా ఆంధ్ర పరిస్థితి కూడా ఒకప్పటిలా లేదు. అన్నపూర్ణలా అసలే లేదు. నిత్యం వరదలు, తుఫానులు మరోపక్క క్షుఈ తవ్వకాలు, రొయ్యల చెరవులు ఇంక పంటెక్కడిది.

*"ఏదో చెప్పాలనే ఉంది*
*కానీ ఏమని చెప్పను*
*ఆకలి కేకలతో దద్దరిల్లే*
*నా ధరిత్రి అన్నపూర్ణ అని చెప్పనా"* (ఎలా చెప్పను! నా ధరిత్రిని - కొప్పిరెడ్డి, పుట: 67) అన్నట్లు మారిపోయిందీ సశ్యశ్యామల ప్రాంతం! నిజం చెప్పాలంటే ఆ ప్రాంతమిప్పుడు...

*"ముంపొక అశనిపాతం*
*సర్వం కోల్పోయిన వైనం*
*ఏదీ సొంతం కాదనే వైరాగ్యం"* (అడపా రామకృష్ణ, పుట: 77)లో కూరికి పోయింది." పేర్లు ఏవైతేనేమి దోపిడీల నయావలసవాదమే ఇక్కడా కొనసాగుతుంది. "ఒంట్లో ఇంట్లో కంట్లో అనింట్లో ఏవేవో ప్రలోభాలు" వెంటాడుతున్నాయి. బతకాలి కనుక బతుకుతున్న జీవితాలెన్నో! పుట్టి పెరిగిన ఊరిని వదిలి పోలేక అక్కడే జీవితాలు చాలిస్తున్న వాళ్ళూ కొందరైతే, ప్రాణం పట్టుకొని పల్లెను వదిలేసి పారిపోతున్న వాళ్ళెంతమందో....

*"మనుషులు ఖాళీ చేసిన ఊరు*
*ఈ చీకటిని జయించడానికి*
*కన్నీళ్ళు చాలవు*
*నా కళ్ళనిండా*
*పొలంలో ధాన్యం గింజలేరుకుంటున్న పిట్టలే*
*వర్షంలో తడిసి చెట్లమీద రెక్కలారేసుకుంటున్న పక్షులే*
*యిప్పుడు సన్నివేశాలకి సన్నివేశాలే మారిపోయాయి.*
*కొత్తగా చెరిగిపోతున్న దృశ్యాన్ని నేనే*
*యిది అంతా*
*సామాన్లు సర్దుకుని వెళ్ళిపోతున్న దు:ఖం*
*గూళ్ళు చెదిరి గువ్వలెగిరిపోయిన వేదన*
*లోపలి ఆకాశం అరుస్తునే ఉంది.* (మనుషులు ఖాళీ చేసిన ఊరు - అరుణ్ బవేరా, పుట: 101).

బహుళ జాతి కంపెనీల్లో భాగంగా రోడ్ల విస్తరణ జరుగుతుంది. ప్రాజెక్టులు కట్టబడ్డాయి. నిర్వాసితులకు నష్ట పరిహారమిస్తామంటారు. ఎప్పటికీ రాకపోయేసరికి అడిగితే, ఆందోళనలు చేస్తే, పోలీసుల చేతిలో చావుదెబ్బలు తినవలసిందే. దొంగకేసుల్లో ఇరుక్కోవలసిందే. అవసరమైతే ఎన్‌కౌంటర్‌కి సిద్ధమవ్వాల్సిన పరిస్థితులను, మన మనుషులతోనే చేయించగలుగుతుందీ అగ్రరాజ్యాధిపత్యం! గంటేడు గౌరునాయుడు రాసిన 'కట్టండి ప్రాజెక్టులు'లో ఇలాంటి కవిత్వాన్ని ఆస్వాదించవచ్చు.

కళింగాంధ్ర ప్రాంత వైభవాన్ని అనేక కోణాల్లో 'అపూర్వులు మా పూర్వులు' కవితలో నల్లి ధర్మారావు వర్ణించి, ఆ వైభవమంతా ఏమైపోతుందనే ఆవేదనను పలికించగలిగారు. దీనిలో ఇంకా చాలా మంది మంచి కవిత్వాన్ని రాశారు. దాట్ల దేవదానం రాజు, చాయారాజ్, సి.కామేశ్వరరావు, వాసా ప్రభావతి, ఎల్.కె.సుధాకర్,

కె.వరలక్ష్మి, పి.ఎస్ నాగరాజు, సాధనాల వెంకటస్వామి నాయుడు, మహ్మద్ అబ్దుల్ అజీజ్, విరియాల లక్ష్మీపతి వంటి వారెంతో మంది ఆర్ధ్రతతో రాసిన కవితలను ఇందులో ఎంపిక చేశారు.

కవితలన్నీ ప్రపంచీకరణ వల్ల పల్లెలు ఎలా విధ్వంసానికి గురైపోతున్నాయో, మానవ సంబంధాలెలా మంటగలిసి పోతున్నాయో, వలసలెలా పెరిగిపోతున్నాయో ప్రతిధ్వనించేవి గానే ఉన్నాయి. దానికి ఆనవాలుగా కళింగాంధ్రను చూపుతున్నారు. నిజానికి ఏ ప్రాంతం చూసినా ఇదే పరిస్థితి. దీన్నే చెప్తూ ''స్థానిక గొంతులే...?'' పేరుతో డా॥ దార్ల వెంకటేశ్వరరావు రాసిన కవిత (పుట: 90)లో వర్ణించినట్టు...

*''ఒక్క ప్రాంతమైనా చూడగలరా...?*
*ఇవిగో నమ్ముకున్న నేలతల్లికి పెట్టిన రంధ్రాలు*
*చమురన్వేషణలో పచ్చదనాల్లోని విధ్వంసాలు*
*కుప్పకూలిన చెట్టంత అనుబంధాలు*
*పైసాపైసా కూడబెట్టుకున్న అరెకరం*
*కొండచిలువలు మింగేసిన రొయ్యల చెరువు*
*చూపలేనివి ఇంకా ఎన్నెన్నో...''*

ఈ కవితా సంకలనం నిండా ఉన్నాయి. ఈ సంకలనంలో కవితల ఎంపిక పట్ల చాలా జాగ్రత్తలు పాటించారనిపిస్తుంది. ఇది కళింగాంధ్ర నుంచి వస్తున్న కవితా సంకలనం. ఏదో ఒక ప్రాంతానికి పోటీగా వస్తున్నది కాదు. తమ ప్రాంత వెనుకబాటుతనానికి ఇతర ప్రాంతాల్లో జరిగే అభివృద్ధిపై దృష్టిపెట్టి నిందించటమో, నిరసించటమో చేయలేదు.

మన సమస్యలన్నింటికీ ఒక మూలం ఉందని నిరూపించేటట్టున్న కవితలనే తీసుకున్నారు. అయితే, తూర్పుగోదావరి జిల్లాను కూడా కళింగాంధ్రలో ఎలా భావిస్తున్నారనే ఒక ప్రశ్న తలెత్తే అవకాశం లేకపోలేదు. భాషాశాస్త్రవేత్తల ప్రకారంగానే ఇంత వరకూ కళింగాంధ్రను చూసిన వారికి ఇది ఒక కొత్త విభజనరేఖను చూపిస్తుంది. కానీ, భౌగోళికంగా చూసినప్పుడు గోదావరికి ఇవతలి ప్రాంతంలోని శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లాల ప్రజల జీవన విధానంలో కూడా అనేక సారూప్య లక్షణాలు కనిపిస్తుంటాయి. ఈ నాలుగు జిల్లాలను కేంద్రంగా చేసుకొనే ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నంలో కొనసాగుతుంది. ఏ విధంగా చూసినా విశాఖపట్నం వైపే తూర్పుగోదావరి జిల్లా ప్రజలు చూస్తుంటారు. కనుక కళింగాంధ్రగానే తూర్పుగోదావరి జిల్లాను పరిగణించటంలో సామంజస్యం కనిపిస్తుంది. ఈ ప్రాంతాలనుండి ప్రాంతీయతలో విశ్వజనీనతను చూపే ప్రయత్నంతో కవితాసకలనం రావటం ఆహ్వానించదగిన పరిణామం! ఈ ప్రాంత సమస్యలపై కూడా పాలక వర్గాలు దృష్టి పెట్టాలి.

***

# ఆమ్రపాలి కథలు -మార్పులు ఔచిత్యపు తీర్పులు

ఆమ్రపాలి కథ రసభరితమయినది. దీన్ని సినిమాలుగా కూడా తీశారు. ఇంకా తీస్తున్నారు. ఆ కథలో అంత ఆకర్షించిన అంశాలేమిటి?ఇలా ఆలోచిస్తూ మన తెలుగులో ఎవరైనా ఆమ్రపాలి కథను రాశారా? అనుకుంటూ చూశాను.

తెలుగులో చాలా మంది బౌద్ధ మత ప్రధాన ఇతివృత్తంతో వివిధ కావ్యాలను రాశారు. గౌతమ బుద్ధుని బోధనలకు ఆకర్షితులైన వాళ్లలో వేశ్యలు కూడా ఉన్నారు. వేశ్యగా మారడానికి కారణాలెన్ని ఉన్నా, మరలా సాధారణ స్త్రీగా ఆమె తన జీవితాన్ని గడపాలనుకుంటే, ఈ సమాజం ఎంతవరకూ అంగీకరిస్తుందనేది ఒక పెద్ద ప్రశ్న! ఆ ప్రశ్నకు సరైన సమాధానమే బుద్ధుడు ఆమ్రపాలిని బౌద్ధమతంలోకి ఆహ్వానించడం.

హిందూ మతంలో అనాచారాలుగా కనిపించే చాలా వాటిని సంస్కరించే ప్రయత్నం బౌద్ధంలో కనిపిస్తుంది. సమాజ నిరాదరణకు గురైన వాళ్లనెంతో మందిని దరిచేర్చుకొని, తక్కువ కాలంలోనే విస్తృతంగా వ్యాపించగలిగింది. సామాజిక నిర్బంధాల కారణంగా గణభోగ్యగా మారిన ఆమ్రపాలి కథ ఇంచు మించు అన్ని భారతీయ భాషలలోను ఎంతో ప్రాచుర్యం పొందింది. తెలుగులో చాలా మంది ఈ కథను తీసుకొని కావ్యాల్ని, నవలల్ని రాశారు. ఈ వ్యాసంలో ఇద్దరు రాసిన కావ్యాలను, మరొకరు రాసిన నవలను తీసుకొని, ఆ కథను ఆయా రచయితలు ఎలా తీర్చిదిద్దారో పరిశీలించే ప్రయత్నం చేస్తాను.

'ఆమ్రపాలి' బౌద్ధ జాతక కథను యస్.టి.జ్ఞానానందకవి గారు ఎనిమిది ఆశ్వాసాలుగాను, కరటూరి సత్యనారాయణ గారు ఏడు సర్గలుగాను విభజించి 'ఆమ్రపాలి' అనే పేర్లతో కావ్యాలుగా రాశారు. జ్ఞానానందకవి గారు శాంతాన్నీ, కరటూరి వారు 'కరుణ'ను ప్రధాన రసాలుగా పోషించారు.

ఇరువురు కవులూ ఆమ్రవనంలో 'ఆమ్రపాలి' అనాథగానే దొరకినట్లు పేర్కొన్నారు. లల్లాదేవి మాత్రం పూర్తి భిన్నంగా కథను సామాజిక అంశాలతో పరిశీలించి రచించారు. ఆమ్రపాలి అసలు పేరు 'ఉదాయి'గా మార్పుచేసి, ఆమ్రవనంలో నివశించటం వల్ల 'ఆమ్రపాలి'గా మారినట్లు, ఆ పిల్ల పుట్టిన తరువాత తల్లిదండ్రులు చనిపోయినట్లు లల్లాదేవి మార్పులు చేశారు.

యస్.టి.జ్ఞానానందకవి గారు తన కావ్యంలో పిల్లలు లేని మహానామునికి (శాక్యధనికునికి) 'ఆమ్రపాలి' దొరకగా, కరటూరి వారి కావ్యంలో ఆనందుడనే కొడుకు కలిగిన శాక్యధనికునికి ఆ పసిపిల్ల దొరికినట్లు చిత్రించారు.

ఆడపిల్ల పెళ్ళీడుకొస్తూంటే పెళ్ళి చేయాలనే తపన తండ్రికి ఎలా పెరుగుతుందో అది జ్ఞానానందకవి గారి కావ్యంలో బాగా కనిపిస్తుంది. కానీ, కరటూరి వారు 'తండ్రి రాజ్య నిర్వహణా భారంలో పడి కూతురికి వివాహం చేయటం మరచిపోయినట్లు రాశారు. ఇటువంటి ప్రయత్నమేదీ లల్లాదేవి నవలలో కనిపించలేదు. ఆమ్రపాలి తండ్రి లిచ్ఛవుల మనస్తత్వాన్ని ఎప్పటికప్పుడు గమనిస్తూ, వారి వల్ల కూతురికి ఏ ముప్పు వాటిల్లుతుందోననే భయంతో ఉండేవాడనీ, కనుక సరియైన సమయంలో తగిన వరుణ్ణి చూసి వివాహం చేయాలని భావించి స్వయంవర సభను ఏర్పాటు చేసినట్లు జ్ఞానానందకవి గారు వివరించారు.

గణతంత్ర రాజ్యాలలో అందమైన యువతి కనిపిస్తే ఆమెను ఆ దేశపాలకులు గణభోగ్యగా చేసుకొనే ఆచారం ఉంది. శాక్యధనికుడు గణతంత్ర రాజ్యానికి చక్రవర్తి అయినా, పాలకులంతా ఏకమై తీర్మానిస్తే తన కూతురినయినా గణభోగ్యగా చేయవలసిందే! దీనికి 'స్వయంవరం' అనే ఒక సంప్రదాయం మాత్రం ఉంది. స్వయంవరంలో యవతికి నచ్చిన యువరాజుని పెళ్ళి చేసుకొనే స్వేచ్ఛ ఉన్నా, అది గణనాయకుడైన చక్రవర్తి చేతిలో ఉండదు.

గణరాజ్యాలలో ఒక గణ పరిషత్తు ఉంటుంది. విధి, విధానాలను అన్నింటినీ ఆ గణపరిషత్తే నిర్ణయిస్తుంది. అందుకనే స్వయంవర సభలో గణపరిషత్తులో సభ్యులైన లిచ్ఛవరాజులు, అందగత్తె అయిన ఆమ్రపాలి తమకే చెందాలనీ, ఇతరులకు చెందకూడదనీ పట్టుపడతారు. గణనాయకుడైన శాక్యధనికుణ్ణి, లిచ్ఛవులు తమ అభిప్రాయం ప్రకారం జరగకపోతే తీవ్ర పరిణామాలు ఎదురౌతాయని హెచ్చరిస్తారు. గణనాయకుడైనా తండ్రికి నామమాత్రమైన అధికారాలే ఉన్నాయని ఆ పరిస్థితిని గమనించి సభలోనే ఉన్న ఆమ్రపాలి 'గణభోగ్య'గా ఉండటానికి అంగీకరిస్తుంది. అందుకుగాను కొన్ని నియమ నిబంధనలను విధిస్తుంది. తనతో పాటు మొదటి నుండీ సభల్లోనూ, రాచకార్యాల్లోనూ పాల్గొన్నట్లు జ్ఞానానందకవి గారు జాగ్రత్తపడ్డారు.

కరటూరి వారు లిచ్ఛవుల్లో 'అభయుడు' అనే బలవంతుడైన మూర్ఖుడు ఆమ్రపాలి పట్ల వ్యామోహం పెంచుకొని, లిచ్ఛవులను రెచ్చగొట్టి, ఆమ్రపాలికి పెళ్ళి చేయకపోవటం వల్లనే రాకుమారులు రాజ్యంలో అశాంతిని సృష్టిస్తూ, ఒకరినొకరు చంపుకుంటున్నారని రాజైన శాక్యధనికునికి నివేదించినట్లు వర్ణించారు.

ఆమ్రపాలి ఈలోగా తండ్రికి తెలియకుండా చెలికత్తె ప్రియంవద సహాయంతో బింబిసారుడి మోసానికి గురవుతుంది. ప్రియంవదకు బింబిసారుని మంత్రి సంజయుడు అన్ని విషయాలు చెప్పి, ఒప్పించి, బింబిసారునికి ఆమ్రపాలికి మధ్య ప్రణయ సమాగమం జరిగేటట్లు చేస్తాడు. చెలికత్తె బింబిసారుడు, ఆమ్రపాలిలను కలిపి, తర్వాత బింబిసారుని వివరాలు చెపుతుంది. తండ్రి మహానాముడు రాజ్య నిర్వహణలో పడిపోయి పెళ్ళి విషయం మరచిపోయాడనీ, అందుచేతనే 'గణభోగ్య'గా తప్పనిసరి పరిస్థితుల్లో చేయవలసి వచ్చినట్లు వర్ణించారు.

సభలో మహానాముడిని 'గణభోగ్య'గా ఆమ్రపాలిని చేయమని పట్టుపట్టడం తనకో ధర్మం, పరులకో ధర్మం పనిచేయదని లిచ్ఛవులు రాజుని వ్యతిరేకించటం వల్ల మహానాముడే ఆమ్రపాలిని ఆమె అంగీకారాన్ని కూడా తెలుసుకోకుండా 'గణభోగ్య'గా ప్రకటించాడు. ఆ విషయాన్ని, కూతురైన ఆమ్రపాలికి చెప్పటానికి బాధాతప్త హృదయుడై ఆమె భవనానికి వెళ్తాడు. కానీ, అక్కడే మాట్లాడకుండా కూర్చుండిపోతాడు. తండ్రిని చూసి, ఆమ్రపాలి బింబిసారుని వల్ల మోసగింపబడిన విషయం ఎక్కడ తెలిసిపోయిందోననీ, అందుకే ఎంతో ప్రేమగా పిలిచి ఆదరించే తండ్రి తాను చేసిన పనికి బాధ పడుతున్నాడనుకొంటుంది. ఈ సన్నివేశం చక్కని నాటకీయతతో సాగింది. జరిగిన విషయాన్ని అంతటినీ తండ్రికి చెప్పేసి, శత్రురాజైన బింబిసారుడని తెలియదనీ, దేశద్రోహం చేయననీ, క్షమించమని ప్రాధేయపడుతుంది.

తండ్రి ఆమ్రపాలిని సముదాయించి, అనివార్యమైన పరిస్థితుల్లో గణభోగ్యగా చేయవలసి వచ్చిందని, సభా విషయాలను ఆమెకు తెలుపుతాడు. ఆ సందర్భంలోనే ఆమ్రపాలి తనకు ఆమ్రవనంలో దొరికిందనీ, స్వంత కుమారుడైన ఆనందుడినీ నిన్నూ ఒకేలా పెంచాననీ చెపుతాడు.

తెలిసిన విషయాలు ఇరువురికీ ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి. దేశంలో అల్లకల్లోలాలను ఆపడం కూడా ఆమ్రపాలి దేశభక్తిగానే భావిస్తుంది. దేశంకోసం దేనికైనా సిద్ధమవుతాననీ, బింబిసారుని చేతిలో మోసపోయినందుకు క్షమించమని చెపుతుంది.

ఇది జరిగిన తర్వాత కూతురు గురించి బెంగపెట్టుకొని కొన్నాళ్ళకు తండ్రి చనిపోతాడు, ఆనందుడు బౌద్ధ సన్యాసిగా మారిపోతాడు. ఆమ్రపాలికి పుట్టిన కొడుకు 'విమలకొండ'ను వేశ్యబిడ్డగా సమాజం గౌరవించదని ఆనందుడు చెప్పటం వల్ల బౌద్ధ సంఘంలో విమలకొండ చేరటానికి తల్లి అంగీకరిస్తుంది. కొడుకుపట్ల పుత్ర వాత్సల్యం వీడలేకపోతుంది. ఏదో ఒక నెపంతో పుత్రుణ్ణి చూడాలనే బుద్ధుని దగ్గరకు వెళ్ళి, బుద్ధుణ్ణి 'కొడుకుని తల్లి నుండి విడదీయడం ధర్మమేనా?' అని నిలదీస్తుంది. బుద్ధుడు జీవిత సత్యాన్ని, దు:ఖ నివారణను చెప్పటంవల్ల ఆమె బౌద్ధ సంఘంలో చేరగలుగుతుంది.

లల్లాదేవి రాసిన 'ఆమ్రపాలి' నవలలో కథను పరిశీలిస్తే 'ఉదాయి'కి తల్లిదండ్రులు చనిపోవడంతో, వైశాలీ రాజ్యంలో ఉన్న బంధువుల ఇంటికి మేనమామ ఆ పిల్లను తీసుకొని వెళుతుంటాడు. మార్గ మధ్యలో దొంగల బారిన పడటంతో మేనమామ చనిపోతాడు. భైరవుడనే మంచి దొంగ ఆ పసిపిల్లను చేరదీసి వైశాలీ నగరానికి చేర్చి యశోదేవి దగ్గర విద్యాభ్యాసం కొనసాగేలా దోహదపడతాడు. గురువుగారి దగ్గర విద్యాభ్యాసం అభ్యసిస్తూ రాజుగారి అనుగ్రహం పొంది, వారి ఆదరణకు పాత్రమవుతుంది. ఆమె చేసిన నాట్యానికి మెచ్చి, నర్తకి పదవినిచ్చి ఒక ఆమ్రవనాన్ని కేటాయించి, దానిలో చక్కని భవనాన్ని నిర్మించాలని రాజు చేతనుడు ఆదేశిస్తాడు. ఆమె ఆమ్రవనంలో ఉండటం వల్ల 'ఆమ్రపాలిక'గా, తర్వాత 'ఆమ్రపాలి'గా పిలువబడుతుంది.

భవన నిర్మాణానికి వినియోగించిన శిల్పులలో లౌకిక విషయాలను పట్టించుకోని 'ఉదయుడు' అనే శిల్పి ఏకాగ్రతతో శిల్పాలను చెక్కుతుంటాడు. అతని శిల్ప నైపుణ్యాన్ని ఆమ్రపాలి అభిమానిస్తుంది. అతని దగ్గరే ఎక్కువసేపు గడుపుతుండేది. ఆమె కూర్చున్న భంగిమను ఒకసారి 'ఉదయుడు' చూసి చక్కని శిల్పాన్ని చెక్కుతాడు. ఆ శిల్పంతోపాటు, బుద్ధుని ప్రశాంతమైన విగ్రహాన్ని కూడా ఆమెకు బహూకరిస్తాడు. ఉదయునిడి పట్ల ఆసక్తిని పెంచుకోవడం గమనించిన రాజు ఆ శిల్పిని మరొక చోటికి పంపాలనుకుంటాడు. ఉదయునుడు ఒక స్వేచ్ఛాజీవి. ఎవరి నియమ నిబంధనలకు తలొగ్గనివాడు. రాజుగారి ఆజ్ఞ ప్రకారం మరో చోటకి శిల్పాలను చెక్కటానికి వెళ్ళమంటే ఇష్టపడక ఆ రాజ్యమే వదిలిపోతాడు.

బుద్ధుని ప్రశాంతమైన శిల్పాన్ని చూస్తూ బుద్ధుని గురించి, అతని ఆశయాలు, ధర్మాలను గురువు గారి సహాయంతో తెలుసుకొని, బుద్ధుణ్ణి దర్శించాలని తహతహలాడుతుంటుంది ఆమ్రపాలి. అదే సమయంలో ఒక బౌద్ధ భిక్షువు ఆ రాజ్యం వచ్చాడని తెలిసి తన భిక్షను స్వీకరించమని ప్రార్థిస్తుంది. ఆ బౌద్ధ భిక్షువు మొదట అంగీకరించి ఆమె ఇంటికి వెళ్ళి భిక్షను స్వీకరించాలనుకుంటాడు. అంతలో ఒక ధనస్వామి అనే ధనవంతుడు ఆ విషయాన్ని తెలుసుకొని ఆ బౌద్ధ భిక్షువుతో 'ఆమె ఒక వేశ్య' అనీ, ఆ భిక్షను స్వీకరించవద్దనీ, మా ధనవంతుల దగ్గర స్వీకరించమనీ చెపుతాడు. ఆ బౌద్ధ సన్యాసి వెంటనే ఆమె పెట్టే భిక్షను తిరస్కరిస్తాడు. దానితో ఆమె ఎంతో బాధపడుతుంది. వేశ్య అంటే ఏమిటో, ఆ జీవితం ఎలా ఉంటుందో అని ఆలోచిస్తూ, తనకి తెలియకుండానే ఒక వేశ్యావాడలోని ఒక ఇంటికి నడుచుకుంటూ వెళ్ళిపోతుంది. అక్కడ 'ఆమ్రపాలి'ని కొంతమంది పట్టుకొని వేశ్యగా ముద్రవేసి, రాజు చేత ఆమెను నర్తకి పదవి నుండి తప్పించి, రాజ్య బహిష్కార శిక్ష వేస్తారు. బుద్ధుడు ఆ నగరం వచ్చే వరకూ తిండీ బట్టా పట్టించుకోకుండా నిరీక్షించి, బుద్ధుని కరుణ వల్ల బౌద్ధ సన్యాసిగా మారటంతో కథ ముగుస్తుంది.

ముగ్గురు రచయితలూ మూడు విధాలుగా 'ఆమ్రపాలి' కథను తీర్చిదిద్దారు. జ్ఞానానందకవి గారు తండ్రి పాత్రను పోషించటంలో ఔన్నత్యాన్ని, నైతిక విలువలను పాటిస్తూ సమయోచితంగా, సందర్భోచితంగా వర్ణించినట్లు అవగతమవుతుంది. దీనికి ముందు నుండే కథను చక్కని ప్రణాళిక వేసుకున్నారనిపిస్తుంది. రాచకార్యాల్లో పాల్గొనడం, ఆమ్రపాలికి ఏర్పాటు చేసిన 'స్వయంవర సభ'లోనే గణభోగ్య నిర్ణయం జరిగినట్లూ రాశారు.

కరటూరి వారి కావ్యంలో అప్పటికే తప్పుచేసి ఉండటం వల్ల, తండ్రి అప్పటికే ఆమెను గణభోగ్యగా అంగీకరించటం వల్ల 'గణభోగ్య'గా ఆమె అంగీకరిస్తూ, పైకి దేశభక్తి పూత పూసినట్లు అనుకోవడానికి అవకాశం కలుగుతుంది. కానీ, కావ్యాన్ని చదువుతున్న పాఠకునికి ఆ నాటకీయత అబ్బురపరుస్తుంది.

జ్ఞానానందకవీ, కరటూరి వారూ ఇద్దరూ కూడా 'ఆమ్రపాలి' గణభోగ్యగా మారిన తర్వాత తండ్రి పాత్రను బాగా చిత్రించారు. జ్ఞానానందకవి గారు, ఆమ్రపాలి తండ్రి

పాత్రను కావ్యంలో మరలా ప్రవేశ పెట్టకుండానూ, కరటూరి వారు, ఆమ్రపాలి తండ్రి బెంగపెట్టుకొని మరణించినట్లు బాగా రాశారు. జ్ఞానానందకవి గారు 'ఆమ్రపాలి' గణభోగ్యగా మారిన తర్వాత కథను ఆమె నుండే చూశారు. పెంచిన తల్లిదండ్రుల కోణం నుంచి చూడలేదు. ఇది చక్కని కథనశిల్పం.

లల్లాదేవిగారి నవలలో 'ఆమ్రపాలి' వేశ్యగా ముద్ర వేయబడుతుంది. ఆమెకు తెలియకుండానే వేశ్యావాడకు పోతుంది. అక్కడ కొంత మంది యువకులు ఆమెను నిర్బంధించి వేశ్యగా మార్చినట్లు రాశారు. అక్కడ వేశ్య జీవిత చిత్రణను వర్ణించటంలో లల్లాదేవి పరిశీలన చక్కగా వ్యక్తమవుతుంది. దొంగల గుంపుకి దొరికిన ఉదాయి అడవిలో పాడుపడిన దేవాలయం మీద ఉన్న నాట్యభంగిమలను చూసి, ఆమె నాట్యాన్ని అభ్యసించాలనుకున్నది. సాధన వలన నాట్యాన్ని సాధించింది. ఆ నాట్యమే ఆమ్రవనాన్ని, నర్తకి పదవిని వచ్చేలా చేసింది. అదే ఆమెను 'వేశ్య'గా అనుమానించేలా చేసింది. ఆ అనుమానంలో నుండి వచ్చిన అవమానమే ఆమెను బౌద్ధ భిక్షువుగా మార్చి, సన్మార్గం వైపు పోయేటట్లు చేసింది.

యస్.టి.జ్ఞానానందకవిగారి 'ఆమ్రపాలి' బింబిసారుణ్ణి ప్రేమించింది. బింబిసారుడూ ఆమెను కోరుకున్నాడు. తర్వాత ఇరువురిలో ఎవరిని ఎవరూ ద్వేషించుకోలేదు. బింబిసారుడు మాత్రం ఆరురోజులు ఆమె భవనంలో ఉండి, దొంగచాటుగా వచ్చిన అతని రాకను లిచ్ఛవులు పసిగట్టడం, అతడిని జాగ్రత్తగా దాచటం, ఆమెను విడిచి వెళ్ళిపోయేటపుడు ఒక ఉంగరాన్ని ఇవ్వటం, ఒకవేళ కొడుకు పుడితే, ఉంగరమిచ్చి పంపమని చెప్పి వెళ్ళిపోతాడు. తన కోసం చిత్రించిన చిత్రపటంలో బింబిసారుణ్ణి ఆకర్షించి, ఆలోచిస్తుండగా చెలికత్తె ఆమె హృదయాన్ని పసికట్టడం, రాయబారం నడపడం వంటివన్నీ చేస్తుంది.

బింబిసారుని పాత్రను కావాలనే కావ్య నాయకునిగా, కవి తీర్చిదిద్దలేదేమో ననిపిస్తుంది. ఆమెను బింబిసారుడు అనుభవించటానికే ప్రయత్నించినట్లు తేలుతుంది. అయితే ఉంగరాన్ని ఇచ్చి, కొడుకు పుడితే, ఉంగరం చూపితే తన పుత్రునిగా స్వీకరిస్తానని చెప్పటం అతని స్వభావాన్ని తేటపరిచే విషయాలుగా గమనించే వీలుంది.

'గణభోగ్య'గా జీవితాన్ని గడుపుతున్న ఆమ్రపాలి తనలో తాను తీవ్ర సంఘర్షణకు లోనై ఒకసారి తాను దొరికిన ఆమ్రవనానికి ప్రశాంతత కోసం రావటంతో, అక్కడ తొలిసారిగా బుద్ధుని దర్శనమవుతుంది. ఆనాటి నుండే ఆమెలో బుద్ధుని ప్రవచనాలు లౌకిక విషయాల పట్ల కోరికను తగ్గించి, అలౌకిక విషయాల పట్ల ఆసక్తిని కలిగిస్తాయి.

బుద్ధుని రాక కోసం నిరీక్షిస్తూ, తీరా బుద్ధునికి భిక్షను పెట్టాలని ప్రయత్నించినపుడు ఆ నగరంలోని ధనవంతులు వ్యతిరేకిస్తారు. బుద్ధుని దర్శనాన్నీ బుద్ధుని శిష్యుడు కూడా అడ్డుకుంటాడు. కానీ బుద్ధుని జోక్యం వల్ల ఆమెకు అతని దర్శనం కలగటం, ఆమె పూర్వజన్మలో నెమలి అనీ, ఇంద్రుని శాపం వల్ల 'ఆమ్రపాలి'గా జన్మించిందని, ఆమె జన్మవృత్తాంతాన్ని బుద్ధుడు వివరించటంతో ప్రజల్లో ఎక్కడలేని ఆదరణ కలుగుతుంది.

బుద్ధునికి భిక్షను పెట్టి, తన సర్వ విద్యలనూ బౌద్ధ సంఘ వ్యాప్తికే వినియోగిస్తూ జీవితాన్ని గడపాలని నిర్ణయించుకొంటుంది.

జ్ఞానానందకవి గారు 'ఆమ్రపాలి' కావ్యాన్ని చారిత్రక తత్త్వకావ్య లక్షణాలతో చక్కగా అన్వయించే ప్రయత్నం చేశారు. జ్ఞానానందకవిగారి 'ఆమ్రపాలి' కావ్యంలో బుద్ధుని బోధనలు అడుగడుగునా కన్పిస్తుంటాయి. మరో విశేషమేమిటంటే, ఈ కావ్యంలో అన్ని పాత్రలూ ఆమ్రపాలి వైపు నడవగా, ఆమ్రపాలి బుద్ధుని ధర్మాలవైపు, బుద్ధుని వైపు పయనిస్తుంది. బౌద్ధమతంలోని ఆర్య సత్యాలనూ, త్రిరత్నాలనూ, అష్టాంగ మార్గాన్ని కావ్యానికి అన్వయించి బౌద్ధ ధర్మేతిహాసంగా మలచగలిగారు.

జ్ఞానానందకవిగారి 'ఆమ్రపాలి' కావ్యంలో మరికొన్ని విశేషాలు ఉన్నాయి. ఆమ్రపాలి గణభోగ్యగా జీవితాన్ని గడుపుతూ మానసిక ప్రశాంతత కోల్పోయి, సంఘర్షణపడుతూ, తీవ్ర వ్యధకు లోనై గుండెల్లో దు:ఖాన్ని పోగొట్టుకోవాలని తాను దొరికిన ఆమ్రవనంలోకి వస్తుంది. కరుణ హృదయుడైన బుద్ధుడు అక్కడ తపస్సు చేసుకుంటూ కనిపిస్తాడు. అతడిని ఆమె ఎవరో ముని అనుకొని ఆమెలో తీరని కోరికను నర్మగర్భితంగా వ్యక్తీకరించి అతనిని తన ఇంటికి రమ్మనమనీ, సర్వ సౌఖ్యాలనూ సమకూరుస్తానంటుంది. బుద్ధుడు ఆమె మనోవాంఛను గమనిస్తాడు.

మృదువుగా, ప్రశాంతంగా, జీవిత సత్యాలను వివరిస్తాడు. అంతేకాక ఆమె బౌద్ధ భిక్షువుగా మారిన తరువాత ఆమెతోపాటు బౌద్ధారామానికి వచ్చిన మిగిలిన ప్రజలకు నాలుగు ఆర్య సత్యాలను వివరిస్తాడు. బౌద్ధ ధర్మ మూల సూత్రాలలో సర్వమూ క్షణికమనేది ఒక మూల సూత్రం. ఇది ప్రపంచం దు:ఖమయమనే దాన్ని స్పష్టం చేస్తుంది. పుట్టిన ప్రతివారికీ మరణం తప్పదు. అయినా ఆశలు పెంచుకుంటారు. ప్రపంచంలో దు:ఖం లేకపోవటంగాని, పుట్టిన జీవి మరణించకపోవటమనేది కనిపిస్తే ఎంతో సంతోషం కదా! అని బుద్ధుడు చెపుతాడు.

మానవుని శరీరం వయ: పరిణామాన్ని అనుసరించి క్షణక్షణం మారుతూ మట్టిలో కలిసిపోతుందనే విషయాన్ని కవి 'నాల్గు దశల మధ్య నవయుచునున్నట్టి' అని వర్ణించారు. దృశ్యమాన ప్రపంచంలోని సర్వమూ అనిత్యమేనని దానివల్ల తెలుస్తుంది.

దు:ఖానికి కారణం కోరికలు అనేది బుద్ధుడు బోధించిన నాలుగు ఆర్య సత్యాల్లో రెండవది. ఇంద్రియాలకు ప్రియమైన విషయ సంపర్కం, వాటి స్మృతి, కోరిక (తృష్ణ)లకు కారణమవుతుంది. ఆ కోరికలు పూర్తిగా త్యజించగలిగినపుడు దు:ఖం నివారింపబడుతుంది. ఇది మూడవ ఆర్యసత్యం.

ఆమ్రపాలి ఎన్నో కోర్కెలతో రగిలిపోతూనే బుద్ధుని ప్రథమ దర్శనం చేసుకొన్నది. బుద్ధుడు జీవితం క్షణికమైనదనే జీవిత సత్యాన్ని బోధించడం, తన తపస్సు పూర్తయిన తరువాత భిక్షను స్వీకరించటానికి వస్తానని చెప్పి పంపితే బుద్ధుని పునరాగమనం వరకూ భిక్షను సమర్పించటానికి ఎదురుచూస్తూనే ఉంది. అప్పటికి ఆమెలో కోరికలు

నశించిపోయాయి. తాత్కాలికమైన లౌకిక భోగాల నుండి శాశ్వతమైన విముక్తి మార్గానికి సిద్ధమై ఉంది. దీనికంతటికీ కారణం ఆమెలో వివాహం చేసుకోవాలనీ, సర్వ సౌఖ్యాలను అనుభవించాలనీ ఉన్న కోర్కెలన్నీ నశించటమే. కొడుకుని, తండ్రిని, సర్వస్వాన్నీ వదిలి బుద్ధుని శిష్యగణంలో చేరిపోతుంది. ఆమె దు:ఖం నుండి విముక్తి పొందుతుంది. ఈ విధంగా చారిత్రక తత్త్వకావ్యంగా జ్ఞానానందకవి గారు 'ఆమ్రపాలి' కావ్యాన్ని తీర్చిదిద్దారు.

బుద్ధుని బోధనలు సమాజం మీద ఎంత ప్రభావాన్ని చూపాయనేది తెలియజేసే కథలు ఎన్నో వస్తున్న నేపథ్యంలోనే 'ఆమ్రపాలి' కావ్యాలు, నాటకాలు, నవలలు కూడా వెలువడ్డాయి. మానవ విలువలను, మానవ సంబంధాలను పటిష్టపరచడంలో బౌద్ధేతివృత్త కావ్యాలు చాలా వరకూ తోడ్పడ్డాయి. అలా నిరూపించే బౌద్ధ జాతక కథలలో ఆమ్రపాలి కథ ఉత్తమోత్తమ కథ. ఇంకా చాలామంది తెలుగు రచయితలు కూడా ఆమ్రపాలి కథను తీసుకొని వివిధ ప్రక్రియలలో రచనలు చేసిన వారు ఉండవచ్చు.

**ఆధార గ్రంథాలు:**


జ్ఞానానంద కవి, యస్.టి. *ఆమ్రపాలి.* కాకినాడ: రసజ్ఞ శ్రీ పబ్లికేషన్, (ప్ర.ము. 1972) ద్వి.ము. 1986.

లల్లాదేవి. *ఆమ్రపాలి.* హైదరాబాదు: విశాలాంధ్ర బుక్ హౌస్, 1983.

సత్యనారాయణ, కరుటూరి. *ఆమ్రపాలి.* రాజమండ్రి: స్వీయ ప్రచురణ, 1980.

సీతా కళ్యాణి, వి. *తెలుగు చారిత్రక కావ్యాలు.* హైదరాబాదు: స్వీయ ప్రచురణ, 1990.

సుబ్రహ్మణ్యం, జి.వి. *సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు.* హైదరాబాదు: తెలుగు అకాడమీ, 1991.

హనుమంతరావు, బి.యస్.ఎల్. *భారతీయ సంస్కృతి - ఒక పరిశీలన.* గుంటూరు: త్రిపుర సుందరి ప్రచురణలు, 1994.


***

# మల్లవరపు జాన్ కవిత్వంలో మాధుర్యం!

మధురకవిగా పేరుపొందిన మల్లవరపు జాన్ కవి కవిత్వంలో ఆ మాధుర్యం దేని వల్ల వచ్చింది? ఆయన కవిత్వం రాశారు. ఆ కవిత్వాన్ని ఛందోబద్ధపద్యంలో రాశారు. సాంసన్ - డెలీలా నాటకం రాశారు. అది క్రైస్తవ సాహిత్యేతివృత్తం. అందులోనూ కొన్ని పద్యాలున్నాయి. సజ్జనాను *రక్తి జాను సూక్తి* మకుటంతో ఒక సూక్తి *శతకం* రాశారు. అది అనేక భావాల సంగమం. రేడియోలో సమస్య పూరణం పేరుతో వారం వారం ప్రసారమైన కార్యక్రమంలో అనేక సమస్యలకు పద్య పూరణ చేశారు. తన కృతులను ప్రచురించిన వారినీ, ప్రచురించడానికీ సహకరించిన వారినీ, తన రచనలపై స్పందించిన వారినీ అభినందిస్తూ పద్యాలు రాశారు. కవిత్వంలో తనకిష్టమైన ప్రాచీనాధునిక కవులనూ, కావ్యాలనూ స్పర్శించారు. మాతృభాషపై, మాతృభూమిపై అభిమానాన్ని కురిపించారు.

వీటిని పరిశీలించినప్పుడు జాన్ కవి భిన్న వస్తువులను తీసుకొని కవిత్వం రాశారని తెలుస్తుంది. కవి భిన్న వస్తువులను తీసుకోవడం వల్ల మాధుర్యం వస్తుందా? తీసుకున్న వస్తువులను కవిత్వీకరించడంలో మాధుర్యం వ్య క్తమవుతుందా? అనే ప్రశ్న ప్రతి కవి గురించీ, ప్రతి రచన గురించీ వేసుకోవలసివస్తుంది. ఈ ప్రశ్నలకు వచ్చిన సమాధానాల సమాహారం నుండే కవిత్వ స్థాయి తెలుస్తుంది. కవి వచ్చిన సమాజం నుండి కూడా కవిత్వ స్థాయిని చూడాలి. కవిత్వ మాధుర్యాన్నీ గుర్తించాలి. కనుక కవి చేసిన భాషా ప్రయోగాల జోలికి ఎక్కువగా పోకుండా భావాలను అనుసరించే మాధుర్యాన్ని పరిశీలిస్తున్నాను.

జాన్ కవి అప్పకవి నిర్ణయాన్ని ఖండించడంతోనే ఆగిపోలేదు. మహాకవి జాషువా కవిత్వంతో కలిసి పయనించారు. కవిత్వం రాయడానికి కులం అడ్డంకి కాదని నిరూపించిన జాషువాని ప్రశంసించారు.

> *"కులహీనుండు రచించు కావ్యమ్ములు నిగ్గుల్ గుల్కినన్ గైకొన*
> *న్వలదన్నాడతి ధూర్తుడప్పకవి నీవా మాటలన్ ద్రుంచి క్రొం*
> *దళుకున్ గబ్బములల్లి పండితుల సన్మానంబులన్ గాంచి మా*
> *తెలుగున్ జాతిని మేలుకొల్పితివి; సందేశాత్మ కావ్య ద్యుతిన్!* (భావ

విపంచి: 1996-69). ఇక్కడ తర తరాల దళితవేదనను పలికించి, పాఠకులను ఆ వాదనతో ఏకీభవింపజేయడంలో మనసు పొందేది మాధుర్యమే! మన లాక్షణికులు దీర్ఘ సమాసాలు లేకుండా రాయడం, సరసములైన పదాలను కూర్చటం మాధుర్య గుణంగా వివరించారు. జాన్ కవిది కేవల సరళ శబ్ద ప్రయోగం వల్ల మాత్రమే వచ్చిన మాధుర్యం కాదు. చెప్పే భావంతో పఠితను అనుభవానికి తీసుకొని పోవడంలో మాధుర్యం ఉంది. డా॥బి.ఆర్. అంబేద్కర్ గురించి రాసిన పద్యాల్లో కూడా ఇలాంటి గుణం కనిపిస్తుంది.

*"కర్ణుడలనాడుకులపరీక్షకుల నడుమ*
*శిరము వంచె వెంటనే నృపాదరణ గలిగె*
*అడుగడుగున నస్పృశ్యుడ వనుచు నిన్ను*
*దూరు నపుడెవ్వ రేనియు తోడుపడిరె?"* (భావ విపంచి: 1996-14). అని వర్ణించడంలో గొప్ప ఆర్ద్రత ఉంది. అంటరానితనాన్ని అనుభవించిన ప్రతి దళిత పాఠకుడూ మహాభారతంలో కుమారాస్త్ర విద్యా ప్రదర్శన సమయంలో కర్ణుడికి జరిగిన అవమానంతో మమేకమవుతాడు. వెంటనే అలాంటి అవమానాలెన్నింటినో ఎదుర్కొన్న డా॥బి.ఆర్. అంబేద్కర్ ఒంటరి పోరాటం స్ఫురింపజేశారు. ఇది వర్ణించినప్పుడు కవి కదిలిపోయుంటారు. వేదనకు గురయ్యుంటారు. అలాంటి వేదనను అభివ్యక్తీకరించేటప్పుడు కవి చాలా నైపుణ్యాన్ని ప్రదర్శించవలసి ఉంటుంది. ఆ ఖండికలను వర్ణించడంలో ఆ నైపుణ్యం వ్యక్తమయ్యింది. ఇవన్నీ పాఠకుణ్ణి ఒక తీయని బాధకు గురిచేస్తాయి. ఆ తీయని బాధలో మాధుర్యం ఉంది.

డా॥బి.ఆర్. అంబేద్కర్ చాలా విషయాల్లో ప్రభుత్వంతో ఒంటరిగానే పోరాడవలసి వచ్చింది. పదవుల్లో ఉన్నా, వాటిని కాపాడుకోవడానికే ప్రయత్నించే వాళ్ళమధ్య తన జాతి పట్ల బాధ్యత కలిగిన వ్యక్తులకు కొన్నిసార్లు అలాంటి సందర్భాలు తప్పవు. అలాంటి సంఘర్షణల ఫలితమే నేటికైనా దళితులు కొంతవరకైనా ఆత్మగౌరవంతో తిరగగలుగుతున్నారు. ఆ భావాల్నే కవి సరళమైన శైలిలో ఇలా వర్ణించారు.

*"నీ మూలమున గదా! నేటి తరమ్ము రా*
*జ్యాంగ హక్కుల రహస్యంబెఱింగె*
*నీ మూలమున గదా! నేటి హరిజన సో*
*దరుడు సభాధ్యక్షతను వహించె*
*నీ మూలమున గదా! నేటి దళిత కుల*
*మ్ముల 'రిజర్వేషను'పొంద గలిగె*
*నీ మూలమున గదా! నేటి గిరిజనులు*
*వర 'కాలనీల' నివాసులయ్యె*
*ఊరికి సుదూరమున వాసమున్న వారు*
*చేరె; నీమూలమున గ్రామ సీమలందు*
*నీ శత జయంతి విజ్ఞాన నిధులకెల్ల*
*గర్వమయ్యె నంబేద్కరూ! పర్వమయ్యె!!* (భావ విపంచి: 1996-17). ఈ పద్యం చదివిన తరువాత పాఠకుడికి గొప్ప రిలీఫ్ కలుగుతుంది. 'పర్వమయ్యె' శబ్ద ప్రయోగంలో గొప్ప ఔచిత్యం ఉంది. బాధలన్నీ విముక్తమయినప్పుడు కదా నిజమైన మాధుర్యాన్ని అనుభవించగలిగేది! మాధుర్యంలోనూ ఎన్ని భేదాలు! జాన్ కవి గారు క్రైస్తవం పట్ల అభిమానం ఉన్నవారు. అయినంత మాత్రం చేత ఇతర మతస్థులపై నిరసనను ప్రదర్శించ లేదు. వివిధ మతాల వారి మనోభావాలను వర్ణించడంలోనూ మధురమైన కవిత్వాన్ని రాయగలిగారు. శ్రీ వేంకటేశ్వరుని నివాస స్థానంగా, హిందువుల పుణ్యక్షేత్రంగా భావించే తిరుపతి ఏడు కొండలను సూక్తి శతకంలో వర్ణించారు. ఇతర మతస్థుల గురించి ఇంకొంచెం రాయాలి. మతం మానవత్వానికి ఉపయోగపడాలనే తపన వారి కవిత్వంలో ఉన్న ఉదాత్త భావన! అందుకనే...

*"పలు మతాను వర్తను పరస్పర విరుద్ధ*
*గతుల జరియించినను మానవత దలంచి*
*సహన సౌశీల్య సామరస్యముల తోడ*
*కలిసి మెలసి శాంతి జ్యోతి నిలుపవలదె?"*(భావ విపంచి: 1996-87)

అని ప్రశ్నించగలిగారు. సమాజంలో భిన్నమతాలున్నప్పటికీ మానవత్వాన్ని చాటి ఉత్తమ గుణశీలాన్ని పెంపొందించటానికి ఉపయోగపడాలనే ఆకాంక్ష కనిపిస్తుంది. కొంచెం ఓపిక చేసుకొని రాయగలిగితే కట్టమంచి వారి *ముసలమ్మ మరణం* వంటి కావ్యం కాగలిగిన స్వరూప, స్వభావాలు కలిగిన 'వల్లూరమ్మ' గురించి కొన్ని గొప్ప ఖండికలు రాశారు. వల్లూరమ్మ గురించి ప్రజల నోళ్ళలో అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. నేటికీ 'ఈతముక్కల' పరిసర గ్రామ ప్రజలు చాలామంది వల్లూరమ్మను గ్రామదేవతగాకొలుస్తున్నారు. ఆ భావాలతో కవి ఏకీభవించే రాశారా? అనే దాని కంటే అక్కడ జరుగుతున్న విషయాలను కవిత్వంలో రికార్డ్ చేయడంలో ఆ ప్రజల అనుభూతితో కలిసి పయనించారని మాత్రం తెలుస్తుంది.

*"సంతాన హీనులు సాగిల పడి వేడ*
*దివ్య సంతతి బ్రసాదించినావు*
*రోగాలతో వచ్చి రోదించి ప్రార్థింప*
*నారోగ్యమిడి సాగనంపినావు*
*ఆపదలందు నిన్నాశ్రయించిన వారి*
*చింతలడచి కటాక్షించినావు*
*అడుగుట తడవుగ నభిమతంబుల దీర్చి*
*కల్పవల్లిగ పేరు గాంచినావు*
*వాహనము లాపి నీ గుడి వద్ద నిలిచి*
*తలచుకొని బయల్దేరు చోదకుల గాంచి*
*మేలుజేసెదవమ్మ! మమ్మేలు మమ్మ!*
*కూరిమి వరాలవెల్లి! వల్లూరు తల్లి! (భావ విపంచి: 1996 73,74).* ఈ

భావాలు కవివేనా? లేక కవి అక్కడి ప్రజలతో మమేకమై రాస్తున్నాడా? అనేది తెలియాలంటే పరిశోధన అవసరం! కవి దృక్పథాన్ని నిర్ణయించడానికి తీసుకొనే అనేక ప్రమాణాలను చూడవలసి వస్తుంది. కనుక ఆ విషయాన్ని కాసేపు పక్కన పెడితే, వల్లూరమ్మను కొలిచిన వారు ఈ కవిత్వాన్ని చదివితే మాత్రం కవిత్వంలో గల మాధుర్యాన్ని అనుభవించగలుగుతారు! రామాయణ, భారత, భాగవతాలను నేటికీ నిలిచి ఉండడానికి అందులో '*గ్రంథ తతుల చంద మందు నుండటమే*' కారణమంటారు కవి.

ఇరవయ్యో శతాబ్ది మొదటి రెండు పాదాల్లో జీవించిన కొద్దిమంది దళితకవులపై గాంధీ ప్రభావం తీవ్రంగానే ఉంది. జాన్ కవిపైనా ఉంది. అందుకనే అప్పటికి బాగా వాడుకలో ఉన్న హరిజన అనే పదాన్నే జాన్ కవి ఉపయోగించారు. అప్పటికే గాంధీ ప్రచారం చేస్తున్న హరిజన పదాన్ని డా॥బి.ఆర్. అంబేద్కర్ తీవ్రంగా వ్యతిరేకించినా, ఆ పదం పట్ల కొంతమంది అంగీకారానికి రాలేకపోయారు. అవగాహన ఉండటం, అవగాహన లేకపోవటం, అవగాహన కలిగినా కావాలనే ప్రయోగించటం వంటివెన్నో హరిజన పద ప్రయోగంలో ఉన్నాయి.

అతుకుల బ్రతుకులు ఖండ కావ్య సంపుటి*(1981)*లో తరతరాలుగా అవమానాలతో బతుకీడ్చిన దళితుల గురించి హరిజనాభ్యుదయం ఖండికలో వర్ణిస్తూ...''*అడుగు జాడలు కంట బడకుండ తుడవంగ/తాటాకు మడిమల దాకు నాడు...*''అంటూ వర్ణించిన పద్యంలో దళితులంతా ఆ వర్ణనతో కలిసి పయనిస్తారు. ఆనాడే మాల-మాదిగ అనే పేరుతో రాయకపోయినా వారి వృత్తులతో ఆ బాధలను వర్ణించారు కవి.

*''చేనేత గుడ్డతో మానమ్ము గాపాడి*
*కట్టు బట్టల కెట్లు కష్టపడితివో*
*పాదరక్షలనిచ్చి పాదాల రక్షించి*
*దూరమ్ముగా నెట్లు త్రోయబడితివో...*

అని దళితులు వృత్తి చేయగలుగుతూ, ఆ వృత్తి తమకు ఉపయోగించుకోలేని సమాజ నిర్బంధాలను హృద్యంగా వర్ణించారు. జాన్ కవి హరిజన పదాన్ని ప్రయోగించినా, కవిత్వంలో మాత్రం డా।।బి.ఆర్. అంబేద్కర్ భావాలను సమర్థించటం కనిపిస్తుంది.

కవిత్వంలో ఉండే మాధుర్యాన్ని ముందుగా కవి అనుభవించి, దాన్ని రచనగా సృజనీకరిస్తాడు. రచనగా బయటకొచ్చిన తరువాత పాఠకులు/శ్రోతలను అనుభవానికి గురిచేస్తాడు. అలా అనుభవానికి గురిచేసే రచనా విశిష్టత కవి అభివ్యక్తిలో ఉండే ఒక రహస్యం. ఆ రహస్యం తెలిసిన వాళ్ళు ఎలాంటి వస్తువుని తీసుకున్నా దాన్ని కవిత్వంచేయగలరు.

కొంతకాలం దాన్ని కవిత్వంగానూ చెలామణీ చేయగలరు. అయితే, అది పాఠకులందరికీ మాధుర్యాన్ని ఇవ్వగలుగుతుందా? అనే ప్రశ్న ఉదయిస్తుంది. అంటే కవి వైపునుండీ, పాఠకుల వైపు నుండీ మాధుర్యాన్ని గుర్తించవలసి వస్తుందన్నమాట! దీనికి కారణం అభిరుచి. కొంతమంది వస్తువేదైనా సాహిత్యంగా రూపొందితే దాన్ని చదువుతారు. అది సాహిత్యం కావడం కంటే, వస్తువుని బట్టే చదివే వాళ్ళూ ఉంటారు. వైయక్తిక అభిమానాల వల్ల కూడా ఆయా రచనలను చదివేవాళ్ళుంటారు. కనుకనే కళ ఎవరికోసం అనే వాదం పుట్టుకొచ్చింది. కళ కళకోసమా? కళ ప్రజలకోసమా? ఉభయులకోసమా? అనే కళాతాత్త్విక చర్చలో జాన్ కవి ఉభయుల కోసమనే వర్గానికి చెందుతారు. ఒక సమన్వయవాదిగా కనిపిస్తున్నారు.

జాన్ కవి సరసవినోదిని*(1991)*పేరుతో ప్రచురించిన సమస్యాపూరణ పద్యాలలో కళ కళ కోసమనే దృక్పథం కనిపిస్తుంది. తెలుగులో ప్రాచుర్యం పొందిన అవధాన ప్రక్రియ పండిత, పామరులకు, భావుకులకు, కళా ప్రియులకు వినోదాన్ని కలిగించగలుగుతుంది. కవికి భావుకత, సమయస్ఫూర్తి, పురాణేతిహాస లోకజ్ఞానం, భాషా పటిమ, కవిత్వీకరించే ప్రతిభ వంటివన్నీ సమస్యా పూరణకు అవసరం. ఇదొక పద్యవిద్య. స్వారస్యం తెలిసిన వారు ఆడుకోనే సాహిత్య కేళి! ఆ పద్య భావాన్ని విప్పి చెప్పినప్పుడు పాండిత్యం లేకపోయినా ప్రతి వాళ్ళూ ఆనందించగలిగే కళ!

జాన్ కవిగారు కూడా కొన్ని పద్య పూరణలు చేశారు. ''తనయుడు' భర్త యయ్యె వనితామణి చేసిన పుణ్యమెట్టిదో!'' ఇదొక సమస్య.

పద్య పాదంలో కొడుకే భర్త కావడమనే లోక విరుద్ధమైన భావం స్ఫురిస్తుంది. రాజా ఈడిపస్ నాటకం తెలిసిన వాళ్ళకైతే అలాంటి ఓ విధివంచిత కథ గుర్తుకొస్తుంది. అయినా, అలా భర్త కావడం 'పుణ్యమనడం' ఆ నాటకం చదివిన వారికీ నచ్చదు. మరేమై ఉంటుంది. దాన్నిలా పూరించారు కవి.

*''అనయము బల్లెటూరు తిరుగాడుచు పాడుచు నాల మేపుచున్*
*గొనముల రాశిబోయు నొక గొల్లకులాంగనయైన 'నీల'కున్*
*మనసిజ మోహనుండు సుకుమారుడు శూరుడు నైన 'దేవకీ*
*తనయుడు' భర్తయయ్యె వనితామణి చేసిన పుణ్యమెట్టిదో!''* (సరస వినోదిని:*1991-10*). శ్రీకృష్ణుని అష్ట భార్యలలో నీల ఒకరు. దాన్ని గుర్తుచేసుకున్నాడు కవి. కథా సందర్భాన్ని అల్లగలిగారు. గొల్లపల్లెలో ఆవులను మేపుకొంటూ జీవిస్తున్న 'నీల' అనే యువతిని దేవకీ తనయుడు (శ్రీకృష్ణుడు) ప్రేమించాడు. మరి అలాంటి సరసుడు, ఇష్టుడు, అందగాడు, మంచి వయసులో ఉన్నవాడు సాక్షాత్తూ అవతార పురుషుడుగా భావిస్తున్న శ్రీకృష్ణుడే భర్తగా లభించడం ఆమె చేసుకున్నపుణ్యమే కదా! అని చమత్కారంగా పద్యాన్ని పూరించడంలో సరసులైన వారికి ఆ కవిత్వం మధురం కాక ఏమవుతుంది!

వినోదమే ప్రధానమైన మాధుర్యాన్ని ఇచ్చిన మరొక పద్యపూరణ. ''కుల వాసన నెంచి చూడ ఘుమఘుమలాడెన్'' ఇదీ సమస్య!

నిజానికి సమకాలీన సమాజంలో 'కులం' కొంత మందికి సువాసననే కలిగిస్తుంది. లేకపోతే సమాజంలో కులం ఏనాడో నిర్మూలనమయ్యేది. పద్య పూరణ సమస్య మరొక సామాజిక సమస్య పరిష్కారాన్ని ఆలోచించే దిశగా కాకుండా, చాలా వరకూ వినోద క్రీడగా మార్చడమే అవధానంలో ప్రయోగంగా మారుతుంది. అప్పుడే ఆ కవిత్వంలో మాధుర్యాన్ని ఆస్వాదించగలిగే వాళ్ళున్నారు. జాన్‌కవి గారు వాళ్ళకి అనుగుణంగానే పూరించగలిగారు.

*''కలికీ! నీచేతులలో*
*గల మహాత్మ్యంబదేమొ, కమ్మని వంటల్*
*వలపించెను కరివేపా*
*కులవాసన నెంచి చూడ ఘుమఘుమలాడెన్* (సరసవినోదిని:*1991 36*). వంట చాలా మంది చేసినా, కొంతమంది చేసిన వంటే కమ్మగా, రుచికరంగా ఉంటుంది. ఈ సమస్యను 'కరివేపాకుల వాసన'గా వర్ణించేసి, ఒక సామాజిక సమస్యను వినోదభరితంగా పూరించడంలో కవి శ్రోతలకు ఒక మాధుర్యాన్ని అందించగలిగారు. అందుకే జాన్ కవి కవిత్వం కవి సినారె గుండెను తాకింది. కవి తుమ్మల సీతారామమూర్తికి సత్కవిత్వంగా తోచింది. జాన్ కవి భావానుభూతే కరుణశ్రీ చేత కింది పద్యాన్ని రాయించింది.

''పనస తొనలకన్న పాల మీగడకన్న
మధువుకన్న ముగ్ధ వధువు కన్న
మల్లవరపు కవితమధురాతి మధురమ్ము

''జాను'' తెనుగు మేలి ''జాను తెనుగు'' ఈ పద్యంలో కరుణశ్రీ కూడా జాన్ కవి కవిత్వంలో గల జానుతెనుగుని బట్టే ప్రధానంగా మధురత్వాన్ని గుర్తించగలిగారు. వేమన లోగడే ఇలాంటి ఒక పద్యాన్ని చెప్పారు. ఆ పద్యంలోని పనస తొనలకన్న అనే పదాలతో పద్యాన్ని ప్రారంభించటంలో వేమనను గుర్తుచేస్తున్నారు కరుణశ్రీ! వేమన భాషలో, భావంలో మాధుర్యాన్ని పలికించిన కవి. జాన్ కవి కూడా అలాంటి వారే అనే సూచనను కూడా కరుణశ్రీ పద్యం నుండి గ్రహించే వీలుంది.

ఏది ఏమైనా ఒక రచనను చదవడంలో భిన్న పార్శ్వాలుండడం వల్ల కవితా మాధుర్యాన్నీ భిన్న పార్శ్వాలలో గుర్తించాలి. జాన్ కవిగారికి పాఠకుల మనసుకి ఆహ్లాదం కలిగించడంలో మాధుర్యం ఉంది. ఆయన పద్యాన్ని చదువుతుంటే, వినే శ్రోతకు శ్రవణత్వంలో మాధుర్యం కలిగింది. ప్రశంస పద్యాలలో ఉభయగత మాధుర్యం ఒలికింది. ఈ కవి కవిత్వ మాధుర్యం, శైలిలో ఉంది. వస్తువులో ఉంది. సామరస్య వాతావరణాన్ని వాంఛించడంలో ఉంది. అన్నింటికీ మించి సహృదయతలో ఉంది. ఆలంకారికులు చెప్పిన మాధుర్య గుణాన్ని మించిన లక్షణాలతో శోభిస్తుంది. ఈ సైద్ధాంతిక నేపథ్యంతో మల్లవరపు జాన్ కవిగారి కవిత్వంలో గల మాధుర్యాన్ని సమాజ, సాహిత్య కోణాల నుండి అర్థంచేసుకోవలసి ఉంది.

**ఆధార గ్రంథాలు:**


జాన్‌కవి, మల్లవరపు రచనలు.

సూర్యనారాయణ శాస్త్రి, సన్నిధానం (వివరణ కర్త), రామరాజ భూషణుడు (గ్రంథ కర్త). *కావ్యాలంకార సంగ్రహము.* సికింద్రాబాదు: యం. శేషాచలం అండ్ కంపెనీ, (ప్ర.ము. 1945) ఐదవ ముద్రణ 1976.


***

# వెంటాడిన అవమానం (కథ): దళిత వాస్తవిక జీవితం

సమాజం వ్యక్తుల సమూహం. వ్యక్తుల మధ్య వైరుధ్యాలుంటాయి. భారతీయ సమాజంలో వ్యక్తుల మధ్య ఏర్పడే వైరుధ్యాల్లో 'కులం' ఒక అనివార్య సందర్భం అయిపోయింది. క్రమానుగతి (Heirarchy), వేరుగా ఉండటం (Seperation), పరస్పర ఆధారం (Inter dependence) వంటి సూత్రాల ఆధారంగా కులం నిర్మితమవుతుంది (సమాజ శాస్త్ర సూత్రాలు, సం// ఆచార్య వై.సి. సింహాద్రి, ఆచార్య జి. సత్యనారాయణ). ఒకే మూలపురుషుడు కలిగి, ఒకే అనువంశిక వృత్తిని పాటిస్తూ అంతర్వివాహాలు చేసుకొంటూ ఒకే పేరుతో చెలామణి అయ్యే కుటుంబాల లేదా బంధుత్వ సమూహాల స్వాధర్మ్య సమూహాన్ని 'కులం' అని సామాజిక శాస్త్రవేత్తలు నిర్వచించారు.

కులం వ్యక్తులకు శుద్ధి (Purity), అశుద్ధి (Pollution) అనే గుణాలను ఆపాదిస్తుంది. 'తెగ' (Tribe)కీ, కులానికీ (Caste) కొన్ని లక్షణాల్లో సమాన ధర్మం ఉన్నా, 'కులం'లో అశుద్ధి, అపవిత్రత వంశపారంపర్యం అయి అది వారిని శాశ్వతంగా అస్పృశ్యులను చేస్తుంది. 'అస్పృశ్యత' అనేది భౌతికమైనది, మానసికమైనది కూడా. వివిధ పనులు చేయటం వల్ల ఏర్పడేది. దీన్ని 'సంస్కారాల' రూపంలో తొలగించుకొనే అవకాశం ఉంది. కానీ, మానసికంగా ఏర్పడిన 'భావం' అలాగే ఉండిపోయి 'అస్పృశ్యత' కొందరికి 'అవమానం'గా పరిణమిస్తుంది. అది జీవితాంతం వేటాడుతుంది. వంశ పారం పర్యంగా వెంటాడుతుంది.

కాసుల ప్రతాపరెడ్డి 'వెంటాడిన అవమానం' పేరుతో ఒక కథ రాశారు. ఒక వాస్తవాన్ని తెలిపేది ఈ కథ. దళితుడికి జరిగే అవమానాన్ని, సామాజిక ఉన్నత అంతస్తు (Ascribed status)లో ఉన్నవాళ్లు సామాజికంగా నిమ్న అంతస్తు (Lowest Social Status)లో ఉన్న వారిని తమతో సమానంగా చూడటానికి ప్రయత్నిస్తే ఎదురయ్యే ఆటంకాల్ని ఈ కథలో వర్ణించారు. దళితుల్ని, దళితేతరుల్ని ఆలోచింపజేసే అనుభూతి ఐక్యత (Unity of Impression) గల కథ ఇది. అనుభూతి ఐక్యతను మంచి కథ కుండే లక్షణాల్లో ఒకటిగా వల్లంపాటి వెంకట సుబ్బయ్య పేర్కొన్నారు. 'అనుభూతి' అనే పదాన్ని కథ పాఠకునిలో కలగజేసే భావ ప్రకంపనగా అర్థం చేసుకోవాలని ఆయన అన్నారు.

ప్రశాంత్ రెడ్డి ఓ జర్నలిస్ట్. ఉద్యోగరిత్యా తన భార్యతోపాటు ఊరు నుండి వచ్చేసి, హైదరాబాద్‌లో ఉంటాడు. వీళ్ళని చూడ్డానికి ప్రశాంత్ రెడ్డి తల్లి లక్ష్మమ్మ వస్తుంది. ఆ రోజు ఎందుకో తల్లిని తొందరగా తన సొంత ఊరికి పంపేయాలనుకుంటాడు. అతని

అంతరంగం అతని భార్యకే తెలియదు. అత్తగారిని ఇంకొన్ని రోజులు ఉండమంటుంది. ఆ మాటనే అతన్ని కూడా చెప్పమంటుంది. ఆ మాటను పట్టించుకోకుండా ఆఫీసుకి వెళ్తున్నాననీ, ఎండ ముదరక ముందే బయలు దేరమనీ తల్లికి చెప్పి ఓ వంద రూపాయిలు చేతిలో పెట్టేస్తాడు. తన తల్లి తన ఇంట్లో ఉండటం తనకి ఇష్టం లేకనో, ప్రేమలేకనో కాదు, దానికి ఓ కారణం ఉంది.

సాయత్రం రాహుల్ వస్తానని చెపుతాడు. రాహుల్ తన ఊరివాడే. తనతో పాటు ఒకే బడిలో చదివినవాడు. ఊరవతల గుట్టల మీద గంటలు గంటలు కూర్చొని మాట్లాడిన మిత్రుడు. మాదిగ కులంలో పుట్టినవాడు. 'ఎల్లయ్య' అనే పేరుని 'రాహుల్'గా మార్చుకున్నవాడు. బాగా చదువుకొని, హైదారాబాదులోనే ఓ ఉద్యమంలో పనిచేస్తూ, ఈ మధ్యకాలంలో తనకి మళ్లీ దగ్గరయినాడు. అతడిని తాను ఎన్నోసార్లు భోజనానికి పిలిచేవాడు. తర్వాత వస్తాననేవాడు. ఈ రోజు వస్తానన్నాడు. అదీ తల్లిని పంపించడానికి ప్రశాంత్ రెడ్డిని తొందర పెట్టడంలోని ఆంతర్యం.

తన భార్య వీణతో మాట్లాడేటప్పుడు, అప్పుడప్పుడూ రాహుల్ ప్రస్తావన వస్తుండేది. ఆమెకి కూడా రాహుల్ పట్ల జాలీ, సానుభూతీ ఏర్పడిందని ప్రశాంత్ రెడ్డికి అనిపిస్తుండేది. ఆ ధైర్యంతోనే రాహుల్ భోజనానికి రమ్మని పిలిచేవాడు. రాహుల్ వస్తున్నందున తన తల్లి ఇంటివద్ద లేకుంటే చాలు అనుకుంటాడు ప్రశాంత్ రెడ్డి ఆఫీసు నుండి ఇంటికి వస్తూ. తన భార్య తనను అర్థం చేసుకుంటుందని అనుకుంటాడు. అయితే ''నీకు బుద్ధి లేదు కాబట్టే మాదిగోడికి మన కంచంలో తిండి పెడతానంటున్నావు'' అంటుంది భార్య వీణ, ''అడ్డమైన వాళ్లకి వండి పెట్టన''ంటుంది. వండి పెడితే ఊరుకోనంటుంది. ఇప్పుడేమి చేయాలి? తన భార్యతో ఘర్షణ తప్పదా? తప్పలేదు.

రాత్రి ఏడున్నర తర్వాత వస్తాడు రాహుల్. వచ్చిరాగానే ''అక్క కనిపించడం లేదేమిటి?'' అని అడుగుతాడు. ''జర్వం వచ్చింది. పడుకుంది'' అని ప్రశాంత్ రెడ్డి సమాధానం చెప్తాడు. ''అయ్యో డాక్టర్‌కి చూపించావా'' అంటాడు రాహుల్. తలూపుతాడు. ఆ తర్వాత కాసేపటికి ''హోటల్‌కెళ్లాం పద'' అంటాడు ప్రశాంత్ రెడ్డి. చెప్పటం మరిచాను దారిలో పాత ఫ్రెండ్ ఒకతను కలిసి బలవంతంగా వాళ్ళింటికి తీసుకెళ్ళాడు. భోజనం చేసిందాకా ఊరుకోలేదు. అందుకే రావటం ఆలస్యమైంది'' అని రాహుల్ చెప్తాడు. ప్రశాంత్ రెడ్డికి ఏం మాట్లాడాలో పాలు పోలేదు. ''సారీ'' అని మాత్రం అనగలుగుతాడు. రాహుల్ చేతిని దగ్గరగా తీసుకొని ప్రేమగా నొక్కుతాడు. ''ఎందుకింత ఇదయిపోతావు. మరోసారి తప్పకుండా అక్క చేతి వంట తింటా కదా!'' అంటూ, తనకేమీ జరగనట్లే కాసేపు ఉండి, బయలుదేరుతాడు. అతనితోపాటు బయటిదాకా వచ్చి, ప్రశాంత్ రెడ్డి సాగనంపేస్తూ రాహుల్ ఓ వ్యాసంలో రాసిన వ్యాక్యాల్ని గుర్తు చేసుకుంటూ అతను వెళ్లే దారిని చూస్తూ, నిలబడిపోతాడు. ఇదీ కథా సారాంశం. దీన్ని కింది విధంగా వస్తు శిల్పాలపరంగా విశ్లేషించే అవకాశం ఉంది.

**దళిత వాస్తవిక జీవిత చిత్రణ:**

అంటరానితనం, సాంఘిక అణచివేత, ఆర్థిక పీడన, రాజకీయ అణచివేత, మనుషులుగా పరిగణింపబడక పోవటం, పశువుల కన్నా హీనంగా చూడబడటాన్ని ''దళిత వాస్తవికత'' అని డా|| ఎస్వీ సత్యనారాయణ అభిప్రాయం. కట్టు బాట్లు, నమ్మకాలు వంటివి దళితేతరుల జీవిత వాస్తవికతగా కూడా ఆయనే వివరించారు.

వల్లంపాటి వెంకటసుబ్బయ్య కథకు 'జీవితం ముడి సరకు' అవుతుందని అంటారు. ''కథా వస్తువు రచయిత జీవితంలో నుంచి కానీ లేదా రచయితకు తెలిసిన ఇతరుల జీవితంలో నుంచి కానీ పుట్టవచ్చు'' అనీ, కథలోని జీవితానికీ ప్రాతినిధ్యం వహించగల పాత్రల్ని అదే జీవితానికి ప్రాతినిధ్యం వహించ గలిగిన సంఘటనల్లో పెట్టి వాటి అంతరంగ, బహిరంగ జీవితాలనూ, వాటి మధ్య ఉన్న సంబంధాన్నీ లేదా వైరుధ్యాన్నీ చిత్రించటమే వాస్తవిక కథనం'' అవుతుందన్నారు. అలాగే ''పాత్ర మానసిక జీవితానికీ, భౌతిక జీవితానికీ మధ్య ఉన్న సంబంధాన్నీ లేదా వైరుధ్యాన్నీ చిత్రించటమే నిజమైన వాస్తవికతా వాదం అవుతుందని చెప్పారు.

ఈ అభిప్రాయాలతో పరిశీలించినా, ఈ ''వెంటాడే అవమానం'' వాస్తవిక దళిత జీవితం ప్రతిఫలించే కథే అవుతుంది. మారుతున్న సామాజిక పరిస్థితుల వల్ల, విద్యా ఉద్యోగ అవసరాల వల్ల దళిత, దళితేతరుల మధ్య సంబంధాలు ఏర్పడుతున్నాయి. అయితే, ఈ బంధం అవసరార్థం ఏర్పడుతున్న మానవ సంబంధాలుగా కొనసాగుతున్నాయి తప్ప, భౌతిక, మానసిక ఆంతరాల్లో భేదాలు తొలగించుకుని కలిసిపోయే మానవ సంబంధాలు కాలేకపోతున్నాయి. దీనివల్ల దళితుల పట్ల జాలి, సానుభూతి, అర్థం చేసుకున్న పరిస్థితే ఒక వ్యక్తికి కలిగినా, ఆ వ్యక్తికి కుటుంబంతో, సంఘంతో, సమాజంతో ఉన్న, కొనసాగవలసిన పటిష్ట బంధానికి ఆటంకాలవుతూ, నేటికీ, వాస్తవికంగా ఈ కథలోని ఇతివృత్తం కనిపిస్తుంది. అందుకనే ఈ ''వెంటాడే అవమానం'' కథలో దళిత, దళితేతరుల మధ్య, కథా పాత్రల మధ్య ''అనుభూతి ఐక్యత'' (Unity of impression) అనే కథకుండే గొప్ప లక్షణం కనిపిస్తుంది. అంతేకాదు, కథా విమర్శకులు ఆశించినట్లు కథలో సంఘర్షణ ఉంది.'' ఇద్దరు వ్యక్తుల మధ్యా, ఒకే వ్యక్తిలోని రెండు అంశాల మధ్యా, రెండు భావాల మధ్యా, రెండు వర్గాల మధ్యా, రెండు సిద్ధాంతాల మధ్యా, రెండు జీవిత దృక్పథాల మధ్యా...'' ఇలా ఎన్నిటి మధ్యనైనా సంఘర్షణ ఉండాలని విమర్శకులు అంటుంటారు.

1. దళితులు - దళితేతరుల మధ్య సాంఘిక అసమానత సంఘర్షణ.

2. కలిసి మెలిసి జీవించే విషయంలో సాంస్కృతిక సంఘర్షణ ఇది సైద్ధాంతిక సంఘర్షణలో ఒక పార్శ్వం.

3. దళితులు - దళితేతరులూ కలిసి మెలిసి జీవిస్తే భౌతిక, భావ వాద సిద్ధాంతాలలో వారు దీన్ని అనుసరించి జీవించటంలో నిర్ణయించుకునే సంఘర్షణ.

ఈ కథలో ప్రశాంత్ రెడ్డికీ, కుటుంబంలోని తల్లీ భార్యలకీ మధ్య సైద్ధాంతిక, సాంస్కృతిక ఘర్షణ కనిపిస్తుంది. అది వీణ ప్రశాంత్ రెడ్డిల సంభాషణల్లో వ్యక్తమైంది.

దీనివల్ల వీణలో భావ వాదం గత జీవితానుభవం వల్ల వచ్చింది. రాహుల్ జీవితంలో భౌతిక వాదం కనిపించటానికి గతానుభవాలే కారణమవుతున్నా, పూర్తిగా భౌతిక వాదిగా కనిపించకపోయినా కత్తి పద్మారావు వంటివారు అంబేద్కర్ ఆలోచనా విధానంగా ప్రచారం చేస్తున్న 'ప్రత్యామ్నాయ సంస్కృతి'లో భాగంగానే హిందూ సమాజంలో కనిపించే 'ఎల్లయ్య' అనే పేరును తల్లిదండ్రులు పెడితే, రాహుల్‌గా తన పేరు మార్చుకుంటాడు. 'రాహుల్' అనేది అంబేద్కర్ నమ్మిన బౌద్ధానికి సంబంధించినది. కుల నిర్మూలనకు బౌద్ధ దీక్షను తీసుకుంటాడు అంబేద్కర్. ఇవన్నీ దళితుల ప్రత్యామ్నాయ సంస్కృతికి జరిగే ప్రయత్నాల్లో కొన్ని.

''సాధారణంగా నిత్య జీవితానికి పాత్ర ఎంత దగ్గరగా ఉంటే అంత నమ్మకం కుదురుతుంది. మార్పు లేకుండా ఉండటం (Consistency) కథలోని పాత్రలకు ఉండవలసిన మొదటి లక్షణం'' అంటారు వల్లంపాటి వెంకట సుబ్బయ్య. ఈ కథలో ప్రశాంత్ రెడ్డికి భయపడో, అతను సర్దిచెప్పడం వల్లనో వీణ మనస్తత్వం మారిపోతే కథలో సంఘర్షణ బయటికి రాదు. అప్పుడు కథ పేలవం అయిపోతుంది. వీణ మారలేదు. చివరివరకూ ఒకే సైద్ధాంతిక దృక్పథానికి కట్టుబడి ఉండటం వల్లనే కథలో రచయిత చెప్పదలచిన 'సమస్య' గురించి, పరిష్కారం గురించి పాఠకుడు లోతుగా ఆలోచిస్తాడు. ఇదే కథకి ప్రాణం వంటిది. కథలో ఒక నేపథ్యం చిత్రితమవుతుంది. స్థల (Place), కాలాల (Time) చిత్రణే కథా సాహిత్యంలో నేపథ్య (Setting) చిత్రణ అవుతుంది. దీన్ని బట్టే రచయిత చిత్రించిన ''సమస్య'' తీవ్రత అర్థమవుతుంది.

**కథా నేపథ్య చిత్రణ  సమస్య తీవ్రత:**

ఒక్క రోజులో ఈ కథ జరిగినట్లు రచయిత వర్ణించారు. ఒక్క రోజులో కులనిర్మూలన, అస్పృశ్యతా నిర్మూలన అనేవి జరిగేవి కాదు. పొద్దున్నే ప్రశాంత్ రెడ్డి స్నానం చేయడానికి వెళ్తుండగా ప్రారంభమైన కథ రాత్రికి ముగిసింది. కథలో పగలు అంతా ఉన్నది తానూ, తన భార్య, తన తల్లి. చీకటిలో వచ్చి, ఒంటరిగా చీకటిలోనే కలిసిపోయినవాడు రాహుల్. తాను అనుభవిస్తున్న వెలుగుని, తన తోటి వారికీ పంచాలనో, అందుకోవాలనో ఆశించటం వల్లనే ''రాహుల్''తో కాసేపయినా చీకటిలో ప్రశాంత్ రెడ్డి నిలబడ్డాడు. వెలుతురు కోసం చీకటిలో కలిసినవాడి కోసం చూస్తూ నిలబడ్డాడు.

ఈ కథలో వెలుతురు ఉండగా కనిపించిన పాత్రలు మూడు. చీకటిలో వచ్చి చీకటిలోనే వెళ్ళిపోయిన పాత్ర ఒకటి. మూడింటిలో ఒక వర్గం, ఒంటరివాడితో కలవాలంటే, తాను తన వ్యవస్థ నుండి బయటకు వచ్చేయాలి. అప్పుడు రెండు వేరువేరు సమాజాలవుతాయి తప్ప మూడు + ఒకటి కలిసిన నాలుగు పాత్రలు కలిసిన సమాజం కాదు. రాహుల్‌లో ఆశావాహంగా ''అక్క చేతి వంట తప్పకుండా మరోసారి తింటా'' అని అనడంలో తాత్కాలికంగా అవమానం వెంటాడినా, దాన్ని జయించి, అందరిలో కలిసే రోజు వస్తుందనే ఆకాంక్ష కనిపిస్తుంది. దానికి ఏమి చేయాలని ఆలోచించటమే ప్రశాంత్ రెడ్డి మనసులో రాహుల్ రాసిన వ్యాసంలో వాక్యాల్ని గుర్తు చేస్తుకొంటూ నిలబడటం.

**సమస్య తీవ్రతకు కారణం అస్పృశ్యత:**

భారతదేశంలో కులం అస్పృశ్యతలో అంతర్భాగం అయిపోయింది. ''అస్పృశ్యత'' అనేది భౌతిక, మానసికమైన మైల (Impurity) వల్ల ప్రపంచ దేశాల్లో ఉందని ''అస్పృశ్యులెవరు?'' అనే గ్రంథంలో డా।। బి. ఆర్. అంబేద్కర్ పరిశోధనాత్మకంగా చర్చించారు. ''అశుచి, మైల, కళంకం, అపవిత్రత, అంటు, అపరిశుభ్రత, మురికి అనే భావాలు అస్పృశ్యతకు దారితీస్తాయనీ, ఈ కళంకం నుండి తప్పించుకుని బయట పడే మార్గాలు కూడా ఈ భావనలో ఇమిడి ఉంటాయని'' డా।। బి. ఆర్. అంబేద్కర్ భావించారు.

''ఆదిమ సమాజం కేవలం మైల (Pollution) పడడం అనే భావన పట్ల నమ్మకం కలిగి ఉండటమే కాదు, నిర్దిష్టమైన కర్మ కాండలు, ఆచార్య వ్యవహారాలు అనుసరించే ఒక జీవన విధానం ఆవిర్భావానికి కూడా ఈ అస్పృశ్యత అనే భావన దారితీసింది'' అని వివరించారు. వస్తువుల్ని తాకడం ద్వారా సంక్రమించే 'మైల' విషయానికొస్తే, ఆదిమ మానవుడు కొన్ని వస్తువుల్ని పవిత్రమైనవిగా, మరికొన్ని అపవిత్రమైనవిగా పరిగణించటం అలవర్చుకున్నాడు. ''పవిత్రత'' అనే భావన కేవలం వస్తువులకు మాత్రమే తప్పనిసరిగా పరిమితం కానక్కరలేదు. కొన్ని తరగతుల మనుషులు కూడా పవిత్రులుగా పరిగణించబడ్డారు. పోలినేషియన్ తెగల్లో, 'ఉగాండా' దేవాలయంలో, దక్షిణాఫ్రికా, న్యూజిలాండ్, ఈజిప్టు, గ్రీకు, రోమన్‌లలో కూడా మైల పడటం అనే భావన ఉన్నట్లు అంబేద్కర్ వివరించారు. ఈ మైల భౌతికమైనది గానూ, భావనాత్మకం (నమ్మకం) గానూ ఉంటుందని మనువు చెప్పిన అంశాన్నీ అంబేద్కర్ పేర్కొన్నారు.

'మైల' నుండి కొంత మంది మాత్రమే సంస్కారాల రూపంలో తొలగించుకోవచ్చు అనే నిబంధనలను భారత దేశంలో పటిష్ఠంగా అమలు చేశారు. హిందువులు పాటించే మరొక రకమైన అస్పృశ్యత ఉన్నది. ఇది కొన్ని జాతులకు వంశపారంపర్యంగా సంక్రమిస్తుంది. 1935 భారత ప్రభుత్వ చట్టం జారీ చేసిన ప్రభుత్వ ఉత్తర్వుల్లోనే 9 భాగాలుగా విభజించి, ''మైల'' పడే కులాల వాళ్ళగా 50 నుండి 60 మిలియన్ల ప్రజలు ఉన్నారనీ, సుమారు 429 అస్పృశ్య కులాలు ప్రభావితం అవుతున్నాయనీ అంబేద్కర్ సోదాహరణంగా నిరూపించారు.

ఈ వివరణలవల్ల ''అస్పృశ్యత'' అనేక దేశాల్లో ఉన్నా భారత దేశంలో కులంతో మిళితమైందని స్పష్టమవుతుంది. అంతే కాకుండా భౌతిక, మానసిక భావనగా గాఢమైన ముద్రను కలిగిస్తుంది. ఇది స్త్రీలలో మరింత గాఢంగా ముద్రింపబడటానికి పురుషుల వలె కాకుండా బయటి ప్రపంచంతో కంటే, ఇంటిలో, కొన్ని కుటుంబాల్లోనే ఎక్కువగా ఉండిపోవటం ఒక కారణమని ఆచార్య పరిమి రామనరసింహం అభిప్రాయపడటంలో లోతైన పరిశీలన ఉందనిపిస్తుంది. (ఈ కథపై జరిగిన చర్చల్లో ఆయన వ్యక్తం చేసిన అభిప్రాయం)

కనుకనే 'వెంటాడే అవమానం' కథలో ఊరికి తల్లిని త్వరగా పంపేయటం, తల్లి ఉంటే ఊరులోనూ తెలిసి పోతుందని భయపడటం, తన భార్యలో ఆ భావాలు స్పష్టంగా ప్రకటితం కావటం అనే నేపథ్య చిత్రణ కథలో సమస్య తీవ్రతను చూపుతున్నాయి. ప్రశాంత్ రెడ్డి ''స్నానానికి'' వెళ్ళటం, దళితుల్లో కలిసి పోవాలనుకోవడానికో, దళితుల్ని తమతో కలిసి పోమనటానికో ఒక సంస్కరణగా తరతరాల అస్పృశ్యతను తొలగించుకునే ప్రయత్నాన్ని రచయిత వర్ణించారు.

ప్రశాంత్ రెడ్డి భార్య ''అంట్లు తోమటం, కడగటం''లో కూడా ఆమెలో భౌతికంగా, మానసికంగా రావాల్సిన మార్పుని ప్రతీకాత్మకంగా పాత్ర చిత్రణ, సన్నివేశ కల్పనల్లో రచయిత బంధించగలిగారు. కథలోని సమస్య సంఘర్షణకు పరిష్కారాన్ని ''తప్పకుండా చూపించాలి అనికానీ, లేదా చూపించకూడదు అని కానీ, వాదించటం మొరటు వాద పరిష్కారం కథలో నుంచే సహజంగా రూపొందాలి. పరిష్కారాన్ని బలవంతంగా కథమీద రుద్దటం శిల్పపరంగా బాధ్యతారాహిత్యం మాత్రమే'' అని వల్లంపాటి వెంకటసుబ్బయ్య అన్నారు. అయితే ముగింపు గురించి ప్రస్తావిస్తూ.. ''కథ రాయటం పూర్తి చేశాక ప్రారంభాన్నీ, ముగింపునీ తీసెయ్యాలనీ, అంటే వాటిని అదృశ్యంగా ఉంచాలనీ, వాటిని పాఠకుని ఊహాశక్తికి వదిలి పెట్టాలనీ'' అని కూడా ఆయన అన్నారు. దీనికి 'వెంటాడిన అవమానం' కథ సరిగ్గా అతుకుతుంది.

**కథకుడిచ్చిన పరిష్కారం:**

'వెంటాడే అవమానం' కథలో పరిష్కారం వాచంగా చెప్పలేదు. అయితే అదృశ్యంగా మంచి నైపుణ్యంతో ముగింపును అందించారు. పాఠకుని ఊహాశక్తిని బట్టే ''పరిష్కారాలు'' వెలువడాలనీ ఆకాంక్షించారు.

''అస్పృశ్యత''గా పరిణమించి, భౌతికంగా, మానసికంగా వ్యక్తుల మధ్య అంతరాలకు కారణమవుతున్న ఈ సమస్యను పరిష్కరించుకోవటం దళిత - దళితేతరుల మధ్యే ఉంది. అది ప్రత్యామ్నాయ సంస్కృతా? సాంస్కృతీకీకరణా? లేక రెండింటినీ మించిన ఉదాత్త జీవన విధానమా? అనేది అందరూ కలిసి ఉండే ఆలోచనను దళిత, దళితేతర మేధావాలు చేయగలగాలి. అది భావ, భౌతిక వాదాల కలయికతో ఏర్పడేదై ఉండాలి. ''అస్పృశ్యత'' అనే భావన తొలిగిపోయిన తర్వాత భావ, భౌతిక వాదాల సంఘర్షణలో ఏదో ఒకటి లేదా కొత్త శక్తి పుట్టి అందరినీ కలిసి మెలిసేటట్లు చేయగలుగుతుంది.

'వెంటాడిన అవమానం' కథలో రచయిత కాసుల ప్రతాపరెడ్డి తరతరాలుగా ఉన్న అనేక రకాలైన ''అస్పృశ్యత''లకు సంబంధించిన భౌతిక, మానసిక భావనల్ని స్పర్శించారు. అలాంటి ''అస్పృశ్యత'' కొన్ని వందల సంవత్సరాలుగా ''కులం''లో కలిసిపోయింది. అంబేద్కర్ కూడా భౌతిక, భావవాదాల కలయికగా ''అస్పృశత'' భావనను చూడగలిగి, భౌతిక దృష్టి వైపు పయనించమనే ఆలోచనను అందించారు. భావ వాదం, అదీ భారత దేశంలో మతం, కర్మ కాండలు, నమ్మకాలతో ముడిపడి ఉండటం వల్ల, ఆ వాదాన్ని నమ్మేవాళ్ళు, ఆచరించే వాళ్ళు, ప్రోత్సహించే వాళ్ళ

సంఖ్య అధికంగా ఉంది. అందువల్ల ''భావవాదం'' మాసిపోవటమో, రూపుమాపటమో సులభమైన మార్గమైతే అంత దగ్గరలో లేదు.

శాస్త్ర, సాంకేతిక రంగాలు బాగా అభివృద్ధి చెందాలి. శాస్త్రీయ దృక్పథం అలవడాలి. సాంఘికీకరణ ప్రక్రియలు శాస్త్రీయ కోణంలో అమలు జరగగలగాలి. శాస్త్రీయంగా బుజువుకానివీ ఎన్నో ఉన్నాయి. శాస్త్రానికి అందని వాటిని శాస్త్రీయంగా నిరూపించటానికి కేవలం ఇప్పుడున్న పరిశోధనల మీదనే ఆధారపడితే సరిపోని పరిస్థితులూ ఉన్నాయి. అలాంటి పరిస్థితులు రావాలని కథలోని ప్రశాంత్ రెడ్డి ఎదురు చూస్తున్నట్లే, అవమాన చీకటితో పోరాటానికో, కలిసిపోవటానికో వెళ్ళిన రాహుల్ కోసం నిరీక్షించటమే మనమిప్పుడు చేయగలిగింది.

**ఆధార గ్రంథాలు:**


అంబేద్కర్, బి.ఆర్. *అస్పృశ్యులెవరు?* అనువాదం, సంపాదకులు లక్ష్మీనారాయణ, గంగిశెట్టి. తదితరులు, బాబా సాహెబ్ అంబేద్కర్ రచనలు ప్రసంగాలు, సంపుటి-7, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ, 1992.

ప్రతాపరెడ్డి, కాసుల. *వెంటాడే అవమానం (కథ).* ఈనాటి ఏకలవ్య సాహిత్య, సాంస్కృతిక ప్రత్యేక సంచిక, 1997.

వెంకట సుబ్బయ్య, వల్లంపాటి. *కథాశిల్పం.* హైదరాబాదు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 2000.

సత్యనారాయణ, ఎస్.వి. *దళిత సాహిత్య నేపథ్యం (వ్యాసం).* ఈనాటి ఏకలవ్య సాహిత్య, సాంస్కృతిక ప్రత్యేక సంచిక, 1997.

సింహాద్రి, వై.సి., సత్యనారాయణ, జి. (సంపా) సమాజ శాస్త్ర సూత్రాలు. హైదరాబాదు: డా।। బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వ విద్యాలయం ప్రచురణ, 2003.


***

# దళిత సాహిత్యం - మౌలిక భావనలు

సమాజం వైరుధ్యాలమయం. అది సంఘర్షణలతో పరిణామ స్వభావాన్ని కలిగి ఉంటుంది. ఆదిమ సమాజం దశ నుండి ఆధునిక సమాజం వరకూ ఈ అంతరాలు కొనసాగుతూనే ఉన్నాయి. మత, వర్గ, వర్ణ, భాష, ప్రాంతీయ, లింగ భేదాల వల్ల మానవుల మధ్య సంఘర్షణ అనివార్యమవుతుంది. సవ్యదశలో జరిగే సంఘర్షణల వల్ల సమాజంలో కొత్త పరిణామాలు సంభవిస్తున్నాయి. తెలుగు సాహిత్యంలోనూ ఇటువంటి పరిణామాలు వర్ణితమవుతున్నాయి. సంప్రదాయ, అభ్యుదయ, దిగంబర, విప్లవ, స్త్రీ వాద సాహిత్య ధోరణులకు ఆ సమాజ పరిణామాలే ప్రధాన కారణాలయ్యాయి. అలాంటి నేపథ్యం నుండే దళిత సాహిత్యం కూడా ఆవిర్భవించింది. దళిత సాహిత్య ఆవిర్భావంతో తెలుగులో సాహిత్య విస్తృతి పెరిగింది.

భారతీయ సమాజంలో ప్రత్యేకంగా కనిపించే వర్ణ వ్యవస్థ, కుల వ్యవస్థగా రూపాంతరం చెందటం, ఆ కులాన్ని ఆశ్రయించుకొని వృత్తులు, ఆ వృత్తులు వంశ పారంపర్యం కావటం, దానివల్ల వల్ల కొన్ని వృత్తులవారికే సామాజిక గౌరవం ఆపాదింపబడటం వల్ల దళితులు ఆత్మన్యూనతకు గురి కావలసిన పరిస్థితులు ఏర్పడ్డాయి. వివిధ సామాజిక ఉద్యమాల వల్ల వచ్చిన మార్పుల ఫలితంగా, ప్రభుత్వం చేపట్టిన ప్రత్యేక చర్యల వల్ల దళితులు కూడా విద్యావకాశాలను పొందగలుగుతున్నారు. ఉద్యోగ రంగాల్లో ప్రవేశించగలుగుతున్నారు. వృత్తులు మారడంతో ఆర్థిక స్థితిగతుల్లోనూ మార్పులు స్పష్టంగా కనిపిస్తునాయి. ఫలితంగా 'సంస్కృతి'లోనూ అనూహ్యమైన మార్పులు సంభవిస్తున్నాయి. ఆత్మన్యూనత నుండి ఆత్మగౌరవం ప్రకటించే స్థాయికి దళితులు ఎదుగుతున్నారు. ఇవన్నీ దళితులు, దళితేతరులు రాస్తున్న వివిధ సాహిత్య ప్రక్రియల వల్ల స్పష్టమవుతున్నాయి.

**దళితులు దళిత సాహిత్యం:**

భారతీయ సమాజంలో చాతుర్వర్ణ వ్యవస్థ కొనసాగింది. దాన్ని అనుసరించి కులవ్యవస్థ రూపొందింది. ప్రధానంగా కుల వివక్షను ఆధారం చేసుకొనే దళితులను, దళిత సాహిత్యాన్ని సాహితీవేత్తలు గుర్తిస్తున్నారు. ఈ నేపథ్యంలో దళితులు, దళిత సాహిత్యం అనే మౌలిక విషయాల పట్ల విస్తృతమైన చర్చ జరిగింది.

**దళితులు:**

నిఘంటువుల్లో 'దళితము' అనే శబ్దానికి 'ఖండింపబడినది, ఛేదింపబడినది, వికసించినది' అనే అర్థాలు కనిపిస్తున్నాయి. ''Dalit'' అంటే Broken or reduced to pieces generally అని ఆంగ్ల నిఘంటువులు వివరిస్తున్నాయి.

అస్పృశ్యత కారణంగా సమాజం నుండి 'విడగొట్టబడిన' వారనే అర్థంలోనే సాహితీవేత్తలు దళితులను వివరిస్తున్నారు. ప్రత్యేకించి ఒక్క కులం లేదా కొన్ని

కులాలకు మాత్రమే పరిమితం చేసుకొని దళిత శబ్దాన్ని ఉపయోగించటం సరికాదనే వాదనలు కూడా ఉన్నాయి.

1) సామాజిక వ్యవస్థలో సరైన స్థానం లభించని, వివక్షకు గురవుతున్న వారందరికీ 'దళిత' శబ్దం వర్తిస్తుంది.

2) శతాబ్దాల తరబడి జరిగిన పోరాటంలో వ్యక్తమైన ఆత్మ గౌరవ నినాదం 'దళిత'.

3) మతాన్ని ఆధారం చేసుకొని ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాల్లో జరిగే వివక్షను ప్రశ్నించే శబ్దం 'దళిత'.

4) సమాజంలో నిమ్నస్థాయిలో బతుకీడుస్తూ, ఆ కష్టాల నుండి బయట పడటానికి శాస్త్ర విజ్ఞానాన్ని విశ్వసిస్తూ, హేతువాద భావనా బలంతో పోరాడుతూ, అస్తిత్వం కోసం నిత్యం ప్రయత్నించే వారికి ప్రాతినిధ్యం వహించే శబ్దం 'దళిత'.

5) దేవుడు, విధి, స్వర్గ-నరకాలు: జన్మ-పునర్జన్మ: ఆత్మ- అంతరాత్మ: అదృష్టం దురదృష్టం వంటి భావనలన్నీ దళితులను బానిసలుగా మారుస్తున్నాయని భావిస్తూ నాస్తికత్వం, హేతువాద భావాలతో మానవతావాదాన్ని బలపరుస్తూ సామాజిక విముక్తిని ఆశించే విస్తృత పరిధిగల శబ్దం 'దళిత'.

ఇలా 'దళిత' శబ్దం గురించి రచయితలు భిన్న కోణాల్లో వివరించారు. అయితే, 1971న బొంబాయి నుండి వెలువడిన మరాఠీ 'దళిత పాంథర్స్ మ్యానిఫెస్టో' దళిత శబ్దాన్ని కింది విధంగా వివరించింది.

"Who is Dalit?

Members of scheduled castes and tribes, Neo - Buddhists, the working people, the landless and poor peasants, women and all those who are being exploited politically, economically and in the name of religion'

దీని ప్రకారం షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తెగలు, నయా బౌద్ధులు, శ్రామికులు, భూమిలేని పేద రైతులు, స్త్రీలు, మతం పేరుతో రాజకీయంగా ఆర్థికంగా దోపిడీకి గురయిన వారంతా 'దళితు'లవుతారని తెలుస్తుంది. కానీ, గిరిజనులకు అస్పృశ్యత సమస్య లేదు. అన్ని రంగాల్లోనూ వెనుకబాటుతనం ఉంది. అగ్రవర్ణ స్త్రీలను 'దళితులు'గా భావించనవసరం లేదనీ భావిస్తున్నారు. ముస్లిం, క్రైస్తవ, బౌద్ధ, సిక్కు వంటి మైనారిటీ వారిపై హిందూమత ఆధిపత్యం ఉంది. అణిచివేతకు గురవుతున్నారని, వీరినీ దళితులుగా గుర్తించాలనీ కొంతమంది భావిస్తున్నారు.

సామాజికంగా నిమ్న స్థానాన్ని అనుభవిస్తున్న ప్రజలు దళిత శబ్దాన్ని ఆత్మ గౌరవానికి ప్రతీకగా భావిస్తున్నారు. చారిత్రక ఆధారాలను బట్టి వీరిని అవర్ణులు, అతిశూద్రులు, అనార్యులు, దాసులు, దాస్యులు, ప్రతిలోములు, అంత్యజులు, అంత్య వాసులు, అంత్యులు, అసురులు, చండాలురు, బాహ్యులు, మ్లేచ్ఛ్యులు, హీనులు, అస్పృశ్యులు, అంటరానివాళ్ళు, పంచములు, హరిజనులు వంటి వివిధ పేర్లతో పిలిచారు. అయితే పంచములు, హరిజనులు శబ్దాలతో కొన్ని వందల సంవత్సరాలుగా వీరిని పిలిచేవారు.

భారత స్వాతంత్రోద్యమ కాలంలో నర్సీమెహతా అనే ఓ రచయిత పెట్టిన 'హరిజన' శబ్దాన్ని మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ విస్తృతంగా ప్రాచుర్యంలోకి తెచ్చారు. మతపరంగా దేవుని బిడ్డలనే అర్థంలో ఆ శబ్దాన్ని ప్రచారం చేశారనీ, అది తమ ఆత్మగౌరవ భంగకరమని దళితులు నిరసించారు. అప్పటినుండే 'దళిత' శబ్దం ఆత్మ గౌరవానికి సమైక్య శక్తికీ ప్రతీకగా ప్రయోగంలో ఉంది. ఆ శబ్దంతో పిలిపించుకోవడానికి ఇష్టపడుతూ, ఆ పేరుతోనే తమ భావాలను వివిధ సాహిత్య ప్రక్రియలుగా అందిస్తున్నారు. అన్ని భారతీయ భాషల్లోనూ 'దళిత సాహిత్యం' పేరుతోనే రచనలు చేస్తున్నారు.

**దళిత సాహిత్యం:**

దళితుల జీవన విధానాన్ని చైతన్యవంతంగా వర్ణించిన సాహిత్యం దళిత సాహిత్యమవుతుంది. దళితుల అభ్యున్నతి కోసం ఎవరు రాసినా అది దళిత సాహిత్యంగానే పరిగణించవచ్చునని విమర్శకులు భావిస్తున్నారు. దళితులే తమ సమస్యలకు ప్రతిస్పందించి రాస్తే దాన్ని 'ఆత్మాభిమానం వాదం' గానూ దళితేతరుల దళితుల పక్షాన్ని వహించి రాస్తే దాన్ని 'ఉదారవాదం' గానూ పిలుస్తున్నారు.

దళిత సాహిత్యం మరాఠీ భాషలో ముందుగా స్థిరపడి, తరువాత భారతీయ భాషలన్నింటిలోనూ విస్తరించింది. కొంతమంది మరాఠీ రచయితలు దళిత సాహిత్యాన్ని ఇలా వివరించారు.

"This literature i closely associated with the hopes for freedom of a group of people who as untouchables are victims of social, economic and cultural in equalities" -
Arjun Dangle

""The Dalit literature was an all out plebeian attack on the orthodox establishment' - Latha Murugakar

"Any work of literature which seeks to express to express in words, the people of those sections of humanity which are oppressed and which are engaged in struggle for there existence to be called in the broadest seance, dalit literature" - Harish Mangalam (గుజరాతీ రచయిత)

దళిత సాహిత్యాన్ని ఎవరు రాసినా దాని మౌలిక స్వభావం, లక్ష్యాలను వీడనంతవరకు దాన్ని దళిత సాహిత్యంగానే పరిగణించవచ్చుననే ఆలోచన ఇంచుమించుగా సర్వాంగీకారం పొందింది. కింది విషయాలు గమనిస్తే ఈ మౌలికాంశాలు ఉన్నదే దళిత సాహిత్యమని స్పష్టమవుతుంది.

1. ప్రాచీన, సాంప్రదాయిక స్వభావం కలిగిన సామాజిక నిర్మాణాన్ని (కుల వ్యవస్థని) తిరస్కరించటం.

2. స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం, సామాజిక న్యాయం ఆశించే మానవతా దృక్పథాన్ని ఆశించటం.

3. హేతువుకు అందని అతీంద్రియ భావాలను తిరస్కరించటం.

4. వాస్తవికతకు ప్రాధాన్యమిచ్చి జీవితానుభవాలను సృజనీకరించటం.

5. వస్తువుకి రూపం సహకారి కావటం, సాహిత్యం సామాజిక చైతన్యాన్ని ఆకాంక్షించేటట్లు రూపొందటం, కళ సమాజం కోసమే అన్న దృక్పథానికి కట్టుబడటం.

6. సత్యం, శివం, సుందరం అనే భావనలను తిరస్కరించటం.

7. అణచివేత, దోపిడీకి వ్యతిరేకంగా తిరుగుబాటు చేసి, సామాజిక, ఆర్థిక న్యాయం కోసం పోరాడటం.

8. కర్మ, పునర్జన్మ, పరమాత్మ వంటి భావనలను నిరసించటం.

9. దళితుల భాషను, ఆచార వ్యవహారాలను గౌరవించి, ఆత్మ గౌరవాన్ని పెంపొందించటం.

10. హిందూ లేదా మూఢత్వాన్ని ప్రబోధించే మత భావనలను తిరస్కరించి, ప్రత్యామ్నాయ సంస్కృతిని రూపొందించటం.

11. అస్పృశ్యత కారణంగా దూరంగా విసిరేయబడిన వారిని ప్రధాన జీవన స్రవంతిలో కలపటం, కులాన్ని నిర్మూలించటం ప్రధాన లక్ష్యాలుగా గ్రహించటం.

12. దళిత సాహిత్యాన్ని రాయటం వినోదం కోసం కాదనీ, సామాజిక చైతన్యం, సామాజిక పరివర్తనకు బాధ్యతాయుతమైన పనిగా గుర్తించటం - దళితులు రాజ్యాధికారాన్ని చేపట్టే దిశగా సాహిత్యం ప్రేరణనివ్వటం.

దళిత సాహిత్య స్వభావాన్ని తెలుసుకోవటానికి పై అంశాలను క్రోడీకరించినా, 'దళిత సాహిత్యం' అని పిలుస్తున్న అన్ని రచనలకూ పైన పేర్కొన్న అన్ని లక్షణాలు సరిపోతున్నాయని చెప్పే వీలు లేదు. కానీ, మౌలికంగా ఈ లక్షణాలు చాలా వరకు దళిత సాహిత్యంలో కనిపిస్తున్నాయి. అలాంటి కొన్ని లక్షణాలు అభ్యుదయ, విప్లవ సాహిత్యంలోనూ కనిపిస్తున్నా, అవి వర్గానికిచ్చిన ప్రాధాన్యం, కులానికివ్వలేదు. కనుక, కులనిర్మూలన ప్రధాన లక్ష్యంగా దళిత సాహిత్యం కొనసాగుతుంది.

జ్యోతిబా పూలే, పెరియార్, అంబేద్కర్ భావజాలంతో పాటు, మార్క్సిజం ప్రభావం కూడా దళిత సాహిత్యంలో కనిపిస్తుంది. 'దేశీయ మార్క్సిజం' అనే భావన కూడా తెలుగు దళిత సాహిత్యంలో చర్చలోకొచ్చింది. అందువల్ల దళిత సాహిత్యాన్ని కాలం, స్వభావాలను అనుసరించి గుర్తించవలసి ఉంది. అయినా, దళిత సాహిత్యం ఆవిర్భవించటానికి శతాబ్దాల సామాజిక పీడనను ఎదుర్కొన్న చారిత్రక నేపథ్యం ఉంది. ఆ నేపథ్యం నుండే 'దళిత సాహిత్యం' స్పష్టమైన అంబేద్కర్ తాత్త్విక భావజాల భూమికతో ఆవిర్భవించింది.

**దళిత సాహిత్యం  చారిత్రక నేపథ్యం:**

అపౌరుషేయాలని భావించే వేదాల్లో (ఋగ్వేదం - 10వ మండలం - పురుష సూక్తం) చాతుర్వర్ణ వ్యవస్థ గురించి ప్రస్తావన కనిపిస్తుంది. దాని ప్రకారం భారతదేశంలో కుల వ్యవస్థ సాంఘిక అసమానతలకు కారణమయ్యింది. కులం వల్ల కలిగిన అసమానతలపై బౌద్ధం, జైనం, చార్వాకం మొదలైనవి నిరసనను తెలిపాయి. అవి కుల నిర్మూలనకంటే అహింస, జ్ఞానబోధ, బౌద్ధిక దృక్పథాలపై ప్రధాన దృష్టిని కేంద్రీకరించాయి. కొన్ని వందల యేండ్లుగా బ్రాహ్మణ, క్షత్రియ వర్ణాల వారు తమ అధికారాన్ని చెలాయిస్తూ సంస్కృత సాహిత్యాన్ని విస్తృతంగా ప్రచారం చేశారు.

ఈ కాలంలోనే ముస్లిములు భారతదేశంపై దండయాత్రలు చేసి, చాలా చోట్ల అధికారం హస్తగతం చేసుకున్నారు. ముస్లిములు మొదట్లో సంస్కృత సాహిత్యానికి ప్రాధాన్యాన్ని తగ్గించారు. ఆ తరువాత కాలంలో పరోక్ష పద్ధతులలో హిందూ సామాజిక వ్యవస్థలో కనిపించే అణచివేత స్వభావాన్నే ముస్లిం పాలకులు కూడా అనుసరించారు. ముస్లిం పాలనలో హిందూ వ్యవస్థలో తమకు అనుకూలమైన వాటిని స్వీకరించి, మిగిలిన వాటిని అణచివేశారు.

ఈ నేపథ్యంలోనే భక్తి సాహిత్యం ప్రారంభమయింది. ఈ సాహిత్యంలో హిందూ మతంలోని మౌలిక లక్షణాలను విస్మరించకుండా, కొన్నింటిని సంస్కరించే ప్రయత్నం మాత్రం జరిగింది. హిందూ - ముస్లిం పాలకుల సంఘర్షణలో బ్రిటీష్ వాళ్ళు భారత దేశాన్ని ఆక్రమించుకున్నారు. వారి పాలనలో పాశ్చాత్య విజ్ఞానం భౌతిక దృష్టిని కలిగించింది. కొన్ని వందల యేండ్ల బ్రిటీష్ వారి పాలనను వ్యతిరేకిస్తూ జాతీయోద్యమం ఊపందుకుంది. ఈ పరిస్థితుల్లో 'జాతీయోద్యమ సాహిత్యం'లో భాగంగా కుల నిర్మూలన కూడా ఒక అంశమయ్యింది. జ్యోతిబా పూలే, నారాయణగురు, సాహు మహారాజ్, పెరియార్ ఇ.వి. రామస్వామి నాయర్, డా।।బి.ఆర్. అంబేద్కర్ మొదలైన వారి ఆలోచనలు దళిత సాహిత్యానికి చారిత్రక, తాత్త్విక భూమికను ఏర్పరిచాయి.

జ్యోతి బాపూలే నిమ్నజాతుల ఉద్ధరణ కోసం 'సత్య శోధక సమాజం' (1873) స్థాపించారు. పూలే హిందూమతంలోని లోపాలను వివరిస్తూ అనేక పుస్తకాలను రాశారు. 1910లో కలకత్తా కాంగ్రెస్ సమావేశం అంటరానితనాన్ని వ్యతిరేకిస్తూ తీర్మానం చేసింది. 1918లో అఖిలభారత దళితజాతుల సమావేశాలు బొంబాయిలో జరిగాయి. 1924లో డా।।బి.ఆర్. అంబేద్కర్ అస్పృశ్యత నివారణోద్యమాన్ని ప్రారంభించారు.

ఈ ప్రభావం భారత దేశంలో ప్రధానంగా మహారాష్ట్ర, తమిళనాడు, కర్ణాటక, గుజరాత్ తదితర రాష్ట్రాల్లో బలంగానే కనిపించి, దళిత ఉద్యమాలు ఊపందుకున్నాయి. తెలుగువారికీ ఈ ఉద్యమాలు మార్గదర్శకమయ్యాయి. 1967 నాటికి జ్యోతిబా పూలే, సాహూ మహారాజ్, కారల్ మార్క్స్ సిద్ధాంతాలు నీగ్రో సాహిత్యంలోని తిరుగుబాటు కలగలిసి అంబేద్కర్ భావజాలాన్ని ప్రధానంగా చేసుకొని 'దళిత సాహిత్యం' ఆవిర్భవించింది.

1981లో భారతీయ దళిత సమాచార పత్రికా సంపాదకుల సదస్సు జరిగింది. 1984లో భారతీయ దళిత సాహిత్య అకాడమీనీ స్థాపించారు. కాన్షీరామ్ 1984 నాటికి అంబేద్కర్ భావజాలంతో బహుజన సమాజ్ పార్టీని స్థాపించారు. దీనితో రాజకీయంగా కూడా దళితులలో చైతన్యం వెల్లువెత్తింది. ఈ ప్రభావం కూడా తెలుగు సాహిత్యంపై కనిపించింది.

1968లో కంచికచర్లలో కోటేశుని సజీవ దహనం చేయడం, 1985 జూలై 17న కారంచేడు ప్రాంతంలో దళితులపై మారణకాండ సాగించడం వంటి సంఘటనలు

జరిగాయి. 1990 ఆగస్టు 6న చుండూరులో దళితులను ఊచకోత కోశారు. దీనితో అంతవరకు సంస్కరణోద్యమ, అభ్యుదయ, విప్లవ సాహిత్యం రాస్తున్న తెలుగు రచయితలు, కవులు దళిత సాహిత్యంపై దృష్టిని కేంద్రీకరించారు.

తెలుగు సాహిత్యచరిత్ర పరంగా చూసినపుడు 12వ శతాబ్దంలో శివకవులు నిమ్న జాతీయులని పిలువబడుతున్న దళితులను శైవమతం వైపు ఆకర్షించేటట్లు చేసిన రచనలు కొన్ని కనిపిస్తున్నాయి. 13 వ శతాబ్దం నుండి 16వ శతాబ్దం వరకు భక్తి ఉద్యమం పేరుతో హిందూ మతంలో సంస్కరణ దిశగా రచనలు వచ్చాయి. 16వ శతాబ్దానికి చెందిన శ్రీకృష్ణదేవరాయలు ''ఆముక్తమాల్యద''లో మాలదాసరి కథ రాయడంలోనూ కుల ప్రభావాన్ని గుర్తించారు. 17వ శతాబ్దంలో పోతులూరి వీరబ్రహ్మం, వేమన వంటి కవులు కులం వల్ల కలిగే సాంఘిక నిమ్నోన్నతాలను నిరసిస్తూ రచనలు చేశారు. 18, 19 వ శతాబ్దాలలో జమీందారీల పెత్తనం, వారి అధికారం క్షీణించటంతో పాశ్చాత్య పాలనకు, పాశ్చాత్య విద్యకు ద్వారాలు తెరిచాయి. క్రైస్తవ సాహిత్యం ప్రారంభమయింది. ఉన్నత వర్ణాలు, వర్గాల వారు క్రైస్తవ రచనలను చేసే నేపథ్యంలో కింది వర్ణాల వారి గురించి రాయడం ఒక అనివార్యగా మారింది.

**దళిత సాహిత్యం ఆరంభ వికాసాలు:**

భారతదేశ వ్యాప్తంగా జరిగిన పాలన, ఆర్థిక పర అంశాల కారణంగా వచ్చిన సామాజిక ఉద్యమాలు వచ్చాయి. దాని ప్రభావంతో వెలువడుతున్న సాహిత్యంలో దళిత సాహిత్యం ఒక ప్రత్యేక విభాగమయ్యింది. 1960 నుండి దళిత సాహిత్యం ప్రాచుర్యాన్ని పొందింది. ఈ పరిణామాలను ప్రముఖ విమర్శకులు ఆచార్య కె.కె. రంగనాథాచార్యులు కింది విధంగా విశ్లేషించారు.

1970లలో మరాఠీ, కన్నడ భాషలలో నిర్దిష్ట లక్ష్యాలతో, ప్రత్యేకమైన అభివ్యక్తులతో దళిత సాహిత్యం పురోగమించింది. 1980ల ఉత్తరార్థంలో తెలుగు సాహిత్యంలో దళిత చైతన్యం నిర్దిష్ట రూపాన్ని పొంది, 1990 మొదలయ్యే నాటికి ''దళిత సాహిత్యం'' సాహిత్యంగా నిలదొక్కుకొనే ప్రయత్నం చేసింది. ప్రాచీన, ఆధునిక సాహిత్యాన్ని ప్రశ్నిస్తూ తనదైన అస్తిత్వంతో ముందుకొచ్చింది. వేమన, తత్వ కవులు మానవతా దృక్పథంతోనూ, గురజాడ హేతువాద దృక్పథం తోనూ దళితుల సమస్యలను సృజనీకరించారు.

సంఘసంస్కరణోద్యమాలు ప్రధానంగా స్త్రీ సమస్యలపైనే కేంద్రీకరించినా, కొంతవరకు కుల సమస్యను కూడా గుర్తించాయి. జాతీయోద్యమం అస్పృశ్యతా సమస్యను ప్రధానంగా గుర్తించి, మత స్పృహలో దాన్ని పరిష్కరించే ప్రయత్నం చేసింది.

అభ్యుదయ సాహిత్యం పీడిత శ్రామిక వర్గ సమస్యలలో భాగంగానే దళిత సమస్యలకు పరిష్కారాన్ని సూచించింది. అది ఎక్కువగా ఆర్థిక సంస్కరణలకే ప్రాధాన్యాన్నిచ్చింది. విప్లవ సాహిత్యం గిరిజన సమస్యలతో పాటు దళిత సమస్యలను

వర్గ దృష్టితో ప్రత్యేక ప్రాధాన్యాన్నిచ్చింది. ఆర్థిక కోణానికి అధిక ప్రాధాన్యాన్నిచ్చే విప్లవ స్పృహతో సమాంతరంగా సామాజిక, సాంస్కృతిక రంగాలలో కూడా దళిత చైతన్యం విస్తరించింది. వర్గం కంటే దళిత సమస్య 'కులం' తోనే ముడిపడి ఉందని గుర్తించి, ఆ అంశాలను ప్రధానంగా తీసుకొచ్చింది.

1909లో ఒక అజ్ఞాత కవి రాసిన ''మాలవాండ్ర పాట''ను తొలి దళిత గేయంగా పరిశోధకులు భావిస్తున్నారు. ఇది ఆంధ్రభారతి (భాద్రపద) మాసపత్రికలో అచ్చయ్యింది. ఆ తరువాత గురజాడ అప్పారావు 1911లో కుల సమస్యను స్పర్శిస్తూ ముత్యాలసరాల్లో రాశారు. 1915లో మంగిపూడి వెంకటశర్మ ''నిరుద్ధ భారతం'' అనే పద్య కావ్యాన్ని రాశారు. అస్పృశ్యతను నిరసిస్తూ దళితేతరులు రాసిన తొలి పద్యకావ్యంగా దీన్ని విమర్శకులు భావిస్తున్నారు. కొండపల్లి జగన్నాథరావు 1921లో రాసిన ''మేలుకొలుపు'' గీతం పురాణాల్లో దళితుల గొప్పతనాన్ని కీర్తించే విధంగా ఉంది. 1930లో జాలా రంగస్వామి రాసిన ''అంటరానివాడెవ్వడు'' పాట, 1933లో కుసుమ ధర్మన్న రాసిన ''హరిజన శతకం'' దళితుల మనోభావాలను బాగా పట్టుకోగలిగాయి. 1933లోనే కుసుమ ధర్మన్న రాసిన ''మాకొద్దీ నల్ల దొరతనము'' గేయం ఒక ఊపు ఊపింది.

గుర్రం జాషువా రాసిన ''గబ్బిలం''(1941) కావ్యంలో దళితుల వేదనా భరిత జీవితాలను, అప్పుడే మొలకలెత్తుతున్న తిరుగుబాటు స్వభావాన్ని శక్తివంతంగా అభివ్యక్తీకరించారు. ఈయనే రాసిన ''నా కథ'' దళిత ఆత్మ కథకు ప్రేరణనిచ్చే రచన. బోయి భీమన్న పురాణేతిహాసాల సమగ్ర అవగాహనతో గాంధీ, అంబేద్కర్ తాత్త్విక భావాల సమ్మేళనంతో గొప్ప రచనలు చేశారు. ''గుడిసెలు కాలిపోతున్నై'', ''రాగవాశిష్టం'' ''పాలేరు'' వంటివి బోయి భీమన్న రచనలలో ప్రముఖమైనవి. ఈ రచనలు దళితులకు గొప్ప ప్రేరణనిచ్చాయి.

ఇలా అస్పృశ్యతను నిరసిస్తూ దళిత, దళితేతరులు అనేక రచనలు చేశారు. ఇంచు మించు ఈ రచనలన్నీ ''జీవితానుభవాలనుంచి పొందిన స్పందన, నిరసన, సంస్కరణ, ఉద్ధరణ, విమర్శ, విజ్ఞాపన, సంఘటన, ప్రతిఘటన దశలుగా పరిణామం చెందాయని'' విమర్శకులు భావిస్తున్నారు. 1968లో కృష్ణా జిల్లా కంచికచర్లలో కోటేశు అనే దళితునిపై అగ్రవర్ణాల వారు దొంగతనం కారణాన్ని మోపి అతడిని సజీవ దహనం చేశారు. ఆ తరువాత కారంచేడు ప్రాంతం (17-7-1985)లో దళితులపై జరిగిన మారణకాండతో దళితుల్లో చైతన్యం వెల్లువెత్తింది.

అంతకుముందు పదిరికుప్పం ప్రాంతం (5-8-1983) లోనూ కొంతమంది దళితులను కిరోసిన్ పోసి కాల్చేశారు. నీరుకొండ ప్రాంతం (15-7-1987) లో కొంతమంది దళితులను చంపేశారు. చుండూరు ప్రాంతం (6-8-1991) లోనూ కొంత మంది దళితులను ఊచకోత కోశారు. ఈ నేపథ్యంలో జి. లక్ష్మీ నరసయ్య, త్రిపురనేని శ్రీనివాస్‌ల సంపాదకత్వంలో ''చిక్కనవుతున్న పాట'' వెలువడింది. ఈ సంకలనంతో దళిత కవిత్వం ఒక సమగ్ర రూపం పొందింది. ఆ తర్వాత ఇంచు మించు ప్రతి

సాహిత్య పేజీలోను దళిత సాహిత్యంపై చర్చోపచర్చలు జరిగాయి. జి. లక్ష్మీనరసయ్య ఆంధ్రజ్యోతి (ఆదివారం అనుబంధం)లో రాసిన వ్యాసాలు దళిత సాహిత్యానికి శాస్త్రీయమైన వివరణలను అందించగలిగాయి.

**దళిత సాహిత్య ప్రక్రియలు:**

తెలుగులో దళిత సాహిత్యం ప్రధానంగా 'దళిత కవిత్వమే' అన్నంతగా కవిత్వం వెలువడింది. అదే స్థాయిలో కాకపోయినా కథలు కూడా ఎక్కువగానే వచ్చాయి. నవలలు, నాటకాలు కూడా వచ్చినా సంఖ్యాపరంగా కూడా చెప్పుకోదగినన్ని రాలేదు. దీర్ఘ కావ్యం, పాటలు కూడా ఎక్కువగానే వెలువడ్డాయి. ఆత్మ కథ అనువాదాలు కూడా కొన్ని వచ్చాయి. 1985 తరువాత వచ్చిన రచనల్లో జీవితానుభవాలతో కూడిన దళిత చైతన్యం ప్రతిఫలిస్తుంది. వివిధ పుస్తకాలకు రాసిన ముందుమాటలు, పత్రికా వ్యాసాలు, పుస్తకాల రూపంలో దళిత సాహిత్య విమర్శ వచ్చింది. విశ్వవిద్యాలయాల్లో దళిత సాహిత్యంపై పరిశోధనలు జరుగుతున్నాయి. అలా దళిత సాహిత్యం ప్రక్రియా వైవిధ్యాన్ని సాధించింది.

**దళిత గేయం:**

అస్పృశ్యతను నిరసిస్తూ 1909లో అజ్ఞాత కవి 'మాలవాండ్ర పాట'లో ''అందారు పుట్టిరీ హిందమ్మ తల్లికి - ఎట్టాగు ఎక్కువ బ్యాపస్లు మాకంటె'' అని నిలదీశారు.. ''మంచియన్నది మాలయైతే మాలనే అగుదున్'' అని గురజాడ అన్నారు. జయధీర్ తిరుమలరావు ప్రధాన సంపాదకత్వంలో వెలువడిన 'దళిత గీతాలు' (1993)లో చాలా వరకు అస్పృశ్యత నివారణకు ప్రయత్నించిన గేయాలున్నాయి. జాలా రంగస్వామి (1930) రాసిన 'అంటరానివారెవరు?' గేయం బొబ్బిలి యుద్ధం బుర్రకథ వరుసలో వీర రసాత్మకంగా సాగింది. నక్కా చిన వెంకయ్య 'హరిజన కీర్తనలు' బాగా ప్రసిద్ధి పొందాయి.

అస్పృశ్యతా నివారణకై శక్తివంతమైన పాటలు రాసిన వారిలో కుసుమ ధర్మన్న ప్రతిభావంతుడైన కవి. బోయి భీమన్న డా।।బి.ఆర్. అంబేద్కర్‌పై రాసిన 'జయ జయ అంబేద్కర' (1992), మాష్టార్జీ 'అందుకో దండాలు బాబా అంబేద్కరా' గేయాలు ప్రార్థనా గీతాలయ్యాయి. గద్దర్ 'పొట్టకూటి కోసం పోలీసోడు', 'దళిత పులులమ్మా' గేయాలు, యువక 'కర్మభూమిలో పూసిన ఓ పువ్వా', గూడ అంజయ్య రాసిన 'ఊరు మనదిరా ఈ వాడ మనదిరా' గేయాలు దళితులను నేటికీ ఉర్రూతలూగిస్తున్నాయి. శివ సాగర్, వంగపండు ప్రసాదరావు, ఉ. సాంబశివరావు, ఇంకా అనేక మంది రాసిన గేయాలలో చాలా వరకు సంస్కరణ, మార్క్సిస్టు భావాలు అధికంగా ఉన్నా దళిత జీవితమే స్పష్టమవుతుంది.

**దళిత పద్య కవిత్వం:**

అస్పృశ్యతా నివారణను ప్రతిఫలించే గేయాలు మాత్రా ఛందస్సులో పద్యాలలో దళిత, దళితేతరులు రాసినా, 1915లో మంగిపూడి వెంకట శర్మ గారి 'నిరుద్ధ భారతం' ఛందోబద్ధ దళిత పద్యకావ్యాల్లో మొదటి రచన. ఆ తరువాత పేర్కొనదగిన పద్యాలు,

కావ్యాలు శతకాలు చాలా వరకు వచ్చాయి. అయితే అవి జాతీయోద్యమ సాహిత్యంలో భాగంగా గాంధీ ప్రభావంతో వెలువడినవి.

కుసుమ ధర్మన్న (హరిజన శతకం - 1933), కర్ణ వీర నాగేశ్వరరావు (అస్పృశ్యుల విజ్ఞప్తి -1936), బిర్నీడి మోషే (హరిజనాభ్యుదయం, పృథ్వీ భాగవతం - 1966), జోసెఫ్ కవి (కన్నీటి కబురు), గుర్రం జాషువా (గబ్బిలం - 1941), కె.సి. జాన్ (బహిష్కారం -1948, ధర్మచక్రం), ఎడ్లపల్లి సామ్యూల్ (చిక్కడు -1963), మల్లవరపు జాన్ (విశ్వ ప్రకాశం - 1974, అతుకుల బ్రతుకులు), సవ్వప్పగారి ఈరన్న (కడలి కెరటం - 1987), నంబూరు దూర్వాస మహర్షి (లోకాలోకనం - 1971), నూతక్కి అబ్రహాం (మత్కుణం), రావూరి ఏకాంబరం (అంబేద్కరో సమరసింహ -1994), కొలకలూరి స్వరూపరాణి (ప్రబోధము), ఎస్.టి.జ్ఞానానంద కవి (పాంచజన్యం, ధర్మాగ్రహం), ఆశావాది ప్రకాశ రావు (అంతరంగ తరంగాలు - 1990) తదితరులు ఎంతో మంది కవులు కుల నిర్మూలనను ఆకాంక్షిస్తూ తమదైన దృక్పథంతో పద్య కవిత్వాన్ని రాశారు. ఛందోబద్ధ పద్య కవిత్వం దళితుల దగ్గరకు చేరే సాహిత్య రూపం కాదని ఎనభయ్యో దశకం వచ్చే నాటికి చాలా మంది వాదించినా కావ్యాలు వెలువడుతూనే ఉన్నాయి. గుర్రం జాషువా పద్యాలు నేటికీ దళితులకు ప్రేరణనిస్తూనే ఉన్నాయి.

దళిత సాహిత్యంతో పరిచయం ఉన్న ప్రతీ వారికి గుర్రం జాషువా రాసిన ఒక పద్యం అయినా నోటికి రాకుండా ఉండదు. ఆ పద్యాల్లో ఉండే వస్తువు, లాలిత్యం, మాధుర్యంతో రసభరితంగా ఉండటమే దానికి ప్రధాన కారణం. గబ్బిలం కావ్యంలో పరమేశ్వరునికి సందేశం పంపిస్తూ దళితుని గురించి...

"ముప్పు ఘటించి వీని కులమున్, గలిమిన్ గబలించి దేహమున్
బిప్పి యొనర్చు నీ భరత వీరుని పాదముకందకుండగా
జెప్పులు కుట్టి జీవనము సేయును గాని నిరాకరింపలే
దెప్పుడు నప్పువడ్డది సుమీ భారతావని వీని సేవకున్" అని వర్ణించారు జాషువా.

దళితుల శ్రమను విలువ కట్టడం సాధ్యం కాదంటున్నారు కవి. గాంధీ ప్రభావంతో దళితేతరుడైనా తుమ్మల సీతారామమూర్తి అస్పృశ్యతా నివారణను కోరుతూ...

"హరిజనుల యందు నేను నొక్కరుండననుచు
నెపుడు ప్రతి హైందవుడు నిర్ణయించుకొనునొ
యపుడె యస్పృశ్యతా భూతమాపసరిల్లు
నపుడె శుచితామయ సమాజమవతరించు"ను అనే భావాలతో పద్యాలను రాశారు. ఇలా అనేక మంది పద్య కవిత్వం ద్వారా కూడా దళిత సమస్యను వర్ణించే ప్రయత్నం చేశారు. కుసుమ ధర్మన్న, గుర్రం జాషువా, బోయి భీమన్నలను దళిత పద్యకవిత్రయంగా అభివర్ణించవచ్చు. దళితుల గురించి తొలిసారిగా 'నిరుద్ధభారతం' కావ్యాన్ని రాసిన మంగిపూడి వేంకటశర్మ అస్పృశ్యతను నిరసిస్తూ...

"మాలలని, పంచములటంచు, మాదిగలని
శ్వపచులని, చెప్పగారాని వారటంచు
మరియు చండాలురని తోడి మానవులను
దురలి వేయుట సాంఘిక ధర్మమగునే" అని సంఘాన్ని ప్రశ్నించారు.

మొత్తం మీద దళిత పద్య కవిత్వంలో మూడు ప్రధాన ధోరణులు కనిపిస్తున్నాయి. గాంధీ ప్రభావం, గాంధీ - అంబేద్కర్ ప్రభావం, హేతువాద భావాలు గల పురాణ విమర్శతో కూడిన మానవతా వాద ధోరణులుగా వాటిని చెప్పుకోవచ్చు.

**దళిత వచన కవిత్వం:**

కులం వల్ల కలుగుతున్న సమస్యలను వర్ణిస్తూ వచన కవిత్వం అధిక స్థాయిలోనే వచ్చింది. నేటికీ పత్రికల్లో, పుస్తకాలలో ప్రచురితమవుతూనే ఉంది. గేయం కుల సమస్యను ఆధారం చేసుకొన్నా, ఆర్థికాంశాలకు ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చినట్టుగా కనిపిస్తుంది. గేయాలు పాడిన/రాసిన వారే వచన కవిత్వాన్ని కూడా రాశారు. కానీ, వారి వచన కవిత్వం ప్రధానంగా కుల సమస్యపైనే దృష్టిని కేంద్రీకరించబడింది. మూలవాసీ సిద్ధాంతాన్ని మాష్టార్జీ ప్రతిపాదించారు. దళితులు నాగజాతికి చెందిన వారనే వాదాన్ని సవేరా ప్రచారం చేశారు. ఇలా వచన కవిత్వం కూడా వర్గ స్పృహతోనే ప్రారంభమయినా, తరువాత కాలంలో కులాన్నే కేంద్రీకరించుకొని వర్గ, మత వివక్షలను సైతం వ్యతిరేకిస్తూ వచ్చింది.

'చిక్కనవుతున్న పాట' (1995) తెలుగు సాహిత్యంలో ఒక కదలికను తెచ్చింది. ఆ తరువాత, దళిత కవిత్వం పూలే, అంబేద్కర్ తాత్విక భావజాలంతో, చైతన్యవంతంగా అనేక కవితా సంకలనాలు, సంపుటాల రూపంలో వెలువడింది. 1995లోనే ఈ కవితా సంకలనాలు ఎక్కువగా రావడం దళిత కవిత్వంలో ఒక చారిత్రక పరిణామం. ఈ సంవత్సరంలోనే కేశవ కుమార్, కె. సత్యనారాయణల సంపాదకత్వంలో *'దళిత మేనిఫెస్టో'*, పట్టేటి రాజశేఖర్, నాగప్ప గారి సుందర్రాజు సంపాదకత్వంలో *'గుండె డప్పు'*, సుంకిరెడ్డి నారాయణరెడ్డి సంపాదకత్వంలో *'బహువచనం'* కవితా సంకలనాలు వచ్చాయి. ఇదే సంవత్సరంలో వచ్చిన మద్దూరి నగేష్ బాబు *'వెలివాడ'*, కత్తి పద్మారావు *'జైలుగంటలు'*, జూలూరి గౌరీశంకర్ *'పొలికట్టె'*, సుంకర రమేష్ బాబు *'తల్లి కోడి హెచ్చరిక'*, సతీష్‌చందర్ *'పంచమ వేదం'* వంటివి పేర్కొనదగినవి.

వీటితో పాటూ కత్తి పద్మారావు *'నల్లకలువ'* (1996) *'భూమి భాష'*, *'కట్టెల మోపు'*, ఎండ్లూరి సుధాకర్ *'వర్తమానం'*, *'కొత్త గబ్బిలం'*, *'నల్ల ద్రాక్షపందిరి'*, *'వర్గీకరణీయం'*, *'అటాజనికాంచె'* (2005), పైడి తెరేష్ బాబు *'అల్ప పీడనం'* (1996), చిన్ని *'ఒళ్ళు కడుక్కుందాం రండి'* జి.వి. రత్నాకర్ *'మట్టి పలక'*, *'అల్లేటి అల'*, గ్యార యాదయ్య *'ఎక్కోషి'*, దార్ల వెంకటేశ్వరరావు *'దళిత తాత్వికుడు'* (2004), ప్రసాద్ మూర్తి *'కలనేత'*, *'మాట్లాడుకోవాలి'*, చల్లపల్లి స్వరూపరాణి *'మంకెన పూవు'*, నాగప్పగారి సుందర్రాజు *'చండాల చాటింపు'*, బన్న ఐలయ్య *'నిప్పు కణిక'* మొదలైనవి దళిత వచన కవిత్వంలో వస్తు, శిల్పాలలో వైవిధ్యాన్ని ప్రదర్శించాయి. వి. సిమ్మన్న, కొండపల్లి సుదర్శనరాజు వెలువరించిన *'దళిత కవిత'* (1991)ను అనేకదళిత కవితలను ఒక చోటకు చేర్చిన మొదటి కవితా సంకలనంగా కొందరు పేర్కొంటున్నారు.

ఎస్.సి. వర్గీకరణ నేపథ్యంలో మాల, మాదిగలు పరస్పరం తమ అవకాశాల కోసం ఒకరినొకరు విమర్శించుకుంటూ వెలువడిన కవితా సంకలనం, సంపుటాలు వచ్చాయి. *'మాదిగ చైతన్యం', 'వర్గీకరణీయం', 'ఒకే గొంతు', 'దండోరా'* మొదలైనవాటిలో ఈ రకమైన కవిత్వం ఉంది. దళిత కవిత్వాన్ని విమర్శిస్తూ 'చకోనా' సంపాదకత్వంలో *'పాట చిక్కబడుతుందా?'* (1996) అనే కవితా సంకలనం కూడా వెలువడింది.

ఈ వచన కవిత్వాన్నంతటినీ చూసినపుడు వస్తు, శిల్పాలలో ఎంతో వైవిధ్యం కనిపిస్తుంది. సలంద్ర *'దళిత మేనిఫెస్టో'* కవితలో వర్గ స్పృహతో కూడిన కుల ప్రతిఘటన చైతన్యం కనిపిస్తుంది.

*"నన్ను*
*చచ్చిన శవాల ముందు*
*దహన సంస్కారాలే చూసుకోమన్నావ్*
*సరే,*
*ఎలాగైతేనేం,*
*నీ ప్రాణాల్ని కూడా*
*ఎలా పాతేయాలో*
*నాకు తెలియడమే బాగయిది."*

అంటూ దళితులకు ప్రతికూలాంశాలైనవి, అనుకూలాంశాలుగా మార్చుకొని చైతన్యంతో పోరాటపటిమను ప్రదర్శించారు.

చాతుర్వర్ణ వ్యవస్థలో దళితులకు అవకాశం లేకుండా చేసిన తీరుని వర్ణిస్తూ బొజ్జాతారకం --

*"నాకై కవిత లేదు*
*నాకు చరిత లేదు*
*నాలుగు వేదాలలోంచి*
*నాలుగు పాదాలలోంచి*
*నన్ను తొలగించారు"* అని వర్ణించారు.

అలాంటి దళితుడు ఆత్మ గౌరవం కోసం పోరాడిన పరిణామాలను కలేకూరి ప్రసాద్ 'పిడికెడు ఆత్మ గౌరవం' కోసం కవితలో ఇలా అంటారు.

*"త్రేతా యుగంలో నేను శంబూకుణ్ణి*
*ఇరవై రెండేళ్ళ క్రితం నా పేరు కంచికచర్ల కోటేశు*
*నా జన్మ స్థలం కీలవేణ్మణి, కారంచేడు, నీరు కొండ...*
*ఇప్పుడు కరడు గట్టిన భూస్వామ్య క్రౌర్యం*
*నా గుండెల మీద నాగేటి కర్రులతో*
*పచ్చబొడిసిన పేరు చుండూరు*
*ఇక చుండూరు నామవాచకం కాదు, సర్వనామం*
*. . . . . . . . .*
*అవమానాలకు, అత్యాచారాలకు, మానభంగాలకు*
*చిత్రహింసలకు గురై*
*పిడికెడు ఆత్మగౌరవం కోసం తలెత్తినవాణ్ణి"*

దళితులు హిందుమతం నుండి అన్యమతాల వైపు ఆకర్షింపబడటానికి గల కారణాలను కూడా కవులు వర్ణించారు.

"మీ వేదాలు ఆలకించినందుకు
సీసం పోయించుకుని దిబ్బళ్ళెత్తిన
నా చెవులకు నా మసీదు, నా సిలువ
అమృతం చిలికే
నాలుగు ఆప్తవాక్యాలు చెప్పి
ధార కట్టిన నా కన్నీటిని
పైట చెంగుతో తుడిచాయి" అని చల్లపల్లి స్వరూపరాణి
మతాంతరీకరణకు గల కారణాలు కవిత్వీకరించారు

వందలాది సంవత్సరాలు వర్గపోరాటంలో భాగంగా ప్రాణాలర్పించినా, కుల సమస్యను విస్మరించి, వర్గ సమస్యే ప్రధానమన్న మార్క్సిస్టులను కూడా వ్యతిరేకిస్తూ దళిత కవిత్వం వచ్చింది. అలాగే, ఒకప్పుడు దళితులను దగ్గరకు చేర్చుకున్న క్రైస్తవ మతంలో కూడా కులం రాజ్యమేలడాన్ని మద్దూరి శాంతయ్య 'ఓసీ క్రీస్తు'లో నిరసిస్తూ కవిత్వం రాశారు. ఈ కవితను ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం ముఖచిత్రంలో ప్రచురించడం ఒక చారిత్రక సందర్భంగా చెప్పుకోవచ్చు. వర్గీకరణ నేపథ్యంలో ఎండ్లూరి సుధాకర్ *'కొత్త గబ్బిలం', 'వర్గీకరణీయం'* వంటి కవితా సంకలనాలని వెలువరించారు.

దళిత కవిత్వంలో మినీకవితలు కూడా కనిపిస్తున్నాయి. దళిత నానీలు, హైకూలు కూడా రాశారు. దీర్ఘకావ్యాలు కూడా వచ్చాయి. ఇలా వచ్చిన దళిత కవిత్వం వస్తు, రూపాలలో తెచ్చిన వైవిధ్యం తెలుగు సాహిత్యంలో ఒక మైలురాయి కాగలుగుతుంది. దళిత కవిత్వంలో వచ్చిన శిల్ప వైవిధ్యాన్ని పాశ్చాత్య సాహిత్యంతో అన్వయించి జి. లక్ష్మీనరసయ్య అనేక వ్యాసాలు రాశారు. వాటిలో పౌరాణిక నేపథ్యం (Mythopoeic), వ్యక్తిత్వారోపణ (Personification), ఉల్లేఖన (Allusion), నాటకీయ స్వగతం (Dramatic Monologue), సంభాషణా శైలి (Conversational Style), పునరుక్తి (Repetition), అపరిచియిత్వీకరణ (De-Formalization), విరోధాభాసం (Paradox), అసాధారణ పోలిక (Conceit), స్థానభ్రంశం (Displacement), స్థానికత లేదా దేశీయత (Nativity), పురాణ ప్రతీకలు (Mythological symbols) మొదలైన శిల్ప పద్ధతులలో దళిత కవిత్వం శిల్ప వైవిధ్యాన్ని ప్రదర్శించింది.

దేవరాజు మహారాజు, ఎండ్లూరి సుధాకర్ మొదలైనవాళ్ళు "దళిత ఆత్మకథా" ప్రక్రియను పరిచయం చేశారు. పైడి తెరేష్ బాబు "దళిత గజల్"ను ప్రారంభించినా కొనసాగలేదు. ఆయనే కవిత్వాన్ని క్యాసెట్ (హిందూ మహాసముద్రం) రూపంలో అందించడానికి ప్రయత్నించినా, పాటకున్నంత ఆదరణ దీనికి లభించలేదు. దళిత సాహిత్యలో ఇంకా ప్రదర్శనానుగుణ సాహిత్య ప్రక్రియలు రావలసి ఉంది.

దళిత నవల:

అస్పృశ్యతను వివిధ కోణాల్లో చిత్రిస్తూ నవలలు రాసిన వాళ్ళున్నారు. హేలావతి (1913), వెంకటపార్వతీశ్వరకవుల 'మాతృమందిరం' (1919), ఉన్నవ లక్ష్మీనారాయణ గారి 'మాలపల్లి' (1922), ఆచార్య రంగనాయకులుగారి 'హరిజన నాయకుడు' (1933), వట్టికోట ఆళ్వార్‌స్వామిగారి 'ప్రజల మనిషి' (1955) ముప్పాళ్ళ రంగనాయకమ్మ గారి 'బలిపీఠం' (1962), డా|| కేశవరెడ్డి రాసిన 'బానిసలు' (2971), 'శ్మశానం దున్నేరు' (1979), 'ఇన్‌క్రెడిబుల గాడెస్' (1979), 'అతడు అడవిని జయించాడు' పేర్కొనదగినవి.

'మాలపల్లి' నవల మార్క్సిస్టు భావజాలంతో జాతీయోద్యమ ప్రభావంతో వచ్చినా, దళితుల జీవితాన్ని స్పర్శించిన నవలగా ప్రసిద్ధి పొందింది. దళితులలోని దాసరుల కుటుంబం చుట్టూనే 'మాలపల్లి' నవలలోని సంఘటనలన్నీ చిత్రితమయ్యాయి. తక్కెళ్ళ జగ్గడు ఉరఫ్ వెంకటదాసు కులం వల్ల వివక్షకు గురవుతుంటాడు. అయినా, ఆర్థిక స్థితిగతులలో మార్పుల రాకపోతే దళితుల అస్తవ్యస్తమవుతుందనేటట్లు పాత్రను తీర్చిదిద్దారు రచయిత.

1980 తర్వాత దళిత సాహిత్యంలో నవలా ప్రక్రియ వేగవంతంగానే వచ్చింది. అక్కినేని కుటుంబరావు 'సౌరాజ్యం' (1981) స్వాతంత్ర్యానంతర గ్రామీణ దళితుల జీవితాలను నవలలో చిత్రించారు. 'ఖాకీ బతుకులు' (1980-82) నవలలో పోలీసుశాఖలో దళితుల ఆత్మగౌరవ పోరాటాన్ని స్పార్టకస్ (జి. మోహనరావు) వివరించారు. చిలుకూరు దేవపుత్ర రాసిన 'అద్దంలో చందమామ' (1988), 'పంచమం' (1998) నవలలో సుమారు 1975 నుండి 99 వరకు రాష్ట్రంలో జరిగిన దళిత ఉద్యమాల చారిత్రక నేపథ్యాన్ని చిత్రించే ప్రయత్నం చేశారు. 'అకాశంలో సగం' (1990) నవలలో ఓల్గా అగ్రవర్ణ భూస్వామ్య వ్యవస్థ కింద నలిగిపోతున్న దళితుల జీవితాలను, ముఖ్యంగా స్త్రీ దృక్పథాన్ని వర్ణించారు. సదానంద శారద 1992లో రాసిన 'మంచినీళ్ళ బావి' తెలంగాణ ప్రాంతం దళిత జీవితాలను వర్ణించింది. 1996లో బండి నారాయణస్వామి 'గద్దలాడతాండాయి' నవలలో రాయలసీమ దళితుల జీవితాన్ని చిత్రించారు. 'నీ బాంచెన్ కాల్మొక్త' (1997) నవలలో కాలువ మల్లయ్య గారు సుమారు యాభై ఏళ్ళలో తెలంగాణలో వచ్చిన సామాజిక పరిణామాలను ప్రాంతీయ మాండలికంలో వివరించే ప్రయత్నం చేశారని విమర్శకులు వ్యాఖ్యానించారు.

సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి 'కాడి' (1998) నవలలో మాల, మాదిగల మధ్య కలిగే అంతరాలను ఆసరా చేసుకొని అగ్రవర్ణాల వారు దళితులపై చేసే పెత్తనాన్ని వర్ణించారు. ఇంచుమించు ఇదే ఇతివృత్తంతో పి.నాసరయ్య 'మాదిగపల్లె' (1998) నవల రాశారు. జి.కళ్యాణరావు గారు 'అంటరాని వసంతం' (2000)లో సుమారు వంద సంవత్సరాల దళితుల పోరాటాల పరిణామాలను ఆకర్షణీయమైన శైలిలో రాశారు. వేముల ఎల్లయ్య 'కక్క' (2000) 'సిద్ధి' (2006) నవలలో తెలంగాణ ప్రాంత దళితుల సాంస్కృతిక జీవనాన్ని ప్రాంతీయ మాండలికంలో రాశారు. బోయ జంగయ్య 'జాతర' (1997) కూడా తెలంగాణ దళితుల జీవితాన్ని వర్ణించిందే. ఇంకా చాలా నవలల్లో దళిత, దళితేతర రచయితలు ఆయా పాత్రలను వర్ణించిన వారున్నారు.

**దళిత కథ:**

దళిత జీవితాలను చిత్రిస్తూ సంస్కరణ, అభ్యుదయ, విప్లవ సాహిత్యంలో భాగంగానే దళిత కథలు కూడా ప్రారంభమయ్యాయి. వాటిలో ఆర్థిక కోణాలకున్న ప్రాధాన్యత కులనిర్మూలన దిశ కనపడదు. దళితేతరులు రాసిన కథల్లోనూ నిమ్న కులాలనే స్పృహ తప్ప, ఆ కులాల జీవిత సంవేదనలకు దర్పణం పట్టే విధంగా వర్ణించినవి చాలా తక్కువగానే వచ్చాయి.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి 1925లో రాసిన 'పుల్లంరాజు కథ'లో తొలిసారిగా దళితుల ప్రస్తావన కనిపిస్తుంది. దళిత జీవితాన్ని, సంవేదనలను, పోరాట చైతన్యాన్ని వర్ణించిన తొలి దళిత కథగా కొలకలూరి ఇనాక్ రాసిన 'ఊరబావి' (1968-69) కథను పరిశోధకులు గుర్తిస్తున్నారు. ఈ కథలో వ్యవస్థ కోసం వ్యక్తి చేసిన త్యాగం, దళితుల్లోని వివిధ తరాల్లో వచ్చిన చైతన్యాన్ని వర్ణించారు. ఈ కథలో మాల మాదిగలందరికీ నీటి సమస్యను తీర్చడానికి ఒక దళిత స్త్రీ చూపిన సాహసంలో ధైర్యం ఉంది. అగ్రవర్ణ కుట్రను ఎదుర్కొనే ఆలోచన ఉంది.

డా|| భార్గవీరావు సంకలనం చేసిన 'ఇంకానా ఇకపై సాగవు', కె. లక్ష్మీనారాయణ, ఆర్. చంద్రశేఖర్ రెడ్డి సంపాదకత్వం, సంకలనంలో వచ్చిన 'దళిత కథలు', గోగు శ్యామల, జూపాక సుభద్ర సంపాదకత్వంలో వచ్చిన 'రేగడి సాల్లు' (2006), రచయితలే విడివిడిగా ప్రచురించుకున్న కథా సంపుటాలలో సుమారు వెయ్యికి పైగా దళిత కథలు కనిపిస్తున్నాయి. కొలకలూరి ఇనాక్, బోయ జంగయ్య, కాలువ మల్లయ్య, శాంతి నారాయణ, ఎండ్లూరి సుధాకర్, నాగప్పగారి సుందర్రాజు, గోగు శ్యామల, జూపాక సుభద్ర, చల్లపల్లి స్వరూప రాణి, జాజుల గౌరి మొదలైన వాళ్ళు రాసిన దళిత కథల్లో నిజమైన దళిత జీవితం కనిపిస్తుంది. దళితేతరులు రాసిన కథల్లో కరుణకుమార్, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి, గోపీచంద్ వంటి వారు కూడా దళిత జీవితాల్లోని అనేక కోణాలను చిత్రించగలిగారు. చలం కొన్ని కథలు రాసినా దళిత జీవితం పట్ల సరైన అవగాహన లేదనిపిస్తుంది. క్రైస్తవం దళితుల్లో తెచ్చిన సాంఘిక, ఆర్థిక అభ్యున్నతితో పాటు, నీరుగార్చే చైతన్యాన్ని కూడా ధారాగోపి, చిలుకూరి దేవపుత్ర వంటి కథకులు వర్ణించగలిగారు.

దళితుల్లోని అంత:సంఘర్షణను, ముఖ్యంగా మాల - మాదిగల మధ్య సాంస్కృతిక, ఆర్థిక సామాజిక వ్యత్యాసాలను స్వామి, మద్దూరి నగేష్ బాబు, పైడితెరేష్ బాబు, ఎండ్లూరి సుధాకర్, ఒమ్మి రమేష్ బాబు, గోగు శ్యామల, జూపాక సుభద్ర మొదలైన వాళ్ళు వర్ణిస్తూ కథలు రాశారు.

నసుమాస్వామి, బిఎస్. రాములు, కాలువ మల్లయ్య, కాసుల ప్రతాపరెడ్డి మొదలైన వారు కథల్లో మార్క్సిస్టు, తెలంగాణ సమస్యలను దళిత జీవిత కోణాల నుండి వర్ణించారు.

మొత్తం మీద దళిత కథ 1934-68 వరకు సంస్కరణోద్యమ దశగా చెప్పుకోవచ్చు. ఈ దశలో సానుభూతి ధోరణి కనిపిస్తుంది. 1968-80 వరకు కులనిర్మూలన దశ. ఈ దశలో మాల, మాదిగలలో ఉండవలసిన సమష్టి పోరాట చైతన్యాన్ని చిత్రిస్తూనే, నీటి సమస్య, వృత్తి చేత పొందే న్యూనత, ఆర్థిక వెనుకబాటుతనం, దళితులు చదువుకోవలసిన అవసరం, క్రైస్తవ, ముస్లిం మతాంతరీకరణ, కులనిర్మూలన చైతన్యంతో కథలు వచ్చాయి.1980-95 వరకు దళిత పోరాట చైతన్య దశ. ఈ దశలో దళితులలో వచ్చిన చైతన్యం చిత్రించబడింది. కారంచేడు, పదిరి కుప్పం, చుండూరు తదితర ప్రాంతాలలో దళితులపై జరిగిన దాడుల నేపథ్యంలో అంబేద్కర్ భావజాలం, ఆత్మగౌరవ పోరాటం మొదలైనవి ప్రతిఫలించాయి. 1995 నుండి నేటివరకు వరకు దళిత బహుజన సమైక్య దశ. ఈ దశలో ఉత్తర భారత దేశంలోని రాజకీయ పరిణామాల నేపథ్యంతో బహుజన్ సమాజ్ పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసినట్లే ఆంధ్రప్రదేశ్ లోనూ ఏర్పాటు చేయాలనే ఆకాంక్షతో కొన్ని కథలు వస్తున్నాయి. బి.సి. కులాల నుండి వచ్చిన కథకులు ఈ దిశగా మంచి కథలు రాశారు. మాల, మాదిగల మధ్య వర్గీకరణ నేపథ్యంలో జరుగుతున్న సంఘర్షణలకు రాజ్యాధికారమే పరిష్కారం చూపుతుందనే ఆలోచనలు కూడా కొన్ని కథల్లో కనిపిస్తునాయి.

మొత్తం మీద వస్తు విస్తృతితో పాటు శిల్ప పరమైన మార్పులు కూడా దళిత కథ అందించగలిగింది. అయినా, సాంస్కృతిక, ఆర్థిక అంశాలను వర్ణిస్తూనే దళిత తాత్విక భూమికను విస్మరించకుండా అంబేద్కర్ భావజాలంతో మరిన్ని కథలు రావలసి ఉంది.

**దళిత నాటకం:**

పందొమ్మిది వందల ముప్పై ప్రాంతం నుండి దళితులను ప్రస్తావిస్తూ కొన్ని నాటికలు, నాటకాలు వచ్చాయి. వాటిని దళితులపై సానుభూతిని చూపుతూ వచ్చిన నాటకాలుగానే చెప్పుకోవచ్చు. ధర్మవరం గోపాలాచార్యుల 'అస్పృశ్యవిజయం'లో అస్పృశ్యత మహాపాపమని వివరించే నాటకం. మునిమాణిక్యం నరసింహారావు తిరుగుబాటు (1938), దర్భ భాస్కరమ్మ 'దేవాలయ ప్రవేశం' ఓరుగంటి కృష్ణ కౌండిన్య 'కృష్ణ చరితం' (1933), బండారు మృంత్యుంజయ 'సమాజం మారాలి', ఆచార్య ఎన్.జి. రంగా 'హరిజననాయకుడు' (1933), ఉన్నవ లక్ష్మీనారాయణ 'హరిజన నాటకం' (1933) వంటి నాటకాలలో ఆయా రచయితలకు దళితుల పట్ల ఉన్న సానుభూతి కనిపిస్తుంది.

దళిత జీవితాన్ని పౌరాణిక, చారిత్రక, సాంఘిక ఇతివృత్తాలతో రాసిన నాటకాలు కూడా కొన్ని కనిపిస్తున్నాయి. దళితులపై సానుభూతి చూపడంటూనే వారి ప్రతిభను వివరించే ప్రయత్నం చేసిన నాటకాలున్నాయి. పుట్టుక, *'కలిసిమెలిసి తిరగటం'*, *'ప్రేమ వివాహాలు'*, *'దేవాలయ ప్రవేశం'*, తిరుగుబాటు భావాలతో కొన్ని నాటకాలు వచ్చాయి.

1959లో బోయి భీమన్న రాసిన 'రాగవాశిష్టం' నాటకాన్ని తొలి దళిత నాటకంగా భావించే అవకాశం ఉంది. దళితుల పుట్టుక కూడా ఉన్నతమైనదేనని, దళితులు

హిందువులలో భాగమని వాదించే నాటకం 'రాగవాశిష్ఠం'. ఈ రచయితే రాసిన 'ఆదికవి వాల్మీకి' (1970), 'పాలేరు' నాటకం దళితులను ఆలోచింపజేసినవి. కొలకలూరి ఇనాక్ రాసిన 'మునివాహనుడు' నాటకం దళితులు దేవాలయ ప్రవేశాన్ని, వారి భక్తిని శక్తివంతంగా వర్ణించింది. ఇంకా సాంఘిక నాటకాలు కూడా చాలా వచ్చాయి.

దళిత సాహిత్య విమర్శ:

'చిక్కనవుతున్న పాట' (1985)కి జి. లక్ష్మీనరసయ్య దేశీయ మార్క్సిజమే 'దళిత కవిత్వ ఎజెండా' పేరుతో రాసిన ముందు మాటతో తెలుగులో దళిత సాహిత్య విమర్శ శాస్త్రీయ పద్ధతిలో ప్రారంభమయింది. అంతకుముందు గుర్రం జాషువా, బోయి భీమన్న, కొలకలూరి ఇనాక్, కత్తి పద్మారావు, బొజ్జా తారకం మొదలైనవారు ఆయా గ్రంథాలకు రాసిన/రాసుకున్న ముందుమాటల్లోనూ దళిత సాహిత్య విమర్శ కనిపిస్తున్నా, అది అస్పృశ్యతా నివారణను ప్రధానంగా చేసుకొని అనేకాంశాలను విశ్లేషించినదే అవుతుంది. వివిధ విశ్వ విద్యాలయాల్లో గుర్రం జాషువా, బోయి భీమన్న, కొలకలూరి ఇనాక్ రచనలపై కొన్ని పరిశోధనలు జరిగాయి. వాటిలో కొంత విమర్శ ఉన్నా, జి.లక్ష్మీనరసయ్య రాసిన వ్యాసాలలోనే దళిత సాహిత్య విమర్శ స్పష్టంగా కనిపిస్తుది.

ఆచార్య గుజ్జర్లమూడి కృపాచారి గారు దళిత కవిత్వంలో ధ్వని సూత్రాలను అన్వయించి, దళితసాహిత్య విమర్శకు దేశీయ భూమికను ఏర్పరిచే ప్రయత్నం చేశారు. కొలకలూరి ఇనాక్ ఆధునిక విమర్శ సూత్రాలలో దళిత సాహిత్య విమర్శకు శాస్త్రీయ విశ్లేషణను అందించారు. దళిత కథపై నసుమాస స్వామి, దళిత ఉద్యమంపై ఎస్వీ సత్యనారాయణ, చారిత్రక, భౌతిక దృక్పథాన్ని కత్తి పద్మారావు, కె.కె. రంగనాథాచార్యులు, దళిత సాహిత్యంలో బి.సి. వాదాన్ని బి.ఎస్. రాములు, పోస్టుమోడరన్ దృక్పథాన్ని బి. తిరుపతిరావు, పోస్టుమోడరన్ దృక్పథ వ్యతిరేకతను సతీష్‌చందర్, జాషువా సాహిత్యంపై ఎండ్లూరి సుధాకర్, అనువర్తిత దళిత సాహిత్య విమర్శను శిఖామణి మొద లైనవారు విశేషమైన కృషి చేశారు.

సమన్వయ దృక్పథాన్ని అఫ్సర్, చందు సుబ్బారావు, అద్దేపల్లి రామమోహనరావు, ద్వా.నా. శాస్త్రి, ప్రసేన్, బొజ్జా తారకం, కలేకూరి ప్రసాద్, కోయి కోటేశ్వరరావు, కె. సత్యనారాయణ, కొప్పర్తి, దార్ల వెంకటేశ్వరరావు, మేడేపల్లి రవికుమార్, పి.సి. రాములు, హెచ్చార్కే, మో, కోవెల సంపత్కుమారాచార్య, ఆర్.ఎస్. సుదర్శనం, కొడపల్లి సుదర్శనం రాజు, కె. లక్ష్మీనారాయణ, గద్దల భాను, కాసుల ప్రతాపరెడ్డి, కొల్లూరి చిరంజీవి, జ్వాలాముఖి, నగ్నముని, తుమ్మల భారతి, కొలకలూరి మధుజ్యోతి తదితరులు అందించారు. వీరే కాకుండా, గోగు శ్యామల, ఎస్జీడీ చంద్రశేఖర్, బూదాటి వెంకటేశ్వర్లు, దేవరపల్లి మస్తాన్‌రావు, వెలమల సిమ్మన్న, కాలువ మల్లయ్య, ఆర్.చంద్రశేఖర్ రెడ్డి మొదలైన వారంతా దళిత సాహిత్య విమర్శను పరిపుష్టం చేస్తున్నారు.

ప్రధానంగా దళిత సాహిత్య విమర్శ జాషువాపై ఎక్కువగా వచ్చింది. ఆ తరువాత వచన కవిత్వం, భాష, అశ్లీల పదాలు, భారతీయ ఆలంకారిక దృక్పథం మొదలైన అంశాలపై ఎక్కువగా వచ్చింది. అయినప్పటికీ, దళిత సాహిత్య విమర్శ సంప్రదాయ సాహిత్యాన్ని విమర్శించటమే పనిగా పెట్టుకున్నట్టు ఉందనే అభిప్రాయాలున్నాయి. మరింత మౌలికంగా శాస్త్రీయంగా దళిత సాహిత్య విమర్శ రావలసిన అవసరం ఉంది. ప్రస్తుతం దళిత సాహిత్య విమర్శలో కనిపిస్తున్న ధోరణులను గమనిస్తే ఆ సాహిత్య విమర్శ పయనించవలసిన మార్గం స్పష్టమవుతుంది.

**దళిత విమర్శ ధోరణులు:**

1. ప్రాచీన కావ్యాలలో సామాన్య పాత్రలకు కనీస అవకాశం కల్పించలేదు. సమాజంలో కేవలం కొన్ని వర్ణాలవారి ఆలోచనలతో కూడినదే సాహిత్యంగా ప్రచారం పొందింది.

2. అలంకార శాస్త్రాలు, లక్షణ గ్రంథాలు చాలా వరకు నిమ్న వర్ణాల గురించి రాయటాన్ని అంగీకరించలేదు. తప్పనిసరి పరిస్థితులలో కొన్ని పాత్రలను ప్రవేశపెట్టినా వాటిని నీచ పాత్రలుగానే చిత్రించాయి. సమాజంలో కొన్ని వర్ణాలవారే సుగుణ స్వభావం కలిగి ఉంటారనే దృక్పథం వాస్తవానికి దూరంగా ఉంది.

3. కొన్ని వందల యేండ్ల సాహిత్యమంతా అసత్యాలతో నిండి పాలక వర్గాల ఆధిపత్యంలో కొనసాగింది. దళితులను అణచివేసే దిశగా ప్రజల భాషకేమాత్రం సంబంధంలేని సంస్కృత భాషలో, ఆ భాషానువాదాలతో దాని మనుగడ కొనసాగింది.

4. ఆధ్యాత్మిక భావాల పేరుతో భావవాదాన్ని ప్రచారం చేసి సాహిత్యం ద్వారా శాస్త్రీయమైన ఆలోచనకు అవకాశం కలగనివ్వలేదు. విదేశీ పాలకుల ప్రవేశంతో హిందూ మత పరిరక్షణకు వివిధ పేర్లతో సంస్కరణ విధానాలను పాటించినా, దళిత సాహితీ వేత్తలు ఆ నేపథ్యాన్ని గుర్తెరిగి సాహిత్యాన్ని పునర్మూల్యాంకనం జరగాలి. మౌఖిక సాహిత్యంలో ఉన్న దళితుల మూలాలు బహిర్గతపరిచే ప్రయత్నం జరగాలి.

5. దళితులను అణచివేసిన భావజాలమే బ్రాహ్మణవాదం. బ్రాహ్మణులను లేదా ప్రత్యేకంగా కొన్ని కులాలను నిందించటం దళిత సాహిత్య విమర్శ ధోరణి కాదు.

6. తెలుగులో దళిత సాహిత్యాన్ని తెలంగాణ ప్రాంతపరంగానూ, ఆంధ్ర ప్రాంతపరంగానూ ప్రత్యేక పరిశీలనలు అవసరం. కారంచేడు సంఘటనతోనే తెలుగు దళిత సాహిత్య చరిత్ర అంబేద్కర్ దృక్పథంతో ప్రారంభమయింది అనటంలో ఆంధ్ర ప్రాంత దళిత రచయితల ఆధిపత్యం కనిపిస్తుంది. ఆంధ్ర ప్రాంత రచయితల రచనలలో క్రైస్తవ మతం, తెలంగాణ ప్రాంత రచయితల రచనలలో హిందూ, ముస్లిం మత విప్లవ సాహిత్య భావాలలో స్పష్టమైన విభజన రేఖను విస్మరిస్తున్నారు.

7. ఎవరి కులం గురించి వాళ్ళు మాత్రమే కుల సంఘాలకు పరిమితమైన దృష్టితో పరిమిత ప్రయోజనంతో సాహిత్యం కుదించుకుపోతుంది. అందువల్ల, దళిత సాహిత్య చరిత్ర పునర్మూల్యాంకనం చేసేటప్పుడు ఏ కులంలో పుట్టారనే దానితో పాటు ఆ రచయితలు దళితుల గురించి రాశారో లేదో పరిగణలోకి తీసుకోవాలి.

8. దళిత సాహిత్య చరిత్రను అంటరానితనం, కులవ్యవస్థ మొదలైనప్పటి నుండి పరిశీలించాలి. దీనిలో భాగంగానే చిందు భాగవతం, జాంబ పురాణాలను చూడాలి.

9. దళిత సాహిత్యంతో విడదీయరాని బంధాన్ని పెనవేసుకున్న క్రైస్తవ సాహిత్యాన్ని అధ్యయనం చేసేటప్పుడు మత దృక్పథం పట్ల ప్రత్యేక సూత్రాలతో విశ్లేషించాలి.

10. కుల నిర్మూలనతోనే దళితుల విముక్తి సాధ్యమవుతుందా? వర్గ దృక్పథం కూడా అవసరమా? అయితే అది ఎంతవరకు అవసరమనేది స్పష్టం చేయవలసిన అవసరముంది. దేశీయ మార్క్సిజం పేరుతో జరిగిన చర్చ కొంతవరకు ఈ విషయాన్ని ముందుకు తీసుకెళ్ళింది.

11. దళిత సాహిత్యం ఏర్పర్చుకొనే పరిధి వల్ల దళితులంటే ఎవరనేది స్పష్టమవుతుంది. షెడ్యూల్డు తెగలు, వెనకబడిన తరగతులు, ముస్లిములు దళితులవుతారా? ఈ విషయంలో ఇంకా స్పష్టత అవసరం. దళితులు, దళిత బహుజనులు వంటి పారిభాషిక పదాలను దళిత సాహిత్యం రాజకీయపరంగా కాకుండా సాంఘిక పీడన, కుల ప్రభావాన్ని అనుసరించి అన్ని వేళలా ఒకే అవగాహనతో ప్రయోగించవలసి ఉంది.

12. సాహిత్యంలో నాయకత్వ పాత్రలను సృజించేటప్పుడు అధికారం, భూమి సమస్య సాంఘిక హోదాల విషయంలో దళిత రచయితలకు స్పష్టత అవసరం.

13 దళితులలో ప్రధానంగా మాల, మాదిగల మధ్యే రిజర్వేషన్ల కోసం జరుగుతున్న అంతఃసంఘర్షణ వల్ల వస్తున్న సాహిత్యం దళిత సాహిత్య వికాసమా? వైఫల్యమా?

14. స్త్రీవాద సాహిత్యలో దళిత స్త్రీ సమస్యలను సమర్థవంతంగా చిత్రణ జరగక పోవడానికి ఆ జీవితం తెలియక పోవడమా? విస్మరించడమా?

15. దళిత సాహిత్యాభివ్యక్తిని శక్తివంతంగా వ్యక్తీకరించడానికి ప్రత్యేక భాషను ప్రయోగించడం, అశ్లీల పదాలను గ్రహించటం, భారతీయ ఆలంకారిక శాస్త్రాంశాలను నిరసించటం, పాశ్చాత్య సాహిత్య సంప్రదాయాలను పాటించటలో గల పరిధులను స్పష్టంగా గుర్తించాలి.

16. దళిత సాహిత్యల ప్రక్రియా పరంగా గేయం (పాట), పద్యం, కథ, నవల, నాటకం, వ్యాసం వంటి వాటిలో దళితులకు దగ్గరైనవేమిటో, అవసరమైనవేమిటో, ఇంకా రావలిసినవేమిటో గమనిస్తుండాలి.

మొత్తం మీద దళిత వచన కవిత్వమే దళిత సాహిత్యంగా కూడా భావింపబడింది. కానీ, అనతి కాలంలోనే వివిధ ప్రక్రియలను పరిశీలించిన తరువాత సాహితీవేత్తల అభిప్రాయంలో మార్పు కలిగింది. భారతీయ సాహిత్యంలో వివిధ భాషల్లో కూడా దళిత సాహిత్యం విస్తృతంగానే వచ్చి, ఆ ప్రభావం తెలుగు దళిత కవిత్వం పై చూపింది.

ఇంత వస్తు వైవిధ్యాలను ప్రదర్శించినా, దళితులకు అందుబాటులో ఉండే సాహిత్య ప్రక్రియ పాటగానే (గేయం) కొంతమంది విమర్శకులు భావిస్తున్నారు. వచన కవిత్వం మధ్య తరగతి విద్యావంతులకు మాత్రమే బాగా అందుబాటులోకి వచ్చిన సాహిత్య ప్రక్రియ అనే విమర్శ కుడా ఉంది.

**ఆధార గ్రంథాలు:**


ఆనందరావు, కె. *హరిజనాభ్యుదయం ఆధునికాంధ్ర కవిత్వం.* విశాఖపట్నం: చైతన్య సాహితి స్రవంతి, 1994.

ఇనాక్, కొలకలూరి. *ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం.* గుంటూరు: మారుతి బుక్ హౌస్, 1996.

చిన్నారావు, యాగాటి. *ఆంధ్రప్రదేశ్ దళిత ఉద్యమ చరిత్ర (1900 1950).* హైదరాబాదు: హైదరాబాదు బుక్ ట్రస్ట్ ప్రచురణ, 2007

పోతన్న, వి. *హరిజనాభ్యుదయం తెలుగు నాటకం.* కర్నూల్: తేజో ప్రచురణలు, 1994.

ప్రసాద్, కలేకూరి. *దళిత ఉద్యమం - దళిత సాహిత్యోద్యమం.*హైదరాబాదు: సాక్షి, హ్యూమన్ రైట్స్ వాచ్, 1999.

మాధవరావు, గుర్రం. *దళిత సాహిత్యంలో వాద ప్రతివాద విమర్శ* (అముద్రిత ఎం.ఫిల్ సిద్ధాంత వ్యాసం). హైదరాబాదు: హైదరాబాదు విశ్వ విద్యాలయం, 2007.

రంగనాథాచార్యులు, కె.కె. *ఆధునిక సాహిత్యం దళిత స్పృహ.* హైదరాబాదు: యువభారతి ప్రచురణ 1993.

లక్ష్మీనారాయణ, కె. *హరిజనాభ్యుదయం తెలుగు కథానిక.* అనంతపురం: రమా పబ్లికేషన్, 1996.

లక్ష్మీనర్సయ్య, జి. *దళిత సాహిత్యం తాత్విక దృక్పథం.* విజయవాడ: దళిత సాన ప్రచురణలు, 1999.

శ్యామ సుందరరావు, అంబటి. *దళిత సాహిత్యం భాషా దృక్పథం* (అముద్రిత ఎం.ఫిల్ సిద్ధాంత వ్యాసం). హైదరాబాదు: హైదరాబాదు విశ్వ విద్యాలయం, 2000.

శాంసన్, పిల్లి. *దళిత సాహిత్య చరిత్ర.* గుంటూరు:
గుంటూరు యూనియన్ ప్రింటర్స్, 2000.
సత్యనారాయణ, ఎస్వీ. *తెలుగులో ఉద్యమ గీతాలు.* హైదరాబాదు:
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1991.
సత్యనారాయణ, ఎస్వీ. (సంపా). *దళిత వాద వివాదాలు.* హైదరాబాదు:
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 2000.
స్వామి, ననుమాస. తెలుగు నవలా అస్పృశ్యతా సమస్య. సికింద్రాబాదు:
ఉదయశ్రీ ప్రచురణలు, 1990.

***

# కులం - వర్గం: శంబుక దృక్పథం

సమాజాన్ని స్పష్టంగా అర్థం చేసుకోవాలంటే, సమకాలీన సాహిత్యాన్ని, అందులోనూ దళిత సాహిత్యాన్ని అధ్యయనం చేయడం అత్యంత అవసరం! దళితుల భాగస్వామ్యంలేని భారతీయ సమాజాభివృద్ధిని ఊహించడం అసాధ్యం. కుల వివక్షను అనుభవిస్తూ, తప్పనిసరై చేస్తున్న వృత్తులు, కులవృత్తులుగా వంశపారపర్యం కావడం, అవి దేశ సంపదకు ప్రధానమైనా, వాళ్ళెలా అప్రధానమయ్యారో శాస్త్రీయంగా అధ్యయనం చెయ్యడం ప్రస్తుత అవసరం. ఈ దిశగా విశ్వవిద్యాలయ స్థాయిలో దళిత సాహిత్యం ప్రత్యేక అంశంగా ఎం.ఏ స్థాయిలో పాఠ్యాంశాలవుతున్నాయి.

నిషేధాలు, సానుభూతులు, సంఘర్షణలు, సహకారాలు దళిత జీవితాల్లో ఎలా పెనవేసుకుపోయాయో, అవన్నీ భారతీయ సమాజంతో ఎలా ముడిపడి ఉన్నాయో తెలియకపోతే, సంక్లిష్టమైన సమాజాన్ని అవగాహన చేసుకోవడం అంత సులభం కాదు. ఈ సంక్లిష్టత అర్థం కావాలంటే దళిత జీవితం, దళిత సాహిత్యం మరింత అవగాహన కావాలి. రచనలు చేసేవారు సమాజ సంక్లిష్టతను అర్థం చేసుకోవడాన్ని బట్టే వారి సాహిత్య ప్రతిఫలనం జరుగుతుంటుంది. ఈ ప్రతిఫలనం దళిత సాహిత్యంలో మరింత స్పష్టంగా కనిపిస్తుంటుంది. అయితే, కేవలం రచనలను బట్టే రచన చేసిన వారి స్వభావాన్ని పూర్తిగా అంచనా వేయడానికి కూడా కొన్ని సమస్యలు ఉన్నాయి.

దళితులను వ్యతిరేకిస్తూ, వారిని అణచివేస్తూ, ఆ దళితులనే పునాదులుగా చేసుకొని 'అభివృద్ధి'లోకి వస్తున్న వాళ్ళు సమాజంలో ఎంతోమంది ఉన్నారు. అలాగే చదువుకున్న మేథావుల్లో కూడా దళిత సాహిత్యాన్ని వ్యతిరేకిస్తూ బయటకొచ్చి వేదికలెక్కి ఊకదంపుడు ఉపన్యాసాలను దంచేస్తున్నా వాళ్ళూ ఉన్నారు. అవసరమైతే రాశామని చెప్పుకోవడానికి సానుభూతి దిగతుడుపుగా దళిత సాహిత్యాన్ని కూడా రాస్తుంటారు. దానివల్ల వస్తే, గిస్తే సన్మానాలు, బహుమతులు అందుకోవడానికీ వెనుకాడరు. కొంతమంది దళితులుగా పుట్టిన వాళ్ళూ దళితులం కాదంటునే దళితులకొచ్చే అన్ని అవకాశాలనూ కొల్లగొట్టేయడంలో ఇతర కులాలకే మాత్రం తీసిపోలేదని కూడా నిరూపిస్తున్నారు. ఇటువంటి పరిస్థితులను ప్రత్యక్షంగా చూస్తున్న వాళ్ళు తెలిసిన వాళ్ళు, చైతన్యవంతులైతే ఏదొకరూపంలో తమ నిరసనను వ్యక్తం చేస్తుంటారు. అలాంటి వారిలో 'శంబుక' ఒకడు.

**శంబుక దళిత చైతన్యం:**

శంబుక పేరుపెట్టుకున్న ప్రత్తిపాటి మల్లేశ్వరరావు సమకాలీన సమాజంలో కనిపించే హిపోక్రసీని చూస్తూ, నోరు మూసుకుని, కాళ్ళూ చేతులుకట్టుకొని, ఏమూలనో దాక్కుంటూ, తన పబ్బం గడిపేసుకుందామనుకోలేదు. మాటై, పాటై ఉద్యమ బాటై స్పందించాడు. తన భావాలను కవిత్వంగా పల్లవింపజేశాడు. తన ఆలోచనలను పరిశోధనాత్మకంగా రాసిన ''ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు ఉద్యమంపై కుల ప్రభావం -

ఒక పరిశీలన''లోనూ, ''చరిత్రలో క్రైస్తవం-ఒక పరిశీలన''లోనూ స్పష్టంగానే చెప్పాడు. ఆశలు రేపినా కూడా ఆవేశంతో ముంచేసిందొకటైతే, ఆవేశాన్ని అణచివేసిన కులం రంగు పూసుకుని వివక్షను ప్రదర్శించేది మరొకటి దళితులను దగా చేసిందని నోరెత్తి, హోరెత్తి అక్షరమై ఆ గ్రంథాల్లో ధ్వనింపచేశాడు శంబుక.

కుల నిర్మూలనకు, నిర్మూలన అవగాహనకు, తద్వారా సమాజం చైతన్యవంతం కావడానికీ ఆధునిక ఆలోచనలను పంచాలనే భావంతో నాస్తిక సమాజంలో చేరి, ప్రతీ విషయాన్ని దేవిడితో ముడిపెట్టే కర్మ సిద్ధాంతాన్ని ఖండించాడు. ఆధునిక భారతీయ సమాజంలో దళితపల్లె కూడా ఒకటవ్వాలని కలలుగన్నాడు.

దళిత సాహిత్యంలో తమకోసం జీవితాలను త్యాగాలను చేసిన వారిని స్మరించుకొంటూ, చైతన్యం పొందడమనే లక్షణం ఒకటి ఉంది. దీనిలో భాగమే 'శంబుక'పై ఈ వ్యాసం. శంబుక రాసిన వ్యాసాలు జోలికి పోకుండా అతడు రాసిన కవిత్వంలో కనిపించే దళిత దృక్పథాన్నే ఈ వ్యాసంలో చెప్పాలనుకుంటున్నాను. 1958 డిసెంబర్ 9న పుట్టి, గుంటూరు పరిసరాలు చైతన్యవంతం చేయడంలో తనవంతు పాత్ర నిర్వహించిన శంబుకను మార్క్సిస్టు దళారీలు ఏప్రిల్ ఒకటో తేది 1995న దారుణంగా హత్య చేశారు. 'శంబుక' ఆశించిందేమిటి? అతని కవిత్వాన్ని తెలుగు సాహిత్యంలో, దళిత సాహిత్యం ఎలా అర్థం చేసుకోవాలి?

**శంబుక దళిత దృక్పథం:**

''శంబుక'' రాసిన కవితల్లో కొన్నింటిని ''పోయేదేమీ లేనోళ్ళం'' పేరుతో ఒక పుస్తక రూపంలోకి తెచ్చారు. వీటిలో శంబుక దళిత దృక్పథం, దళిత సాహిత్య అధ్యయనంలో ఒక ప్రధానవర్గ కోణాన్ని ఆవిష్కరించేదిగా ఉంది. శంబుక దళిత దృక్పథంలో కిందివి ప్రధానంగా కనిపిస్తాయి.

1) సమాజంలో కులం కనిపించడం ఒక విస్మరించలేని వాస్తవం.

2) ''కులం'' పేరుతో దోపిడి జరుగుతుంది. ఇది భిన్న రూపాల్లో ఉంది. దీన్ని వివరించడం.

3) కుల నిర్మూలనకు కృషి చేస్తున్నదెవరు? వ్యతిరేకిస్తున్నదెవరు? గమనించవలసి అవసరాన్ని నొక్కి చెప్పడం.

4) కులాన్ని వాడుకుంటూనే, కులాన్ని విస్మరించే వాళ్ళని వ్యతిరేకించడం.

5) కులపరంగా, ఆర్థికపరంగా మార్క్సిస్టులు పోరాటాలను నిర్మించవలసిన అవసరాన్ని చాటడం.

6) మార్క్సిస్టు పార్టీలో నాయకత్వం అగ్రవర్ణాలనబడే వారి చేతుల్లోనే మారు రూపాల్లో చేరడంవల్ల మార్క్స్, లెనిన్ మావో ఆశయాలు నెరవేరడం లేదనే అనుభవ సత్యాన్ని చాటడం.

7) దళితుల ఆత్మ గౌరవ ప్రకటనతో స్వీయ ఉద్యమాల నిర్మాణావశ్యకత నుంచటం.

వీటితోపాటు మరికొన్ని అంశాల్నీ తన కవిత్వంలో శంబుక శక్తివంతంగా చెప్పే ప్రయత్నం చేశాడు.

**విస్మరించలేని స్థితిలో కులం:**

''కులమయమిదం భారత్'' కవితలో ''శంబుక'' సమాజ అంతరాల్లో కులం చొచ్చుకుపోయిన మార్గాలను అన్వేషించి చూపాడు. గుడిలో, బడిలో, మతంలో, ప్రేమలో, పెళ్ళిలో, ఉద్యోగంలో నిరుద్యోగిగా ఉండిపోవడంలో ప్రభుత్వంలో, ప్రభుత్వ యంత్రాంగంలో, ఓట్ల-సీట్లలో, కాలేజిల్లో, కార్ఖానాల్లో, పండితునిలో, పామరునిలో, నీటి బోరుల్లో విద్యుద్దీపాల్లో, జైళ్ళలో, నల్లకోట్ల న్యాయంలో, నాయకత్వంలో, రౌడీయిజంలో, పల్లెల్లో, పట్నాల్లో, పార్టీల్లో, చివరికి చావులో కూడా 'కులం' ప్రస్తావన అనేది లేకుండా లేదు. కాకపోతే, ఆచారంగానో, సంప్రదాయంగానో కలిసిపోయి, అంతర్యాన్ని వ్యక్తం చేస్తూ కుల స్వభావాన్ని కాపాడుకుంటూ ఉంటుంది.

దీనివల్ల కులానికీ 'ఒక్కో సంస్కృతి' రూపొందడంలో ఆశ్చర్యపోవలసిన పనేమీలేదు. కానీ, భారతీయ సమాజాన్ని చూసినట్లయితే, నాటి నుండి నేటి వరకూ దళితులు రకరకాల పీడనలను ఎదుర్కొంటూనే ఉన్నారు. ఆ పీడనల నుండి రక్షించుకోవడానికి మతమార్పిడిలను తప్పని పరిస్థితుల్లో అంగీకరించవలసి వచ్చింది. ఏ కొందరో ఇష్టపడి కొన్ని మతాల్లోకి వెళ్ళినా, ఆ మతాల్లోనూ దళితులకు దక్కిన గౌరవం అనుభవంలోకొచ్చేసరికి, అందులోను ఇమడ లేని పరిస్థితులు. ఇలా హిందువులు, ముస్లింలు క్రైస్తవులు, బౌద్ధులుగా దళితులు మారిపోవడంలో పీడన నుండి బయటకు రావాలనే ఆలోచనే ప్రధానం. దీని ఫలితంగా సంస్కృతి వైవిధ్యం దళితుల్లో ఎక్కువగా కనిపించినా, కులంలోని అంటరానితనం దళితులనందరినీ ఏక సూత్రంలో కట్టిపడేసిందని చెప్పుకోవచ్చు.

భారతదేశ వ్యాప్తంగా ఉన్న దళితులను పరిశీలించినట్లయితే కులానికో సంస్కృతి ఉన్నా, విభిన్న సంస్కృతులతో పాటు అస్పృశ్యత అనే గుణం దళితుల్లోనే కనిపిస్తూ అది వంశపారంపర్యం అయ్యిందని తెలుస్తుంది. 'కులం' ఒక కాదనలేని సత్యమై కూర్చొంది! ''కులమయమిదంభారత్'' కవితలో శంబుక తన సైద్ధాంతిక భూమికనంతా ఈ కవితలో కనిపించేటట్లు చేసుకున్నాడు. సిద్ధాంత వివరణ చేస్తున్నట్లుగా మిగిలిన కవితలను వర్ణించాడు. శంబుక కవిత్వం సామాన్యమైన పదాలతో అలవోకగా సాగిపోతుంది. అందువల్ల చాలా మంది శంబుక కవిత్వంలో శిల్పం సరిగ్గా పట్టించుకోలేదన్నారు. అయితే ఈ సందర్భంలో సాహిత్య అభివ్యక్తి గురించి మాట్లాడుకోవలసిన అవసరం ఉంది.

'కులమయమిదం భారత్' కవితలో సామాన్య పదాలతోనే 'కవిత్వం' చేశాడు కవి. అలంకారాలు తొడగడం కంటే అలవోకగా చెప్పినట్లే కనిపిస్తుంది కవిత. దళిత కవిత్వం ఇలాగే ఉంటుందా? అనే అనుమానం కూడా చాలామందికి కలగవచ్చు. దళిత కవిత్వం ఆధునిక సాహిత్యంలో భాగం. అది మళ్ళీ ఆధునిక సాహిత్యంలోనూ వ్యక్తి, వ్యక్తి చైతన్యం వైయక్తికానుభూతులు మాత్రమే ఆధునిక చైతన్యం కాదనీ, మార్మికంగా వ్యక్తం చెప్తేనే సాహిత్యం గొప్పదనడం వంటి వాటిలో దళిత సాహిత్యానికి కొన్ని విభేదాలున్నాయని ముందుగా గమనించకపోతే శిల్పాభివ్యక్తి గురించే ఎవరైనా మాట్లాడరు. అలా మాట్లాడే వారు దళిత సాహిత్య శిల్పానికి ఉన్న వైవిధ్యాన్ని గమనించవలసి ఉంది.

**దళిత కవిత్వాభివ్యక్తి:**

దళిత సాహిత్యం, ప్రయోజనాల్లో దళితులను చైతన్య పరచటం ప్రధానమైంది. కనుకనే, అభివ్యక్తిలో భాషలో తీసుకొనే అలంకారాలలో, శిల్ప నైపుణ్యంలో అన్నీ దళితులకు అనుగుణమైన, తెలిసిన, అనుభవంలో ఉన్న వాటినే ఉపయోగించుకోవడం కనిపిస్తుంది. నిత్య జీవితంలో ముడిపడిన వాటినే ఉపమానాలుగా, ప్రతీకలుగా గ్రహించటం జరుగుతుంది.

'కళ కోసం కళ' అనే శుద్ధ కళావాదుల వలే కాకుండా 'కళ ప్రజల కొరకే' అనే నైతిక కళావాదుల వర్గంలోకి దళిత కవిత్వం చేరుతుంది. అయితే, దళిత కవిత్వ అభివ్యక్తి మూడు మార్గాలలో పయనిస్తుందని చెప్పే అవకాశం కూడా ఉంది.

1) సాధారణమై పదాలు, నిత్య వ్యవహారంలో కలసిపోయిన సంభాషణ వలే కనిపిస్తూనే భాషకంటే వస్తుతత్వంపై దృష్టిని పెట్టేటట్లు చేయడం.

2) భాష, వస్తుతత్త్వ వ్యక్తీకరణకి సమ ప్రాధాన్యతనిస్తూనే సౌందర్యాభివ్యక్తిలో మరే ఇతర సాహిత్యానికి దళిత సాహిత్యం తీసిపోదని నిరూపించే ప్రయత్నం చేయడం.

3) ప్రతిదాన్నీ వ్యవస్థగా మార్చే ప్రయత్నం కూడా కనిపిస్తుంది.

పైన పేర్కొన్న మొదటి రకానికి శంబుక కవిత్వం చేరుతుందనిపిస్తుంది. ఇక్కడొక విషయాన్ని గుర్తుంచుకోవలసి ఉంది. దళిత కవిత్వ అభివ్యక్తీకరణ పద్ధతులను, స్థాయిలను పేర్కొనడమనేది విశ్లేషణకు వీలుగా అధ్యయన సౌలభ్యం కోసమే తప్ప, ఆధిక్యతలను, ఉచ్చ నీచ భావాలను కల్గించడానికి మాత్రం కాదు.

'శంబుక' కవిత్వం దళితుల కోసం. దళిత సామాన్య ప్రజల కోసం రాసింది కవిత్వాన్ని తూచే పద్ధతుల్లో కొంతమంది దళిత కవులను ప్రత్యక్షంగా విమర్శించక పోయినా పరోక్ష విమర్శలు చేస్తూ, అభివ్యక్తి నైపుణ్యం లేక, రాసిందాన్నంతటికీ గొప్ప కవిత్వాభివ్యక్తిగా కీర్తించుకుంటూ, వస్తూ రూపాల్లో, వస్తువుకే ప్రాధాన్యమని వాదిస్తున్నారనే వాళ్ళూ అక్కడక్కడా కనిపిస్తున్నారు. అలాంటి వాళ్ళకి సరైన సమాధానమిస్తునే వస్తు రూపాల్లో సమప్రాధాన్యత నివ్వగలిగి, ఏ సాహిత్యానికైనా పోటి పెట్టగల దళిత సాహిత్య సృష్టికర్తలు ఎంతోమంది ఉన్నారు. శివసాగర్, ఎండ్లూరి సుధాకర్, సతీష్ చంద్ర, మద్దూరి నగేష్‌బాబు, శిఖామణి, పైడి తెరేష్‌బాబు, కలేకూరి ప్రసాద్ తదితరుల కవిత్వాన్ని పరిశీలిస్తే దళిత సౌందర్యాభివ్యక్తి ఎంత సమర్థవంతంగా వ్యక్తమయ్యిందో తెలుస్తుంది.

దళిత సౌందర్యం వస్తువు వల్లా, దాన్ని అభివ్యక్తీకరించడం వల్ల సమర్థవంతంగా కావడం 'శంబుక' కవిత్వంలోనూ కనిపిస్తుంది. ''పోయేదేమీ లేనోళ్ళం'' అని తన కవితా సంపుటికి పేరు పెట్టుకోవడంలోనే దళితుల పోరాట స్ఫూర్తినీ తెలియపరుస్తున్నాడు.

**కుల నిర్మూలన నిజాయితీ:**

''ఆహా కులమా!'' పేరుతో రాసిన కవితలో ఒక మాదిగ వ్యక్తి బట్టలు ధరిస్తే చూసే చూపులకే అగ్రవర్ణమని పిలవబడే వ్యక్తి బట్టలు ధరించకపోవడంలో నిరాడాంబరత్వాన్ని పోలిక చేసి, ఒకడిది దర్పం, మరొకడిది నిరాడంబరత్వం అనడంలోనే చూసే చూపు సరిగ్గా లేదంటున్నాడు. డా|| అంబేద్కర్, గాంధీలను స్ఫురిపంజేస్తాడు. దీన్ని సమాజంలో కుల నిర్మూలన ఆదర్శ ప్రకటనకు అనుసంధానిస్తూ...

*''బాపనోడు కులం లేదంటే*
*మహోన్నత సంఘ సంస్కర్త, ఆదర్శ జీవి*
*మాలోడు ఇదే అంటే*
*ప్రమాదకరమైన పచ్చి కులతత్త్వవాది*
*'ఓసి' కులమా*
*నీవెంత కసాయిదానివే?!''*- అని ప్రశ్నించడంలో కనిపించే ఆధిపత్య భావజాలాన్ని వివరిస్తున్నాడు. దళితులపై సంస్కరణ పేరుతో చెలాయించే నాయకత్వాన్ని, దాని స్వభావంలో కనిపించే హిపోక్రసీని బహిర్గతం చేస్తున్నాడు. ''ఓసి కులమా అనడంలో అనే పార్శ్వాన్ని కూడా చూడగలిగే అవకాశం ఉంది. ''ఓసి'' కులమా అనే దానిలో కులాన్ని నిందించడమూ ఉంది. కులాంతర వివాహాలు జరిగేటప్పుడు, నిజంగా ప్రేమించేవారికి ప్రతిబంధం కాదు, అని ముందుకెళదామంటే అలా వివాహం చేసుకోవడానికి సిద్ధపడితే, వ్యతిరేకించేదెవరు? ఇలాంటి వైరుధ్యాలు నిండుగా పెట్టుకున్న ఆధిపత్య భావజాలం గలవాళ్ళు, తమ పిల్లలను తమ కులం వాళ్ళకే ఇచ్చి పెళ్ళిళ్ళు చేస్తుంటారు. దానికి అనేక కథలల్లుతారు. ''ఎర్రదొంగలు'' కవితలో...

*'సమాజంలో కౌటిల్యా కులాలేవీలేవంటూ*
*'వర్గం వర్గం' అంటూ కొంగ జపం చేస్తున్న*
*మార్క్సిస్టు అద్వైతులు*
*తన కొడుకులూ, కూతుళ్ళకు*
*తన కులపోళ్ళను మాత్రమే ఏరిఏరి*
*పెళ్ళిళ్ళు చేస్తున్న మార్క్సిస్టు మనువులు*
*ఇంటి గుమ్మంలో మార్క్స్, లెనిన్‌ల ఫోటోలు తగిలించి*
*ఇంటి లోపలి దేవుని ఫోటోలు తగిలించే*
*హిందూ కమ్యూనిస్టుల డొల్లతనాన్ని బట్టబయలు''* చేస్తున్నాడు కవి. కులం వద్దంటూనే కులాన్ని పాటించే వాళ్ళలో వర్గవాదులు కూడా ఏ మాత్రం తీసిపోవట్లేదంటున్నాడు. వీళ్ళు ఎప్పటికీ కుల నిర్మూలనకి ఆదర్శవంతులు కాలేరనీ, దళితులు ఇటువంటి వారిపట్ల జాగురూకలై ఉండవలసిన అవసరాన్ని ఎలుగెత్తి చాటుతున్నాడు. చరిత్రలో ఆదర్శవంతుల జాబితా కోసమే ప్రయత్నించే కుల నిర్మూలన సంస్కర్తల చరిత్రలను పునరాలోచించమంటున్నాడు కవి.

**వర్గ, కుల ప్రత్యామ్నాయ పోరాటమార్గం:**

మనసులో ఒకటి, బయటికి మాట్లాడేది ఇంకొకటి చేయడం కంటే 'వర్గ' వాదులు కూడా 'కులం' చూపిస్తున్న ప్రభావాన్ని గుర్తించమంటున్నాడు కవి. దీనికి స్వీయానుభవం, పరిశోధనతో కూడిన 'కమ్యూనిస్టు ఉద్యమంపై కులం ప్రభావం' గ్రంథం రాయడం శంబుక కవిత్వ అనుభవానికి బాగా తోడ్పడింది. 'దళిత గర్జన'లో...

*''నిన్నడిగేది ఒక్కటే కామ్రేడ్!*

*వర్ణ ధర్మం పేరుతో వాడు నన్ను ఈసడిస్తే*

*వర్గ పోరాటం పేరుతో*

*నీవు నన్ను విస్మరిస్తున్నావు''* అని చెప్పడమే గాకుండా, నాయకత్వంలో ఉన్న వాళ్ళు వర్గవాదులు దళితులను ప్రతిభలేని వాళ్ళుగా ముద్రవేస్తున్నారనీ, పార్టీ క్రమశిక్షణ పేరుతో సేవకులుగా మారుస్తున్నారనీ, మార్క్సిస్టు పడికట్టు పదాలతో గందరగోళానికి గురిచేయడం కంటే వాస్తవాన్ని గుర్తించాలంటున్నాడు. వినే పరిస్థితుల్లో లేని నాయకత్వ పరిరక్షణ జిత్తులను పసిగట్టిన దళితులు ఎర్రజెండా వ్యాపారం చేస్తున్నఈ ఎర్ర బూర్జువా వామపక్షీయుడో, రామపక్షీయుడో గానీ, మా వ్యతిరేక పక్షీయుడావుతున్న వైనాన్ని గుర్తించారని ''పోయేదేమీ లేనోళ్ళం''లో స్పష్టం చేసి, అనింటా మోసపోయిన పరిస్థితుల్లో, నమ్మిన వాళ్ళు కూడా దళితులను బానిసలుగా మార్చుకోవడాన్ని వ్యతిరేకించడం స్వతంత్ర ఉద్యమాన్ని నిర్మించుకోమని ప్రభోధించడం కవి భావాల్లో స్పష్టంగా కనిపిస్తుంది.

**శంబుక మార్క్సిజం:**

దళితులు స్వతంత్ర పోరాటాలను నిర్మించుకుంటున్నారు. దానికి కారణాలేమిటి? మార్క్సిజంలో గల నాయకత్వ వైఫల్యం వల్లనా మార్క్సిజం పునాదుల్లో 'కులం' భాగం కానందువల్లనా! అనేది శంబుక జీవితం. సాహిత్యం ముఖ్యంగా కవిత్వం చదివే వారికి స్పష్టంగా తెలుస్తుంది. జెండాలు మోయడానికే ఉపయోగపడుతున్న దళితులు పార్టీ పేరుతో మార్క్సిస్టు భావజాలంలో, ఆదర్శంలో, ఆచరణలో రాకపోవడానికి కులమే కారణమవుతున్నా దాన్ని అంగీకరించకుండా, కులాధిపత్య భావజాలం గల నాయకులే అడ్డుతగలడం వల్ల, ఆత్మగౌరవాన్ని చంపుకొని, ప్రాణాలను బలిపెట్టడానికే ఆ పోరాటాల్లో మిగిలిపోవడం కంటే, ఆత్మగౌరవ స్వతంత్ర కుల పోరాటం నిర్మించుకోమంటున్నాడు కవి.

దళితుల సమస్యలు ఎజెండాలో పెట్టమంటే, కుల తత్వాన్ని అంటగట్టడం, గతితార్కిక భౌతికవాదాలను వినిపించడం. ఉపరితల అంశాలన్నింటికి పునాదిలోని ఆర్థిక అంశాలే కారణమంటూ సాధారణీకరించడాన్ని తీవ్రంగానే వ్యతిరేకించాడు. వ్యతిరేకించాల్సిన అవసరాన్ని భవిష్యత్ తరాలకు కవిత్వంలో అందించి స్ఫూర్తిదాయకమయ్యాడు.

*''ఈ సాంఘిక ఆర్థిక అసమానతలపై*

*సాయిధంగా తిరగబడతాం*

*మాకు మేము మార్గదర్శకులమౌతాం*

*మేము కారల్‌మార్క్స్ చెప్పిన*

*పోయేదేమీ లేనోళ్ళం''* అంటూ మార్క్సిజాన్ని వ్యతిరేకించడంలేదనీ,

మార్క్సిజాన్ని భారతదేశ పరిస్థితులకు అనుగుణంగా మార్పులు చేసి కులాన్ని కూడా ఎజెండా చేయాలని వాదించాడు. కుదరదన్నప్పుడు, ఆత్మగౌరవంతో, ఆశయాన్ని అంకితభావంతో సాధించడానికి స్వతంత్రించే అంబేద్కర్ తాత్త్విక భూమికకు మార్క్సిజాన్ని దేశీయ పరిస్థితులకు అనుగుణంగా చేసుకోవాలనే దృక్పథం 'శంబుక'లో కనిపిస్తుంది.

శంబుక తాత్త్విక పోరాట దృక్పథంలో కొన్ని విభేదాలు ఉన్నాయి. కానీ, తాను ప్రత్యక్షంగా అనుభవించిన జీవితం నుండి 'పోరాట మార్గం దళిత మార్గం'గా రూపొందించిందనేది అర్థం చేసుకోవలసి ఉంది. శంబుక దళిత దృక్పథంలో వర్తమాన దళిత ఉద్యమం అన్ని భావాలను అంగీకరించాలనేమీ లేదు. కానీ, 'శంబుక దృక్పథం'లో అనేక అంశాలను వర్గవాదులు గుర్తించే పరిస్థితులు కనిపిస్తున్నాయి.

చికాగోలోని 'హే' మార్కెట్‌లో ఎనిమిది గంటల పనిదినం కోసం రక్తాన్ని చిందించిన కార్మికుల సమరత్యాగాన్ని నిత్యం స్మరించుకుంటూనే కార్మిక వర్గ చేతిలో నిలవ వలసిన ఎర్రజెండా, బూర్జువాలు లాక్కోవడాన్ని వ్యతిరేకించినందుకు, దాన్ని బహిరంగంగా ఉద్యమ ప్రాయం చేసినందుకు ఆత్మ త్యాగాన్ని చేసిన దళితవీరుడిగా దళితుల పీడితుల హృదయాల్లో కలకాలం నిలిచిపోతాడు శంబుక.

***

# ప్రయోగాల పల్లకిలో 'నానీలలో సినారె'

తెలుగు కవిత్వం వస్తు, రూప వైవిధ్యంతో బాగానే ముందుకి వెళ్తున్నదని 'ఆధునిక కవిత్వాన్ని' చదువుతున్న వారికి అనిపిస్తుంది. తెలుగు సాహిత్యానికి చెందినవని చెప్పుకోగలిగే రూప ప్రక్రియల్లో 'నానీలు' కూడా ఒకటి. యువ సాహితీవేత్తలను ఇవి బాగా ఆకర్షిస్తున్నాయి. చాలామంది 'నానీ'లకు లక్షణాలు చెప్తున్నా, అందులో చాలామంది రాస్తున్న వారికి ఆచార్య ఎన్. గోపి గారు చెప్పిన నియమాలు తెలియవనీ, కవిత్వం రాయటానికి, సులువుగా కవి అనిపించుకోవడానికి చాలా మంది ఉవ్విళ్లూరుతున్నారనే విమర్శ కూడా వచ్చింది. 'నానీల'కు ఆచార్య ఎన్. గోపి గారు చెప్పిన నియమాలను పాటించని వారు చాలా మంది ఉన్నారు.

జపాన్ నుండి దిగుమతి చేసుకున్న హైకూలకు కూడా ఇదే పరిస్థితి. హైకూ ప్రయోగంలో తెలుగు భాషకున్న పరిస్థితులూ వేరనేవాళ్ళూ ఉన్నారు. మరొక విషయాన్ని ఈ సందర్భంగా గమనించాలేమో! కవిత్వంలో లక్షణాలు ఉండవచ్చు గానీ, లక్షణాల కోసమే కవిత్వం రాయరు. అది ఆధునిక కవిత్వంలో మరీనూ! ఏది ఏమైనా, 'ఛందోబందోబస్తులను ఛట్ ఫట్' మనిపించి, చమక్కులను చమత్కారాలను, రసగుళికలను మెరిపించే కవిత్వాన్ని 'నానీ'లలో పండించి 'ఆహా' అనిపించేటట్లు రాయగలిగే ప్రయత్నం మాత్రం 'నానీ'లలో కనిపిస్తుంది.

నావీ, నీవీ కలిసి బహువచనం 'లు' చేరి, ఒక వ్యక్తిరాసినా, వ్యక్తుల సమూహ భావనగా మారగలిగే అవకాశం 'నానీ'లకు ఉంది. అది డా|| ద్వానా శాస్త్రి గారు ఇటీవల రాసిన 'నానీలలో సినారె'లో బాగా కనిపిస్తుంది. 75 సంవత్సరాలు నిండిన జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత, పద్మభూషణ్ డా// సి. నారాయణ రెడ్డిగారి జన్మదినోత్సవం సందర్భంగా డా// ద్వానాశాస్త్రి గారు 75 'నానీ'ల శతకంగా దీన్ని తీసుకొచ్చారు.

'శతకం' అంటే నూరు. అయినా నూట ఎనిమిది పద్యాలు ఉండటం తెలుగు శతకంలో సంప్రదాయంగా కొనసాగుతుంది. 'శతకాలు'గా పేరు పొందిన కొన్ని పద్య శతకాలలో వందల కొద్ది పద్యాలు కూడా ఉంటున్నాయి. ''ఒకే వ్యక్తిపై శతకాలు వచ్చాయి. కానీ, 'నానీ'లు రాలేదు. ఈ దిశగా చేసిన ఈ ప్రయోగం.... 'నానీ' ప్రక్రియకి మరింత ధైర్యాన్ని తీసుకువస్తుందని నా నమ్మకం'' అని కవి స్పష్టంగానే చెప్పుకోవటం వల్ల 'నూరు సంఖ్య' మాత్రమే శతకాలను నిర్ణయించటానికి ప్రామాణికంగా తీసుకోవటం సరిపోదనే ఆలోచన కనిపిస్తుంది.

'నానీలలో సినారె' గ్రంథం గురించి కొన్ని పరిధులను కూడా కవిగారే ప్రకటించారు. ''ఆయన నన్ను ఎప్పుడూ ఆప్యాయంగా పలకరిస్తారు. ఆయనతో నా అనుభవాలూ, ఆయనపై నా అభిప్రాయాలు వెల్లడించాలని ఎప్పటి నుంచో వుంది.... ఇప్పుడూ ఒక్క సినారెపైనే 'నానీ'లు రాయాలనిపించింది'' అని చెప్పుకున్నారు.

ఇలాంటి ఆత్మీయమైన అనుబంధాలు కూడా మంచి రచనలను అందించేటట్లు చేస్తాయేమో! అందుకనే సంప్రదాయ కవులు కూడా ప్రముఖులపై పద్యాలు రాశారు. పంచరత్నాలు, నవరత్నాలు, నక్షత్ర మాలికలు, ఖండకావ్యాలు, శతకాలు.... ఇలా చాలా రాశారు. 75 'నానీ'లను ఎవరూ, ఏ ఆధునిక కవీ ఒక శతకమని చెప్పలేదు. దీన్ని డా// ద్వానా శాస్త్రి గారు ఆధునిక కవితా ప్రక్రియలో చెప్పి, సంప్రదాయాన్నీ, ఆధునికతనూ ముడివేసే ప్రయత్నం చేశారు. ఆచార్య ఎన్ గోపి గారితో చర్చించే ఈ పని చేశారు. గోపీ గారికే అంకితం ఇచ్చారు. ఇదో విశేషం!

ఈ శతకంలో డా// ద్వానా శాస్త్రి గారు, సినారెలో గమనించిన కొన్ని అనుభవాలతో చాలామంది పయనించగలుగుతారు. సినారె గురించి చెప్తూ కవి ఇలా ఒక నానీ రాశారు.

*''పిల్ల కవులను*
*వెన్ను తట్టారు*
*ప్రతిభకు*
*పట్టం కట్టారు''* డా// సి. నారాయణ రెడ్డి గారు జ్ఞానపీఠ్ పురస్కారాన్ని పొందినవారు. అయినా ఎవరైనా కొన్ని కవితలు రాసి, అదీ తొలిసారిగా రాసినవైనా సరే ఓ గ్రంథంగా ముద్రిస్తే, వాటిలోనూ స్వారస్యాన్ని చూడగలిగి, ఆ కవిని ప్రోత్సాహించే ఉదాత్త స్వభావం సినారెలో ఉంది. సినారె ఏదైనా కమిటీల్లో ఉంటే మాత్రం 'ప్రతిభకే' పట్టం కడతారు. మొదటిది ప్రోత్సహించేదీ, రెండవది గుర్తించేదీ. రెండింటినీ సినారె నిర్వహించే తీరు తెలియాలంటే 'సినారె'తో అంత అనుబంధం ఉండగలిగిన వారికే సాధ్యం. దాన్ని డా॥ద్వానా శాస్త్రి గారు కవిత్వంతో పట్టుకోగలిగారు.

ఇక్కడ మరో విశేషం కూడా ఉంది. మొదటి దానిలో సౌందర్య ఆరాధకుడుగా కనిపిస్తారు సినారె. వ్యక్తిలో, వస్తువులో, రెండింటిలో, అన్నింటిలో సౌందర్యాన్ని ఆస్వాదించగలిగిన కళాస్వాదకుడు. రెండవ దానిలో సినారె విమర్శకుడిగా, న్యాయమూర్తిగా, నిర్ణయకుడుగా కనిపిస్తారు. సినారెలో కనిపించే ఈ రెండు కోణాలను 'నానీ'లో డా// ద్వానా శాస్త్రి గారు వర్ణించగలి గారు.

మరొకచోట సినారెను కవి...

*'ఈ తరం కవులతో/ జాగింగ్/ సినారె/ తద్దర్మార్థకం గదా''* అని వర్ణించారు. 'తద్దర్మార్థకం' అని చెప్పడం ద్వారా నిత్యం కవిత్వం రాస్తుంటారనే వ్యంగ్యార్థం స్ఫురించేటట్లు చేయగలిగారు కవి.

ఈ శతకంలోనే మరోచోట

*'చిన్న పత్రికలు*
*తలలెగరేస్తున్నాయి*
*సినారె*
*సిరాగాలతో'* అన్నారు డా// ద్వానా శాస్త్రి గారు. సినారెలో ఉన్న మరో గొప్పతనమిది. రాసింది కవిత్వమా? కాదా? అనేదే ప్రధానంగా చూస్తారు. దాన్ని ప్రచురించుకోవడానికి ఇష్టపడి ఏ చిన్న పత్రిక వాళ్ళు ప్రచురించుకున్నా, అభ్యంతరాన్ని చెప్పరు. పైగా ఆ పత్రికలో ప్రచురించుకోవడానికి మళ్ళీ మళ్ళీ

కవితలు పంపిస్తుంటారు. బహుశా, కవిత్వం ప్రచురించే ప్రతి పత్రికలోనూ సినారె కవిత ఉంటుందన్నా అభ్యంతరం ఉండదేమో!

సినారె ఒక చోట చెప్పుకున్నారు. కవిత్వం రాయకపోతే ఆ రోజు ఏసి గదిలో కూర్చున్నా చెమటపడుతుంది. పదాలివి కాదు గానీ, ఇంచుమించు భావమిదేననుకుంటాను. ఆయన నిరంతరం కవిత్వం రాస్తారు. సినారె నిత్యం కవిత్వం రాస్తుంటారనడానికి, ఆయన కవిత్వంలో కనిపించే కొత్త కొత్త వస్తువుల స్పర్శే సాక్ష్యం. చిన్న పత్రిక అని కూడా చూడకుండా అన్ని పత్రికల్లో కనిపిస్తుంటాయి. కొంతమంది ఓ స్థాయికి వచ్చామని భావించారంటే స్థానిక, చిన్న పత్రికలను రేడియోలను, 'చిన్నస్థాయి'గా చూస్తారు. అక్కడ కూడా పాఠకులు ఉంటారు. అలా వాళ్లకి అందించటంలోనే కవిత్వాన్ని అందరికీ పంచే నిరాడంబరతను సినారెలో చూడవచ్చు. 'పోటీ పడటం' అనేది గొప్ప అబ్జర్వేషన్. ఆధునిక కవుల్లో పోటీ పడలేక కవిత్వాన్ని రాయటం లేదనే వాళ్లు సినారెని చూసి నేర్చుకోవలసింది ఎంతో ఉందని చెప్పడానికి ద్వానా వారి అభిప్రాయం చాలా ప్రోత్సాహాన్నిస్తుంది.

ప్రతి సంవత్సరం సినారె ఒక పుస్తకమైనా ప్రచురిస్తారు. ఆయన హృదయం కవిత్వం ఊరే చెలమ. ఆయన హృదయం కవిత్వం నిండిన బావి. దీన్ని వర్ణిస్తూ డా|| ద్వానా శాస్త్రి గారు

'*ప్రతి సంవత్సరమూ/ గుండెకు గండి/ ఆ గాయానికి/ మొక్కుదాం రండి*' అని సినారె పట్ల భక్తిభావాన్ని ప్రదర్శిస్తారు. కవిత్వ ప్రేమికుల చేత భక్తి భావాన్ని ప్రదర్శింపచేస్తారు కవి. సినారె వ్యక్తిత్వాన్ని, కవిత్వాన్ని, అనుభవాన్ని ముప్పేటగా అందించిన 'నానీ'లలో సినారె '75నానీ'లతో ఒక శతకం అనే ప్రయోగం చేసిన డా// ద్వానా శాస్త్రి గారు ప్రయోగవాదులలో చేరడానికి మార్గం వేసుకున్నారు. నిజానికిది ప్రయోగాల పల్లకిలో ఊరేగుతున్న 'నానీ'లలో సినారె. డా// ద్వానా శాస్త్రిగారే అన్నట్లు

''*తెలంగాణ మట్టికి/ మకుటం/ తెలుగు వీధుల్లో/ పూలశకటం*'' సినారె కవిత్వాన్ని, సినిమా పాటలను, పరిశోధన, విమర్శ సాహిత్యాన్నీ, ఉపన్యాస కళనీ, సభారంజకత్వాన్ని, దాన్ని నిర్వహించేటప్పుడు గల కార్యదక్షతలోని ఆజ్ఞాపాలననీ, అన్నింటినీ మించి కవిత్వాన్ని నిత్యం శ్వాసించే గొప్ప కవి సినారె అని మరోసారి గుర్తుచేసే రచన 'నానీలలో సినారె'.

వీటినన్నింటినీ డా// ద్వానా శాస్త్రి గారు 'నానీ'లలో వర్ణించి సినారె 75 సంవత్సరాల పుట్టిన రోజుకి గొప్ప హారాన్ని అలకరింప చేశారు. ఈ 'నానీ'లు సినారె సాహితీ వైశిష్ట్యానికీ, మూర్తిమత్వానికీ చిహ్నా పతాకాలనీ, అన్నీ అందరికీ ఎల్లవేళలా నచ్చాలని వుంటే, ఇంత సాహిత్యం రాదు, ఇంత వైవిధ్యమూ ఉండదు. విపులాంచ పృథ్వీ అని డా// ద్వానా శాస్త్రిగారే తన కవిత్వంలో ఉండేదేమిటో, ఆదరించేది ఎవరో కూడా తెలిసిన రాసిన 'నానీ'లివి. డా// ద్వానా శాస్త్రి గారు మౌలికంగా విమర్శకుడు. అప్పుడప్పుడు కవి.రెండింటినీ 'నానీలలో సినారె' శతకంలో చూడవచ్చు.

***

# భౌతిక వాస్తవికత: "కులవృత్తి" కథ

పవిత్రత - అపవిత్రతలనేవి ఒకదాన్ని ఒకటి వెన్నంటి ఉంటాయి. పవిత్రత అనేది ఒక భావన. మానవులు ఏర్పరుచుకున్న ఆచార సంప్రదాయాల నుండి రూపొందిన భావన. మానవుడు ఆదిమ కాలంలో ప్రకృతి శక్తులతో పోరాడి, తాత్కాలిక ఉపశమనం కోసం పంచభూతాలను దైవశక్తులుగా భావించుకున్నాడు. నిత్య జీవితంలో వాటి అవసరాన్ని గుర్తెరిగి వాటిని పరిరక్షించుకోవటానికి ఎంతగానో ప్రయత్నించాడు. వాటితో ప్రతి జీవికి గల సంబంధాన్ని విడదీయరానిదనీ త్వరలోనే గుర్తించగలిగాడు.

ఆదిమ సమాజంలో కూడా తెలివైన మానవుడు తనకంటే తెలివి తక్కువ ఉన్నవాడిని మాటలతో, చేతలతో తన ఆధీనంలో ఉంచుకునే ప్రయత్నం చేశాడు. దీనిలో భాగంగానే ప్రకృతి శక్తులకు నియమబద్ధంగా ''శాంతి'' చేయడం ఆరంభించాడు. తాను చేసిన, చేస్తున్న ''శాంతి'' చర్యలకు యాదృచ్చికంగా వేగంగా గాలి వీచటంగాని, గాలి ఆగిపోవటంగాని, వర్షం కురవటంగాని, ఆగిపోవటంగాని, భూమి కంపంచటం, నెమ్మది పడటం వంటివి జరిగేవి. వీటి శాంతి చర్యల వల్ల, లేదా మాంత్రిక చర్యల వల్ల మాత్రమే జరుగుతున్నాయని కొంతమంది నమ్మటంతో ఆ పనులు ఆచారాలుగా, సంప్రదాయాలుగా మారిపోయాయి. దానిలో ప్రకృతి ఆరాధన విస్తృతమైంది.

మన వేదాల్లో కూడా పంచభూతాలను శాంతి చేసే విధంగానే అత్యధిక మంత్రాలు ఉన్నాయి. ఇదంతా ఎందుకు మాట్లాడుకోవలసి వచ్చిందంటే, ఇటీవల ఆచార్య కొలకలూరి ఇనాక్ గారు ''కులవృత్తి'' పేరుతో ఒక కథ రాశారు. దాన్ని ఒక సైద్ధాంతిక దృక్పథంతో పరిశీలించవలసిన అవసరం ఉంది.

**కులవృత్తి కథలో ఏముంది?:**

ఆచార్య కొలకలూరి ఇనాక్ గారు ప్రజా సాహితి మాసపత్రిక (సెప్టెంబరు-2006: 18-26)లో రాసిన ''కుల వృత్తి'' కథపై ఆ పత్రిక తరువాత సంచికల్లో కొంత చర్చ జరిగింది. రచయిత ప్రతి స్పందనను కూడా ప్రజా సాహితి (2006: 51-52)లో ప్రచురించారు. అంతే కాకుండా, ఆంధ్రప్రభ దినపత్రిక సాహితీ గవాక్షంలోనూ ఆ కథా ప్రభావంతో ఒకరు అభిప్రాయాన్ని కూడా రాశారు. ఇంతమందిని ఆ కథ ఎందుకు కదిలించగలిగింది?

ఆ కథ మామూలు కథ కాదు. ఉబుసుపోక రాసింది కాదు. పాఠకులు ఉబుసుపోక చదివేది కాదు. ఒక బలమైన సమస్యకు ఒక బలమైన తాత్త్వికధారను అందించటానికి రాసిన కథ. ఇనాక్ గారు ఈ కథనే కాదు. అంతకు ముందు కూడా అంతకంటే గొప్ప కథలను చాలా రాశారు. అందులో ఊరబావి, గొడ్డదొంగ, పొట్టపేగులిబ్బందిగోడు, తాకట్టు, కొలుపులు కథలు పేర్కొనదగినవి.

ఇందులో నాకు బాగా నచ్చింది తాకట్టు కథ. తమకి తెలియకుండానే ఆచారాలు, సంప్రదాయాలు పేరుతో బ్రాహ్మణీయ వర్ణాలు ఎలా కూరుకుపోతున్నాయో దీనిలో వివరించారు. నిజానికి ఈ కథలో బ్రహ్మణీయ వర్ణాల పట్ల రచయితకున్న సహృదయత కూడా అర్థమవుతుంది. వారి కథల్లో బ్రాహ్మణీయ వ్యతిరేకత ఉంటుంది. అది వ్యక్తిగతం కాదు. అసలు అవగాహన ఉన్న రచయిత రాసిన దళిత సాహిత్యంలో వ్యక్తిగతానికి తావేలేదు. పైగా ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారి రచనల నిండా డా|| బి.ఆర్. అంబేద్కర్ భావజాలం వ్యాపించి ఉంటుంది.

ఆచార్య కొలకలూరి ఇనాక్‌గారే ''ఆధునిక విమర్శ సూత్రం'' (1996: 155)లో బ్రాహ్మణవాదాన్ని ఇలా వివరించారు. బ్రాహ్మణుడు ''*ఆర్యుడుగా ప్రవేశించినప్పుడు అభద్రతా భావంతో ఏర్పాటు చేసుకున్న వర్ణ వ్యవస్థను తనకనుకూలంగా మలచుకొని, అధికారం హస్తగతం చేసుకొని, అందుకు ఆధారంగా సాహిత్యం సృష్టించుకొని అందర్నీ, ఆడవాళ్ళతో సహా అణచి ఉంచటానికి చరిత్ర అంతటా చేసిన కుట్ర, కుయుక్తి, మోసం బ్రాహ్మణ వాదం... దళితులు బ్రాహ్మణుల్ని నిందించరు. బ్రాహ్మణ వాదాన్ని వ్యతిరేకిస్తారు.*'' అని స్పష్టంగానే వివరించారు. ఈ దృష్టితో చూసినప్పుడు కులవృత్తి కథలో పూజారి (స్వామి)-అతడితో వాదించిన మాదిగ (మూర్తి)లు ఆయా వ్యవస్థలకు ప్రతినిధులు.

**కథలో ప్రతిపాదిత అంశాలు:**

అసలు కులవృత్తి కథలో రచయిత ఈ కింది అంశాలు వాదనకు పెట్టారనుకుంటున్నాను.

1) దేవుడికీ-భక్తుడికీ మధ్య పూజారి అవసరమా?

2) పవిత్రతను అర్థం చేసుకోవడమెలా? పవిత్రత - అపవిత్రతలను నిర్ణయించటానికి తీసుకుంటున్న ప్రమాణాలేమిటి? ఆ ప్రమాణాలు కాలానుగతంగా మారుతున్నాయా? లేదా? వాటిని కొన్ని వర్ణాలు తమకనుకూలంగా మార్చుకుంటున్నాయా? లేదా? దేవాలయంలోకి పూజార్లు లేకుండా/చూడకుండా చెప్పులతోనూ, ఇంకా రకరకాలగానూ పోయినప్పుడు నిజంగా వాళ్ళందరికీ/ఆ పశు పక్షులకు ''పాపం'' చుట్టుకుంటుందా? దాన్ని తెలుసుకోవడమెలా? ఇలాంటి సమస్యలన్నింటినీ ఆలోచింప చేసేవిధంగా ''కులవృత్తి'' కథ ఉంది.

**ప్రతిపాదిత అంశాల సమన్వయం:**

1) దేవుడికీ - భక్తుడికీ మధ్య పూజారి నిలబడి 'కొందరికే దేవుడ'నే భావన కలిగిస్తున్నారు. దేవుడే అంగీకరించినా అస్పృశ్యత పేరుతో దళితులను పూజారి దేవాలయంలోకి అంగీకరించని కథను ''మునివాహనుడు'' (1976) నాటకంలో ఇంతకుముందే ఇనాక్ గారు రాశారు.

ఇప్పుడు దాని తరువాతి పరిణామాన్ని, అంటే అస్పృశ్యతను ఆధారం చేసుకొని కొంతమంది వృత్తి చిహ్నాలను దేవాలయంలోకి రాకుండా అవమానిస్తున్నారని, దాన్ని నిరసిస్తూనే, సంస్కరణను కోరుకుంటున్నారు రచయిత.

చెప్పులతో దేవాలయంలోకి ప్రవేశించి దేవుడ్ని పూజించడం మన తెలుగు సాహిత్యం స్పర్శించిన అంశమే. శ్రీకాళహస్తీశ్వర మహాత్యంలో భక్త కన్నప్ప కథలోనూ చెప్పులతో, మాంసంతో శివుడిని పూజచేసినా దేవుడికేమీ అభ్యంతరం రాలేదు. అప్పుడూ పూజారి వర్గానికే అభ్యంతరం వచ్చింది. అయితే, ఆ కథలో కన్నప్ప భక్తుడే కావచ్చు కానీ నాగరిక సమాజంతో సంబంధంలేని వాడు. కానీ, ఇనాక్‌గారి మూర్తి చదువుకున్న భక్తుడు. అన్నీ తెలిసిన భక్తుడు. కార్య కారణ సంబంధాన్ని వివరిస్తూ మాట్లాడుతుంటాడు. దేవుడి కోసం పూజారి కాదు. పూజారి కోసమే దేవుడు అన్నట్లుగా దేవాలయ వ్యవస్థను మార్చేశారని స్వామి-మూర్తిల సంభాషణలో తేలిపోతుంది. దేవుడికీ - భక్తుడికీ మధ్య ఉండే పూజారి వారధిగా నిలుస్తాడనేది కేవలం భమ. పూజారి అహంకారంగా రచయిత నిరూపించారు.

2) పవిత్రత అనేది భౌతికమా? మానసికమా? అనేది తెలిస్తే గాని దాన్ని నిర్ణయించటం అంత సులువు కాదు. శుచి, శుభ్రతలు ముందుగా బాహ్య రూపానికి చెందినవే, ఆ తరువాతే ఆత్మ లేదా అంతరంగ పరిశుద్ధత గురించి ఆలోచించటం జరుగుతుంది. అనేక చోట్లలో తిరిగి వస్తారు కనుక, కాళ్ళకున్న చెప్పులను విప్పేసి ఇంటిలోకైనా, గుడిలోకైనా ప్రవేశిస్తారు.

ఇక్కడ శుభ్రత రూపంలో పవిత్రత దాగిఉంది. ఈ పవిత్రతను నిర్ణయించేది మానవులే! మానవులే దేవిడికి ప్రీతిపాత్రమైనవేమిటో నిర్ణయించి, వాటిని దేవుడికి నివేదించటం జరుగుతుంది. ''నిర్ణయించినవి'' కాకుండా మరేమైనా పెడితే ఆ దేవాలయం లేదా ఆ స్థలం అపవిత్రం అయిపోతుందంటారు. కనుక ''కొన్ని'' నిషేధాలకు గురవుతాయి. కొంతమంది దేవుళ్ళకు, దేవతలకు మాంసాన్ని నివేదించటం జరిగితే అపవిత్రమైపోయినట్లే భావిస్తారు. శుద్ధి కార్యక్రమం చేస్తారు. చిత్రమేమిటంటే ఆ మాంసం చాలా మంది దేవతలకు నివేదించినప్పుడు ఎలాంటి అపవిత్రతా రాదు.

దీన్ని బట్టి పవిత్రతకు సార్వజనీన లక్షణం లేదనే కదా తేలేది. అంతేకాదు, భౌతిక స్థితిగతులే పవిత్రతను నిర్ణయించడంలో కీలక పాత్రను పోషిస్తున్నాయనీ అర్థమవుతుంది. ఈ కారణాలను ఆధారం చేసుకునే దళితులకు దేవాలయ ప్రవేశాన్ని చాలా కాలం నిషేధించారు. చదువుకున్న, శుభ్రంగా ఉన్న దళితులకు తప్ప, ఇప్పటికీ చాలా చోట్ల దళితులకు దేవాలయ ప్రవేశం లేదు.

శుభ్రంగా ఉన్నంత మాత్రం చేత కూడా అందరినీ దేవాలయంలోకి ప్రవేశించనివ్వటం జరగటం లేదు. కనుక కేవలం బాహ్య శుభ్రత మాత్రమే సరిపోదు. మరింకొకటేదో కావాలి. అదేమిటి? అది మానసికంగా ఏర్పడిన, ఆచారాలతో కూడిన భావన. ఆ ఆచారాలు క్రమేపీ సంప్రదాయాలుగా మారిపోతాయి. శుభ్రతలో, మానసిక భావనలో పవిత్రత ఉంటుంది. అందుకనే కథలో బ్రాహ్మణుడు వేసుకున్న మురికి వస్త్రాలు గానీ, మాసిపోయిన జంధ్యంగానీ పవిత్రతకు అడ్డురాలేదు.

**ఆచార సంప్రదాయాలు  ద్వంద్వ ప్రమాణాలు:**

ఇక్కడ ఆచారాల్లోనూ, ఆ ఆచారం సంప్రదాయంగా మలుచుకోవటంలోనూ ద్వంద్వ ప్రమాణాలున్నాయి. ఆ ప్రమాణాలు కొన్ని వర్ణాల, వర్గాలనుండే రూపొందుతున్నాయి. దీన్ని ప్రశ్నిస్తుంది కులవృత్తి కథ.

పవిత్రతను పరీక్షకు పెడుతుందీ కథ. కనుకనే బూట్లు శుభ్రంగా ఉన్నాయి. జంధ్యం మురికిగా ఉందని కూడా కనిపించే భౌతిక వాస్తవికత నుండే 'మూర్తి' తన ప్రశ్నలను సంధించాడు. అంతేకాదు పవిత్రతలో కనిపించే డొల్లతనాన్ని కూడా ప్రశ్నించాడు. అందుకనే, పూజారి స్వామి మూర్తిని అడ్డగించినా చెప్పులు, బూట్లు ధరించి వెళ్లకూడదన్నా, 'ఒక ఉన్నతాధికారి'(?) దేవాలయంలోకి వెళ్ళిపోతాడు. దాన్ని మూర్తి గమనించి, స్వామిని అడిగితే, పూజారి చూడలేదంటాడు. ఇక్కడ పూజారి చూడకపోతే ఆ దేవాలయంలో ఏమి జరిగినా అపవిత్రం కాదనే కదా అర్థం!

నిజంగా అపవిత్రం అయితే దాన్ని సంప్రోక్షణ ద్వారా శుద్ధిచేయటం జరుగుతుంది. అది కూడా పూజారి గమనిస్తేనే! లేకపోతే పవిత్రత - అపవిత్రత అనే ప్రస్తావన రాదు. ఇంత జరిగినా దేవుడు నిమిత్తమాత్రుడు గానే కవిపిస్తున్నాడు. పూజారే పెత్తనం చెలాయిస్తున్నాడు. కనుక పూజారి లేకపోయినా భగవంతుడిని పూజించుకోవటంలో ఎలాంటి ఇబ్బంది లేదనే స్పష్టమవుతుంది.

ఇనాక్ గారు దేవుడిని అంగీకరిస్తున్నారా లేదా అనే దానికంటే దేవాలయ వ్యవస్థలో ప్రక్షాళనను అభిలషిస్తున్నారు. సామాజిక వ్యవస్థలో దేవాలయ వ్యవస్థ ఒక అంతర్భాగం. అది ఏ మతానికి చెందినదైనా కావచ్చు. దేవాలయం చుట్టూనే తరతరాలుగా పాలకులు తమ పాలనను కేంద్రీకరించారు.

దేవాలయంలోకి వెళ్ళాలనుకోవటంలో సమాజంలో కలవటానికి దళితులు పడే తరతరాల ఆవేదన ఉంది. దేవుడిని నమ్మడం డా।। శాంతికుమార్ గారు అన్నట్లు ఒక మౌఢ్యమే కావచ్చు. కానీ, దేవాలయంలోకి వెళ్ళేవారంతా దేవుని పట్ల విశ్వాసంతోనే ఉన్నారనుకోవడానికి వీల్లేదు. అర్చకత్వం చేసేవాళ్ళంతా తాము దేవుడిని నమ్ముతూనే దైవసేవ చేస్తున్నారనుకోవడానికీ వీలులేదు.

అర్చకత్వం ఒక వృత్తిగా మారింది. వృత్తిని ఫలితం ఆశించి చేస్తారు. సేవ ఉచితంగా లేదా నిస్వార్థంగా చేస్తారు. ఇతర పనులు చేస్తే అగౌరవంగా భావిస్తారనీ మరో పని చేతగాక గతిలేని స్థితిలో కూడా చాలా మంది అర్చకత్వం చేస్తున్నారు. మరికొంత మంది దీన్ని మంచి ఆదాయ మార్గంగానే భావిస్తున్నారు. కనుక అర్చకులంతా దేవుడి పట్ల విశ్వాసం ఉన్నవాళ్ళని ఎలా అనలేమో దేవాలయ ప్రవేశం కోరుకునే వాళ్లంతా దేవుణ్ణి పూజించడానికే పోరాడుతున్నారనీ అనలేం కదా!

**కుల వృత్తి భావన:**

ఇక, 'ప్రతీ ఇంటిలోనూ కుల వృత్తులు అవతారం ఎత్తినా' ఒక్కో వృత్తి ఒక్కో కులానికి మాత్రమే అంటగట్టడం తరతరాలుగా జరుగుతోంది. ఇంటిలో బట్టలు ఉతుక్కోవడం, ఇస్త్రీ చేసుకోవడం, బూట్లు పాలిష్ చేసుకోవడం, షేవింగ్ చేసుకోవడం తదితర పనులన్నీ కులవృత్తులుగా భావింపబడవు. ఇంట్లో ఇలాంటివి చేసుకున్నంత మాత్రాన కుల వృత్తులు ఇంటిలో అవతారం ఎత్తినట్లుగా భావించలేం. జీవనోపాధి కోసం ఎన్నుకునేదే వృత్తి అవుతుంది.

సాధారణంగా ఇంట్లో చేసుకునే పనులు అవసరార్థం లేదా ఆదాయవనరులు సరిపడక మాత్రమే చేసుకుంటారు. వాటిని కులవృత్తులు అనలేం కదా! అంతేకాదు, గ్రామాల్లో చాలా చోట్ల ఆదాయం రానంత కాలం పోచమ్మ, మైసమ్మ మొదలైన ఆలయాల్లో మాల-మాదిగలు లేదా కింది వర్ణాల వాళ్ళు పూజారులుగా వ్యవహరిస్తారు. అయినా పూజారి వృత్తిని బ్రాహ్మణ వర్గ సొత్తుగానే భావిస్తూ ఆ ఆలయానికి ఆదాయం సమకూరుతున్నప్పుడు ఆ కింది వర్ణాల పూజారులను తొలగిస్తారు. దానికి అవసరమైతే ప్రభుత్వ సహకారం తీసుకుని చట్టపరంగా బ్రాహ్మణ వర్గానికి చెందిన వారినే పూజారులుగా నియమిస్తారు.

నేటికీ తిరుమల తిరుపతి దేవస్థానంలో పూజారులుగా పనిచేయటానికి ఏ వర్ణాలవారికి అవకాశం ఉందో స్పష్టంగానే తెలుస్తుంది. కుల వృత్తులు అవతారాలు మారినట్లు కనిపించినా అవి మానసిక భావనలో కొన్ని వృత్తులు నేటికీ హీనంగానే భావింపబడుతున్నాయి. ఆ వృత్తులు కొన్ని వర్ణాల వారినే స్ఫురించేటట్లు చేస్తున్నాయి. కనుక కుల వృత్తుల అవతారాలను అర్థం చేసుకోవడంలో అన్ని వర్ణాల వాళ్ళూ అన్ని వృత్తులూ చేసినా మానసికంగా మాత్రం కులవృత్తి భావన కొన్ని వర్ణాలదే అనేది అంతరించలేదు. ''కులవృత్తి'' కథలో మూర్తి దేవాలయ ప్రవేశాన్ని ఆశించటంలో ఈ మానసిక వ్యథ అంతా ఉంది.

**సామాజిక వాస్తవికత కళా సిద్ధాంతం:**

ఆదిశంకరాచార్యుల వారికి ఎదురుపడి చండాలుడి రూపంలో శివుడే కొన్ని ప్రశ్నలు అడుగుతాడు. అది నిజానికి ఆత్మ తత్వానికి సంబంధించిన వాదం. ఇనాక్ గారు కూడా తన కథలో చిత్రించిన పూజారి స్వామి - మాదిగ మూర్తిల మధ్య సంభాషణ ఒక సామాజిక సమస్యను బయటికి తేవాలనే ఉద్దేశంతో చేసిన కల్పన. కొన్ని వేల సంవత్సరాల దళితుని వేదన మూర్తి మాటల్లో ప్రతిధ్వనించింది.

దేవాలయ ప్రవేశం, కుల వృత్తీ ఆ పరికరాలను గౌరవించమనటం ఒక సామాజిక సమస్యకు సంబంధించిన విషయమే! సామాజిక సమస్యను సైద్ధాంతికంగా వివరించే ఈ ప్రయత్నాన్ని ''కళ కోసం కళ'' అనే సిద్ధాంతంతో ముడివేయడం అంటే సామాజిక వాస్తవికతను వక్రీకరించటమే! ఆది శంకరాచార్యులు చండాలుని వాదనను అంగీకరించటంలో కనిపించని వితండవాదం, మూర్తి సంభాషణలో కొందరికి కనిపించటం ఆశ్చర్యకరమే!

ఇక్కడ ఈ కథా రచయిత ప్రతిభను కాదనలేం. కానీ, ప్రతిభను నిరూపించుకోవాలని కాకుండా సామాజిక సమస్యను ప్రతిభావంతంగా పరిష్కారాన్ని సూచించాలనుకున్నారు. దీన్ని అర్థం చేసుకోవడంలో కలిగే కష్టాన్ని ఆధారంగా చేసుకుని ఈ కథను ''కళ కోసం కళ'' అనే సిద్ధాంత చట్రంలోకి నెట్టేసే ప్రయత్నం శోచనీయం.

''దేవుణ్ణి నమ్మేవాళ్ళు మొత్తం జనాభాలో తొంభై శాతం కన్నా ఎక్కువగానే ఉంటారేమో! ఆ దేవుడు వుండే ఆలయం పవిత్రమైనది (ఉన్నతమైనది) అనే భావన వారిలో ఉంటుంది.'' అని ప్రకటించిన (ప్ర.జా.సా., అక్టోబర్: 2006 -56) డా|| శాంతి కుమార్‌గారే ''దేవుడే ఉంటే- కనీసం ఉన్నాడని నమ్మకమో, భయమో వుంటే - ప్రపంచంలో ఇంత అవినీతి, అక్రమాలు, అన్యాయాలు, దోపిడీ పీడనలు జరుగుతూ ఉండేవా? తన గుడిలో జరిగే అక్రమాలకే దిక్కులేదు....'' అని వివరించారు. ఇవి పరస్పర విరుద్ధ ప్రకటనలు. ఒకదాన్నొకటి ఖండించుకుంటున్నాయి. అంతేకాకుండా ఐదు శాతం ప్రజల్లో దేవుడి పట్ల నమ్మకం లేకపోవటం వల్లనే ఇన్ని అన్యాయాలు, అక్రమాలు వంటివన్నీ జరిగిపోతున్నాయా! ఆలోచించవలసిందే.

**ఆలోచనా విధానంపై భావజాల ప్రభావం:**

అత్యధికుల ఆలోచనా విధానం, అల్ప సంఖ్యాకుల ఆలోచనా విధానంపై ఎప్పుడూ పెత్తనాన్ని చెలాయిస్తూనే ఉంటుంది. ప్రశ్నించటాన్ని నేరంగా కూడా పరిగణిస్తుంది. అది అల్ప సంఖ్యాకుల స్వీయ అస్తిత్వాన్ని కోల్పోయేలా చేస్తుంది. అప్పుడది ఆధిపత్య భావజాలంగా రూపొందుతుంది.

ప్రపంచ వ్యాప్తంగా ప్రస్తుతం అమెరికా చెలాయిస్తున్నది ఇలాంటి ఆధిపత్య భావజాలమే. చిన్న దేశాలు తమ అస్తిత్వం కోల్పోవటంలో, ఉన్న అస్తిత్వాన్ని నిలబెట్టుకోలేక పోవటంలో ఆధిపత్య భావజాల ప్రభావమే ప్రధాన కారణం. భారతదేశంలో ఆచారాలు, సంప్రదాయాలు మొదలైన వాటిపై హిందూ భావజాలం ఇలాగే తన ఆధిపత్యాన్ని చెలాయిస్తుంది. మానవ జీవన విధానానికి కావలసిన ప్రమాణాలు హిందూ భావజాలం నుండే రూపొందుతున్నాయి.

భారత దేశ వివాహ వ్యవస్థలో హిందూ - ముస్లిం - గిరిజన తెగల మధ్య జరిగే వావి వరసల గురించి ఈ సందర్భంలో ఓ సారి ఆలోచించాలి. దీన్ని సాహిత్యపరంగా కూడా చూడవచ్చు. రామాయణంలో వాలి- సుగ్రీవుల కథలో హిందూ ఆధిపత్య భావజాలమే వావి వరసలను నిర్ణయించింది. పవిత్ర భావనను కూడా ఏర్పరిచింది. ఈ వాలీసుగ్రీవుల కథలో కనిపించే వావి వరసలు నిజానికి గిరిజన తెగలకు సంబంధించినవి కాదు. గిరిజన తెగలలో నేటికీ అన్న భార్యను తమ్ముడు, తమ్ముడి భార్యను అన్న - భార్యగా చేసుకోవటం సర్వసాధారణమే! అయితే అది ఆయా పరిస్థితులను అనుసరించి ఉంటుంది. యుద్ధాల్లో కూడా ఓడిపోయిన వాళ్ళ భార్యలను గెలిచిన వాళ్ళు తమ ఆస్తిగా మార్చుకోవటం జరుగుతుండేది. దీనిలో పవిత్రత అపవిత్రతలకు అవకాశమే లేదు.

ఆరుద్ర రాసిన ''రాముడికి సీత ఏమవుతుంది.'' గ్రంథంలో ప్రపంచ వ్యాప్తంగా ఉన్న సీతారాముల కథలను పోలుస్తూ ఆయన వివరించారు. అప్పుడు ఆయనపై చాలామంది తీవ్రంగానే విమర్శలు చేశారు. సీతారాముల మధ్య సంబంధాన్ని పవిత్రంగానే ఆ ప్రజలు భావించారు. నిజానికి ఆ రకమైన విమర్శలు రావటానికి తెలిసో తెలియకో ప్రజల ఆలోచనల్లో హిందూ భావజాలం ఆక్రమించి ఉండటమే కారణం. చాలా మంది తెలిసో తెలియకో కొన్ని మాటల్ని వాడేస్తుంటారు. అలాంటి వాటిలో దళితులు కూడా ఏదైనా ఒక నీచమైన విషయాన్ని పోలుస్తూ చెప్పటానికి ''చండాలంగా ఉంది'' అంటుంటారు. ఈ వ్యాసకర్త కూడా ఒక సెమినార్లో హిందూ భావజాలంలో కొట్టుకుపోయే కులవృత్తి కథలో మూర్తి చెప్పులతో దేవాలయంలోకి వెళ్ళాలనుకోవటాన్ని అందరూ అంగీకరించే భావనేనా అని అనుమానాన్ని వ్యక్తం చేశారు. దానికి కారణం కథలో చెప్పిన సమస్య లోతుల్లోకి వెళ్ళటం కంటే ఆచార సంప్రదాయాల ప్రభావంపైనే నిలిచి మాట్లాడటం ఒక ప్రధాన కారణం. ఇలాంటివన్నీ ఆధిపత్య భావజాలం ప్రభావంలో కొట్టుకుపోయి మాట్లాడేవే తప్ప లోతైనా అవగాహనతో అంటున్నవి కాదు. అలాగే దేవాలయంలోకి చెప్పులతో వెళ్ళకూడదు అనేది అందరి ఆలోచనల ఫలితంగా ఏర్పడిన ఆచార సంప్రదాయం కాదు. ఆధిపత్య భావజాలం నుండి వచ్చిన ఆలోచనలు మాత్రమే.

వాలీ సుగ్రీవుల కథలో పవిత్ర భావన ఒక నిస్సహాయత నుండి అంగీకరించిందే తప్ప స్వీయ అస్తిత్వాన్ని నిలబెట్టుకుని అంగీకరించింది కాదు. అంగీకరించకపోతే ఆధిపత్యం విధించే శిక్ష తప్పదు. వ్యతిరేకిస్తే సంఘర్షణ తప్పదు. ఇలాంటిదే మహాభారత కథలో పాండవుల పుట్టుకకు సంబంధించిందీ కూడా! ఇక్కడ స్త్రీ పురుషుల మధ్య ఉండవలసిన సంబంధాలను హిందూ భావజాలం అవసరానికి అనుగుణంగా మార్చేసింది. ప్రమాణాలను కాలానుగుణంగా మార్చుకోవచ్చని పాండవుల పుట్టుక జరిగిన తీరే గొప్ప నిదర్శనంగా నిలుస్తుంది.

''కుల వృత్తి'' కథలో కొన్ని వర్ణాలు మరికొన్ని వర్ణాలపై అవసరానికి అనుగుణంగా మార్చుకుంటూ ఆధిపత్యాన్ని చెలాయిస్తున్నారని రచయిత స్పష్టం చేయదలచుకున్నారు. అందుకనే పూజారి స్వామి మొదట్లో మూర్తిని చెప్పులతో దేవాలయ ప్రవేశానికి అంగీకరించడు. కాళ్ళు రసి కారుతున్నాయని మూర్తి అనగానే బూట్లు కడుక్కుని దేవాలయం లోనికి వెళ్ళడానికి స్వామి అంగీకరిస్తాడు. అంటే ప్రమాణం మారింది. ఆచారం సంప్రదాయం ఒకేలా ఉండాలని ఏమీ లేదు. వాటిని మార్చుకునే స్వభావం ఉందనేది స్వామి చేతనే నిరూపించారు రచయిత.

పూజారులు చూడకుండా పక్షులు, జంతువులు ఆలయంలోకి ప్రవేశించినపుడు దేవాలయం అపవిత్రం కావటం లేదు. అంటే దేవుడి కంటే పూజారికే నియమ నిష్ఠలపై ఆసక్తి ఎక్కువగా ఉంది. పాప పుణ్యాలు ఉన్నాయో లేవో కూడా పుజారులే స్పష్టం చేస్తున్నారు. అవసరమైతే పాపాలు పోవడానికి కర్మ కాండలు నిర్వహించే వాళ్ళూ పూజారులే. ఆ నియమ నిష్ఠలు కొన్ని వర్ణాల నుండే రూపొందుతున్నాయని మరికొన్ని వర్ణాలకు అవి శాపంగా మారుతున్నాయని రచయిత ఒక నూతన దృష్టిని ప్రదర్శించదల్చుకున్నారు.

అవసరానికి అనుగుణంగా బలైపోతున్న వాళ్ళు అంటే సామాజిక సంబంధాలకు దూరం చేయబడుతున్న వాళ్ళు కింది వర్ణాల వర్గాల వాళ్ళే అనేది నిరూపించటం ఈ కథలో కనిపిస్తుంది. ఆ నిరూపణలకు హిందూ భావజాలం ఆధారంగా తీసుకుంటున్నారని నిరూపించదలచుకున్నారు. ఒక్కొక్కసారి ఒక్కొక్క ప్రమాణాన్ని ఆధారంగా తీసుకుంటున్నారు. చెప్పులతో గుడిలోకి పోకూడదు అనేది ఇలాంటి ప్రమాణాల్లో ఒకటి. అంతే తప్ప అపవిత్రమవుతుందనే కారణం కాదనేది కూడా రచయిత ఉద్దేశం.

దేవాలయంలోకి చెప్పులతో ప్రవేశించటం అనేది అత్యధికులు తెలిసో తెలియకో అంగీకరించే పవిత్ర భావన. ''*అంతర్నిబంధన రక్షణలో విడిగా ఉండిపోయేవి పవిత్రాలు. ఇక ఈ అంతర్నిబంధనలు, నిషేధాలు వర్తింపజేసి పవిత్రాంశాలకు దూరంగా ఉంచబడేవి అపవిత్రాలు*'' అని సామాజికి శాస్త్రవేత్త Prof. Durkhem తన గ్రంథం "The elementary forms of the relegion life"లో వివరించారు. (డా|| బి.ఆర్. అంబేద్కర్ రచనలు (సంపుటి 7) 1992 - 328). ఇవి అందరికీ వర్తిస్తాయి. వీటిని విధిగా పాటించాలి. వీటిని అతిక్రమించటం అంటే నేరం కంటే ఘోరం. అది దైవ దూషణ, పాప కార్యంగా మత ప్రచారకులు భావిస్తారు. కనుక ఆచారాలు సంప్రదాయాల్లో పవిత్రాంశాలు ఒక భాగమైపోతాయి. ఇవి పరీక్షలకు గురైనప్పుడు సోక్రటీస్లా అవసరమైతే ప్రాణాన్ని కూడా కోల్పోవలసి వస్తుంది. శాస్త్రీయతకు అవకాశమే ఉండదు.

భౌతిక వాస్తవికత మానసిక ప్రభావాన్ని ఎలా కలిగిస్తుందో వివరించే పరిణామం ఈ ''కులవృత్తి'' కథలో కనిపిస్తుంది. ఇతర దేశాల, మతాల ఆచార సంప్రదాయాల నుండి చూసే వారికి దేవాలయంలోకి చెప్పులతో వెళ్ళటం తప్పు కాదనిపిస్తుంది. పరిమిత దృష్టితో చూసేవాళ్ళకి తప్పనిపిస్తుంది.

అస్పృశ్యత వేరు పవిత్రత వేరు. సామాజికంగా ఒక వర్గం మరొక వర్గం పట్ల చూపే జుగుప్సనే అస్పృశ్యత అంటారు. అది భారత దేశంలో కనుమరుగైపోతుందని చెప్పడానికి నిదర్శనమే మాదిగ మూర్తిని దేవాలయంలోకి ప్రవేశించటానికి పూజారి స్వామి ఆటంకం పెట్టటం లేదంటాడు కథలో. ఈ స్థాయిని దాటి చెప్పులు వేసుకుని కూడా దేవాలయంలోకి వెళ్ళాలని కోరుకోవటంలో అన్ని వృత్తుల వస్తువులకు వృత్తులు చేసేవారికి సమాన గౌరవం సమాన వ్యక్తిత్వం దక్కాలనే సామాజిక సమస్యను ఈ కథ చిత్రించింది.

కథ శాస్త్రీయమైనంత మాత్రాన అందరూ అంగీకరించాలని ఏమీ లేదు. చేతబడి, బాణామతి వంటివన్నీ మూఢ విశ్వాసాలని చెప్తున్నా, శాస్త్రీయంగా నిరూపిస్తున్నా అత్యధిక ప్రజలు నమ్మే స్థితిలో లేరు. శాస్త్రీయత కంటే మానసిక ప్రభావానికే తాత్కాలికంగా అత్యధిక ప్రాధాన్యత లభిస్తుంది. అలాంటప్పుడు మూర్తిలాంటి వారి వాదన కన్నీళ్ళే పెట్టిస్తుంది. కానీ, కొంతమందినైనా ఆలోచింపచేయగలిగితే మన

ఆచార సంప్రదాయాల్లో మార్పులు ఖచ్చితంగా వస్తాయి. ఆ మార్పులు అందరికీ సంతోషాన్ని కలిగిస్తాయి. అందరితో కలిసి మెలిసి జీవించేలా చేస్తాయి. అలాంటి మార్పును ఆశించే కథే "కులవృత్తి".

**ఆధార గ్రంథాలు:**


అంబేద్కర్, బి.ఆర్. *అస్పృశ్యులెవరు?* అనువాదం,
సంపాదకులు లక్ష్మీనారాయణ, గంగిశెట్టి. తదితరులు,
బాబా సాహెబ్ అంబేద్కర్ రచనలు ప్రసంగాలు, సంపుటి-7,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ, 1992.

ఇనాక్, కొలకలూరి. *ఆధునిక సాహిత్య విమర్శ సూత్రం.*
గుంటూరు: మారుతి బుక్ హౌస్, 1996.

ఇనాక్, కొలకలూరి. కులవృత్తి కథ. *ప్రజాసాహితి మాస పత్రిక,*
సెప్టెంబరు 2006.


***

# ముస్లిం మైనారిటీ కవిత్వంలో స్త్రీవాద దృక్పథం

తెలుగులో స్త్రీవాదం వచ్చిన తరువాత దళిత, ముస్లిం మైనారిటీ వాదంలోనూ స్త్రీలు తమ సమస్యలను కవిత్వీకరిస్తున్నారు. అంతకు ముందు పురుషులే స్త్రీ సమస్యలను కొంతవరకూ స్పర్శిస్తూ కవిత్వం రాశారు. అయితే స్త్రీలు రాసిన కవిత్వంలో మరింత బలంగా ముస్లిం స్త్రీ సమస్యలు అభివ్యక్తమయ్యాయి.

ముస్లిం స్త్రీ సమస్యలను షాజహానా, మున్వీరున్నీసా, మహేజబీన్, షహనాజ్ ఫాతిమా మొదలైన వాళ్ళు స్త్రీవాద దృక్పథంతో కవిత్వీకరిస్తున్నారు. షాజహానా రాసిన ''నఖాబ్'' కవితా సంకలనం(2005), ముస్లిం స్త్రీవాదానికి నిలువెత్తు నిదర్శనంగా నిలుస్తుంది. అంతకు ముందు వచ్చిన ''జల్ జలా'' కవితా సంకలనం(1998)లో కూడా స్త్రీవాద సమస్యలను వర్ణిస్తూ పురుషులు కవిత్వం రాశారు. ఖాదర్ మొహియుద్దీన్ ''పుట్టుమచ్చ''(1991)లో, గుజరాత్ సంఘటనల తరువాత ''గుజరాత్ గాయం'', ''ఆజా'', ముస్లింల సాహిత్య ప్రత్యేక సంకలనం ''ముల్కి''(2005), ''అలావా''(2006) కవితా సంకలనం, స్కైబాబా రాసిన ''జగన్ కీ రాత్'', ఖాజా ''ఫత్వా''(1998) మొదలైన వాటిలోనూ ముస్లిం స్త్రీవాదం కనిపిస్తుంది.

ఇంటిలో స్త్రీ పురుషుల మధ్య కనిపించే వివక్ష ఇతర స్త్రీలకున్నట్లే ముస్లిం స్త్రీలలోనూ ఉంది. కానీ, ఉన్నత విద్య నభ్యసించనివ్వకపోవడం, నిర్ణయాధికారం లేకపోవడం మొదలైన వాటి విషయంలో ముస్లిం స్త్రీలు మరింత వివక్షకు గురవుతున్నారు. బయటకు కనిపించే బురఖా, ఆ బురఖా వెనుక ఎన్నో నిర్బంధాలు, బహు భార్యత్వ సమస్య, బహు సంతానోత్పత్తి కోసం అనుభవించే లైంగిక వివక్ష, భర్త చనిపోతే స్త్రీ పునర్వివాహం పట్ల తలెత్తుతున్న అనేక పరిణామాలు మొదలైన సమస్యలు ముస్లిం స్త్రీవాదంలో కనిపిస్తున్నాయి.

అంతే కాకుండా, పురుషాధిపత్యం, కుటుంబ హింస, ఆర్థిక, సాంస్కృతిక విద్యా కారణాల వల్ల చాలామంది విడాకుల కోసం ''తలాఖ్'' చెబుతున్నారు. ఆర్థిక, ఉద్యోగ కారణాల వల్ల పరదేశాలకు వలస పోయిన తరువాత స్త్రీలు పొందే కష్టాలు, బాలికలను ముసలి వాళ్ళకిచ్చి వివాహం చేసే పద్ధతి, దాని వెనుక స్త్రీ ఆంతరంగిక మనస్తత్వం వంటివన్నీ ముస్లిం స్త్రీవాదంలో కవయిత్రులు వర్ణిస్తున్నారు. దీన్ని తెలుసుకొనే ముందు ముస్లిం మైనారిటీ సాహిత్యం అంటే ఏమిటో సంక్షిప్తంగానైనా తెలుసుకొంటే బాగుంటుంది.

**ముస్లిం మైనారిటీ వాదం:**

తెలుగు సాహిత్యంలో ''మైనారిటీ వాదం'' అనే పేరు వినిపిస్తుంది. Minority అనగా ''అల్ప సంఖ్యాకులు'' అని అర్థం. భారతీయ జనాభా లెక్కల ప్రకారం హిందువుల తర్వాత స్థానంలో ముస్లింలు, క్రైస్తవులు, సిక్కులు, జైనులు, బౌద్ధులు మొదలైన వారు సంఖ్యాపరమైన క్రమంలో కనిపిస్తున్నారు. హిందువులు తప్ప మిగిలిన వారంతా ఇంచుమించు అల్పసంఖ్యాకులే. అయినప్పటికీ అల్ప సంఖ్యాకులైన ముస్లింలు తమ కష్టనష్టాలను అభివ్యక్తి కరించే సాహిత్యాన్ని 'మైనారిటి వాదం' అంటున్నారు.

తెలుగు సాహిత్యంలో 'మైనారిటీ వాదం' అనేది ఒక పారిభాషిక పదంగా మారింది. ప్రపంచ వ్యాప్త పరిస్థితులను బట్టి తమ సమస్యలలో ప్రత్యేకత ఉందనీ అల్ప సంఖ్యాక వర్గం కావడం వల్ల అభద్రత భావం నెలకొందనీ భావిస్తున్న ముస్లింల మనోభావాలను ప్రతిఫలిస్తు వస్తున్న సాహిత్యమే మైనారిటీవాద సాహిత్యం. దీన్ని ''మైనారిటీవాద సాహిత్యం'', ''ముస్లిం సాహిత్యవాదం'', ''మైనారిటీవాదం'' మొదలైన పేర్లతో పిలుస్తున్నారు. ఈ స్వరూప స్వభావాలను సాధారణీకరించి తెలుగు సాహిత్యంలో ముస్లింల ప్రత్యేక అనుభవాల వ్యక్తీకరణను గుర్తించ గలిగే విధంగా దీనిని ''ముస్లిం మైనారిటీ వాదం'' అని పిలవడం సమజసంగా ఉంటుంది.

**ముస్లిం మైనారిటీ వాదం నిర్వచనం:**

1) ముస్లిం మనోభావాలను శక్తివంతంగా ''పుట్టుమచ్చ'' కవిత ద్వారా వ్యక్తీకరించిన ఖాద్దర్ మొహియిద్దిన్‌గారి ప్రకారం - ''ముస్లిం వాదం అంటే ముఖ్యంగా ముస్లిం ఆలోచనల చట్టం అన్నారు.

దీన్ని మరింత వివరిస్తూ ''*ముస్లిం తత్త్వం, ముస్లిం తాత్త్విక దృక్పథం, ముస్లింలు గతాన్ని ఎలా చూడాలి? తమ భవిష్యత్‌ను ఎలా నిర్మించుకోవాలి? ఈ రెండింటికి సంబంధిచిన వివిధ అంశాల పట్ల ఎటువంటి వైఖరిని కలిగి ఉండాలి? వీటిని వివరించేదే ముస్లిం తాత్త్విక దృక్పథం. ఈ దృక్పథాన్ని సాహిత్య కళారంగాల్లో ఎలా ప్రతిఫలింపజేయాలో వివరించేదే ముస్లిం సాహిత్య దృక్పథం*'' అని ముస్లిం సంస్కృతి కవిత్వం ''అలావా''కు రాసిన ముందుమాట (సూఫీతత్వమే సరైనా మార్గం)లో ఖాద్దర్ మొహియిద్దిన్ అన్నారు.

ఈయనే ముస్లిం మైనారిటీ వాదాన్ని ఇంకొంచెం లోతుగా వివరిస్తూ ''*ముస్లిం వాదమంటే ఒక ధార్మిక సముదాయంగా తన గతిని స్థితిని తను దర్శించుకునే చైతన్యం. తనవైన ప్రతీకలు చిహ్నాల ద్వారా తనదైన ఒక అభివ్యక్తి అంతేకాదు ముస్లింవాదం అంటే భారతీయ ముస్లిం సాంస్కృతిక విలువల పట్ల, ఆ మాటకి వస్తే మొత్తం ప్రాశ్చ ప్రపంచ సాంస్కృతిక విలువల పట్ల, సార్వజనీయమైన మానవతా విలువల పట్ల ఒక నిబద్ధత, ఒక జాగురూకత, వాటిని పరిరక్షించుకునే ఒక ప్రయత్నం. వాటి అభివృద్ధిని కాంక్షించే ఒక సంకల్పం. తెలుగు ద్వారా భారతీయ సాహిత్యాన్నికి*

తద్వారా మానవ నాగరికతకి అందుతున్న అపూర్వమైన ఒక అదనపు విలువ ముస్లింవాదం. ముస్లింవాదం తనలోనే తానొక ఏకవచనం, ద్వివచనం, బహువచనం, ముస్లింవాదం తనకోసం తనదైన పద్ధతిలో తన ఉనికిని లోకాన్నికి చాటి చెప్పేందుకు సృష్టించిన సృజనాత్మక నినాదం'' అని అన్నారు.

2) ముస్లిం మైనారిటీవాదం గురించి కొన్ని వ్యాసాలు రాసిన ప్రముఖ విమర్శకురాలు ముదిగంటి సుజాతరెడ్డిగారి అభిప్రాయంలో ''మైనారిటీవాదం అంటే ముస్లింలు, క్రిస్టియన్లు, సిక్కులు, జైనులు, బౌద్ధులు మొదలైన మతపరంగా అల్పసంఖ్యలో ఉన్నవారందరూ ఉండాలి. కాని వారు ఎవ్వరూ ఈ అభివ్యక్తిలో లేరు. క్రిస్టియన్‌ల వేదన కొంతవరకు దళితవాద కవిత్వంలో ప్రకటితమవుతుంది. ఇంక కేవలం ముస్లింల వేదన ప్రకటించేదే మైనారిటీ వాదంగా కనిపిస్తుంది. భారతదేశపు విశాలమైన దేశీయ సమాజంలో భాగంగా గుర్తింపబడక పోవడం అనే ఆవేదన అందరిచేత కాకున్న కొందరి లెక్కల్లో దేశ ద్రోహులుగా తప్పుడు ప్రచారం చేయబడుతున్న బాధ మైనారిటీ వాదంలోని ముస్లిం సాహిత్యంలో వ్యక్తమవుతున్నది. ఇది కేవలం కాషాయమూకలకు వ్యతిరేకంగాను, ఫ్యాసిస్ట్ ధోరణులకు వ్యతిరేకంగాను లేస్తున్న సాహిత్యోద్యమం కాదు. కాని మతోన్మాద శక్తులు చూపే వివక్ష, అంటగట్టే దేశ ద్రోహత్వం, జరిపే హింసకు కుమిలిపోతు బయటకు వ్యక్తం చేసే వేదన మైనారిటీ కవిత్వంలో కనిపిస్తుంది.'' అని ఈ మైనారిటీ సాహిత్య స్వభావం గురించి వివరించారు. (''ముల్కి''- ముస్లిం సాహిత్య సంకలనం, 2005: 93)

3) ముస్లిం మైనారిటీ వాదాన్ని ఉద్యమప్రాయంగా ముందుకు తీసుకువెళుతున్న స్కైబాబా అభిప్రాయంలో - ''భారతదేశంలోని ముస్లింలు ప్రత్యేక పరిస్థితుల రీత్యా ముస్లిం సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక విషయాల్ని గురించి ముస్లిం వాదం మాట్లాడుతుంది. మతం వ్యక్తిగతం అనే స్పృహతో మతం జోలికి ముస్లింవాదం వెళ్లదు. కాని, ముస్లింల జీవన మార్గానికి ప్రత్యక్షంగా, పరోక్షంగా అడ్డంకులుగా నిలుస్తున్న అంశాల పట్ల స్పందిస్తుంది. ముస్లింలను అణిచివేస్తున్న మూల శత్రువుతో పోరాడుతునే అంతర్గత వైరుధ్యాలను వదలకుండా బాహ్య అంతర రెండు పోరాటాలు చేయడం ముస్లింవాదం ప్రత్యేకత. హిందుత్వ దాష్టీకాన్ని ప్రశిస్తూనే అంతర్గతంగా ముస్లిం స్త్రీల గురించి, దూదేకుల గురించి ముస్లింలోని ఛాందసత్వం గురించి, ముస్లిం సమాజంలో జరగవలసిన సంస్కరణల గురించి, తమ మూలాల వెతుకులాట గురించి ఎంతో సాహిత్యాన్ని సృష్టించటం ఆ సాహిత్య ప్రత్యేకత'' అని అన్నారు. (''అలావా'' ముస్లిం సంస్కృతి కవిత్వం, 2006:18)

మొత్తం మీద ముస్లిం మైనారిటీవాద సాహిత్యం ఒకవైపు స్వీయమతంలోని మూఢాచారాలను ఖండిస్తూ మరొకవైపు మాతృదేశంలో తమ అస్తిత్వాన్ని నిరూపించుకుంటూ అగ్ర వర్గానికి కింది వర్గానికి మధ్య నలిగిపోతూ తాము ఏ స్థితిలో ఉన్నారో తెలియజేస్తూ రాస్తున్న సాహిత్యం ''ముస్లిం మైనారిటీవాద సాహిత్యం'' అని నిర్వచించుకోవచ్చు.

**ముస్లిం మైనారిటీ కవిత్వం స్త్రీవాద దృక్పథం:**

ముందే ప్రస్తావించినట్లు వివక్షను ఆధారంగా చేసుకొని ముస్లిం స్త్రీవాదం వచ్చింది. మతాన్ని ఆధారంగా చేసుకొనే ఇంచుమించు అన్ని సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. అయినప్పటికీ ఆయా సమస్యలను బట్టి కింది విధంగా ముస్లిం స్త్రీవాదాన్ని వివరించుకునే అవకాశం ఉంది.

**మతాంతరీకరణ భాషా సమస్య:**

వివిధ పాలన, సాంఘిక, మతకారణాల వల్ల కొన్ని సామాజిక వర్గాల వాళ్ళు ముస్లింలుగా మతాంతరీకరణ చెందడం వల్ల భాష, ఆచార వ్యవహారాల్లో కలిగే ఇబ్బందులను కూడా ముస్లిం స్త్రీలు కవిత్వీకరిస్తున్నారు. ఉదాహరణకు కొన్ని కవితా ఖండికలను చూస్తే ముస్లిం స్త్రీవాదం ఎలా ఉందో తెలుస్తుంది.

ముస్లిం స్త్రీపరంగా వారి మనోభావాలను వర్ణించడంలో చేయి తిరిగిన రచయిత్రి షాజాహానా. ఆమె "లద్దాఫ్ని" పేరుతో రాసిన కవితలో ముస్లింలలో 'లద్దాఫ్' స్త్రీ మానసిక జీవితాన్ని చిత్రించారు. వచ్చీ రాని ఉర్దూ పదాలతో మాట్లాడుతుంటే ఎదురయ్యే ఇబ్బందులు, వాటిని అధిగమించడం కోసం ఉర్దూ నేర్చుకోవాలనే వారి ప్రయత్నం, ఆ భాష రాక, తన మాతృభాషలోనే మాట్లాడితే వచ్చే నష్టమేమిటనే ప్రతిఘటన స్వరాన్ని కూడా వినిపించగలిగారు కవయిత్రి. 'భాష' భావాభివ్యక్తికి బలమైన వాహిక మాత్రమే తప్ప ఫలానా భాషలోనే మాట్లాడాలనే నియమం లేదనీ ఒక శాస్త్రీయమైన ఆలోచనను ప్రతిఘటన స్వరంతో ప్రతిధ్వనిస్తూ...

*"వచ్చో రాదో నా ఉర్దూ పరిజ్ఞానం మీద*
*వాళ్ళ కుతూహల ప్రావీణ్య ప్రదర్శన జరిగి"*నప్పుడు-
*"తెగించి బయటకు రాలేని మోహమాటపు నీటి చుక్కలు*
*కంటి కొనల్లో ఇరుక్కొని అచ్చం నాలాగే అల్లాడతాయ"*ని వర్ణించారు.

ముస్లిం స్త్రీ ఈ పరిస్థితిని ఎదుర్కొనే స్థితిని వర్ణిస్తూ-

*"వాళ్ళ ఉరుదూ జరీ చీరల సమూహాల గల గలల మెరుపుల*
*ముందు*
*నా గొంతు కాటన్ చీరై బిక్కు బిక్కుమంటూ*
*ఒంటరిగా ముడుచుకుంటుంది."* అని ఆ పరిస్థితిని జరీ చీరల మధ్య కాటన్ చీర తెల్లబోయిన దృశ్యాలతో పోల్చారు కవయిత్రి. జరీ చీరలను ముస్లింలలోని ఉన్నత వర్గానికి, కాటన్ చీరను కింది వర్గానికి ప్రతీక చేసి వర్ణించారు కవయిత్రి. దీని ద్వారా ముస్లింలలోని వర్గ సమస్యను కూడా చెప్పినట్లయింది. అవమానాల నుండి ఆత్మ గౌరవాన్ని ప్రదర్శిస్తూ-

*"నీ దూదేకుల తనాన్ని షోహర్ ఆపాదించుకోనప్పుడు అస్లీ ముస్లిం ముద్రని మాత్రం నేనెందుకు భరించాలి?"* అంటుంది కవయిత్రి అందుకనే "లదాహీ రహుంగీ" అంటూ కవితను ముగించారు.

**సంతానోత్పత్తి లైంగిక హింస:**

ముస్లిం స్త్రీ అనగానే చాలా మందిలో వినిపించే మాట అనేకమందికి జన్మనివ్వడానికి పుట్టిన స్త్రీ. ఈ సమస్యను శక్తి వంతంగా కవిత్వీకరించారు 'షహనాజీ పాతిమా'!

*''ఓపిగ్గా అసంఖ్యాక వారసుల్నిచ్చే*
*సంతానోత్పత్తి కర్మాగారం*
*...*
*అనాదిగా ఆధారపడ్డం అలవాటు చేయబడిన స్వయం ప్రతి పత్తి లేని పరాధీన''*గా ముస్లిం స్త్రీ బతుకుని వెళ్ళదీస్తున్న దృశ్యాన్ని అభివర్ణించారు కవయిత్రి. 'ఖబర్దార్' అనే కవితలో ముస్లిం స్త్రీ అనుభవిస్తున్న లైంగిక హింసను షాజహానా ఇలా వర్ణించారు.

*''మీ సుఖం కోసం*
*ప్రాణం చీల్చుకు పన్నెండు మందిని కనమనండి*
*లేకపోతే నరకం*
*ఇప్పుడు అనుభవిస్తున్నదే పక్కా స్వర్గం''* ఇలా వర్ణించి వదిలేయలేదు కవితను తిరుగుబాటు తత్వాన్ని ప్రేరేపిస్తూ ఇలా అంటారు.

*''మమ్మల్ని మౌన మాంసాలుగా*
*ఉత్పత్తి యంత్రాలుగా బతకమన్న మీ సంప్రదాయానికో సలాం''*

ఇక్కడ షాజహానా కవితలో ముస్లిం స్త్రీ వేదనను వర్ణించటమే కాకుండా సమస్య పరిష్కారానికి మార్గాన్ని కూడా చూపిస్తున్నారు. సంప్రదాయంలో ఉన్నంత కాలం స్త్రీకి విముక్తి లేదనేది ముస్లిం స్త్రీలు గుర్తించాలని కవయిత్రి భావిస్తున్నారు.

**వివాహం బహు భార్యత్వం:**

ముస్లింలకు పవిత్ర గ్రంథంగా భావించే ఖురాన్‌లో ముస్లిం వివాహ వ్యవస్థ గురించి ఉంది. కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లోనే బహూ భార్యాత్వాన్ని అంగీకరించవచ్చునని స్పష్టంగానే ఉంది. దీన్ని వక్రీకరిస్తూ, మత పెద్దల అండ దండలతో స్త్రీ మనోభిప్రాయాలను విలువనివ్వకుండా జరుగుతున్న వివాహం గురించి, ఆ వివాహాల వెనుక ఉండే దయనీయ గాథల గురించి కూడా కవిత్వం వచ్చింది.

*''నేనొక అరబ్బు కామవాంఛకు*
*బలైన బొమ్మను/ ...*
*పరదేశానికి అమ్ముడైన*
*అంగడి బొమ్మను నేను/ ...*
*కన్న వాళ్ళు అసహాయితకు*
*కటిక పేదరికానికి*
*బలిపీఠం ఎక్కుతున్న వాళ్ళం*
*మేము కేవలం బొమ్మలం''* ఒకవైపు పేదరికం, మరొక వైపు మూఢత్వం చేసే పెత్తనం. ఈ రెండింటి మధ్య బొమ్మల్లా మారిపోతున్న స్త్రీల గురించి మున్వీరున్నీసా రాసిన ''గుడియా'' కవిత గొప్ప నిదర్శనం!

ముస్లిం స్త్రీవాదం గురించి మాట్లాడుతూ ప్రముఖ కవి, విమర్శకుడు డా॥ ఎండ్లూరి సుధాకర్ ఇలా అన్నారు. "*ముస్లిం స్త్రీవాద కవిత్వం అంటే ముస్లిం స్త్రీలు రాసిందే అవుతుంది. ఇక్కడ సానుభూతికి తావులేదు. ముస్లిం స్త్రీ పుట్టుక ముస్లిం స్త్రీ ఉనికిని నిర్ధారిస్తుంది.*" (ముల్కి 2005: 95) ఈ అభిప్రాయం ప్రకారం చూస్తే ముస్లిం స్త్రీవాదం గురించి ముస్లిం స్త్రీల రచనలనే ప్రధానంగా పరిగణనలోకి తీసుకోవాలి. ఇతరుల రచనలను తీసుకున్నా ముస్లిం స్త్రీలు రాసిన దానికున్నంత ప్రాధాన్యతను ఇవ్వవలసిన అవసరం లేదని గుర్తించాలి. అంతే తప్ప ఇతరులు రాయకూడదని కాదు. ఈ పత్రంలో ముస్లిం స్త్రీలు రాసిన కవిత్వాన్నే ప్రధానంగా తీసుకొని విశ్లేషించడం జరిగింది. ముస్లిం స్త్రీలు రాసిన కవిత్వంలో వారి బాధలు వెల్లడవుతున్నాయి. ఇతర మతాలు, వర్ణాలలో కంటే ముస్లిం స్త్రీ ఇస్లాం మతంలో మరింత పీడనకు గురవుతుందని ముస్లిం స్త్రీవాదం వల్ల స్పష్టమవుతుంది. వస్తువులో వచ్చిన నవ్యత శిల్పంలో కూడా ప్రవేశించి తెలుగు సాహిత్యానికి మరింత సొగసుని అందించిందని చెప్పుకోవచ్చు.

ముస్లిం సాహిత్యం రాస్తున్న కొద్దిమందిలో స్త్రీవాద దృక్పథంతో రాస్తున్నవారు చాలా తక్కువ మంది ఉన్నారు. వారిలోను శక్తివంతంగా రాసే కవయిత్రిగా షాజహానా నిలుస్తున్నారు. ఈ విధంగా విశ్లేషించుకున్నపుడు ముస్లిం స్త్రీవాదం షాజహానా చుట్టూ తిరుగుతుందని చెప్పవచ్చు. ముస్లిం సమస్యలు మరిన్ని బయటకు రావాలంటే ముస్లిం మహిళలు మరింత మంది చదువుకోవలసిన అవసరం ఉంది. అప్పుడు మాత్రమే ఇస్లాం మతంలోని కొన్ని లోపాలు స్త్రీ పాలిట శాపాలుగా వక్రీకరించని పరిస్థితి నెలకొంటుంది.

**ఆధార గ్రంథాలు:**


ఎల్లయ్య, వేముల. (సంపా). ముల్కి *(ముస్లిం సాహిత్య సంకలనం).* హైదరాబాదు: హైదరాబాదు బుక్ ట్రస్ట్, 2005.

షాజహానా. *నఖాబ్ (ముస్లిం స్త్రీ కవిత్వం).* హైదరాబాదు: నసాల్ కితాబ్ ఘర్ ప్రచురణ, 2005.

షాజహానా, స్కైబాబా (సంపాదకులు). అలావా *(ముస్లిం సంస్కృతి కవిత్వం).* హైదరాబాదు: నసాల్ కితాబ్ ఘర్ ప్రచురణ, 2006.


***

# అమ్మ నవల:
# మాక్సిమ్ గోర్కీ రచనా నైపుణ్యం

ప్రతి రచయితకు సృజనాత్మక నైపుణ్యం ఉంటుంది. ఆ నైపుణ్యం వల్ల తాను చేపట్టిన ఆ ప్రక్రియకూ కొన్ని సార్లు ప్రక్రియా గౌరవం పెరుగుతుంది. మరి కొన్ని సార్లు ఆ నైపుణ్యం కొరవడినా వస్తువుని బట్టి ఆ ప్రక్రియ ఆదరణకు పాత్రమవుతుంది. గోర్కి రాసిన 'అమ్మ' నవలలో రెండింటికీ సముచిత ప్రాధాన్యం కనిపిస్తుంది. నవలను ప్రారంభించటం, పాత్రలను తీర్చిదిద్దటం, భావజాలాన్ని వ్యాపింపచేయటంలో రచయిత గొప్ప నైపుణ్యాన్ని ప్రదర్శించారు.

**నవల ప్రారంభంలో నైపుణ్యం:**

ప్రతి రచనకు 'ప్రారంభం' చాలా ముఖ్యం. అనేక రకాలుగా రచనను ప్రారంభిస్తుంటారు. 'అమ్మ' నవలను రచయిత సాధారణంగానే ప్రారంభించారు. ''*ప్రతిరోజూ తెల్లవారే సరికి ఫ్యాక్టరీ కుయ్యమని కూతపెడుతుంది. ఆ కూత వినడంతోనే కూలిపేటలోని జనమంతా కలత నిద్ర నుంచి లేచి ఒళ్ళు విరుచుకుని చిరచిరలాడుతూ ఇళ్ళలో నుంచి బెదిరిపోయిన బొద్దింకల లాగున గబగబా వీధుల్లో పడతారు...*'' ఇలా సాగిపోతుంది నవల.

కార్మికుల జీవితాల్లో సహజమై పోయిన జీవితాలను వర్ణించటం రచయిత లక్ష్యం. కార్మికుల జీవితాల్లో ఎలాంటి మార్పూ లేదు. మార్పుల కోసం ప్రయత్నిస్తే నిర్బంధాలు తప్పవు. ఆ ప్రయత్నాలు జీవితాలను చిద్రం చేస్తున్నాయి. కనుక ''మార్పు'' వైపు ఆలోచించకుండా, స్తబ్ధంగా గడిచిపోతున్న జీవితాల్లో సంఘర్షణ, మౌలిక మార్పులను రచనలో తీసుకు రాగలగాలి. అందుకనే కొత్త వాళ్ళను ఆ కార్మికులు అనుమానంగా కూడా చూస్తుంటారు. దాన్ని తరువాత ''నిఘాపోలీసు''గా కథలో వర్ణించారు రచయిత.

**స్తబ్ధతను పోగొట్టటం:**

అణచివేత వల్ల కార్మికుల్లో స్తబ్ధత నెలకొంది. అయినా వాళ్ళలో అసహనం ఉండేది. దాన్ని వాళ్ళు తమ తమ కుటుంబ సభ్యులతో గొడవ పడటం, కూలిపేట వాళ్ళతో కొట్టుకోవటం వల్ల ఆ అసహనాన్ని తీర్చుకొనే వారు. బాధలు తెలియకుండా ఉండేందుకు మందు తాగేవారు. మళ్ళీ ఫ్యాక్టరీ కూతపెడుతుంది. పనికి పరిగెట్టవలసిందే ఇవన్నీ రొటీన్‌గా జరిగిపోయే పనులే! 'అమ్మ' కథానాయిక పెలగోయానీలోవ్నా ఇంటి నుండే స్తబ్ధతను చెదరగొట్టే దిశగా రచయిత తన ప్రణాళికను సిద్ధంచేసుకున్నారు. కథానాయికకు ''నీలోవ్నా'' అని పేరు పెట్టినా, ఆ పాత్ర చారిత్రకంగా జరిగిన జీవితమే! ఆ విషయాన్ని ముందుమాటలో స్పష్టంగానే వివరించారు. 1849 ఒక గొడారి కుటుంబంలో పుట్టి 1938లోచనిపోయిన అన్నాకిరీల్లొవ్నా వాస్తవ జీవితాన్ని కేంద్రికరించి నవల వర్ణించారు రచయత. నవలలో

కథానాయిక నీలోవ్నాను భర్త, మిహయిల్ వ్లాసొవ్ చాలా హింసించేవాడు. తన క్రూరత్వాన్నంతా ఆమెపై చూపేవాడు. అతడు కొట్టిన దెబ్బలకు ఆమె గూనిదవుతుంది. కొద్దిగా చదువుకున్నా, ఆ అక్షరాలనూ మరిచిపోతుంది. భర్త సేవ చేయటమే తన జీవిత పరమార్థమయ్యింది. ఒక ప్రాణం ఉన్న యంత్రలా తయారవుతుంది. తాగుడు ఎక్కువ కావటంతో అనారోగ్యానికి గురై భర్త చనిపోతాడు.

భర్త లాగానే కొడుకు పావెల్ కూడా తాగుతుంటాడు. కానీ, అతడికి ఆ మందు సరిపడదు. ఇలా ఈ బతుకులింతే అనుకునే స్తబ్ధతా వాతావరణాన్ని ముందుగా ''అమ్మ'' ఇంటిలోనే కల్పించారు రచయిత. ఆ స్తబ్ధతను బద్ధలుకొట్టి ''అమ్మ''ను ''విప్లవం కన్న అమ్మ''గా పరిణామం చెందేటట్లు వర్ణించారు. అందులోనే రచనా నైపుణ్యం ఇమిడి ఉంది.

సంఘర్షణ:

తమ బాధలకు కారణాలను పావెల్ వివిధ పుస్తకాలు చదవటం ద్వారా, ప్రజల జీవితాలను పరిశీలించటం ద్వారా అవగాహన చేసుకున్నాడు. తన తండ్రి లాగే తానూ ''అమ్మ''ను హింసించ కూడదనుకున్నాడు. తన తల్లితో గౌరవంగా మెలిగేవాడు. పుస్తకాలు చదవటం, కొన్ని విషయాలను రాసుకోవటం, వేళకి ఇంటికి రాకపోవటం, ముఖం పీక్కుపోయి కనిపించటం వంటివన్నీ పావెల్‌లో ప్రవేశించిన సంఘర్షణను తెలుపుతున్నాయి. తనకొడుకు అందరిలా ఉండకుండా ప్రత్యేకంగా ప్రవర్తించటంలో మాతృత్వంలోని సహజమైన సంఘర్షణ కూడా వ్యక్తమయ్యింది. పావెల్ పట్ల పడిన మానసిక సంఘర్షణ కేవలం తన మాతృ హృదయానికి సంబంధించిన సంఘర్షణే అనుకోవచ్చు. నిజానికి తన కొడుకు సంతోషం కోసమే పావెల్ స్నేహితులను అమ్మ మొదట్లో ఆదరించేది. ఇక్కడ కూడా 'అమ్మ' పాత్రలో మాతృహృదయ సంఘర్షణే కనిపిస్తుంది.

పావెల్, ఆతని స్నేహితులు కలిసి చర్చించుకోవటం, సమాజ పరిస్థితులను మార్చాలనుకోవటం, కరపత్రాలను తయారు చేయటం, వాటిని పంచటం ''సమస్య''ను ముందు పెట్టి పరస్పర సంఘర్షణకు మార్గం తెరిచినట్లయ్యింది. సమాజంలో సమస్యలున్నా, అంతః సంఘర్షణ స్వభావాన్ని కూడా ఉంటుందని ఈ సన్నివేశంలో గమనించవచ్చు.

ఆ తర్వాత ఫ్యాక్టరీలో కరపత్రాలు దొరకటం, కొంతమందిని జైలుకి పంపటం, మళ్ళీ మళ్ళీ కరపత్రాలు సిద్ధమై ప్రత్యక్షమవ్వటం వంటివన్నీ సమాజంలో భిన్న వర్గాల మధ్య గల పరస్పర సంఘర్షణ పరిస్థితులను రచయిత వర్ణించ గలిగారు. ఈ కరపత్రాలను రహస్యంగా పంచటంలో ''అమ్మ'' కూడా తనకి తెలియకుండానే ఉద్యమంలో ఒక భాగమైపోతుంది. జైలుకి వెళ్ళిన కొడుకుని కలుసుకున్నప్పుడు, తొలిసారికి, తరువాత మళ్ళీ మళ్ళీ కలుసుకున్నప్పటికీ, కోర్టులో కొడుకు ప్రసంగం విన్న తర్వాతా ''అమ్మ'' పాత్రలో గొప్ప పరిణామాన్ని ప్రవేశపెట్టారు రచయిత. ఇదంతా పరస్పర సంఘర్షణ ఫలితమే! సత్యాన్ని తెలుసుకున్న జీవిత ప్రయాణమే!

**భావజాల విస్తరణ:**

మార్క్సిస్టు ప్రధాన సూత్రాల్లో నాయకత్వ లక్షణాలను పెంపొందించటం, ఉద్యమం నిరంతరం కొనసాగించటం, వ్యక్తిగత ఆస్తులు లేకపోవటం, స్త్రీ పురుష స్వేచ్ఛా వాతావరణం, ప్రతి విషయాన్ని కూలంకుషంగా చర్చించుకోవటం వంటివెన్నో ''అమ్మ'' నవలలో బాగావిస్తరించ గలిగారు రచయిత. జీవితం తెలిసి రాసిన రచనలు బాగుంటాయి. జీవితాన్ని నడిపించే శక్తులను గుర్తించి రాస్తే ఆ రచనలు మరింతగా బాగుంటాయి. జీవితం తెలియటం, జీవితాల్ని నడిపించే శక్తులను గుర్తించగలగటం రెండూ 'అమ్మ' నవలలో ఉన్నాయి.

పావెల్ బాగా పుస్తకాలు చదివేవాడు. దానితో పాటు అనేక చర్చలలో పాల్గొనేవాడు. పావెల్ దగ్గరకు స్నేహితులు కూడా ఒక్కొక్కరూ రావటం, మాట్లాడుకోవటం, వెళ్ళిపోవటం, ఏవో కొన్ని పత్రికలు రాయటం, వాటిని పంచటం, అవసరమైతే తమ తమ అభిప్రాయాలను వ్యక్తీకరించటంలో తీవ్రమైన సంఘర్షణకు దిగటం వంటివి జరుగుతుండేవి. పావెల్ 'అమ్మ'తో అంటున్నట్లే ఒకనాడు పోలీసులు అతణ్ణి పట్టుకుంటారు. జైల్లో పెడతారు. ''పావెల్'' అరెస్టుతో కరపత్రాలు ఆగిపోకుండా మళ్ళీ కరపత్రాలు రాసి, వాటిని పంచగలగటంలో నాయకత్వం విస్తరింపబడింది. నిజమైన నాయకత్వం ఎలా ఉండాలో వర్ణితమైంది. దానితో కరపత్రాలు రాసేదెవరు? వాటిని పంచేదెవరు? అనేది పాలకవర్గాలకు అంతుపట్ట లేదు. దానితో అనేక మంది రైతులు, కార్మికులు, ప్రజలు ఉద్యమంలో భాగస్వామ్యం పెరిగి, ఉద్యమం కొనసాగగలిగింది. వ్యక్తి ఆగిపోతే, ఉద్యమం ఆగిపోకూడదనే భావజాలాన్ని దీనిద్వారా బాగా వివరించినట్లయ్యింది.

నిజానికి ''అమ్మ'' నవలలో కొంతమంది ఉద్యమకారులకు వ్యక్తిగత ఆస్తులు ఉన్నట్లు వర్ణితమయ్యాయి. కానీ, ఆ ఆస్తిని ఉద్యమానికి వినియోగించినట్లు వర్ణించటం మరో గమనించవలసిన విషయం! ముఖ్యంగా రహస్యంగా ప్రెస్ నడిపే లుద్మీలా, సారష్కా వంటి వాళ్ళు వ్యక్తిగత ఆస్తులు కలిగి ఉన్నావాళ్ళే! కానీ, వాటిని ఉద్యమ విస్తరణకు ఖర్చుపెట్టినట్లు రచయిత వర్ణించారు.

ఫ్యాక్టరీలో పనిచేసిన కార్మికులు అమ్మకి జీతమిస్తుండేవారు. ఆమె, ఆ ఉద్యమకారులు ఆ డబ్బంతా దాన్ని ఉద్యమానికే ఖర్చుపెట్టేవారు. అలాగే ఉపాధ్యాయురాలు, డాక్టరు వంటి వాళ్ళెంతో మంది ఉద్యమానికి ఊతమిచ్చిన వాళ్ళే! ఒక నిరంకుశ శక్తిని ఎదిరించటానికి, అనేక చిన్న, పెద్ద శక్తులన్నీ ఓ చోటకు చేరక తప్పదన్నట్లు కేవలం డబ్బు ఉండటమే ప్రధానం కాకుండా ఆ డబ్బు ఉద్యమానికి వినియోగిస్తున్నారా? లేదా? అనేది కూడా ప్రధానమని నవలలో వివరించినట్లయ్యింది.

ఉద్యమకారులకు ''వివాహం'' జరగాలా? వద్దా? అనే విషయంలోనూ కథానాయకుడు పావెల్‌ను ఓ అమ్మాయి ఇష్టపడటం, పావెల్ మాత్రం ఉద్యమానికే అంకితం కావటం వంటి వాటినీ ఈ నవలలో చర్చకు అవకాశం ఇచ్చేలా వర్ణించారు రచయిత. తన చివరి మాటకూడా విప్లవం గురించే మాట్లాడనివ్వండని క్షయవ్యాధితో

చనిపోయిన తిరుగుబాటుదారుడు చెప్తాడు. ఇలా మార్క్సిస్టు భావజాలాన్ని వివిధ పాత్రల రూపంలో గోర్కి చక్కని సమన్వయం చేసి అందించారు.

**వస్తు కళా సమన్వయం:**

భర్త సేవే భాగ్యంగా భావించిన నీలోవ్నా, విప్లవకారులందరికీ 'అమ్మ'గా పరిణామం చెందిన దశలను నిశిత దృష్టితో సృజనీకరించారు రచయిత. క్రీస్తుని ఎవరైనా పల్లెత్తుమాటంటే పడని 'అమ్మ' చివరికి, క్రీస్తునీ, చర్చి వాతావరణాన్ని, తాను చేస్తున్న రహస్యోద్యమ కార్యకలాపాలను జీవిత సత్యాన్ని తెలుసుకోవటానికి చేసే ప్రయాణంగా భావిస్తుంది. అది 'ఆమె' పాత్రానుగుణంగా రచయిత తీసుకొచ్చిన గొప్ప పరిణామం. ఆ పాత్రలో పాఠకుడు లీనమవ్వాలను కుంటాడు.

నాటి రష్యా నిరంకుశ చక్రవర్తుల పాలన, దేశ పరిస్థితులు, దాని ఫలితంగా 1902లో సొర్మొవో ప్రాంతంలో జరిగిన మేడే దినోత్సవం, తదనంతరం అనేక మందిని జైళ్ళకు పంపటం, సైబీరియాకి వలస పంపి, హతమార్చటం వంటివన్నీ వస్తుగత వాస్తవ సంఘటనలు. పావెల్ నిజ జీవితంలో ప్యోత్‌జులామొవ్. అతని తల్లే అన్నాకిల్లొవ్నా.చారిత్రక వాస్తవాన్ని గోర్కీ కళాత్మకం చేశాడు. అలాంటి పీడనను ఎదుర్కొనేందుకు కాలంతో దేశంతో నిమిత్తం లేకుండా ''తమదే'' అని ఫీలవ్వగలిగేటట్లు సృజనీకరించాడు. సత్యాన్ని సత్యంగా చెప్పటం కంటే, కళాత్మకంగా చెప్పటం వల్ల అది మనసుల్లో స్థిరంగా నిలిచిపోతుంది. మనసుల్ని కదిలిస్తుంది. ఇంద్రియానుభూతుల్ని సుఖదుఃఖాలతో నింపేస్తుంది. సత్యం దర్శనీయమవుతుంది. అది జీవితాల్ని ఫలవంతం చేస్తుంది. ఆ శక్తి గోర్కి రాసిన 'అమ్మ' నవలకు ఉంది. అందుకనే నూరేళ్ళయినా, 'అమ్మ' నవలలో సజీవ కళ తొణికిస లాడుతుంది. ఉద్యమకారులకు ఊతమవుతుంది. విముక్తి గీతాల్ని వినిపిస్తుంది.

***

# పరిశోధకుడుగా
# ఆచార్య పింగళి లక్ష్మీకాంతం

*'"Research is a simple a systematic refined technique of thinking, employing specialist tools, instruments and procedures in order to obtain in more adequate solutions of a problem than would be possible under ordinary means.""* అని సి.సి. క్రాఫోర్డ్ పరిశోధన గురించి చెప్పిన అభిప్రాయం ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి పరిశోధనకు ఇంచుమించు సరిపోతుంది. పరిశోధనలో సమస్యను పరిష్కరించడానికి కొన్ని పరికరాలు ఉండాలి. కొన్ని పద్ధతులు పాటించాలి. వీటిని ఉపయోగించుకుంటూ సరైన పరిష్కారాన్ని లేదా సమన్వయాన్ని చేయటానికి ఒక సక్రమమైన వ్యవస్థ ఉండాలి. ఇది సాధ్యమైనంత వరకూ అందరికీ కాకపోయినా, ఎక్కువమందికి ఆమోదయోగ్యమైన వ్యవస్థలో కొనసాగేదై ఉండాలి.

విశ్వవిద్యాలయ స్థాయిలో చదువుకున్న కొంతమంది తొలితరం విద్యార్థులకు సాహిత్య చరిత్ర, సాహిత్య విమర్శలను బోధించిన అధ్యాపకుడుగా ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు (1894-1972) ప్రసిద్ధులు. విద్యార్థులకు పాఠాలను బోధించేందుకు తయారుచేసుకున్న నోట్స్ (Notes) ఆ తరువాత కాలంలో వ్యాసాలు, గ్రంథాలుగా ప్రచురింపబడి, కొన్ని పరిశోధనా విషయాలను అందించగలిగింది. అధ్యాపకుడు (Lecturer)గా, రీసెర్చ్ ఫెలో (Research fellow)గా, అనుభవం కలిగిన వీరు సాహిత్య పరిశోధనలో కొన్ని సమన్వయాలను, కొన్ని ప్రతిపాదనలను చేశారు. వీటిలో కొన్నింటినైనా నిరూపించటం ద్వారా 'పరిశోధకుడుగా ఆచార్య పింగళి లక్ష్మీకాంతం'గారి కృషిని అంచనా వేయగలిగే అవకాశం కలుగుతుంది.

**పరిశోధన శాస్త్రీయ పద్ధతి:**

పరిశోధన ఒక పద్ధతి ప్రకారం జరగాలి. వివిధ సోపానాలుగా తార్కిక ఆలోచనాపద్ధతి ఉండటం శాస్త్రీయ పరిశోధనలో ఉంటుంది. జాగ్రత్తతో కూడిన అన్వేషణ లేదా విషయ విచారణ కూడా పరిశోధన అని భావించే పరిస్థితుల్లో సాధ్యమైనంత వరకూ సాహిత్య పరిశోధనను కూడా శాస్త్రీయమైన పద్ధతిలో వివరించే అవకాశం కలుగుతుంది.

**విషయం - విధానం:**

ప్రతి పరిశోధనలోనూ విషయం, విధానం అనేవి ఉంటాయి. '*విషయంలోని హితాన్ని వివరించేది విషయ విమర్శ కాగా, విధానాన్ని (విషయాన్ని చెప్పే విధానాన్ని) వివరించేది విధాన విమర్శ*' అని శైలీ విమర్శను చూపే స్పష్టమైన ఒక విభజన రేఖా చిత్రాన్ని ఆచార్య పరిమి రామనరసింహం గారు ఆంధ్ర మహా భారత శైలీ పరిశీలనం గ్రంథంలో ప్రతిపాదించారు (రామనరసింహం 1996: 4). ఇదే పద్ధతిలో పరిశోధనలో కూడా 'విషయం, విధానం' అని రెండు విధాలుగా ఉండే అవకాశం ఉంది.

పరిశోధనలోని విషయాన్ని మాత్రమే విశ్లేషిస్తూ గానీ, కేవలం విషయ నిర్వహణ మాత్రమే చూసినా గాని పరిశోధకుడుని సరిగ్గా అంచనా వేయటం శాస్త్రీయం అనిపించుకోదు. కనుక, రెండు మార్గాల్లోనూ పరిశోధన విషయాలను విశ్లేషించే ప్రయత్నం జరగవలసి ఉంది.

**పరిశోధకుడుగా ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు:**

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు సాహిత్య పరిశోధనను సాధ్యమైనంత వరకూ ఒక పద్ధతి ప్రకారం కొనసాగించారు. దీన్ని కింది విధంగా వివరించుకోవచ్చు.




**భావన (ఊహ):**

ప్రతి పరిశోధకుడు, పరిశోధన విషయం గురించిన ఒక ఊహ (Induction) చేస్తాడు. ఈ భావన (concept) పరిశోధన మొదటిదశ, ఒక వాస్తవానికి సంబంధించిన భావ సముదాయానికిచ్చే పేర్లే భావనలు. ఈ భావనలు ఊహించిన వస్తువుల ధర్మాలు, మనుషుల, సంఘటనలకు ఒక పేరుని నిర్దేశిస్తాయి. కొన్ని కొన్ని సమయాల్లో భావనలు స్పష్టంగానూ, మూర్తం (concrete) గానూ ఉండవచ్చు. వీటిని పరిశోధనలో 'నిర్మాణం సామాగ్రి' అని కూడా అంటారు. భావనలు నిర్మాణ సామాగ్రిగా ఉపయోగపడతాయి. (పరిశోధన పద్ధతులు -సామాజిక గణాంకం: 2003: 20)

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు పాఠాలు బోధించేందుకు రాసుకున్న నోట్సే అయినా, "ఆంధ్రవాఙ్మయచరిత్ర" ఒకటి రాయాలనుకోవటం, దాని స్వరూప స్వభావాలను ఊహించటం పరిశోధన భావనగానే గ్రహించవచ్చు. '*సుందరమైన రచనయు, సార్వజనీనమైన ప్రయోజనమును కలిగి భావనాత్మకమైన నిర్వృతిని ఇచ్చుచు కర్తయొక్క ఆత్మీయతను స్ఫురింపజేయు గ్రంథము కావ్యము. అట్టి కావ్యముల యొక్క చరిత్రయే సాధారణ వాఙ్మయ చరిత్ర అని అంగీకరింపవలసి యుండును*' (పింగళి లక్ష్మీకాంతం 1976: 4) ఇది పరిశోధన మొదటి దశలో పరిశోధకుడికి కలిగిన భావనే (concept) అవుతుంది తప్ప, పరికల్పన సిద్ధాంతం (Hypothesis) అవ్వదు. అయితే, భావన పరికల్పన సిద్ధాంతంలోనూ కనిపించవచ్చు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు 'వాఙ్మయ చరిత్ర' రాయాలనుకోవటానికి కారణం

అప్పటికే ఉన్న కవిజీవితాలు కవులచరిత్రల్లో కనిపించటం వల్ల పరిశోధన సమస్యలను గుర్తించారు. ఈ సమస్యని పరిష్కరించడానికి, అప్పటికే ఉన్న సాధారణ సిద్ధాంతాన్ని తడిమి చూశారు. అంటే కవుల చరిత్రలే సాహిత్య చరిత్రలు అవుతాయా? లేదా? అనే ఆలోచన చేశారు.

### సాధారణ సిద్ధాంతం పరిశోధన సమస్య:

జీవిత గాథలే ప్రధానంగా ఉన్న చరిత్రలు కవి జీవిత చరిత్రలు అనిపించుకోగలవేమో గానీ, సాహిత్య చరిత్రలనిపించుకోవు. (ఆంధ్ర సాహిత్య చరిత్ర: 04) అనువాద, స్వతంత్ర, పురాణ, ప్రబంధ యుగాలనో, ఆది, మధ్య, ఆధునిక కాలాలుగానో సాహిత్య చరిత్రను పిలవటం సరైన యుగ విభజనకాదు. దీనివల్ల 'సాహిత్యయుగం' కొన్ని వందల యేండ్లు సాగవలసి వస్తుంది అనేది సాహిత్య చరిత్ర నిర్మాణంలో తన పరిశోధనకి ఎదురైన సమస్యగా గుర్తించారు ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు. దీనికి తనదైన పరికల్పన సిద్ధాంతాన్ని (Hypothesis) ప్రతిపాదించారు.

### పరికల్పన సిద్ధాంతం (ఊహా ప్రతిపాదన):

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారి అభిప్రాయంలో వాఙ్మయ చరిత్ర అంటే కేవలం గ్రంథనామాలను ఉదాహరించటం, వాఖ్యానించటమేకాదు. ఆ కవుల ప్రతిభావిశేషాలను, దేశకాల పరిస్థితులను, వాటికి గల అన్యోన్య సంబంధాలను, అవి కావ్యంలో ప్రతిఫలించిన విధానాన్నీ, వాటివల్ల ఆ రచనకు కల్గిన గుణదోషాలను వివరించి, వాఖ్యానించాలి. ప్రతిభాహీనులైన కవుల విషయంలో ఇంత విశ్లేషణ అవసరం లేదు. ప్రతిభావంతుల ఆత్మీయతా దర్శనానికి ఇది అవసరమవుతుంది. అప్పుడది కొత్త వెలుగునిస్తుందనే ఆలోచనను చేశారు.

యుగవిభజన కవిని బట్టే గాని పోషకుణ్ణి అనుసరించి ఉండకూడదు. అంతేకాదు, 'ఆదర్శప్రాయమైన వాఙ్మయచరిత్ర రాయటం ఎప్పటికీ సాధ్యం కాక పోయినా, అప్పటికి ఉన్న కవుల చరిత్రలకంటే భిన్నమైందీ, కావ్యమూల్యాలను వివరించేదీ అయి ఉండాలి' అనే పరికల్పన సిద్ధాంతం (Hypothesis) తో తన రచనను (Notes) తయారు చేసుకున్నారు. 'గౌతమ వ్యాసములు', 'విజ్ఞాన సర్వస్వము'లో ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు జీవించి ఉండగానే సాహిత్యచరిత్ర పట్ల తన పరికల్పన సిద్ధాంతాన్ని కార్య రూపంలో పెట్టారు.

1972లో ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు మరణించిన తర్వాత శిష్యుల దగ్గరున్న Notes వివిధ ప్రతులను అనుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ 1974లో, ఆచార్య కోలవెన్ను మలయవాసినిగారి పరిష్కరణలో మళ్ళీ 1998లోనూ విశాలాంధ్రవారు ప్రచురించారు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు ఈ సాహిత్య చరిత్రకు పెట్టుకున్న పేరు 'సవిమర్శక ఆంధ్ర వాఙ్మయ చరిత్ర'. ఇలా పేరు పెట్టుకోవటంలోనూ తన పరికల్పన సిద్ధాంతాన్ని గుర్తించవలసిన అవసరం ఉంది. పరిశోధకుడు ఊహించిన లేదా అనుమానించిన వివిధ అంశాల మధ్య సంబంధం

ఈ Hypothesisలో ఉంటుంది. అప్పటికే ఉన్న సాధారణ సిద్ధాంతంలో పరిశోధన సమస్యని గుర్తించి, ఒక తాత్కాలిక సామాన్యీకరణ చేయటం పరికల్పన సిద్ధాంత దశలో ఉంటుంది. ఇది భావనల మధ్య పరస్పర సంబంధాన్ని నిరూపించే లక్ష్యాన్ని ప్రేరేపించే దశ అనవచ్చు.

మూడవ దశలో తన పరికల్పన సిద్ధాంతాన్ని నిరూపించేందుకు కొన్ని పరికరాల అవసరాన్ని ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు గుర్తించారు. ఇవి ప్రయోగశాలలో నిరూపించే పరికరాల (Instruments) వలె ఉండవు. అయినా సాహిత్య పరిశోధనను కూడా శాస్త్రీయపద్ధతిలో కొనసాగించేందుకు కొన్ని పద్ధతులు ఉన్నాయి. సాహిత్య పరిశోధన దర్శనపరమైనదే, భాషా శాస్త్ర పరిశోధన శుద్ధ శాస్త్ర పరిశోధనగా ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు గుర్తించటం ఈ సందర్భంగా గమనించవలసి ఉంది.

**పరికల్పన సిద్ధాంత నిరూపణ:**

చరిత్రకారుడు కాలానుసరణ, తులనాత్మక పద్ధతులను పాటించాలని ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు భావించటంలో పరిశోధన నిరూపణ పరికరాలను ఎన్నుకున్నట్లే. కవుల కాల నిర్ణయాలను, గ్రంథ కర్తృత్వాన్ని, కావ్యావతారికలు, కావ్య ఆంతరిక విషయాలు, భాషాంశాలను గుర్తించటం, తులనాత్మకంగా అధ్యయనం చేయటం ద్వారా పరికల్పన సిద్ధాంతాన్ని నిరూపణం (Testing) చేయవచ్చని చెప్పుకున్నట్లయింది. వీటికితోడు వాఙ్మయ చరిత్రకారుడు విమర్శకుడై, రాగద్వేషాలు లేనివాడు, సమబుద్ధి కలిగినవాడు, నిశితదృష్టి కలిగి వ్యాఖ్యాన నైపుణ్యం ఉన్నవాడై ఉండాలన్నారు. అవసరమైతే కావ్యేతర ఆధారాలనూ చూడవలసి వస్తుందన్నారు.

**పరికల్పన సిద్ధాంత నిరూపణ:**

ప్రతిపాదనను లేదా పరికల్పన సిద్ధాంతాన్ని ఆచరణాత్మకమైన చలాంకాలు (Variables) లేదా నిర్మాణ సామగ్రిగా కనిపించే 'భావన'లను విడివిడిగా తీసుకుని వీటిని తన అనుభవాలను, తనదైన ప్రమాణాలను అనుసరించి కార్య కారణ సంబంధాలకు తగినట్లు ఉన్నాయో లేదో పరీక్షించి (Hypothesis Testing), ఫలితాంశాన్ని ధృవీకరించడానికి పరిశోధకుడు ప్రయత్నిస్తాడు. అప్పుడది ఒక 'సిద్ధాంతం' (Thesis)గా మారుతుంది. ఇదే 'అంతిమ వాస్తవం' అనే అవకాశం కూడాలేదు. ఇది సాహిత్యంలో మరింతగా ఒదిగే లక్షణం. తెలుగులో కవుల చరిత్ర, వాఙ్మయ చరిత్ర, సాహిత్య చరిత్ర, సాహిత్య వికాస చరిత్ర వంటి పేర్లతో సాహిత్య చరిత్రలను రాసినవాళ్ళున్నారు. వాటికి ప్రత్యేక స్వభావం ఉన్నా అన్నింటిలోను కవులను కావ్యాలను పోషకులను కాలాలను అనుసరించి రాసిన ఈ సాహిత్య చరిత్రలలో ఆయా సాహిత్య చరిత్రకారులకు ఒక్కొక్క సిద్ధాంతం ఏర్పడింది.

తమ తమ యుగవిభజనను నిరూపించుకొనే సమర్థించే కృషిచేసినా కాలాన్ని బట్టి ప్రమాణాలు ఏర్పడుతుంటాయి. అంటే 'సిద్ధాంతం' మళ్ళీ సాధారణ సిద్ధాంతం(general theory)గా మారిపోతుంది. దాన్ని ఖండించడానికో,

సమర్థించడానికో మరో పరిశోధకుడు ప్రయత్నించినప్పుడు అప్పటికే ఉన్న సాధారణ సిద్ధాంతం (Fixed General Theory) మళ్ళీ పరీక్షలకు గురవుతుంది. అందుకనే అనేకమంది, అనేక పేర్లతో సాహిత్య చరిత్రలను రాస్తున్నారు.

**సిద్ధాంతం వివరణ:**

దీన్ని విజ్ఞాన స్వరూపంగా చెప్పుకోవచ్చు. పరస్పర భావనల ఫలితంగా ఇది ఏర్పడుతుంది. వివిధ భావనల మధ్య ఉంటాయని అనుమానించే సంబంధాల్నే 'సిద్ధాంతం' (Theory) అంటారు. సందర్భశుద్ధి (coherence), తర్కం (logic), అంతర్గత సంగతత్త్వం (Internal constitency) సిద్ధాంతంలో ఉంటాయి. 'నిరూపణకు అవకాశం ఉండే ఒక తార్కిక ఆలోచనాక్రమం సిద్ధాంతంలో కనిపిస్తుంది'. సిద్ధాంతమే యదార్థం కాదు. కానీ, సిద్ధాంతంలో ఇది యదార్థం అని నిరూపించటంతో పాటు పరిశోధకుని Testing Results యొక్క క్రమ పద్ధతి ఉంటుంది.

వీటిని కింది శీర్షికలుగా పరిశీలించే అవకాశం ఉంది.

**కవి కాలాదుల నిర్ణయం:**

తెలుగు కవుల కాలాన్ని, జీవిత చరిత్రలను నిష్కర్షగా చెప్పటం సాధ్యం కాదని ఒప్పుకుంటూనే (ఆంధ్ర సాహిత్య చరిత్ర 64) కవుల కాలాన్ని సాధ్యమైనంతలో స్పష్టం చేయటానికి ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు ప్రయత్నించారు.

మానవల్లి రామకృష్ణ కవి, నన్నెచోడుడు నన్నయ కంటే ముందు వాడని నిరూపించిన ఒక సిద్ధాంతాన్ని తర్వాత అనేక మంది పరిశోధకులు ఖండించటానికి చాలా ప్రయత్నం చేశారు. రామకృష్ణకవి సిద్ధాంతాన్ని 'సాధారణ సిద్ధాంతంగా' భావించి ఒక నిరూపణ చేసేందుకు ప్రయత్నించిన వారిలో ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు కూడా ఒకరు.

నన్నెచోడుని కుమారసంభవం 'అవతారిక'లో రామేశ కవీంద్రుని స్తుతించిన ''శ్రీరామేశ కవీశ్వరాదులెదనీ శ్రీపాదముల్ భక్తితో..'' మొదలైన పది పద్యాలను బట్టి 'శివకవి'ని ప్రస్తుతించారని లక్ష్మీకాంతం గారు అన్నారు. 'రామేశుడు' అనే కవి శ్రీశైల మఠచరిత్రలో పేర్కొన్న వాడైతే క్రీ.శ 1090 సంవత్సరానికి తర్వాత వాడని శాసనాధారాలతో కూడా తేలిందని ఆయన వివరించారు. రామకృష్ణకవి లాగానే ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు 'కుమార సంభవం' లోని వ్యాకరణ ఛందో విశేషాలను బట్టి కూడా తన ప్రతిపాదనను నిరూపించే ప్రయత్నం చేశారు.

ఇలా కవి కాలాన్ని నిర్ణయించటానికి తాను ఎన్నుకున్న ప్రణాళిక, పద్ధతుల ప్రకారం తన ఊహను, పరికల్పన సిద్ధాంతాన్ని నిరూపించి ఫలితాంశాన్ని ప్రకటించారు. కాలనిర్ణయాల్లో పూర్వుల పరిశోధన వివరాలని కార్యకారణాన్ని పరిశీలించకుండా అంగీకరించలేదు. తన 'పరికల్పన సిద్ధాంతం' అంతకుముందే ఉన్న సిద్ధాంతంతో సరిపోతే వారి 'సిద్ధాంతాన్ని' అంగీకరించారు.

**కర్తృత్వనిర్ణయం:**

సాహిత్య చరిత్రలో కవికాలం ఎంతముఖ్యమో, కావ్య గ్రంథ కర్తృత్వ నిర్ణయం కూడా అంతే ముఖ్యం. ఈ రెండింటినీ స్పృశించకుండా సాహిత్య చరిత్ర రచన ముందుకి వెళ్ళదు. ఆంధ్ర మహాభారతం, రంగనాథ రామాయణం, పలనాటి వీరచరిత్రల కర్తృత్వ నిర్ణయంలో పింగళి వారి కృషి ప్రశంసనీయంగా కనిపిస్తుంది. కర్తృత్వ నిర్ణయాన్ని కూడా తాను ప్రకటించిన కాలానుసరణ, తులనాత్మక, కావ్య ఆంతరిక సాక్ష్యాల ఆధారం (Evidence) తోనే పరికల్పన సిద్ధాంత నిరూపణ చేశారు. వాటిలో ముఖ్యమైన అంశాలను కింది విధంగా పేర్కొనవచ్చు.

1. ఆంధ్ర భారత కర్తృత్వాన్ని నిరూపిస్తూ, భారతాన్ని నన్నయ రాయలేదనీ. రాజరాజనరేంద్రుడే దాన్ని రాశారనే 'ఒక వింత సిద్ధాంతం' బయలుదేరిందన్నారు. 'వింత' అంటే 'ఆశ్చర్యాన్ని గొలిపే' అనే అర్థం తీసుకుంటే ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు వాడిన పరిభాష (Technical Term) అంగీకారయోగ్యమవుతుంది. అలా కానప్పుడు ఇతరులు ప్రతిపాదించి, నిరూపించిన సిద్ధాంతాన్ని అంగీకరించలేని వారిగా లక్ష్మీకాంతంగారిని పరిగణించవలసి ఉంటుంది. ఇదలా ఉంచితే, అప్పటికే ఒక Fixed Theory ఉందనీ, దాన్ని వీరు అంగీకరించటం లేదనీ మాత్రం స్పష్టం అవుతుంది. దీన్ని పూర్వ పక్షం చేయటానికి రాజరాజనరేంద్రుని "కూర్మ శాసనాన్ని" ఉదాహరించి నిరూపించారు.

2. రంగనాథ రామాయణం గోనబుద్ధారెడ్డి రచించి, తండ్రి విట్టల ధరణీశుని పేరుతో గ్రంథానికి 'రంగనాథ రామాయణం' అనే పేరుపెట్టాడన్నారు. కర్తృత్వాన్ని నిరూపించటానికి గ్రంథంలోనే అనుమాన ప్రమాణాలు ఉన్నాయనీ, అయితే ఇవి 'స్వతఃప్రమాణాలుగా గ్రహించే వీలులేదనీ చెప్పారు ఇక్కడ కర్తృత్వ సమస్యకి కారణాన్ని తెలిపారు.

వాల్మీకి, భాస్కరుడు తదితరుల రామాయణాలుగా వాళ్ళపేరుతోనే ఆయా రామాయణాలు ప్రసిద్ధి చెందినట్లే 'రంగనాథుడు' రాయటం వల్లనే 'రంగనాథ రామాయణం' అనే పేరు వచ్చి, అదొక పరిశోధన సమస్యగా మారిందన్నారు. లాక్షణికులలో లక్ష్యనిరూపణ మాత్ర ప్రయోజనం తప్ప, చారిత్రక వివరాల్లో సాక్ష్యాన్ని చూడటంలో ఆసక్తి ఉండదనీ, అప్పకవి లక్ష్య లక్షణాల వల్ల ఇలాంటి లోపాలే వచ్చాయనీ, కనుక లక్షణకర్తలు ఉదాహరించినంత మాత్రంచేత 'రంగనాథ రామాయణం' 'రంగనాథుడిది' అయిపోదు అనే వాదాన్ని పేర్కొన్నారు.

ఈ కాలంలోని చక్రపాణి రంగనాథుడే రాశాడనుకుంటే అతడు శివభక్తుడు. రంగనాథ రామాయణంలో వైష్ణవ కథ ఉంది. మతం మార్చుకోవటం జరిగితే తప్ప శైవుడు వైష్ణవ కథని రాయటంలో విశ్వసనీయత అంతగా ఉండదన్నారు. రంగనాథ రామాయణంలోని బాలకాండలో-

*'మాతండ్రి విఠ్ఠల లక్ష్మనాథుని పేర*
*రాజులు బుధులును రసికులు సుకవి*
*రాజులు గోష్ఠిని రాజిల్లి పొగడ*

.................... శ్రీరామ చరిత
మొప్ప జెప్పెద.....' అని ఉంటుంది. (*రంగనాథ రామాయణం* 1989: 4)

కర్తృత్వాన్ని నిరూపించటానికి దీన్నొక ఆధారంగా తీసుకున్నారు. దీనిలో ''విట్ఠలక్ష్మాపాలుడు'' అని ఉండటం వల్ల విట్ఠల రామాయణం అని ఉండవచ్చును కదా అనిపించవచ్చుననీ, కానీ విట్ఠలుని పూర్తి పేరు ''పాండురంగ విట్ఠలుడై'' ఉండవచ్చుననే ఊహ చేశారు లక్ష్మీకాంతం గారు. విట్ఠలుడనేది పండరీపురంలో వెలసిన పాండురంగ విట్ఠలనాథుని పేరు కనుక, ఉచ్చారణా సౌలభ్యం కోసం 'రంగనాథ' అనే ఏక దేశ నామాన్ని రామాయణానికి కలిపి ''రంగనాథ రామాయణం'' అని పేరు పెట్టారని నిర్ణయించారు. (రంగనాథ రామాయణం పూర్వోత్తర కాండలు 1989: vi) ఈ విషయాన్ని 1935 లోనే Andhra University Telugu Association Bulletinలో ప్రకటించాననీ, కానీ దీన్ని గ్రహించకుండా వావిలాల వేంకటేశ్వరశాస్త్రి గారి సిద్ధాంతానికి ఇది అనుకరణమని, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ 1942లో విమర్శించారని అన్నారు. తాను విద్యార్థులకు పాఠాలు చెప్పేటప్పుడే ఈ నామ సమన్వయం చేశానని ఆంధ్ర సాహిత్యచరిత్రలో చెప్పుకున్నారు. 1922-23 నాటికే రంగనాథ రామాయణంలోని కొంతభాగం యూనివర్సిటీ పరీక్షల్లో పాఠ్య భాగంగా ఉండటం వల్ల దాన్ని పాఠంగా చెప్పటం జరిగిందన్నారు.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు 1931లో ఆంధ్ర విశ్వ కళాపరిషత్తులో లెక్చరర్‌గా చేరారు. అంతకు ముందు అంటే 1920 నాటికి బి.ఏ. పూర్తి చేసి బందరు హైస్కూలులో తెలుగు పండితుడిగా, కళాశాలలో ఉపన్యాసకుడిగా 1927 వరకు పాఠాలు బోధించారు. (ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి స్మారక సంచిక-1974: 5). బహుశా తాను పాఠాలను చెప్పేటప్పుడు ఇలాంటి పరిశోధన విషయాలు మరొకరి పేరుతో రికార్డ్ (record) కావటం వల్లనేనేమో 'సాహిత్య శిల్పసమీక్ష' (1966) కి రాసుకున్న పీఠికలో చాలామంది ''ఇందలి సిద్ధాంతమును, వాక్యములను, ప్రకరణములను నా పేరు మీద గాక పోయినను, పత్రికలలో, గ్రంథములలో, విరివిగా ప్రచారము చేసి, ఈ నూత్న విమర్శ సంప్రదాయమునకు కొంత ప్రతిష్ఠ సంపాదించిరి'' అని రాసుకున్నారు. అందువల్లనేకావచ్చు వీరి భార్య''తెలుగు వాఙ్మయచరిత్ర'' త్వరగా ప్రచురించమని కోరి ఉండవచ్చు.

3. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి పరిశోధనను అనేక మంది ప్రశంసించినా ''పలనాటి వీరచరిత్ర'' పరిష్కరణం వీరి పరిశోధన పటిమకు నిదర్శనంగా నిలుస్తుంది. శ్రీనాథుడి కర్తృత్వాన్ని శంకించిన వారి వాదనను పేర్కొని, కావ్యానికి కీర్తి అనేది రచనను బట్టి వస్తుందనీ కవి పేరును బట్టి కాదని చెప్పారు (ఆంధ్ర సాహిత్య చరిత్ర: 373). అయితే, కావ్యంలో కన్పించే శైలిని బట్టి, క్రీడాభిరామ రచనాభివేశాన్ని తులనాత్మకంగా పరిశీలించి చూపి శ్రీనాథుడే 'కర్త' అని నిరూపించారు పలనాటి వీరకథను వీలైనంతవరకూ దాచి ఉంచిన సి.పి.బ్రౌన్‌ని స్మరించారు. (పలనాటి వీరచరత్ర1991: xxiii).

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి కంటే ముందు పలనాటి వీరచరిత్ర కర్తృత్వ విషయాన్ని డా॥ చిలుకూరి వీరభద్రరావు గారు, అక్కిరాజు ఉమాకాంతం గారు, వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తదితరులు నిరూపించే ప్రయత్నం చేశారని, పూర్వ పరిశోధకులనీ గుర్తించారు. శ్రీనాథుడు, మల్లయ్య, కొండయ్య అనే ముగ్గురు ''పలనాటి వీరచరిత్ర'' కర్తలని పరిశోధకులు గుర్తించారని అన్నారు. (అదే: xxiii) అయితే 'పలనాటివీరచరిత్ర'లో పిచ్చుకకుంట్లు పాడగా విని, సంతృప్తి పడక, అంత కంటే ఉదారమైన పద్ధతిలో సత్కావ్య రూపంలో, ప్రజలు పాడుకుంటూ ఆనందించాలనే ఆలోచనతో పలనాటివీరచరిత్ర'ను ద్విపద కావ్యంగా రాశారని నిరూపించారు.

పదకొండు ప్రకరణాల 'పలనాటి వీరచరిత్ర'లో పేర్లు చెప్పుకున్న కవులు శ్రీనాథుడు, మల్లయ్య, కొండయ్యలు. ఆ పదకొండు ప్రకరణాల వివరాలివి.

1. అనుగురాజు పలనాటి సంపాదనము, 2. పలనాటి రాజ్య విభాగము, 3. కోళ్లపోరు: గోపన్న విరుగు, 4. అరణ్యవాసము (అనగా మందాడి వలస), 5. మందపోటు: లంకన్నవిరుగు, 6. గుండాల యుద్ధము, 7. అలరాజు రాయబారము, 8. కల్లు ప్రతిష్ఠ, 9. బాలచంద్రుని యుద్ధము, 10. కొమ్మరాజుయుద్ధము, 11. బ్రహ్మన్నవిరుగు.

''*...వీటిలో కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధములను శ్రీనాథుడు రచించినట్లు ఆద్యాంతములను, కోళ్ల పోరు: గోపన్న విరుగును మల్లయ్య రాసినట్లు అవతారికయందును, కొమ్మరాజుయుద్ధమును కొండయ్య చెప్పినట్లు ఫలశృతియందును కలదు (వీరికి అవతారికా ఫలశృతిల పంక్తులు. ఈ గ్రంథమున యథా స్థానమున అచ్చు పడలేదు. అది పొరపాటు. ఆ భాగముల 1,2 అనుబంధములుగా, ప్రత్యేకముగా ఈయబడినవి మిగిలిన ఏడు ప్రకరణములలోను మొదటి రెండింటిని వ్రాసిన కవి ఒక్కడే, కాని అతడెవరో తెలియదు*''(అదే: పు: xxx-xxxi) అని పేర్కొన్నారు.

కర్తృత్వ నిర్ణయాన్ని ప్రకటించటానికి వేటూరి ప్రభాకరశాస్త్రి గారి సహకారాన్ని తీసుకుని వివిధ ప్రతులు సంపాదించారు. అనేక మంది కవుల విషయంలోఇదే పద్ధతిలో కర్తృత్వ నిర్ణయానికి ప్రయత్నించటం కనిపిస్తుంది.

**కవి కావ్య వైశిష్ట్య నిర్ణయం:**

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు ముందే పేర్కొన్నట్లు కవి ప్రతిభావంతుడని తెలుస్తున్నపుడు కావ్యలోతుల్లోకి వెళ్లి ఆ విశేషాలను రాసే ప్రయత్నం చేశారు. అవసరమైతే ఒక కవితో మరో కవిని, ఒక కావ్యంతో మరో కావ్యాన్ని తులనాత్మకంగా అధ్యయనం చేసి కవి కావ్య వైశిష్ట్యాన్ని విమర్శనాత్మక దృష్టితో నిర్ణయాలను ప్రకటించారు. సాధారణ సమీక్షలో ఒకే అంశంపై దృష్టిని కేంద్రీకరించటం, విమర్శలో అనేక అంశాలను భిన్న దృక్కోణాలతో, ఆత్మీయతాముద్రలోను పరిశీలించటం, పరిశోధనలో ఆత్మీయతా ముద్ర రహితంగా సత్యాన్వేషణా ఫలితాలను ప్రకటించటం ప్రధానమనేది గమనించాలి. వీటిని బట్టే పరిశోధకుడు కవిని కావ్యాన్ని ఏ దృష్టితో పరిశీలిస్తున్నాడో అవగాహన చేసుకోవడానికి వీలవుతుంది.

సాహిత్య పరిశోధనలో అనుభూతుల (Percepts) ఆధారంగా కావ్య మూల్య వివేచన జరుగుతున్నా, వాటిలో కొన్నింటినైనా లక్షణానుసారంగా ప్రయత్నిస్తే శాస్త్రీయం (scientific)గా నిరూపించేందుకు తార్కిక వివేచన (logical reasoning)ని ఆధారంగా తీసుకోవటం మంచిది. లేకపోతే వ్యక్తిగత అభిమానాలకు లోనయ్యే ప్రమాదం ఉంది. దీని నుంచి తప్పించుకొని వస్తునిష్ఠ (objectivity) వైపే పరిశోధనను కొనసాగేటట్లు చేసుకోవడానికి, సాక్ష్యాలను (Evidence) గ్రహించటంలో నిర్మమకారాన్ని (dis passionateness) ప్రదర్శించవలసి ఉంటుంది.

ఈ విషయాలను ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు ఇలా నిరూపించారు.

1. వ్యాస భారతం కేవలం కురు పాండవుల యుద్ధానికే సంబంధించినది కాదు. ఎంతో కాలం నుండి భారతదేశంలో విజృంభిస్తున్న సాంఘిక దావాగ్ని యొక్క పరిణామం. భారతీయ విజ్ఞానాన్ని సంరక్షించాలనే ఉద్దేశ్యంతో వ్యాసుడు భారతాన్ని రాశాడు. ఇలాంటి విజ్ఞానాన్ని ఆంధ్రులకు అందించాలని రాజ రాజ నరేంద్రుడు ఆలోచించాడు, (ఆంధ్ర సాహిత్య చరిత్ర. పు. 36) అనడం ద్వారా మహాభారత వైశిష్ఠ్యాన్ని చెప్పి, నన్నయ అనే గొప్ప కవి సమకాలీన పండితులను మెప్పించి, ఆఖ్యాన, నాటకీయ శైలిలో తెలుగులో మూలాన్ని పాటిస్తూనే, అవసరమైన చోట స్వతంత్రతను ప్రదర్శించిన విశిష్ట కవిగా నిరూపించారు.

2. పాల్కురికి సోమనాథుడు తెలుగు కవుల్లో అగ్రశ్రేణికి చెందినవాడైనా, కవిత్వం మతపరం కావటం వల్ల శైవేతర వర్గాల్లో రావలసినంత కీర్తి రాలేదు. (ఆంధ్ర సాహిత్య చరిత్ర.106) ద్విపద కవిత్వం పామర కవిత్వంగా పండితులచేత అనాదరించబడినా పదకవిత్వానికి వాఙ్మయంలో ప్రతిష్ఠ చేకూర్చి ద్విపద కవితా శాఖకు ప్రథమాచార్యుడుగా కీర్తికెక్కినాడు అని సమీక్ష, విమర్శ, పరిశోధన దృష్టితో పరిశీలించి నిర్ణయాన్ని ప్రకటించారు ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు.

3. ఒక్కొక్క కవినీ అతని పాండిత్యాన్ని కావ్యాన్ని బట్టి కావ్య ప్రాశస్త్యాన్ని నిర్ణయించటం, కావ్యాన్ని సమకాలీన, పూర్వ కావ్యాలతో సమీప భాషా కావ్యాలను అనుసరించి అధ్యయనం చేయటం వల్ల వీరు ప్రకటించుకున్న పరిశోధన 'పరికరాలకు' అనుగుణంగానే కొనసాగించినట్లు తెలుస్తుంది.

'తెలుగు సంస్కృతి (మొదటి సంపుటి) పునస్సంశోధితము'లో ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు రాసిన కొన్ని సాహిత్య యుగాలు ఉన్నాయి. (తెలుగు సంస్కృతి-1983:739-766) కవి-కావ్య వైశిష్ట్యాన్ని వాటిలో ప్రకటించిన అభిప్రాయాలను చూస్తే వీరి లోతైన విమర్శ, పరిశోధనా కృషి తెలుస్తుంది.

"*అఖండ సాహితీ సంపన్నుడయి, ప్రౌఢ సాహిత్య నిర్మాతయైన శ్రీనాథ కవి ఆ విద్వత్కవి పదవిపదము నుండి దిగి వచ్చి, సామాన్య జనులకు చెలికాడై పదకవిత్వము నాదరించి, పలనాటి వీరచరిత్ర రచియించియు, పిచ్చుక కుంటులకు పదములు, సుద్దులు వ్రాసి యిచ్చియు, అచ్చమయిన దేశీ కవియనిపించును*" (అదే: పు: 743)

పిల్లలమర్రి పినవీరభద్రుని 'శృంగార శాకుంతలము' గురించి అనేక కావ్యాలను పరిశీలించిన అనుభవం ఆ కావ్య విమర్శలో కనిపిస్తుంది. విమర్శకుడైన చరిత్రకారుడు కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉంటాయి. అవి సరిగ్గా సరిపోతున్నట్లుగా ఈ పింగళి లక్ష్మీకాంతం గారి వ్యాఖ్య కనిపిస్తుంది. అది ఇది. '*భారతమున శకుంతలా జన్మవృత్తాంతము వ్యాసుడు శకుంతలచే చెప్పించెను. కాళిదాసు తన నాటకములో శకుంతల చెలికత్తెలచే సూచింపజేసెను. పినవీరభద్రుడు వ్యాస కాళిదాసులననుసరింపక యీ కథ స్త్రీ జనోక్తియగుటకంగీకరింపక కణ్వశిష్యుని నోట చెప్పించెను. ఇతని సంకల్పము సముచితమైనదే. కానీ, నిర్వాహణ లోపభూయిష్టమయినది.*'' ఇక్కడ విమర్శలో వస్తునిష్ట గుణదోష పరిశీలన, తులనాత్మక దృష్టి ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి పరిశోధనలో కనిపిస్తాయి. పైగా 'నిర్వహణ' పట్ల కూడా లోతైన ఆలోచన ఉన్నట్లు తెలుస్తుంది. తెలియకపోతే, అధ్యయనం చేయకపోతే తులనాత్మకంగా పరిశీలించాలన్నంత మాత్రంచేత తప్పించుకోవాలని ప్రయత్నించరు.

జక్కన 'విక్రమార్క చరిత్రము' గురించి ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు చెప్తూ ''*సంస్కృతమున విక్రమార్కచరిత్రయను ఒక గ్రంథమున్నది. కాని అది మూలము కాదు. విక్రమార్కుని పేర లోకములో ప్రచారమునున్న కథలను గ్రహించి జక్కన ఈ కావ్యమును రచించెనేమో! దీనికి సరియగు మూలగ్రంథము దొరుకునంత వరకు దీనిని అనువాద గ్రంథమనరాదు*'' (అదే: పు: 750) అని కావ్యమూల, మూల్యాలను ప్రకటించేటప్పుడు వహించవలసిన జాగ్రత్తను పాటించి, దానికి అనుగుణంగానే సాహిత్య చరిత్ర రచనను కొనసాగించారు.

సాహిత్య వికాస సూత్రానికి మార్గం వేసినట్లు కూడా పింగళి లక్ష్మీ కాంతం గారి కొన్ని నిర్ణయాలు కనిపిస్తాయి.

''*శ్రీనాథ, పోతనలు తీర్చిన ఆలంకారిక శైలిని కొంతవరకు అందుకొన్న వాడు జక్కన. జక్కన, అనంతామాత్యునిల వలే కథా సముచ్చయ రూపమగు కావ్యమును రచించిన ఇంకొక కవి కొరవి గోపరాజు*''

''*పోతన మార్గకవిత్వంలో ఎటువంటివాడో, పదకవిత్వశాఖలో గేయకవిత్వశాఖ సంకీర్తనా వాఙ్మయ కవిత్వంలో అన్నమాచార్యుడట్టివాడు*'' (పు:751).

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు తన పరిశోధన పరికరాలుగా కొన్నింటిని తీసుకున్నారు. అవి సాహిత్యచరిత్ర రచనకు పాటించవలసిన నియమాలను తెలుపుతున్నాయి. ఆ నియమాలను తాను కూడా పాటించినట్లు పై విశ్లేషణ వల్ల తెలుస్తుంది.

ప్రక్రియ - స్పష్టత:

సాహిత్య చరిత్ర పరిశోధనలో కవిత్వశాఖలను, సాహిత్య ప్రక్రియలను స్పష్టం చేయటం అవసరం కవిత్వచరిత్రలే సాహిత్య చరిత్రలు కాదనే ఆలోచనలు కూడా ఆధునిక సాహిత్య చరిత్ర, వికాస చరిత్ర కారుల్లో కనిపిస్తున్నాయి. ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారి వంటి వారి రచనల్లో ఇలాంటి భావనలు ఉన్నాయి.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు కవిత్వాన్ని మార్గ, దేశీ, జాను తెనుగు కవిత్వాలుగా వ్యవహారంలో ఉన్న వాటిని గుర్తించి, సంగీత పరిజ్ఞానంతో, నాట్యశాస్త్రం ఆధారంగా వీటి మధ్య స్పష్టతను చూపే ప్రయత్నం చేశారు. 'ప్రక్రియ'(Genre)ను నిర్వచించటంలో సాహిత్య చరిత్రకారుల్లో ఏకాభిప్రాయం లేదు.

కవిత్వం, దీనిలో పద్య, పదకవిత్వం గల కావ్యాలు, ప్రబంధాలు, ఖండకావ్యాలుగా విభజించి వ్యవహరించటాన్నే ఇంచుమించు సాహితీ వేత్తలు ప్రక్రియలుగా భావిస్తున్నారు.

'ప్రక్రియ'ను ఈ పరిమితార్థంలోనే ఈ వ్యాసంలో ప్రయోగిస్తూ, ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు కావ్యాన్ని, ప్రబంధాన్ని నిర్ణయించటంలో ప్రదర్శించిన విమర్శనాత్మక దృష్టినీ, పరిశోధన అన్వేషణనీ, నిర్ణయ స్పష్టతను వారి పరికల్పన సిద్ధాంత పరికరాలుగా ప్రకటించుకున్న వాటిని ఎంతవరకూ పాటించారనేది అనువర్తన చేయటమే ఇక్కడ ప్రస్తుత కర్తవ్యం.

కావ్యావతారికలు కావ్య అంతరిక విషయాలను అనుసరించి సాహిత్య రచనను కొనసాగిస్తానని చెప్పుకోవటం వల్ల, 'కావ్య, ప్రబంధ' పదాలను ప్రత్యేకంగా చెప్పుకోవటాన్ని గుర్తించిన ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు వాటికి ఎలాంటి తీర్పులిచ్చి, ఎలాంటి సమన్వయం చేసి, ఎలాంటి నిర్ణయానికి వచ్చారో తెలిపేది 'విషయ నిర్వాహణ సంబంధి'ని నిరూపించటం అవుతుంది.

క్రమత విషయంలో పరిశోధనాపద్ధతిని పాటించటం కూడా Testing, Results ని బట్టి తెలుస్తుంది.

1. నన్నెచోడుని 'కుమారసంభవం'లో 'మార్గకవిత', 'దేశికవిత'లను ప్రస్తావించారు. దీన్ని వీరేశలింగం చూపిన సంగీతదర్పణ లక్షణ శ్లోకాన్నీ, 'సంగీత రత్నాకరం' లోని లక్షణాన్ని, నాట్యశాస్త్రంలోని లక్షణాలను ప్రమాణాలుగా తీసుకుని నిరూపించే ప్రయత్నం చేశారు. "*సంగీతానికి శాస్త్రనిబద్ధత వల్ల 'మార్గ' ఏర్పడిందనీ 'నియమరహితమై శాస్త్రమున కెక్కని కేవల ప్రజానురంజనమునకై రచింపబడినది*" 'దేశీ' కవితలన్నారు.

2. 'జానుతెనుగు' అంటే 'సరళమైన తెలుగు' అనీ సర్వసామాన్యమైన భాష జాను తెలుగు (పు: 80) అనీ, సర్వులు అంటే, ఆబాలగోపాల ప్రజలు అని అర్థం కాదు. కొద్దో గొప్పో భాషా జ్ఞానం కలిగి, పాండిత్యం లేకపోయినా, ఇతరుల సహాయం

తీసుకోకుండానే చదివి అర్థం చేసుకోగలిగిన అక్షరాస్యులని పాల్కురికి సోమనాథుని ఉద్దేశమని వ్యాఖ్యానించారు. "*నన్నెచోడుని అభిప్రాయమునను జానుతెనుగనగా అచ్చతెనుగు కాదు*" అన్నారు. "*అది సర్వ సామాన్య భాష*'అయి ఉంటుందన్నారు. *భారవి, వాల్మీకులను ప్రత్యేకంగా వస్తుకవులని ఏ కవితా గుణాన్నిబట్టి పేర్కొన్నారో ఊహించలేం*" అని తన నిర్ణయాన్ని స్పష్టంచేశారు.

"మార్గ, దేశీలను 'నాట్యశాస్త్ర' పరంగా పరిశీలిస్తూ నృత్యం ప్రాక్తన మానవుడు శరీరావయవ విక్షేపాలను లయానిత్వం చేస్తూ సృష్టించుకొన్న కళ" (పు: 28). "*నృత్య, నృత్తములలో నృత్యము భావమును ఆశ్రయించుకుని ఉంటుంది. అది గేయంలోని పదాలయొక్క అర్థాభినయ పూర్వకం. అది మార్గం*" అనిపించుకుంటుంది.

రెండవది తాళాన్నీ, లయనీ మాత్రమే ఆశ్రయించుకుని ఉంటుంది. అది నృత్యం, అది దేశి అనిపించుకుంటుంది అని విశ్లేషించి, సాహిత్యపరంగా అన్వయించే ప్రయత్నం చేశారు. ఆంగ్లంలో నృత్యమును Highstyle అనీ నృత్యము Popular style అని చెప్పారని ఇది దశరూపక ఆంగ్లానువాదమని వివరించి శాస్త్ర సమ్మతమైనది 'మార్గ' గాను, శాస్త్రేతిని 'దేశి' గాను స్పష్టం చేసి తన పరిశోధన చరిత్ర రచనలో వాడుకున్నారు. వీరు రచించిన '*గౌతమ వ్యాసము*'లు లోనూ (పు:40-41) పరిష్కరించిన '*పలనాటి వీర చరిత్ర*' (పు:xxvi)లోనూ దీన్నే వివరించటం వల్ల 'మార్గ, దేశి'లను సంగీత, నాట్యశాస్త్ర పరిభాషను ఉపయోగించి అన్వయించారు.

'దేశి' శబ్దానికి వాఙ్మయంలో 'ఇతివృత్తం, భాష, ఛందస్సు' అనే మూడు లక్షణాలు ఉంటాయన్నారు. ప్రధానంగా (ప.వీ.చ.పు:xxvi) "*మార్గ కవిత్వమును నిరసించి, దేశి కవిత్వమునకై కంకణము కట్టుకొన్న పాల్కురికి సోమనాధుడు సైతము వీటిని సర్వత్రా సాధించలేద*"నీ అన్నారు.

దేశికవితా శబ్దాన్ని అన్నింటా సార్థకం చేసిన కావ్యాల్లో '*పలనాటి వీరచరిత్ర*' మొదటిది, మేటిది (పు:xxvii) అని నిర్ణయించటంలో లక్షణానువర్తన కనిపిస్తుంది. ఈ మార్గదేశి లక్షణాలు పరిశోధకులు అంగీకరించారా! లేదా? అనే విషయంలో భిన్నాభిప్రాయాలు ఉన్నాయి. అయినా, "'*మార్గ, దేశి', 'జానుతెనుగు', 'వస్తు కవిత' మొదలైన పారిభాషిక పదాలకు స్పష్టమైన నిర్వచనాలు మనకిప్పటికీలేవు*" అని ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం గారు (సాహిత్యంలో చర్చనీయాంశాలు. 1991:27) అనటంలో వీటిపట్ల సాహిత్యవేత్తల్లో గల గందరగోళాన్ని తెలుపుతున్నాయి. అందుకనే, ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు తన రచనలన్నింటిలో ఇంచుమించు నృత్త, నృత్య, నాట్య పరిభాషతో పోలుస్తూ మార్గ, దేశి లక్షణాలన్నింటిని వివరించి, పదకవిత్వాన్ని '*పలనాటివీరచరిత్ర*'లో శ్రీనాథుడిని గొప్ప కవిగా నిరూపించటం వీరి పరిశోధన విధాన నిర్వహణలో కొనసాగింపు తెలుపుతుంది.

**భాష శైలి నిర్వహణ:**

గ్రాంథిక భాషలోనే రాస్తూన్నా, పూర్తిగా గ్రాంథిక భాష అనే చెప్పే అవకాశం లేదు. ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారి అభిప్రాయంలో *"ఆంధ్ర సాహిత్య చరిత్ర 'నోట్స్' గ్రాంథికంలోనే ఉండేది. విజయవాడ ఆకాశవాణి కేంద్రంలో తెలుగు ప్రోగ్రాములకు సలహాదారుగా ఉన్న కాలంలో ఆధునిక భాషా ప్రయోజనం వారికి బాగా పట్టినట్టుంది...సంస్కృత కుమార వ్యాకరణము (1968) కొంత భాగం శిష్టవ్యావహారికంలో పాఠం చెబుతున్నట్టు రాసింది. కొంత గ్రాంథికచ్ఛాయలో నడిచింది. చాలా వరకు రెండింటి కలయిక కనిపిస్తుంది"* (ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారి స్మారక సంచిక - 74:58-60) ఈ వ్యాసంలో అక్కడక్కడా ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి అభిప్రాయాలను ఉదాహరించిన వాటిని చూసినా ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తి గారు చేసిన వ్యాఖ్యలు నిజమని తెలుస్తుంది.

'సాహిత్య శిల్ప సమీక్ష'లో భాష, కావ్య భాషలో ఉన్న కమనీయతనూ, సాహిత్య సిద్ధాంతాలనూ వివరించేటప్పుడు పాతమాటలను కొత్త అర్థాల్లో వినియోగించటానికి నవ్య పారిభాషిక పదజాలాన్ని సృష్టించి, రెండింటినీ సమర్థంగా సాధించారని ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు (అదే:పు:54)అన్నారు.

*"ఆంధ్రవిమర్శలో పాశ్చాత్య పరిజ్ఞానంతో ప్రయోగించే పారిభాషిక పదాలను నిర్ధారించటంలో ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి కృషి గొప్ప సేవే"* అని ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం వ్యాఖ్యానించారు (రసజ్ఞశిల్పి:119).

ఈ అభిప్రాయాలు ఆచార్య పింగళి లక్ష్మీకాంతం భాషా ప్రయోగ స్వరూప, స్వభావాలను, పరిశోధనలో వినియోగించుకోవటాన్ని వివరిస్తున్నాయి.

పరిశోధనలో ఉండవలసిన స్పష్టతకు భాషా ప్రయోగం కూడా గొప్ప పాత్ర నిర్వహిస్తుంది. సృజన, సృజనేతర సాహిత్యాలలో భాషా ప్రయోగాన్ని, ఆ ప్రయోగం వల్ల సాధించే ప్రత్యేక ప్రయోజనాన్నీ ఆధునిక భాషాశాస్త్రవేత్తలు శాస్త్రీయంగా నిరూపించే ప్రయత్నాని చేస్తున్నారు. ఇలాంటి ఒక ప్రయత్నం ఆచార్య పరిమి రామనరసింహంగారి 'శైలీశాస్త్రం - ఒక సమాలోచన' అనే పరిశోధనా వ్యాసంలో చూడవచ్చు. (ఆధునిక సాహిత్య విమర్శ రీతులు, 2005:115155) సాహిత్య అధ్యయనంలో భాషా శాస్త్ర సూత్రాల అనువర్తనం వల్ల సాహిత్య విలువలను మూల్యాంకనం చేయటంలో వ్యక్తినిష్ఠ [subjectivity], అభిరుచు [imprecision]ల నుండి, వస్తు నిష్ఠవైపుకి పయనింపజేసి, సాహిత్య విమర్శను శాస్త్రీయంగా నిరూపించే ప్రయత్నం 'శైలీశాస్త్రం' చేస్తున్నదని భాషావేత్తలు (అదే-పు; 113) భావిస్తున్నట్లే, ఈ సూత్రాన్ని పరిశోధనకు కుడా అనువర్తించుకుని, భాషాప్రయోగాలను బట్టి కూడా సాహిత్య పరిశోధనా విధానాన్ని శాస్త్రీయంగా నిరూపించే అవకాశం చాలా వరకూ కనిపిస్తుంది.

భాష – సృజనాత్మక పరిశోధన:

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు 1931లో ఆంధ్ర విశ్వ కళాపరిషత్తులో తెలుగు లెక్చరర్‌గా చేరారు. వెంటనే తెలుగు భాషా సాహిత్యాలకు కోర్స్ డిజైన్ చేయవలసి వచ్చింది. తరువాత, పాఠాలను బోధించారు. ఈ అనుభవంతో పరిశోధనాంశాలను బోధనా పద్ధతిలో వివరించేందుకుగానూ సాహిత్య సిద్ధాంతాలను అనువర్తించారు.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు సాహిత్యచరిత్ర, సాహిత్య శిల్ప సమీక్షలను బోధించేవారు. భారతీయ పాశ్చాత్య భాషా సాహిత్య విషయాలను అన్వేషించి విద్యార్థులకు బోధించేవారు. అది వారి రచనలలోనూ ప్రతిఫలించింది. భారతీయ సాహిత్య సిద్ధాంతాల విషయంలో కొంత పరిభాష ప్రాచుర్యంలో ఉంది. అయినప్పటికీ, పాశ్చాత్య సిద్ధాంతాలను ఆంగ్లభాషలో నుండి తీసుకోవటం వల్ల తెలుగు అనువాద పరిభాషను ఇస్తూనే, ఆంగ్ల పదాన్ని బ్రాకెట్స్‌లో పెడుతున్నారు. అదే విషయాన్ని స్పష్టంగా అందించే వాహిక అవుతుంది. దీన్నే ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు కూడా పాటించారు.

అంతేకాదు, అక్కడక్కడా సృజన సాహిత్యాన్ని వర్ణిస్తున్నట్లు ఆలంకారిక భాషను వినియోగించుకున్నారు. ఈ విషయ విధాన నిర్వహణను ఆచార్య కోలవెన్ను మలయవాసిని గారు కొంత వరకు గుర్తించారు. అందువల్లనే "*విద్యార్థులకు బోధించటం ప్రధానంగా పుట్టిన రచన (సాహిత్య చరిత్ర) కావటం వల్ల, చెప్పే తీరులో ఉపమానాలు దృష్టాంతాలు చెప్పటం వల్ల ఆయా అంశాలు స్పష్టంగా బోధపడి చక్కగా మనస్సుకి హత్తుకుంటాయ*"ని ఆచార్య కోలవెన్ను మలయవాసిని గారు వ్యాఖ్యానించారు (రసజ్ఞశిల్పి;112). ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు ఆలంకారిక వర్ణన చేసిన వాక్యాన్ని కింది విధంగా చూడవచ్చు.

"*భారతములో బీజప్రాయంగా, ఎర్రనలో అంకుర ప్రాయంగా, సోమన్నలో మొలకగా పొడచూపిన ప్రబంధలత, శ్రీనాథుని చేతిలో కొనలు సాగి, చిగిర్చి, మారాకు వేసినది. అది పుష్ప ఫల సమన్వితమగుట రాయల కాలంలో, మనుచరిత్రయే ఆలతపూచిన తొలిపూవు, పండిన తొలి ఫలము*" (తెలుగు సంస్కృతి, మొ.సం., పునఃసంశోధితం,1983:754).

ఇంకా, భాషా విధాన నిర్వహణలో కన్పించే మరో అంశం ప్రశ్న-సమాధానాల రూపంలో ఉండటం, కథనాత్మక పద్ధతిలో సంభాషణగా కూడా ఉండటం వంటి ప్రయోగాలు అక్కడక్కడ కనిపిస్తున్నాయి. సంస్కృత ప్రభావం వల్ల యత్తదర్థక ప్రయోగాలు విరివిగానే ఉన్నాయి.

సాహిత్య పరిశోధనలో ఉపయోగించవలసిన భాషను గురించి కొందరు చెప్తూ "*పరిశోధన కవిత్వం లాగా సృజన రచన కాదనీ, సృజన రచయిత దర్శించిన సమాజాన్ని, అతడు ప్రదర్శించిన కళను పరిశోధకుడు సమాజాన్ని విశ్లేషించి వివరించి*

చూపిస్తాడు'' అని అంటున్నారు (సాహిత్య పరిశోధన సూత్రాలు, 1997:72). కానీ, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, వడలి మందేశ్వరరావు గార్ల వంటి వాళ్ళు పరిశోధన, విమర్శ రంగాలలో సృజనాత్మకత కూడా ఉంటుందని భావిస్తున్నారు. అయితే, ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు తన పరిశోధనలో అక్కడక్కడా సృజనాత్మక పద్ధతిలో ఆలంకారికంగా చెప్పినా, రచన అంతా అలాగే ఉండదు. ఉన్నచోట్ల కూడ భావ స్పష్టతకు లోటురాదు.

సాహిత్య చరిత్రలో ఇంచుమించు ప్రతి ముఖ్యమైన కవి కావ్యంలో గల 'శైలి'ని వివరించే ప్రయత్నాన్ని చేశారు. 'శైలి'అనే పదానికి ఆంగ్లంలో గల "style' అనే పదానికి ఉన్న అర్థమే సరిపోతుందంటూ శైలికి 'మానవుని మనోవ్యాపారము' అనీ, 'తీరు, సరణి, రీతి' అనే అర్థాలలో కూడా వాడుతున్నారని చెప్పారు. వాఙ్మయంలో ఆఖ్యాన [narrative], నాటకీయం [dramatic], వర్ణనాత్మక [descriptive] రూపంలో శైలి ఉంటుందంటారు (సాహిత్య చరిత్ర, పు. 48-49). ఒక్కొక్క కవికి ఒక్కొక్క శైలి ఉంటుందనీ, దాన్నిబట్టే అతని స్వభావం వ్యక్తం అవుతుందనీ, ఆత్మీయతలో శైలి ఒక భాగమని, 'శైలియే శీలం' అని వివరించారు (పు.49). నన్నయది ప్రధానంగా 'ఆఖ్యానశైలి' అనీ, అక్కడక్కడా నాటకీయ శైలి కూడా కనిపిస్తుందని అన్నారు.

**కర్ణాటక భాష మనస్సుకు హాయిని కలిగించే ఒక శైలి:**

ఆధునిక భాషాశాస్త్రవేత్తలు శైలి విషయంలో మరింత లోతుల్లోకి వెళ్ళి శాస్త్రీయ దృష్టి కోణాన్ని ప్రదర్శిస్తున్నారు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు శ్రీనాథుని శైలి గురించి చేసిన విశ్లేషణ వల్ల శ్రీనాథుడు కన్నడవాడు కాదని, ఆంధ్రకవేనని నిరూపించిన విషయం పరిశోధకుల మన్ననలను పొందింది. శ్రీనాథుడు 'భీమేశ్వరపురాణం'లో

*''పాఢిబెరికింప సంస్కృత భాషయంధ్రు*
*పలుకు నుడికారమున నాంధ్ర భాష యందు*
*రెవ్వరేమన్ననంధ్రునాకేమి కొరత*
*నా కవిత్వమునిజము కర్ణాటభాష''* అని వర్ణించారు.

అలాంటిదే ఒక చాటు పద్యంలో 'తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మీ! దయలేదా నేను శ్రీనాథుడన్' అని అంటాడు. దీనిలో గల 'కర్ణాట భాష' 'తల్లీ! కన్నడ రాజ్యలక్ష్మీ' అనే ప్రయోగాలను అనుసరించి శ్రీనాథుడిని కర్ణాటక రాష్ట్రానికి చెందిన వాడనే వాదాన్ని పూర్వపక్షం చేశారు. నా కవిత్వము నిజము 'కర్ణాటభాష' అంటే 'కర్ణాట శైలి' అని అర్థమన్నారు (ఆంధ్ర సాహిత్య చరిత్ర, పు.385).

*''ఒక కవి రచనను గురించి, వాని భాష కఠినముగా ఉండును. వాని భాష రసవంతముగా ఉండును. అని మనము చెప్పినప్పుడు, అచ్చటి కాఠిన్యముగాని, రసవత్తర భాషకు సంబంధించినది గాని కాదు. శైలికి సంబంధించినది కనుక అక్కడ 'భాష' శైలి అనే అర్థం''* (పైదే పు:385). శ్రీనాథుడు 'కర్ణాట భాష' అనే పద్యానికి వాచ్యార్థమే అనుకుంటే శ్రీనాథుని కావ్యాల్లో ఒక్క వాక్యమైనా కన్నడ భాషలోనిది చూపగలమా? అని ప్రశ్నిస్తారు.

*"దక్షిణాత్యులంతా పాడే కర్ణాటక సంగీతం ఒకశైలి వంటిదేనని, శాస్త్రనిబద్ధ మార్గ సంగీతానికి, శాస్త్రేతి సంగీతమైన దేశీ సంగీతానికి భిన్నమైన రెండింటి కలయిక వల్ల ఏర్పడిన శైలినే 'కర్ణాట శైలి'"* అంటారని సంగీత శాస్త్ర ప్రమాణాలతో శ్రీనాథునిశైలిని లక్ష్మీకాంతం గారు నిరూపించారు.

బెండపూడి అన్నయామాత్యుడు శ్రీనాథుణ్ణి పాకనాటింటి వాడవు, భాంధవుడవు అని సంబోధించటాన్ని బట్టి ఇద్దరూ బంధువులేనని, ఇద్దరూ పాకనాటి నియోగులేనని, ఈ శాఖ వాళ్ళు కన్నడ దేశంలో ఉన్నట్లు తెలియదనీ ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు చెప్పడాన్ని పరిశోధకులు కూడా అంగీకరించారు. *"సంగీత నాట్యపరిభాషను కరణముగా చెవికింపును మనస్సుకు పెంపును కలిగించెడి ఒక శైలిని సృష్టించి దానినే కర్ణాట భాష"*గా శ్రీనాథుడు పేర్కొన్నాడని పింగళి వారు ప్రశంసనీయంగా సమన్వయం చేశారు.

బెండపూడి అన్నయ బాంధవ్యం ప్రస్ఫుటంగా కనబడుతుండగా శ్రీనాథుడు కర్ణాటకుడు ఎట్లా అవుతాడన్నది పింగళివారి ప్రశ్న. అక్కిరాజు ఉమాకాంతంగారికి ఈ విషయం తట్టకపోవటం ఆశ్చర్యకరమని ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు నిరూపించారని మెచ్చుకున్నారు అక్కిరాజు రమాపతిరావు గారు. అక్కిరాజు రమాపతిరావు గారు అక్కిరాజు ఉమాకాంతం వంశానికి చెందిన వారే! ఉమాకాంతం గారు రాసిన 'పలనాటివీరచరిత్ర' పీఠికను తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించింది. ఇవన్నీ ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు విషయాన్ని నిర్వహించిన విధానాన్ని తెలియజేస్తున్నాయి.

**కావ్యం- ప్రబంధం:**

సాహిత్య సమీక్ష, సాహిత్య చరిత్రలో 'కావ్యం, ప్రబంధా'ల గురించి విస్తృతంగానే చర్చించారు. అయితే, వీటిని ఒకే అర్థంలో ఉపయోగించారా లేదా? అనేది, ఆ ఉపయోగించిన సందర్భాలను అనువర్తితం చేయటం ద్వారా విషయ విధాన నిర్వహణను వివరించే ప్రయత్నం చేయవచ్చు.

కావ్యాన్ని నిష్కర్షగా నిర్వచించటం కష్టమని చెప్పి, కావ్యానికి పాశ్చాత్య విమర్శకుల సిద్ధాంతాలను ప్రమాణాలుగా వివరించారు. సర్వజనాను రంజకత్వం (Subject Matter), ఆలంకారికంగా ఉండటం, ఆ రచన చదవటంవల్ల గాని, వినటంవల్ల గాని 'రసానంద జనకత్వం' కలగటం అనేది ఉండాలన్నారు. శాస్త్రంలో విషయతత్వం శ్రమ చేసిన వారికి, దానిలో నిష్ణాతులైనవారికేగానీ అందరికి 'అక్కరకు' వచ్చేది కాదన్నారు. వాటికి సంస్కృత మహాభాష్యం, వ్యాకరణశాస్త్రాల ప్రమాణాలను చూపారు. ఆ తర్వాత కావ్య నిర్వచనం చేశారు.

వారిచ్చిన కావ్య నిర్వచనాన్ని ఈ వ్యాసంలో 'భావన' (ఊహ) అనే ఉప శీర్షికలో పేర్కొన్నాను. అయితే కావ్యము, ప్రబంధములను కూడా 'గ్రంథము' అని

వ్యవహరించటం వీరి రచనల్లో విరివిగా కనిపిస్తుంది. వివిధ పద్యాలలో కుమారసంభవం 'ప్రబంధం' అని ఉండటాన్ని గుర్తించారు. ప్రబంధ కవిత్వాన్ని వస్తు కవిత్వంగా పేర్కొని ఉండవచ్చునని (ఆంధ్ర సాహిత్య చరిత్ర, పు.82) కావ్యంలో ప్రధాన కథను గుణాలంకార వర్ణాదుల్లో రసవంతం చేయటమే కాకుండా, సరిపడే కథాంశాన్ని కూడా అలాగే పరిపోషించి రసవంతం చేయటమే వస్తు కవిత్వం చెప్పటం అన్నారు (పు:83). అదే ఈ కవి (నన్నెచోడుడు) దృష్టిలో ప్రబంధ రచన అని తాను తలుస్తున్నానన్నారు. రచనా విధానాన్ని బట్టి కుమారసంభవం ప్రబంధమేనని అసందిగ్ధమైన సమాధానాన్ని చెప్పవచ్చునని, వస్త్వైక్యం లేదనీ చెప్పారు (పు:83). పురాణగాధను తీసుకున్నా, వర్ణనలవల్ల ప్రబంధంగా వర్ణించారని (పు:84) సోదాహరణంగా వివరించారు. పేరుకే ప్రబంధ లక్షణాలను సంతరించుకున్నా పురాణ లక్షణాలనే 'కుమారసంభవం'లో చూడవచ్చు.

'ప్రబంధం' అంటే కావ్యంలోని పదాలన్నిటికి ప్రకృష్టమైన బంధం కలిగిందని లాక్షణికులు భావిస్తున్నారు. సాహిత్య దర్పణాది లక్షణ గ్రంథాల్లో ప్రబంధం పట్ల విస్తృత పరిధిలో నిర్వచించారని వాటిని లక్ష్మీకాంతం గారు సంక్షిప్తంగా వివరించారు.

**ప్రబంధం లక్షణాలు:**

ప్రబంధాలకుండవలసిన లక్షణాలను కింది విధంగా క్రోడీకరించారు.

1. పద్యాలన్ని పరస్పర సంబద్ధములు కావాలి
2. వాటిని కలిపే ఇతివృత్తం ఉండాలి.
3. ఇతివృత్తం పూర్వాపూర్వ ఖండాలు, ఉత్తరోత్తర ఖండాలకు, పూర్వాపూర్వ పద్యాలన్ని ఉత్తరోత్తర పద్యాలకి దారి చూపించి, కార్యకారణ సంబంధాన్ని, సన్నివేశ నిభిడత్వాన్ని కలిగించాలి.
4. కథాకథన చమత్కృతిని కలిగించి ఆ గ్రంథం మహా ఉదారమైన సారస్వతమూర్తిగా గోచరించాలి.
5. కావ్యావయములన్నీ చక్కగా బంధించి కూర్చే అంశాల్నే 'సంధి సామాగ్రి' అంటారనీ, ఇవి లేకపోతే ఖండకావ్యాలవుతున్నాయన్నారు.

అయితే, వీటిని ప్రబంధానికి ఉండవలసిన మౌలిక లక్షణాలుగా చెప్పినా, మనుచరిత్రకు అన్వయిస్తూ చెప్పిన మరికొన్ని లక్షణాలు కూడా ఉన్నాయి.

**తొలి ప్రబంధం: మనుచరిత్ర:**

ప్రాచీన ఆంధ్రకవులు 'ప్రబంధ' శబ్దాన్ని ప్రాచీన సంస్కృత అలంకారికులు వాడిన అర్థంలోనే వాడారు. దాన్ని ప్రక్రియా విశేషంగా భావించలేదు. తిక్కన, కేతన, ఎర్రన, సోమన, శ్రీనాథుడు మొదలైన కవులంతా తమ కావ్యాలను 'ప్రబంధాలు' గానే పేర్కొన్నారని అచార్య పింగళి లక్ష్మీకాంతం వివరించారు. అయితే, 'ప్రబంధం' పేరుతో వచ్చిన గ్రంథాలన్నింటినీ తీసుకుని లక్షణాన్ని క్రోడీకరించే ప్రయత్నం చేశారు. ప్రధానంగా వాటిని మనుచరిత్రకే అనువర్తించి చూపారు. ఆ లక్షణాలివి.

1. ఏకనాయకాశ్రయత్వం, 2. అష్టాదశ వర్ణనలు, 3. శృంగార రస ప్రధానం, 4. ఆలంకారిక శైలి, 5. భాషాంతరీకరణం కాకూడదు. స్వతంత్రరచనై ఉండాలి.

ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం మొదలైన విమర్శకులు ఈ లక్షణాలను అంగీకరిస్తూనే మరికొన్ని లక్షణాలను చేర్చారు. ప్రబంధాలకు లక్షణాలను వింగడించిన మొదటి పరిశోధకుడుగా ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారినే చెప్పుకోవచ్చు.

16వశతాబ్ది ఆదినుండి వెలువడిన మనుచరిత్రాది గ్రంథాల్లో పైన పేర్కొన్న లక్షణాలన్నీ సరిపోయినా, సరిపోకపోయినా 'స్వతంత్ర రచనలు కావటం, ఆలంకారిక శైలితో శోభిల్లటం వల్ల అవన్నీ ప్రబంధాలుగా పరిగణన పొందాయని ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు అన్నారు. ''*ఏవం విధ సర్వలక్షణోపేతమైన మొదటి ఆంధ్ర ప్రబంధమును సృష్టించినవాడు కనుకనే అల్లసాని పెద్దన్నే ఆంధ్రకవితాపితామహుడయ్యెను*'' అని పెద్దననే మొదటి ప్రబంధకర్తగా నిరూపించారు. అంతేకానీ, నన్నెచోడుడు కాదనీ, ఆనాటి స్వతంత్ర రచనలకు శుద్ధ ప్రబంధ స్వరూపం సిద్ధిపొందలేదనటంలో, ముందు చెప్పినట్లు 'నన్నెచోడుణ్ణి మొదటి ప్రబంధకర్తగా నిరూపణ చేయలేకపోయారు. అప్పుడు Hypothesis లో మార్పు తప్పలేదు. అందుకనే, తర్వాత నిరూపణలో Hypothesis మార్చుకోవలసివచ్చింది. అయితే, దీన్ని తెలివిగా 'స్వతంత్ర్యేతివృత్తం' అనే లక్షణాన్ని అనువర్తించటం వలన తన Hypothesisని పూర్తిగా నిరాకరించకుండా మెరుగులు పెట్టుకోగలిగారు.

Hypothesis ప్రకారమే కాకుండా వచ్చిన ఫలితాంశాన్నే ప్రకటించటం నిబద్ధత కలిగిన పరిశోధకుని లక్షణం. అది వీరిలో కనిపిస్తుంది.

**సాహిత్య చరిత్ర - యుగవిభజన:**

సాహిత్యచరిత్ర నిర్మాణంలో ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు తన Hypothesisలో యుగవిభజన ఎలా సమర్థించుకున్నారా?, ఫలితాంశాలని ప్రకటించారా? అనేది పరిశీలించటం అవసరం.

1972లో ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు చనిపోయారు. 1974లో '*ఆంధ్ర సాహిత్యచరిత్ర*' ప్రచురితమైంది కనుక దీనిలోని యుగవిభజన నిర్ణయ సత్యాన్ని కొంత శంకించే అవకాశం ఉంది. అయితే, అన్ని విషయాలపట్లా ఈ విషయం పైన శంక ఎలాగూ ఉంటుంది. కానీ, 'యుగవిభజన' ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు జీవించి ఉండగా ప్రచురించిన గ్రంథాల్లో ఉంది. కనుక, దీన్ని తులనాత్మకంగా అధ్యయనం చేసి, ఆయన చేసిన యుగవిభజన విషయ నిర్వహణను పరిశీలిచటం బాగుంటుంది.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు, సాహిత్య చరిత్రకు కవుల పేరు మీదనే యుగ విభజన జరగాలని భావించి కవి ప్రతిష్ఠ తర్వాత కవుల అనుసరణ మార్గంగా యుగ విభజన చేశారు. ఒకవేళ సర్వోన్నతుడైన కవి గానీ, సమస్కంధుడు గానీ లేకపోతే, ఒకవేళ ఎక్కువున్నా గానీ, మరో పేరు వాడవచ్చునన్నారు. వీటిని విభజించిన కాలం, పేర్లను కింద పేర్కొంటున్నాను.

| గౌతమవ్యాసములు, | ఆంధ్ర సాహిత్య చరిత్ర |
|---|---|
| 1. పేరులేదు | 1. ప్రాఙ్నన్నయ యుగం. క్రీ.శ. 1000 |
| 2. నన్నయయుగం. | 2.నన్నయ యుగం. క్రీ.శ. 1000 -1100 |
| 3. 12వ శతాబ్ది. | 3. శివకవి యుగం. క్రీ.శ.1100-1225 |
| 4. తిక్కన యుగం. 13వ శతాబ్ది. | 4. తిక్కన యుగం క్రీ.శ. 1225-1320 |
| 5. ఎఱ్ఱన యుగం (1300 - 1350). | 5. ఎఱ్ఱాప్రగడయుగం క్రీ.శ.1320-1400 |
| 6. శ్రీనాథయుగం (1350 - 1500). | 6. శ్రీనాథయుగం క్రీ.శ. 1400-1500 |
| 7. కృష్ణరాయలయుగం (1500-1600). | 7. రాయల యుగం క్రీ.శ. 1500-1600 |
| 8. దక్షిణాంధ్రయుగం (1600-1775). | 8.దక్షిణాంధ్రయుగం/నాయకరాజులయుగం క్రీ.శ.1600-1775 |
| 9. క్షీణయుగం (1775-1875) | 9. క్షీణయుగం క్రీ.శ. 1775-1875 |
| 10. ఆధునిక యుగం (1875 -). | 10. ఆధునిక యుగం క్రీ.శ.1875-? |

ఈ రెండు గ్రంథాల్లో ఉన్న యుగవిభజనలకు పేర్లు పెట్టడంలో పెద్ద తేడాలేదు. కానీ, కాలాలను నిర్ణయించటంలో కొంత తేడా కనిపిస్తుంది. 'తెలుగు సంస్కృతి' వారు ప్రచురించిన మొదటి సంపుటి (పునస్సంశోధితము)లో ప్రబంధ పూర్వయుగం (క్రీ.శ.1400-క్రీ.శ.1500) గానూ (పు:739), ప్రబంధ యుగం (క్రీ.శ.1500-క్రీ.శ.1875) గానూ (పు:751) రెండు భాగాలను ఆచార్య పింగళి లక్ష్మీకాంతం రాశారు. డా|| బిరుదురాజు రామరాజుగారి ఆధ్వర్యంలో ప్రచురించిన 'తెలుగు వాఙ్మయము'లో ఇది కనిపిస్తుంది. బహుశా ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు చేసిన యుగవిభజనలో డా|| బిరుదురాజు రామరాజు గారు పునస్సంశోధితంలో మార్పులేమైనా చేశారేమో తెలియదు. కనుక ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు వేసుకున్న ప్రణాళిక అంటే Hypothesis ప్రకారం చూస్తే 'గౌతమ వ్యాసము'లను బట్టే దీన్ని పరీక్షించవలసి (Testing) ఉంది. అయినా మూడింటిలోని విషయాన్ని నిర్వహించిన తీరుని విశ్లేషించటం అవసరమే!

**ప్రాఙ్నన్నయ యుగం(క్రీ.శ.1000 వరకు):**

1). నన్నయకు పూర్వమే తెలుగులో పరిష్కృతమైన భాషలో రచనలు చేసినా, పద్యాలు రాసినా కవులున్నా ఆంధ్రమహాభారతం వంటి వ్యవస్థీకృత స్థితి లేదనీ, అందువల్ల నన్నయ ఆదికవి కాకపోయినను ఆంధ్ర మహా భారతం మాత్రం తెలుగులో ఆదికావ్యమని ఆయన ఒక నిర్ణయానికి వచ్చారు (ఆంధ్ర సాహిత్య చరిత్ర:పు:24). ఒక వేళ సర్వదేవుడు నన్నయ పూర్వీకుడైనా అతని 'ఆదిపురాణం'లో నన్నయ ఆంధ్ర మహా భారతంలో కనిపించే భాషా సభ్యతల సమన్వయ దృష్టి కనిపించదన్నారు.

2). నన్నెచోడుడు స్మరించిన రాజు, చాళుక్యరాజు రాజరాజు నరేంద్రుడేననీ, అతడు పుట్టించినది తెలుగు కవిత్వమేనని చెప్పారు.

(3) ఆంధ్ర సాహిత్య చరిత్రలో నన్నయ ఆదికవి కాకపోయినా ఆదికావ్య కర్తగా చాలా చోట్ల పేర్కొన్న వీరు గౌతమ వ్యాసాలలో 'ఆదికవి' అన్నారు. ఈ కాలాన్ని గౌతమ వ్యాసాలలో 'ఆంధ్రవాఙ్మయ స్థూలరూపం'లో ఉపోద్ఘాతంగానే రాశారు అంతే తప్ప, ఎలాంటి యుగవిభజన పేరు ప్రత్యేకంగా పెట్టలేదు. అయితే, ఆంతరంగిక సాక్ష్యాల్లో 'ప్రాఙ్నన్నయ యుగం' అనే మాటను వాడటం కనిపిస్తుంది (పు:3). ఈ ప్రాఙ్నన్నయ యుగంలో ఉన్న గేయ కవిత్వం ఆంధ్ర మహా భారతం ముందు నిలవలేకపోయిందన్నారు. 'ఆదికవి' అనే ప్రకటన విషయంలో, తర్వాత సాక్ష్యాధారాల వల్ల, శాసనకవిత్వం, పద, గేయకవిత్వాల వల్ల 'ఆదికవి కాకపోయినా' అని తన Hypothesisని సవరించుకున్నారు.

**నన్నయ యుగం (1000 1100):**

గౌతమ వ్యాసాల్లో 11వ శతాబ్ది అని పేర్కొన్నా, ఆంధ్ర సాహిత్య చరిత్రలో కాల స్పష్టత కనిపిస్తుంది. రాజ రాజ నరేంద్రుడు 1022లో పట్టాభిషిక్తుడై 1063 వరకు రాజ్యపాలన చేశాడనీ, ఇక కొనసాగింపుగా జరగలేదన్నారు. ఏ సంవత్సరంలో నన్నయ భారత రచనకు ఉపక్రమించారో తెలియదుకానీ, రాజ రాజ నరేంద్రుని పాలనాకాలం చివరిలో ప్రారంభించి, రాజు మరణంతో నన్నయ గ్రంథ రచన ఆపారనే అభిప్రాయం సరికాదనీ, నన్నయ స్వర్గ గమనమే కారణమై ఉండునని ఊహించారు. ఈ కాలంలో వాడిగా పరిశోధకులు చెపుతున్న అథర్వణుడు నన్నయకు తరువాత కాలం వాడేనని, వేములవాడ భీమకవి వయసులో చాలా చిన్నవాడై ఉంటాడనీ చెప్పారు. ఈ యుగంలో 'ఆంధ్ర మహా భారతం' తప్ప, వేరే గొప్ప గ్రంథం లేకపోవటాన్ని బట్టి ఈ శతాబ్ది వాఙ్మయానికి నన్నయ యుగకర్తగా ప్రాతినిధ్యం వహిస్తాడన్నారు

**శివకవియుగం (1100 1225):**

ఈ కాలంలో శివుడు తప్ప వేరే దేవుడు లేడనే దృష్టితో మతాన్ని సాహిత్యం ద్వారా ప్రచారం చేసిన వాళ్ళలో నన్నెచోడుడు, పండితారాధ్యుడు, పాల్కురికి సోమనాథుడు ముఖ్యులు. చివరి కవి పాల్కురికి సోమనాథుడు 13వ శతాబ్దిలో ఉన్నా, యదార్థ చరిత్ర లేకపోవటం వల్ల, సౌలభ్యం కోసం 1225తో యుగవిభజనను ఆపినట్లు చెప్పుకున్నారు (పు:63). ఈ యుగంలో ప్రధానంగా కవులు శివతత్త్వాన్నే ప్రచారం చేయటం వల్ల 'శైవయుగం'గా పిలవవచ్చునని గౌతమ వ్యాసములలో పేర్కొన్నారు.

**తిక్కన యుగం (1225 1320):**

సాహిత్యంలో తిక్కన యుగం, పాలనలో కాకతీయ యుగం ఇంచుమించు ఒకేసారి అంతమవ్వటం వలన ఈ యుగాన్ని 1320 వరకూ నిర్ణయించవచ్చునన్నారు (ఆంధ్ర సాహిత్య చరిత్ర.:138-167). తిక్కన 1205-1210 కాలం మధ్యలో జన్మించి, 1288 వరకు జీవించినా 1323 వరకూ వీరి శిష్యులు తిక్కన కవితా సంప్రదాయాన్ని కొనసాగించే రచనలు చేశారు. అందువల్ల దీన్ని 'తిక్కన యుగం'గా నిర్ణయించారు.

అయితే, యథావాక్కుల అన్నమయ్య 1242లో 'సర్వేశ్వరశతకం' రాసినట్లు చెప్పుకోవటంవల్ల తిక్కన కంటే పెద్దవాడు కావచ్చు. కానీ, యథావాక్కుల అన్నమయ్య తిక్కనను గురుతుల్యుడుగా భావించాడు. చాలా మంది కవులు ఈ యుగంలో తిక్కనను ప్రత్యక్ష, పరోక్ష మార్గాలలో అనుసరించినవారే! అందువల్ల 'తిక్కన యుగం' అనటం సమంజసం.

**ఎర్రన యుగం (1320 1400):**

కాకతీయ సామ్రాజ్యం 1323లో ఢిల్లీ సుల్తానుల హస్తగతం కావటంతో దేశ చరిత్రలో రెడ్డి రాజుల యుగం ప్రారంభమైనట్లే, సాహిత్య చరిత్రలో ఎర్రాప్రగడ యుగం ఆవిర్భవించింది (పు:244). ఎర్రన 1280 ప్రాంతంలో జన్మించి 1360 వరకూ జీవించి ఉండవచ్చు (పు:244). 14వ శతాబ్ది చివరి భాగంలో శ్రీనాథుడు జన్మించినా, ఈ శతాబ్ది చివరి వరకూ యుగకర్తృత్వం ఎర్రన పేరుతోనే ఉండటం సమంజసం ఎంత మేటి కవులైనా తెలుగు సాహిత్యంలో నన్నయ, తిక్కన, ఎర్రన (కవిత్రయం) త్రిమూర్తులవంటి వారు అని చెప్పి, 'ఆంధ్ర కవి ప్రపంచానికి ఈ ముగ్గురూ గురు స్థానీయులు'గా అభివర్ణించారు.

అందువల్ల, ఆంధ్ర మహా భారత కర్తృత్వ గౌరవంతో వారి పేర్లతో మూడు యుగాలు ఉండటం న్యాయమన్నారు. ఆఖ్యాన, నాటకీయ, వర్ణనా పద్ధతులకు కూడా వీరు ముగ్గురూ ఆది గురువులు అని యుగనామాన్ని సమర్థించుకున్నారు. భాస్కరుడు, సోమన వంటి వాళ్ళు యుగకర్తలు కాదని తేల్చారు. గౌతమ వ్యాసాల్లో ఈ యుగాన్ని 1350 వరకూ అని పేర్కొన్నా, దాన్ని వివరించ లేదు. కానీ, ఆంధ్ర సాహిత్య చరిత్రలో సమర్థవంతంగా వివరించారు. ఈ యుగ విభజన సమర్థనకు ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు చాలా ప్రయత్నం చేశారు.

**శ్రీనాథ యుగం (1400 1500):**

గౌతమ వ్యాసాల్లో శ్రీనాథుని యుగం 1350-1500గా పేర్కొంటే, ఆంధ్ర సాహిత్య చరిత్రలో 1400-1500గా మార్పు చేశారు. ఆంధ్ర కవుల్లో తిక్కన తర్వాత శ్రీనాథుని వంటి విద్వత్కవి ఇంకొకడు లేడు, అని కొంత అతిశయోక్తిని ప్రదర్శించి, (గౌతమ వ్యాసాలు, పు.14) తన కాలంలో కవి బ్రహ్మవలే, కవి సార్వభౌముడు సాహితీ గురు పీఠాన్నీ అధిష్ఠించిన మహామూర్తిగా పేర్కొన్నారు.

అనువాద సరణికి, ప్రబంధ రచనకి శ్రీనాథుడు మార్గ దర్శకుడిగా భావించి, "*శ్రీనాథుని జీవిత చరిత్ర రాయటం అంటే 15వ శతాబ్దంలోని ఆంధ్ర దేశ చరిత్ర రాయటమే*"అనే డా।। చిలుకూరి వీరభద్రరావుగారి అభిప్రాయాన్ని శ్రీనాథుని యుగ విభజన సమర్థనకు కొంత ప్రమాణంగా గ్రహించారు. రెడ్డి రాజ్య స్థాపకుడు ప్రోలయ వేమారెడ్డి (1323-1350) తర్వాత పాలనను కొనసాగించిన వారు కొంత మంది ఉన్నారు. ఈ పాలకుల్లో పెదకోమటి వేమారెడ్డి 1400-1420 లేదా 1402-1420గా గుర్తించి, ఇతని ఆస్థానంలో ఉన్న శ్రీనాథుడు అనేక కావ్యాలను రాయటం, సాహిత్యాన్ని ప్రభావితం చేయటం వల్ల 'శ్రీనాథుని యుగం' అనేది సమంజసం అని సమర్థించుకున్నారు.

అయితే కందుకూరి వీరేశలింగం, వేటూరి ప్రభాకర శాస్త్రి గార్లు ప్రతిపాదించిన శ్రీనాథుని కాలాన్ని పరిశీలించి, కావ్యపీఠికలు, ఆ కాలంలో పాలకులను అనుసరించి 1380 లేదా 1385గా నిర్ణయించి 1470 వరకు జీవించి ఉంటారన్నారు (తె. సా. చ. పు:310-312). అయితే ఈ యుగాన్ని నిష్కర్షగా నిర్ణయించటం కష్టం అని చెప్పుకున్నారు

ఆంధ్ర మహాభారత కవులు పురాణానువాదానికీ, శ్రీనాథుడు, ఈ యుగకవులు సంస్కృతానువాదానికి దారి చూపిన గురువులుగా తలంచారు. శ్రీనాథుని రచనారంభంతో ప్రారంభమైన ఈ యుగం 'ప్రబంధ పూర్వ యుగం' అనే పేరుకి కూడా అర్హత సాధించిందని అనటం వల్ల 'తెలుగు సమితి' వారి వ్యాసాల్లోని 'యుగవిభజన' సమర్థన కూడా సరిపోతుంది. 1500ల నుండి స్వతంత్ర ఆంధ్ర ప్రబంధాలు అవతరించాయని, అందుచేత 1400-1500 కాలాన్ని శ్రీనాథయుగం అన్నారు.

**శ్రీ కృష్ణ దేవరాయల యుగం (1500 1600):**

క్రీ.శ 1500 నుండి ఆంధ్ర ప్రబంధాల స్వతంత్ర లక్షణాన్ని అనుసరించి ఈ యుగ విభజన చేసినట్లు ఆంతరంగిక ఆధారాలు కనిపిస్తున్నాయి. శ్రీకృష్ణదేవరాయల యుగాన్నే 'ప్రబంధ యుగం'గా భావించవచ్చునని అన్నారు. అయితే, 'ఆంధ్ర సాహిత్య చరిత్ర' (1974) గ్రంథంలో మిగిలిన యుగాల గురించిన ప్రస్తావన కనిపించదు. అయినా, గౌతమ వ్యాసాల్లో ఈ యుగ విభాగం గురించి కొంతవరకు ఉంది. శ్రీ కృష్ణ దేవరాయల యుగ సమర్థనలో, శ్రీకృష్ణదేవరాయలు 'ఆముక్తమాల్యద' గురించి కాకుండా, ఆ కాలంలో జరిగిన ప్రబంధ కృషి, పోషణ, స్వయంగా కవికావటం వంటి వాటి వల్ల 'శ్రీ కృష్ణ దేవరాయల యుగం' అని పేరు పెట్టినా, పెద్దన గురించే ఎక్కువగా ప్రస్తావించి, పెద్దన పెద్దరికాన్ని కొనియాడటం కనిపిస్తుంది. ఈ యుగ విభజనలో ఇదొక విశిష్టత.

**దక్షిణాంధ్ర యుగం (1600 1775):**

దీన్ని ఆంధ్ర సాహిత్య చరిత్రలో చేసిన యుగవిభజనలో 'నాయక రాజుల యుగం'గా కూడా ప్రతిపాదించడం కనిపిస్తుంది. కానీ, గౌతమ వ్యాసాల్లో 'దక్షిణాంధ్ర యుగం'గానే పేర్కొన్నారు (పు:27). రఘునాథ రాయలని ఈ యుగ మూల పురుషుడిగా చెప్పారు. నాయక రాజుల్లో మూడవ వాడైన రఘునాథ రాయలు కవి, పండిత పోషకుడుగా, తంజావూరులో ఆంధ్ర సాహిత్యానికి సేవ చేశారు. శ్రీ కృష్ణ దేవరాయలతో కొంత సామ్యం ఉన్నా, దక్షిణాంధ్ర కవుల కృషిని గుర్తించే విధంగా ఈ యుగ విభజనను సమర్థించారు.

**క్షీణ యుగం (1775 1875):**

పాలనా ప్రభావం ఆధారంగా, సామంత రాజుల కాలం నాటికి రాజులకీ, కవులకీ ఐహికమే ప్రధానమై, భోగలాలసత పెరిగింది. ప్రబంధాలు వచ్చినా అవి అనుకరణలే అయ్యాయి. కవిలో నూత్నత్వం లేదు. నిస్తేజమైన సాహిత్యాన్ని పునరుద్ధరించి కొత్త

మార్గంలో నడపగల మహాకవి, యుగపురుషుడు లేడు. అందువల్ల దీన్ని 'క్షీణ యుగం'గా సమర్థించారు. అయితే మొల్ల, కంకంటి పాపరాజులు ఉన్నా, ఆ కాలంలో ఉన్న మిగతా అంశాలే యుగ నిర్ణయానికి ఆధారంగా తీసుకున్నారు.

**ఆధునిక యుగం (1775 1875):**

ప్రాచీన, నవీన లక్షణాలు కొంత ఉన్నప్పటికీ, మొత్తం మీద చూసినప్పుడు, అంతకు ముందున్న యుగం కంటే నవ్యంగా ఉన్న సాహిత్యమే ఎక్కువ. కనుక, కాలాన్నిబట్టి ఆధునిక యుగంగా, గుణాన్ని బట్టి నవ్యయుగంగా చెప్పారు (పు.33). నవ్యసాహిత్య శాఖలు విస్తరించటాన్ని కూడా గుర్తించారు.

**యుగవిభజన విశ్లేషణ:**

యుగ విభజనకు కాలం, కవి, ప్రభావాలు వంటి వాటిని చెప్పుకున్నా, సమర్థించుకోవడానికి ప్రయత్నించినా, ఎర్రన యుగ నిర్ణయంలో పింగళివారు ఇబ్బందిని ఎదుర్కోక తప్పలేదు. రాజులను బట్టి యుగవిభజన చేయటం సరైనది కాదంటూనే 'దక్షిణాంధ్రయుగం'లో నాయకరాజుల ప్రభావాన్ని ఎక్కువగా చర్చించారు. ప్రతి యుగంలోనూ పాలకులను, సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితులను స్పర్శా మాత్రంగానే పరిశీలించారు. కానీ, ఏ పరిస్థితులవల్ల ఆ కావ్యాలు వచ్చాయో, ఆ కవులు అలా ఎందుకు రాశారో చెప్పే ప్రయత్నం కొంతవరకూ జరిగినా, ఈ దృష్టి కంటే, కావ్య స్థానాన్ని నిర్ణయించే దిశగానే యుగ విభజన కొనసాగింది.

కవి పేరుతో యుగవిభజన చేసినా అన్ని యుగాలలోనూ, ఆ కవుల ప్రభావమే అందరిపైనా ఉందని చెప్పే వీలులేదు. అలాగే వంద సంవత్సరాలను యుగవిభజన కాలంగా తీసుకోవటం వల్ల కూడా ఏ కవి పేరు పెట్టాలనే విషయంలో పరిశోధకుడు కొంత సందిగ్ధ పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. కానీ, సంక్షిప్తంగా సాహిత్య యుగాలను గుర్తుపెట్టుకోవడానికి వీలుపడుతుంది. నేటికీ సాహిత్య చరిత్ర యుగవిభజనలో ఒక్కొక్కరికి ఒక్కో అభిప్రాయం ఉంది. అయినా, వారివారి ప్రతిపాదనలను నిరూపించే దిశగానే ప్రయత్నిస్తున్నారు. మంచి, చెడులను కాలమే నిర్ణయిస్తుంది. అంటే సిద్ధాంతాలన్నీ మళ్ళీ, మళ్ళీ పరీక్షలకు గురవుతూనే ఉంటాయనేది గుర్తించవలసిన అంశం.

**విషయ పరిశోధన:**

పరిశోధించిన 'విషయమే' ప్రధానంగా పరిగణనలోకి తీసుకొనే పద్ధతిని తెలిపేది 'విషయ పరిశోధన' అని పిలువవచ్చు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు చేసిన పరిశోధనలను ముకురాల రామారెడ్డి, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, డా|| అక్కిరాజు రమాపతిరావు, ఆచార్య కోలవెన్ను మలయవాసిని, డా|| ద్వా.నా.శాస్త్రి, రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు తదితరులు వివిధ ప్రత్యేక సంచికలలో చాలా వరకూ సమర్థించారు. పింగళి వారి శతజయంతి సంచిక 'రసజ్ఞశిల్పి'; స్మారక సంచిక, వివిధ పత్రికలలో పైన పేర్కొన్న పరిశోధకులు, విమర్శకులు పింగళి లక్ష్మీకాంతంగారి యుగ విభజనను సమర్థిస్తూ అనేక వ్యాసాలను ప్రచురించారు.

**పరిశోధనలో మరికొన్ని ముఖ్యాంశాలు:**

వీటితోపాటూ, ముఖ్యమైన కొన్ని అంశాలను కింది పరిశోధనాంశాలుగా ప్రకటించవచ్చు.

1. నన్నయ తర్వాతవాడే నన్నెచోడుడు అని సమర్థించటం

2. తెలుగులో మొదటి హేళన కావ్యం క్రీడాభిరామం అని చెప్పటం.

3. తిమ్మయ, సోమన, బాలసరస్వతి అనే కవిత్రయం రాసిన ద్విపద భారతాన్ని శాస్త్రీయంగా పరిష్కరించటం.

4. ద్విపద భారతాన్ని కవిత్రయ భారతంతో పోల్చటం సరైంది కాదని నిరూపించటం.

5. గోనబుద్ధారెడ్డి ద్విపద రామాయణాన్ని రాసి, తన తండ్రి విఠ్ఠల ధరణీశుని పేరుతో 'రంగనాథ రామాయణం' అని పేరు పెట్టాడని నిరూపించటం..

6. 'ముసలమ్మ మరణం'లో ముసలమ్మ లోక కళ్యాణం కోసమే ఆత్మ త్యాగం చేయటంవల్ల, ముగింపు 'మంగళకరమే' అవుతుంది అని నిరూపించటం..

7. 'ప్రభావతీ ప్రద్యుమ్నం' సంస్కృత మూలంలో ఉందని స్పష్టం చేయటం.

8. 'కర్ణాటక భాష' అంటే 'కర్ణాటక శైలి' అని సంగీత శాస్త్రాన్ని అనుసరించి నిరూపించటం.

9. 'పలనాటి వీరచరిత్ర, ద్విపద భారతం, రంగనాథ రామాయణాన్ని పరిష్కరించి, పరిష్కరణ పట్ల పరిశోధకుని జాగ్రత్తను గుర్తుచేయటం.

10. సాహిత్య విమర్శ, సాహిత్య చరిత్రలలో భారతీయ, పాశ్చాత్య సంప్రదాయాలను సమన్వయించటం వల్ల విజ్ఞానాభివృద్ధికి మార్గం వేయగలిగే సమన్వయాన్ని చూపటం.

11. ప్రబంధాన్ని సమన్వయించి, మనుచరిత్రను అన్ని లక్షణాలు ఉన్న ప్రబంధంగా నిర్ణయించటం.

ఇలా పరిశోధనలో కొన్ని కొత్త అంశాలను కొత్త సమన్వయాలను చేయగలిగారు. ఈ కృషి వల్ల 'తెలుగు సాహిత్య చరిత్ర పరిశోధకుడు'గా ఒక విశిష్ట స్థానాన్ని సాధించారు. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం గారు వ్యాఖ్యానించినట్లు ''*సాహిత్య చరిత్రను కవుల చరిత్రకంటే భిన్నమైన అస్తిత్వాన్ని కల్పించి, అందులో వికాస సూత్రానికి ప్రాథమికమైన ఆధారాలను పునాదులుగా అమర్చిన మొదటి గౌరవం పింగళివారికే దక్కుతుంది*''.

తెలుగులో ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు 'సాహిత్యచరిత్ర' రాసే నాటికే కవుల చరిత్రలు ఉన్నాయి. వాటికంటే భిన్నంగా కావ్య సమీక్ష, విమర్శ లక్షణాలను సంతరించుకోవటం వల్ల వీరి 'సాహిత్యచరిత్ర'కి ఒక విశిష్టస్థానం చేకూరింది. రాజుల, పోషకుల పేర్లతో ఆరుద్ర యుగవిభజన చేసి ప్రచురించటం ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి చివరికాలం వరకూ జరుగుతునే ఉంది. అయితే ఆరుద్ర చేసిన విభజన పోషకుల పేరుతో ఉన్నా, పోషకుల ప్రభావాన్నీ, పాలనా కాలాలను,సాంఘిక, మత, ఆర్థిక పరిస్థితులను కావ్యాల్లో, రచనలలో ప్రతిఫలించేవన్నీ తన రచనలో వివరించారు.

అందువల్ల, పాలనా ప్రభావాన్ని మార్క్సిస్టు దృక్పథంతో చేసిన యుగవిభజనగా గుర్తించవలసి వచ్చింది. అయితే ఆరుద్ర పూర్తిగా దీన్ని పాటించటంలో కొంత వెలితి కనిపిస్తుంది. కొన్నింటి విషయంలో సర్దుబాటు చేసుకోవడానికి చాలా ప్రయత్నాలు చేశారు. అలాగే లక్ష్యాత్మకంగా కూడా యుగవిభజనలో, సమర్థన ఉన్నా, ఎర్రనయుగం, ఆధునిక యుగం వంటి వాటిలో సమర్థనలే తప్ప, అవే అందరికీ ఆమోదయోగ్యం అనుకోవటానికి వీలు లేదు.

కందుకూరి, గురజాడ శ్రీరామమూర్తులనుండి నేటి డా॥ ముదిగంటి సుజాతారెడ్డి, డా॥ ద్వా.నా.శాస్త్రిల వరకు వివిధ పేర్లతో యుగవిభజనలు జరగటం, సాహిత్యచరిత్రలు రావటం అనేది జరుగుతుంది. అయినా, సాహిత్య చరిత్ర రచనకూడా 'ఒక పద్ధతి' ప్రకారం జరగడం లేదు. Inductive Method, Deductive Method లలో సాహిత్య పరిశోధన కొనసాగటం వల్ల సాధారణ సిద్ధాంతం నుండి, నూతన సిద్ధాంతాన్ని స్థాపించే ప్రయత్నం, 'సిద్ధాంతాలు నుండి కొత్త సమన్వయాలను చేయాలనే ప్రయత్నం తెలుగు సాహిత్యం, చరిత్ర ఉన్నంత వరకూ కొనసాగుతునే ఉంటాయి.

కొత్త ప్రమాణాలు, కొత్త ఆకరాలు, కొత్త సమాచారం వస్తూ, కొత్త పద్ధతిలో సాహిత్య పరిశోధనలు నిరంతరం జరుగుతునే ఉంటాయి. సాహిత్యం, సాహిత్య పరిశోధన ఒక జీవన స్రవంతి. అది కొనసాగుతునే ఉంటుంది. సాహిత్య చరిత్ర రచన సాహిత్య స్వరూప స్వభావాలను గమనించినప్పుడు పరిశోధనలో శాస్త్రీయత ఉన్నా, ఫలితాంశాలు అందరివి ఒకేలా ఉండవని గుర్తించక తప్పదు. అలా చూసినప్పుడు సాహిత్య పరిశోధన, విమర్శ, సాహిత్య చరిత్ర రచనలలో కొంతైనా ఆత్మాశ్రయ ధోరణి ఉంటుంది. దాన్ని దృక్పథం అని సాహిత్య పరిభాషతో వాడుతున్నారు. ఆ విధంగా చూసినపుడు, తొలి తరం పరిశోధకులలోనే ప్రాచ్య, పాశ్చాత్య సమన్వయ దృక్పథాన్ని ప్రదర్శించిన పరిశోధకుడుగా, విమర్శకుడుగా, చరిత్రకారుడుగా ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారికి ఒక విశిష్ట స్థానమే ఉంది.

**ఆధార గ్రంథాలు:**


అప్పారావు, శ్రీరామ, పోణంగి., రామకృష్ణమాచార్య, నండూరి., సూర్య సుందరం, పింగళి (సంపా.). *రసజ్ఞశిల్పి (ఆచార్య లక్ష్మీకాంతం శత జయంతి సంచిక).* విశాఖపట్నం: డా. పి. శ్రీనివాస్ ప్రచురణ. 1994.

*ఆచార్య లక్ష్మీకాంతం స్మారక సంచిక.* హైదరాబాదు: విజ్ఞాన సమితి, తెలుగు అకాడమి, 1974.

విద్యా శేఖరులు, ఉమాకాంత., అక్కిరాజు. *పల్నాటి వీర చరిత్ర పీఠిక.* హైదరాబాదు: పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం, 1997.

కుల శేఖరరావు, ఎం., కుసుమాబాయి. కె. *సాహిత్య పరిశోధన పద్ధతులు.* హైదరాబాదు: నవయుగ పబ్లిషర్స్, 2001.

చంద్రశేఖరరెడ్డి, రాచపాళెం., బ్రహ్మానంద, హెచ్.ఎస్.
సాహిత్య పరిశోధన సూత్రాలు. హైదరాబాదు:
విశాలాంధ పబ్లిషింగ్ హౌస్, 1997.
ప్రకాశరావు, గొల్లపూడి. *భారతీయ సాహిత్య నిర్మాతలు పింగళి కాటూరి.*
న్యూఢిల్లీ: సాహిత్య అకాడమీ, 1999.
బుద్ధ భూపతి, గోన., కాచ భూపతి, గోన., విఠల భూపతి, గోన.
*శ్రీ రంగనాథ రామాయణం.* హైదరాబాదు:
తెలుగు విశ్వ విద్యాలయం, 1989.
రామనరసింహం, పరిమి. *ఆంధ్ర మహా భారత శైలీ పరిశీలనం.*
హైదరాబాదు: పరావాక్ ప్రచురణలు, 1996,
రామారెడ్డి, ముకురాల. సాహిత్య సులోచనాలు. హైదరాబాదు:
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1992.
లక్ష్మణ చక్రవర్తి, సి.హెచ్., వారిజారాణి, పి., విజయకుమార్, జి. (సంపా).
ఆధునిక సాహిత్య విమర్శ రీతులు. హైదరాబాదు:
ఆంధ్ర విద్యాలయ స్నాతకోత్తర తెలుగు శాఖ, 2005.
లక్ష్మీకాంతం, పింగళి. *గౌతమ వ్యాసములు.* హైదరాబాదు:
విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1989.
లక్ష్మీకాంతం, పింగళి. సాహిత్య శిల్ప సమీక్ష. విజయవాడ:
గంగాధర పబ్లికేషన్, 1986.
విశ్వనాథం, జి. (సంపా.). పరిశోధన పద్ధతులు *సామాజిక గణాంకం.*
హైదరాబాదు: డా|| బి.ఆర్. అంబేద్కర్ విశ్వ విద్యాలయం, 2003.
వెంకటేశ్వరరావు, దార్ల. పరిశోధకుడుగా ఆరుద్ర
*(అముద్రిత సిద్ధాంత వ్యాసం).* హైదరాబాదు:
హైదరాబాదు విశ్వ విద్యాలయం, 2003.
సుబ్రహ్మణ్యం, జి.వి. సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు.
హైదరాబాదు: తెలుగు అకాడమి, 1991.

***

# తెలుగులో తొలి కథానిక ఏది? ఎందువల్ల?

తెలుగులో తొలి కథ ఏదనే విషయంపై విమర్శకులలో ఏకాభిప్రాయం లేదు. గురజాడ అప్పారావు రాసిన 'దిద్దుబాటు' మొట్ట మొదటి ఆధునిక కథానిక అని చాలా మంది విమర్శకులు అభిప్రాయ పడుతున్నారు. ఆ కాలంలో వచ్చిన కథలను తులనాత్మకంగా పరిశీలించిన విమర్శకులు అత్యధిక శాతం మంది 'దిద్దుబాటు'నే మొట్ట మొదటి కథ అని అంటున్నారు. దిద్దుబాటు (1910), *లలిత* (1902), *విశాఖ* (1904), *స్త్రీవిద్య* (1902), *ధనత్రయోదశి* (1902) కథలలో ఒక దానిని మాత్రమే తొలి తెలుగు కథగా కొంత మంది గుర్తిస్తున్నారు. మరొక వైపు తొలి తెలుగు కథానిక తెలంగాణా ప్రాంతం నుండి వచ్చిందనే వాదన మరొకటి బయలు దేరింది. కానీ, దానిపై తగినంత చర్చ జరగలేదు. ఈనేపథ్యంలో ఈ కథలను, కథలపై వచ్చిన విమర్శలను పునర్మూల్యాంకనం చేయడమే ఈ వ్యాసం ప్రధాన లక్ష్యం.

**కథ - కథానిక లక్షణాలు:**

మానవునికి ఊహ తెలిసినప్పటి నుంచీ కథ ఉంది. కథ, దాని పుట్టుక గురించి పరిశోధించిన వాళ్ళు వేద, పురాణ, ఇతిహాసాలలో కూడా కథలు ఉన్నాయని సోదాహరణంగా నిరూపించారు. అందువల్ల కథను ప్రాచీన కథ, ఆధునిక కథగా వర్గీకరించి, ఆధునిక కథను ఆంగ్లంలోని Short Story అనే అర్థంలో వాడుతున్నారు. అలా చూసినప్పుడు కథ ఆధునిక ప్రక్రియ. ఆధునిక అనే పారిభాషిక పదం వల్లే కథకు కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉంటాయని తెలిసింది. ఆధునిక కథానిక పాశ్చాత్య దేశాలలో కూడా ఇంచుమించు ఒకే కాలంలో ఆవిర్భవించినట్లు పరిశోధకులు భావిస్తున్నారు. (జి.నాగయ్య. 1996: 830) ఆంగ్ల విమర్శకులు Short Story గురించి చెప్పిన నిర్వచనాలు పరిశీలించినా కథకు ప్రాచీన, ఆధునికంగా వర్గీకరించడమే కాకుండా వస్తు శిల్పపర అంశాలు కూడా ముఖ్యమని స్పష్టమవుతుంది.

నాగయ్య. జి., తెలుగు సాహిత్య సమీక్ష (రెం.సం), 1996: 830) లో ఉదహరించిన నిర్వచనాలు:

1."*A Short Story in a prose narrative requiring from half an hour to one or two hours into per usal putting the same idea, into different phraseology, we may say that s short story in a story that can be easily read at a single sitting.*" - W.H. Hudson

2."*A Prose narrative briefer than the short novel, more restricted in characters and situations, and usually concerned with a single effect*" - Karl Beck son, Arthur Ganz

ఈ నిర్వచనాలను బట్టి కథ అనేదాన్ని సామాన్యుడు కూడా సులభంగా చదవడం, ఒకేసారి చదవగలగడం, దానితో పాటు ఆసక్తిదాయకంగా ఉండటం. తక్కువ నిడివి కలిగివుండటం అనే మౌలిక అంశాలు ఉండాలనే అవగాహన కలుగుతుంది.

విమర్శకులు ఇంగ్లీషు Short Storyకి చెప్పిన లక్షణాలే తెలుగు విమర్శకులు ఇంచుమించు ఆధునిక తెలుగు కథ, కథానికలకు కూడా అన్వయిస్తున్నారు. వల్లంపాటి వెంకట సుబ్బయ్య 'కథాశిల్పం' లో పాశ్చాత్య విమర్శకులు సారాంశాలతో చెప్పిన కొన్ని ముఖ్య లక్షణాలు కింది విధంగా ఉన్నాయి.

1) **క్లుప్తత:** ఇతివృత్తం అవసరాలకు మించి కథ పెరగటం.

2) **అనుభూతి ఐక్యత:** ఒకే సంఘటన లేదా పాత్ర లేదా ఆ పాత్ర ప్రాధాన్యత లేదా ఒకే సంఘటన చూస్తూ ఉండే గుణాత్మక మార్పు.

3) **సంఘర్షణ:** రెండు భావాలు లేదా ఇద్దరు వ్యక్తులు లేదా రెండు జీవితాలు ఇలా ఎన్నింటి మధ్యనైనా ఉండే మానసిక లేదా భౌతిక నిర్మాణం.

4) **నిర్మాణ సౌష్టవం:** కథను ఆద్యంతం చదివించే రచనా విధానంతో ఎక్కడో ఒకచోట అసలు విషయం స్ఫురించేటట్లు ఉండే కొసమెరుపు వంటి వాటిని కలిగి ఉండటం.

5) తక్షణత్వం (Immediacy)

6) సమకాలీనత (contemporariness)

ఇవేకాకుండా, ఆధునికతలో గల భావనలను కథ/ కథానిక ప్రతి ఫలింప చేస్తుందో లేదో చూడవలసి ఉంటుంది. ఆధునిక కథానిక పుట్టడానికి అది కూడా ఒక మూలకారణం.

*''కథను పారిశ్రామిక నాగరికత, ప్రపంచ సంస్కృతికిచ్చిన మహత్తర కానుక''గానూ, ''అభద్రతా భావమే కథానిక పుట్టుటకు ముఖ్య కారణం''*

*''19వ శతాబ్దపు జీవితానికి, జీవిత దృక్పథానికి సాహిత్యం ఒక రూపం. జీవితంలోని ఒక ముక్కను తీసుకొని దానికి 'వ్యక్తిత్వం' ఇవ్వాలన్న ఆకాంక్షలోంచి కథకు రూపం వచ్చింది.''* ఇవన్నీ ఆధునిక కథానిక ఆవిర్భావానికి దానిలోని ఆధునికతను తెలుపుతున్నాయి. ఆధునికతలో కనిపించే స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాతృత్వం వంటి భావాలతో పాటు, శాస్త్రీయ ఆలోచనా విధానం ఆధునిక కథానికకు ముఖ్యమైన స్పృహ కూడా ఉంది.

**తొలి కథానికవిమర్శ-తీరు తెన్నులు:**

తొలితెలుగు ఆధునిక కథ గురించి ప్రధానంగా రెండు విమర్శ ధోరణులు కనిపిస్తున్నాయి.

**దిద్దుబాటుని సమర్థించే వారి వాదం:**

తొలి తెలుగు కథగా గురజాడ రాసిన 'దిద్దుబాటు'ని గుర్తించిన వారు కింది కారణాలను సూచించారు. ఈ వర్గం విమర్శకులలో ఆరుద్ర, చింతా దీక్షితులు తదితరుల దృష్టిలో 'దిద్దుబాటు'లో ఆధునిక కథకు ఆదర్శనీయ గుణాలు లేవనేది ప్రధాన విమర్శ.

1) ఆధునిక కథానికకు కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉన్నాయి.

2) కథా వస్తువు సంస్కరణ దృక్పథానికి చెందింది.

3) అత్యధిక ప్రజలకు అందుబాటులో ఉండే వ్యావహారిక భాషలో ఉంది.

4) అభ్యుదయ భావజాలాన్ని కలిగి ఉంది.

5) కేవలం ఆ రచన వరకే కాకుండా, ఆ రచయిత రాసిన మిగిలిన రచనలను కూడా పరిగణించి, 'ఆధునికత'ను నిర్ణయించడం.

6) అతీంద్రియ భావాలకు, మానవేతర శక్తుల ప్రభావం కంటే, మానవతా వాద, హేతువాద దృక్పథాలను పరిగణనలోకి తీసుకోవడం. ఇటువంటి ఆధునిక సాహిత్య విలువల ఆధారంగా 'దిద్దుబాటు' మొట్ట మొదటి ఆధునిక తెలుగు కథానికగా నిలుస్తుందని విమర్శకులు భావించారు.

**'దిద్దుబాటు' ని కాదనే వారి వాదనలు:**

మరో వర్గం స్త్రీ వాద విమర్శకులలో ప్రధానంగా లలిత, భార్గవీరావు, కొండవీటి సత్యవతి తదితరులు కనిపిస్తున్నారు. వీరి విమర్శ కింది విధంగా ఉంది.

1) సాహిత్యాన్ని స్త్రీ దృక్పథంతో అధ్యయనం చేయకపోవడం వల్ల, భండారు అచ్చమాంబ విస్మరించబడటమో, నిర్లక్ష్యానికి గురికావడమో జరిగింది.

2) పురుషాధిపత్యం వల్లే భండారు అచ్చమాంబ 'స్త్రీవిద్య', 'ధనత్రయోదశి' కథలు కావాలనే పట్టించుకోలేదు.

3) ఆనాటి భాషనే భండారు అచ్చమాంబ ప్రయోగించింది. నిజానికి గురజాడ 'దిద్దుబాటు' అనేక 'దిద్దుబాట్లు'కి గురైంది. దాని అసలు పేరు 'కమలిని' అది గ్రాంథికంలో ఉంది. తర్వాత దానిని వ్యవహారికంలోకి మార్పు చేశారు. కనుక, భాష ఆధారంగా చేసే వాదన సరైంది కాదు.

4) భండారు అచ్చమాంబ రచనలన్నీ స్త్రీ విద్యను కోరుకుంటూ, 1902 నాటికే పురుషాధి పత్యాన్ని ప్రశ్నించడం, సమానత్వాన్ని ఆకాంక్షించడం ఆధునిక భావాలు కావా?

5) కథా నాయకుడు గోపాలరావు, తన నౌకర్ని పదే పదే తిట్టడం, కొట్టడం, తనకి అవసరమైన పనులు చేయించుకోవడానికి డబ్బు ఆశ చూపడం వంటివన్నీ 'దిద్దుబాటు'లో ఉండటం అభ్యుదయం ఎలా అవుతుంది?

6) భండారు అచ్చమాంబ రాసిన రచనలు స్త్రీ విద్య, ధనత్రయోదశి కథలను లోతుగా చూస్తే, సంస్కరణ దృక్పథం కనిపిస్తుంది. నాటికి గురజాడ రచనల్లోనూ సంస్కరణ దృక్పథమే ప్రధానంగా ఉంది. కనుక, సమకాలీనతతో పాటు, ఆధునిక జీవన కాంక్ష ప్రతిఫలిస్తుంది.

వస్తు శిల్ప వివేచన:

'స్త్రీవిద్య' కథకు మరోపేరు 'భార్యా భర్తల సంవాదం'. పెళ్లైన తర్వాత భర్త ఉన్నత చదువుల కోసం వెళ్తే, తన భార్యను చదువుకొని, తనకు ఉత్తరాలు రాయమని, స్త్రీకి విద్య ఎంతో అవసరమని ప్రబోధిస్తాడు.

సంభాషణ తప్ప దీనిలో కథకు కావలసినంత బిగువు కనిపించదు. నాటి సమాజాన్ని బట్టి స్త్రీ మాట్లాడటం కంటే పురుషుని చేతనే స్త్రీకి కూడా ఉండవలసిన విద్యావసరాన్ని చెప్పారనేది కేవలం రచనా విధానాన్ని సమర్ధించటమే అవుతుందేమో. ఎవరు చెప్పినా, స్త్రీ విద్య అవసరమని చెప్పడమే ముఖ్యం. అంతవరకు బాగానే ఉన్నా, అది ఆధునిక కథగా దాన్ని పరిగణించగలమా? ఆలోచించ వలసిందే!

'ధనత్రయోదశి'లో ధనవంతులైన వ్యక్తి (వేంకటరత్నం), తమ తల్లిదండ్రుల వల్ల పేదరికంలో కూరుకు పోయి, ఉన్నత విద్యను అభ్యసించే స్తోమతలేక, కుటుంబాన్ని పోషించటం కోసం గుమస్తాగా ఒక షాపులో చేరతాడు. ఆ షాపు యజమాని (వేంకటశెట్టి) మరో ఉద్యోగీ (కృష్ణమూర్తి) కలిసి, కథానాయకుని నిజాయితీని పరీక్షించడమే కథా వస్తువు. దీపావళి రాబోతుంది కనుక, తమ దారిద్రాన్ని పోగొట్టుకోవడానికి ధవవంతుడైన ఆ షాపు యజమానికి తెలియకుండా కొంత ధనాన్ని అపహరిద్దామని సహ ఉద్యోగి చెప్పినా వినకపోతే, బలవంతంగా వందరూపాయలు ఆ ఉద్యోగే ఆతని (వేంకటరత్నం) జేబులో పెట్టేస్తాడు. ఆ డబ్బుతో ఇంటికొచ్చి, తన భార్యకు చెప్పలేక నిద్రపట్టక అర్థరాత్రి ఆ డబ్బుల్ని చూస్తుంటే, భార్యకి మెలుకువ వచ్చి, మర్నాడు ఇద్దరూ కలిసి షాపు యజమానికి ఇచ్చేయడంతో, అది తాను పెట్టిన పరీక్ష అనీ, దానిలో దంపతులిద్దరూ నెగ్గారని మెచ్చుకుని జీతం పెంచడం కథా వస్తువు.

విమర్శకురాలు సత్యవతి గారన్నట్లు కథా నిర్మాణం పటిష్ఠంగానే ఉన్నా, కథలో భార్య భర్తలలో దైవం పట్ల భయమే ఎక్కువగా ప్రతిఫలించింది. ఒకవేళ షాపు యజమానికి తెలిస్తే, ఉద్యోగం పోతే, బతకడమెలాగో తెలియని నిస్సహాయిత వారిరువురిలోనూ వెల్లడయ్యింది. భార్య భర్తల మధ్య పిల్లల పట్ల సమాజం పట్ల మాత్రం మానవీయమైన ఔన్నత్యం చక్కగా వర్ణితమైంది.

విజయలక్ష్మి, వేంకటరత్నం, వేంకట సెట్టి, కృష్ణమూర్తి పాత్రల పేర్లన్నీ సంప్రదాయకంగా వస్తున్న భావజాలానికి ప్రాతినిధ్యం వహిస్తున్నాయి.

గ్రాంథిక భాషలో ఉన్నా గానీ, శిల్ప పరంగా చాలా పటిష్ఠమైన విధానంలో రాసిన కథగానే దీన్ని చెప్పుకోవచ్చు. 'లలిత', 'విశాఖ' కథలన్నీ రాచరిక సమాజాన్నే తప్ప ఆధునికతకు చాలా దూరంలో ఉన్నాయి. ఈ కథల గురించి వ్యాఖ్యానిస్తూ ఆరుద్ర గారే పేర్కొన్నట్లు ఆచంట సాంఖ్యాయన శర్మగారి కథలు ఆయనే ప్రచురించుకున్న 'కల్పలత'లో తప్ప, మరెక్కడా ప్రచురితం కాలేదు. పోనీ ఆయన పత్రిక లోనూ మరెవరి రచనలూ ప్రచురితం చేయలేదు.

కథల్లో నిర్మాణం కొంత బాగానే ఉన్నా, జానపద కథలు కూడా నిర్మాణపరంగా ఎంతో గొప్పగానే ఉంటాయి. అయినా వాటిని విమర్శకులు ఆధునిక కథలని పిలవడం లేదు!

'లలిత' కథలో 'లలిత' అందమైన రాచకన్య. ఆమెను బాగా ధనవంతురాలైన, విలాసవతియైన బాలాంబ మేనల్లుడు చంద్రవర్మ ప్రేమిస్తాడు. ఆమె అమాయకత్వం, పవిత్రతలను చూసి, స్వయంగా తానే తాను చెడ్డవాడినని మనసిచ్చినా నీకు తగనని ఆమెతోనే చెప్తాడు. కానీ, ఆమె లౌక్యంగా మనసిచ్చిన తర్వాత ఆ హక్కులన్నీ తనకే ఉంటాయనీ, అంతకు ముందు ఎలా ఉన్నారనే దాని కంటే, తర్వాత ఎలా ఉంటారనేదే తనకు ముఖ్యమని చెప్పి, ఒప్పించి పెళ్ళి చేసుకుంటుంది.

గ్రాంథికమైనా ప్రబంధ కాలంనాటి వర్ణనలతో నిండినా నిర్మాణం బాగుంది. రాచరికపు సమాజంలో తప్పనిసరి సర్దుబాటు మనస్తత్వంగానే కథా నాయికి ''లలిత''ను అర్థం చేసుకోవడానికి అవకాశం ఉంది. మరో కోణంలో చూస్తే, స్త్రీ పురుష సంబంధాలలో కొన్ని కొత్త విలువల్ని ప్రతిపాదిస్తుంది. ఆమె పైకి చెప్పకపోయినా, అదే నీతిని స్త్రీపట్ల కూడా అనుసరించగలగాలనే నిగూఢ భావం దాగిఉంది.

'విశాఖ' కథ కూడా రాచరికపు సమాజాన్నే ప్రతిఫలిస్తుంది. ఒక రాజ కుటుంబానికి చెందిన 'విశాఖ' అనే యువతి కళానిధి అనే యువకుడిని ప్రేమిస్తుంది. అది తెలిసిన విశాఖ తల్లిదండ్రులు కళానిధిని జైలులో బంధిస్తారు. అతడిని అర్ధరాత్రి చంపించేయాలని ఒక ప్రణాళిక వేస్తారు. అది తెలిసిన విశాఖ ముసుగు ధరించి జైలు దగ్గరకు వచ్చి అతని ఎవ్వరికి తెలియకుండగా విడిపించుకుపోతుంది. ఆ చీకట్లో వచ్చినామె ఎవ్వరో కళానిధి గుర్తించలేదు. ఆమె నడక మాటలను బట్టి తాను అంతకుముందు జైలులో చూసి, తనని పెళ్లి చేసుకుంటే జైలు నుండి విడిపిస్తానని చెప్పినా సరళ అనుకుంటాడు. ఆ విశాఖ పరిచారికే సరళ. ఆమె అతని రక్షించడానికి వచ్చినందుకు ఆమె త్యాగానికి ఆమె మాటలోని లాలిత్యానికి కరిగిపోతాడు. సరళనే పెళ్ళి చేసుకుంటే తప్పేముందనుకుంటాడు. సరళ కూడా తనకు తగినదే కదా అనుకుంటాడు.

తాను ప్రేమించిన విశాఖ వచ్చి పెళ్ళి చేసుకోమంటే తన పరిస్థితి ఏమవుతుందోనని మానసికంగా సంఘర్షణ పడతాడు. అంతలో ఆమె వెనుక ఎవరో వస్తున్న శబ్దం వినిపిస్తుంది. వచ్చేదెవరని సరళని అడుగుతాడు. ఆమె తన పరిచారికని చెప్తుంది. ఆ తర్వాత ముగ్గురూ నడుచుకుంటూ కొండమీదకు వెళ్ళిపోతారు. అక్కడున్న ఒక దేవాలయం దగ్గర ఉంగరం మార్చుకొని వివాహం చేసుకుంటారు.

దూరంగా నలుగురు కత్తులతో రాజభటులు వస్తారు. మళ్ళీ వాళ్ళు తనని జైలులో పెట్టడానికి వస్తున్నారనుకుంటాడు కళానిధి. రాజ భటులు తన భర్తను చంపడానికే వచ్చినట్లు భార్య చెప్తుంది. వెంటనే కళానిధి వారితో కలబడి యుద్ధం చేస్తాడు. ఒకడి తలను నరికేస్తాడు. మరొక భటుడు ఆ ఇద్దరి స్త్రీలలో ఒకరిని కత్తితో గాయపరుస్తాడు.

కళానిధి వాన్ని చంపేస్తాడు. మిగితా భటులు కళానిధిని గాయపరిచి పారిపోతారు. కళానిధి పడిపోతాడు.

తెల్లవారిన తర్వాత లేచి చూసేసరికి తనదంతా ఒక 'కల' అనుకుంటాడు. కానీ, గాయాలతో ఒళ్ళంతా నొప్పిగా ఉంటుంది. ఎదురుగా ఉన్న విశాఖను చూసి ఆశ్చర్యపోయి రాత్రి జరిగిన ఆ యుద్ధ విశేషాలు చెప్పి తన భార్య 'సరళ'ను రాజభటులు సరికేసారని ఆమె కోసం తపిస్తుంటాడు. విశాఖ నవ్వుతూ ఆ రాత్రి వివాహం చేసుకున్నది తననే అనీ ఆమెకు గాయమైందని మనకోసం భటులతో తలపడి ఆమె ఆత్మ త్యాగానికి సిద్ధపడిందని, అయినా ఆమె రక్షింపబడిందని చెప్తుంది. ఆమెను పెళ్లి చేసుకుంటానని మాట ఇచ్చినందువల్ల ఆమెను కూడా వివాహం చేసుకోమని విశాఖ కోరుతుంది. అతడు ఆమెను కూడా చేసుకొని సుఖ సంతోషాలతోజీవిస్తాడు.

కథలో శిల్పం బాగుంది. కానీ, వస్తువులో ఏ మాత్రం ఆధునికత కనిపించదు. దీనిని ఆరుద్ర తొలి తెలుగు కథకు పోటి రాదగిన కథ అని అన్నారు.

చాలామంది విమర్శకులు తొలి తెలుగు కథానికగా 'దిద్దుబాటు'ని భావిస్తున్నా దానిలో వేశ్యా లోలత్వానికి గురికాబోయే భర్తను భార్య సంస్కరించడమే వస్తువు. యాంటినాచ్ ఉద్యమంలో తలమునకలైన భర్త గోపాలరావు సానిదాని పాట సరదాలో లగ్నమై పోయి ఆ సరదా అది మనిషి మీద కూడా పరిగెత్తేలా చేస్తుంది. ఆ విషయం తెలిస్తే భార్య కమల తనని నిలదీస్తుందనుకుంటాడు. రాత్రికి ఇంటికి వెళ్ళిన గోపాలరావు భయంతోనే తలుపు తడతాడు. ఇంటిలో భార్య కనిపించదు. నౌకరు రాముడు మాత్రం గోపాలరావుతో వేళాకోళం ఆడుతూ మాట్లాడుతుంటాడు.

తన భార్య కనిపించక పోయేసరికి కోపంతో నౌకర్ని బెదిరించి విషయం అడుగుతాడు. ఆమె పుట్టింటికి వెళ్ళిపోయిందని, చదువు నేర్పారు కనుక ఆ విషయాన్ని ఉత్తరం రాసి పెట్టింది చూసుకోమంటాడు. గోపాలరావు ఆ ఉత్తరం చదివి, బాధపడి తన తప్పు తెలుసుకొని నౌకరుకు డబ్బులు ఇస్తానని చెప్పి ఆమెను తీసుకురమ్మంటాడు. ఇంకెప్పుడూ ఇటువంటి చెడ్డపనులు చేయనని చెప్పమని నౌకరుని బతిమిలాడుకుంటాడు. ఇదంతా గమనిస్తున్న కమలిని మంచం కింద నుండి పైకిలేచి నవ్వుతూ బయటకి వస్తుంది.

ఈ కథ శిల్పం లోను, వస్తువులోను, ఆధునికతను కలిగి ఉంది. కథా నిర్మాణాన్ని పక్కన పెట్టినా, మొదట దిద్దుబాటుని కమలిని పేరుతో గ్రాంథికంలోనే రాసినా, కథ నిండా సంస్కరణోద్యమమే కనిపిస్తుంది. సమకాలీన సమాజం ప్రతిఫలిస్తుంది. సమకాలీన సమాజంలో జరిగే సంస్కరణల భిన్న కోణాలను కూడా ఆవిష్కరించింది. స్త్రీకి విద్య ఉండటం వలన కలిగిన తెలివితేటలతో ఉత్తరం రాయడం. తాను పుట్టింటికి వెళ్ళకుండగానే వెళ్ళిపోతే వచ్చే పరిణామాలను కూడా వివరించగలిగింది.

సంక్షిప్తత, రచనా విధానం, కొసమెరుపు వంటి లక్షణాలు ఆధునిక ఈ కథానికకు సరిపోతున్నాయి. వస్తువు విషయంలో లలిత కథలో లలిత పాత్రలో కనిపించని తెలివితేటలు దిద్దుబాటులోని కమలినిలో కనిపించటం ఒక విశేషం. ధనత్రయోదశిలో కథా నాయిక విజయలక్ష్మి సుగుణవంతురాలు, ఆమె పరిస్థితులకు అనుగుణంగా సర్దుకుపోవడమే తప్ప ఆధునికమైన భావాలేమీ కమలినిలో కనిపించినంతగా ఈమెలో కనిపించవు. తమ పిల్లల్ని పక్క ఇంటిలో వాళ్ళు కొట్టినప్పుడు కూడా ఆ సమయంలో భర్త ఉంటే బాగుండునని అనుకుంటుందే తప్ప, ఆ కొట్టిన స్త్రీని తానేమీ అనలేక పోయింది. ఇలా తొలి తెలుగు ఆధునిక కథలలో కనిపించే వస్తు శిల్ప విషయాలను పరిశీలించినప్పుడు దిద్దుబాటులో ఉన్నంత ఆధునికత మిగతా కథలలో అంతగా లేదు.

ధనత్రయోదశి గాని, లలిత కథలను గానీ మాత్రమే కొంత వరకైనా పోటీ పెట్టగలవేమో గాని స్త్రీవిద్య, విశాఖ కథలను దిద్దుబాటు కథకు పోటీకి సరిపోవు. ప్రాంతీయ అభిమానంతో విశాఖ కథను, స్త్రీవాద ప్రభావంతో స్త్రీవిద్యను ఒక్కొక్కరు తొలితెలుగు ఆధునిక కథలుగా ప్రకటించి ఉంటారు. చారిత్రక పద్ధతిలో చూసినప్పుడు దిద్దుబాటు దగ్గరలో నిలవగలిగే కథ ధనత్రయోదశి మాత్రమే. కనుక, చారిత్రక దృక్కోణంతో ధనత్రయోదశిని తొలి ఆధునిక కథానికగానూ, దానికంటే ఆధునిక కథానికకు ఉండవలసిన ఎక్కువ లక్షణాలు కలిగిన తొలి తెలుగు ఆధునిక కథానికగా దిద్దుబాటుని అంగీకరించటమే సమంజసమని కథలను, విమర్శలను పరిశీలించిన తర్వాత స్పష్టమవుతుంది.

ఈ దృష్టితో చూసినప్పుడు పైన చూసిన వస్తు, శిల్ప వివేచన ప్రకారం దిద్దుబాటు తొలి తెలుగు కథానిక గాను, చారిత్రకంగా ధనత్రయోదశిని తొలితెలుగు ఆధునిక కథలు గా ప్రస్తుతం లభిస్తున్న ఆకరాలను బట్టి నిర్ణయించే అవకాశం కనిపిస్తుంది. అయినా ఈ రచయితలు, రచయిత్రులు తమకి ప్రథమ స్థానం పీఠాలు దక్కాలని కాకుండా, సమాజ సంఘర్షణను ప్రతిఫలింపచేసి, సమస్యల పరిష్కారాన్ని ఆశించిన వారు. ఆ దిశగా ఈ కథలను మనం అర్థం చేసుకోవాలి. ఇలాంటి విభజన కేవలం అకడమిక్‌గా కొంత స్పష్టత కలగడానికేనని గమనించడం చాలా అవసరం.

**ఆధార గ్రంథాలు:**


ఆరుద్ర. *సమగ్ర ఆంధ్ర సాహిత్యం. నాల్గవ సంపుటి*, తెలుగు అకాడమీ: హైదరాబాదు, 2004: 515.

నాగయ్య, జి. *తెలుగు సాహిత్య సమీక్ష (రెం.సం.).* నవ్య పరిశోధక ప్రచురణ: తిరుపతి, 1996: 830

నిర్మల్, భీమ్‌సేన్. *తులనాత్మక పరిశోధనలు (వ్యాసం).* తెలుగులో పరిశోధన, (సం.పా), దేవులపల్లి రామానుజరావు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ: హైదరాబాదు, 1983: 318.

లక్ష్మీకాంతమ్మ, ఊటుకూరి. *ఆంధ్ర కవయిత్రులు.* మెజెస్టిక్ పబ్లికేషన్స్: రాజమండ్రి. 1958:123

వెంకట సుబ్బయ్య, వల్లంపాటి. *కథా శిల్పం.* విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్: హైదరాబాదు, 2000.
వెంకటేశ్వరరావు, దార్ల. *పరిశోధకుడుగా ఆరుద్ర.* పి.హెచ్.డి. అముద్రిత సిద్ధాంత వ్యాసం, హైదరాబాదు విశ్వవిద్యాలయం, 2003: 235, 250.
సత్యవతి, కొండవీటి. *తొలి తెలుగు కథా రచయిత్రి భండారు అచ్చమాంబ (వ్యాసం).* భూమిక (మాసపత్రిక), ప్రత్యేక సంచిక: 2004: 3

**పత్రికలు:**

ఆంధ్రప్రదేశ్, నవంబరు - డిసెంబరు (ప్రత్యేక సంచిక), 1996: పుటలు: 48,49.
ఆంధ్రప్రదేశ్, అక్టోబరు, 1996, పుటలు: 48-50.
ప్రజాకళ (www.prajakala.org) ఇంటర్నెట్ మాసపత్రిక.
అభ్యుదయ (మాసపత్రిక), మార్చి, 1978
భారతి (మాస పత్రిక) డిసెంబరు, 1932.
భూమిక (మాస పత్రిక) ప్రత్యేక సంచిక, 2004: పుట 3

***

# వ్యాసాల ప్రచురణ వివరాలు

ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, కేంద్రసాహిత్య అకాడమీ వారు సంయుక్తంగా నిర్వహించిన జాతీయ సదస్సు (3, 4 అక్టోబరు 2005) లో పాల్గొని వెంటాడిన అవమానం కథపై పత్రాన్ని సమర్పించడానికి అవకాశం కలిగించిన వారు ఆచార్య గుజ్జర్ల మూడి కృపాచారి గారు.

ఈ వ్యాస చర్చలో పాల్గొని అనేక ఆలోచనలు కలిగించిన వారు ఆచార్య పరిమి రామనరసింహం, ఆచార్య తుమ్మల రామకృష్ణ గారలు.

ఈ వ్యాసాన్ని ప్రజాకళ ఆన్‌లైన్ మాస పత్రిక (ఏప్రిల్, 2007) లో ప్రచురించే ముందు దాన్ని చదివి సూచనలు చేసినవారు: ప్రజాకళ ఎడిటర్ సాజీగోపాల్ (USA), ప్రముఖ కథకుడు, అనువాదకుడు, సైంటిస్ట్ ప్రొఫెసర్ ఆరి సీతారామయ్య (Oakland University, Michigan, USA,) గారు.

ఇదే వ్యాసాన్ని నేటినిజం పత్రిక(14-10-2005)లో ప్రచురించి వారు ఎడిటర్ బైసదేవదాసు గారు.

మనసున మనసై నవలపై వ్యాసాన్ని రాయడానికి ప్రేరణ కలిగించి, దాన్ని 1980 తర్వాత తెలుగు స్త్రీవాద నవల గ్రంథం (2008) లో ప్రచురించిన వారు: డా// కె. లక్ష్మీనారాయణ, ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి. ఈ వ్యాసాన్ని ఆన్‌లైన్ మాసపత్రిక 'ఈమాట' (సెప్టెంబరు 2007) లో ప్రచురించిన వారు, ఆ వ్యాసాన్ని చదివి ఎడిట్ చేసి, చర్చలో పాల్గొన్న వారు: ప్రముఖ రచయిత్రి ఇంద్రగంటి పద్మ (USA) గారు.

ఈ వ్యాసాన్ని రెండు వారాల పాటు (16-3-2008, 23-3-2008) ప్రచురించిన వారు: దిహైదరాబాదు మిర్రర్ పత్రిక.

వల్లంపాటి వారి విమర్శ పై వ్యాసాన్ని రాయించి, దాన్ని ఆధునిక సాహిత్య విమర్శకులు ప్రస్థానాలు (2008) గ్రంథంలో ప్రచురించిన వారు: డా//సిహెచ్. లక్ష్మణచక్రవర్తి

ఆ వ్యాసాన్ని ప్రచురణకు ముందే చదివి తగిన సూచనలు చేసి వారు: వల్లంపాటి వెంకట సుబ్బయ్య

ఆ వ్యాసాన్ని వివిధ భాగాలుగా ప్రచురించిన పత్రికలు: ఆంధ్రప్రభ (9-1-2007) విశాలాంధ్ర (29-12-2008)

బండ్ల మూడి హనుమాయమ్మ హిందూ మహిళా డిగ్రీ కళాశాల, గుంటూరు వారు నిర్వహించిన యుజిసి, జాతీయ సదస్సు (22-9-2007) లో సమర్పించిన పత్రం: ముస్లిం మైనారిటీ కవిత్వం లో స్త్రీవాద దృక్పథం. ఇది ఆ కళాశాల వారు ప్రచురించిన ప్రత్యేక సంచికలో ప్రచురితమైంది. దీన్ని ది హైదరాబాదు మిర్రర్ వాళ్ళు ప్రచురించిన తేది: 2-12-2007.

పింగళి లక్ష్మీకాంతం గారిపై పరిశోధనాత్మక వ్యాసాన్ని రాయించి, హైదరాబాదు విశ్వవిద్యాలయం లో జరిపిన జాతీయ సదస్సు (8-11-2005)లో సమర్పించే అవకాశం కలిగించి, తెలుగులో తొలితరం పరిశోధకులు సదస్సు సంచిక (2005)లో ప్రచురించిన వారు: ఆచార్య పరిమి రామనరసింహం గారు.

మల్లవరపు జాన్ కవి గారి సాహిత్యం పై రాసి వ్యాసాన్ని వాఙ్మయి పత్రిక (జూలై-సెప్టెంబరు, 2007)లో ప్రచురించిన ప్రచురించిన వారు: పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు.

ఈ వ్యాసాన్ని ప్రచురించి, దానికి ఉత్తమ వ్యాసంగా బహుమతికి ఎంపిక చేసిన వారు: సాహితీ కౌముది త్రైమాసక పత్రిక (ఫిబ్రవరి-ఏప్రిల్, 2007) మల్ల వరపు జాన్ కవి ప్రత్యేకసంచిక:

కళింగాంధ్ర కవిత్వం పై రాసిన వ్యాసాన్ని ప్రచురించిన వారు ఆంధ్రప్రభ (2007), ప్రజాసాహితి (2007) తెలుగు పీపుల్ డాట్ కామ్ (2007).

అమ్మ నవల పై రాసిన వ్యాసాన్ని ప్రత్యేక సంచిక (మార్చి, 2007) లో ప్రచురించిన వారు ప్రజాసాహితి మాస పత్రిక., దాన్ని పునఃప్రచురణ చేసిన వారు దట్స్తెలుగు డాట్ కామ్(2007).

శంబుక సాహిత్యం పై నిర్వహించిన సదస్సులో పాల్గొనడానికి అవకాశం కలిగించి, వ్యాసాన్ని ప్రత్యేక సంచిక 'శంబుక శకం' (2005)లో ప్రచురించినవారు : డా// కాకాని సుధాకర్, పి. నవజీవన్.

ఆమ్రపాలి పై రాసిన వ్యాసాన్ని రెండు వారాల పాటు (13091998 ; 20 091998) ప్రచురించిన వారు ఆంధ్రభూమి, దీనితో పాటు ఆన్లైన్ మాస పత్రిక ప్రజాకళ (సెప్టెంబరు, 2007),

కులవృత్తి కథ పై రాసిన వ్యాసాన్ని ఆచార్య కొలకలూరి ఇనాక్ విమర్శ గ్రంథం(2009)లో ప్రచురించిన వారు డా//కొలకలూరి మధుజ్యోతి గారు, ఈ వ్యాసాన్ని పునః ప్రచురించిన వారు ప్రజాకళ: (మే, 2007).

సినారె నానీలపై రాసిన వ్యాసాన్ని ప్రచురించిన వారు దట్స్తెలుగు డాట్ కామ్ (14-10-2005)

తెలుగులో తొలి దళిత కథ ఏది? ఎందు వల్ల? వ్యాసాన్ని ప్రచురించిన వారు : విశాలాంధ్ర సాహిత్యానుబంధం (922009), ఇదే వ్యాసాన్ని ఆన్ లైన్ లో ప్రచురించిన పత్రిక : ప్రాణహిత, మార్చి, 2009.

ఇలా నేను రచనలను చేయడానికి సహకరించిన, ప్రోత్సహించిన, బహుమతులు ప్రకటించిన, ముద్రించిన, పునర్ముద్రించిన వారందరికీ నా ప్రత్యేక కృతజ్ఞతలు చెప్పడం నా బాధ్యతగా భావిస్తున్నాను. ఈ వ్యాసాలు చదివి అభిప్రాయాలు రాసిన వాళ్ళున్నారు. ఫోనులో చాలా సేపు మాట్లాడిన వారున్నారు. వారందరికీ కూడా నా ప్రత్యేక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

మీ నిర్మాణాత్మక సూచనలను ఎల్లప్పుడూ ఆశిస్తుంటాను.

-దార్ల వెంకటేశ్వరరావు

# రచయిత
# దార్ల వెంకటేశ్వరరావు పరిచయం

**పుట్టిన ఊరు** : చెయ్యేరు అగ్రహారం, కాట్రేనికోన మండలం, తూర్పు గోదావరి జిల్లా.
**ప్రస్తుతం** : లెక్చరర్, తెలుగు శాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం.
**పుట్టిన తేది** : 05-09-1973
**తల్లిదండ్రులు** : పెదనాగమ్మ, లంకయ్య (అబ్బాయిగారు)
**చదువు** : బి.ఏ. (స్పెషల్ తెలుగులో ఆంధ్రా యూనివర్సిటీ ఫస్ట్)
యస్.కె.బి.ఆర్. కళాశాల, అమలాపురం.
డిప్లొమా (సంస్కృతం), నిజాం కళాశాల, హైదరాబాదు.
PG Diploma in Telugu Language Teaching,
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం
ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి. (తెలుగు)
హైదరాబాదు విశ్వవిద్యాలయం.
ఎం.ఏ. (సమాజశాస్త్రం)
డా|| బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం.

**పరిశోధన వివరాలు:**

ఎం.ఫిల్. (డా|| యస్.టి. జ్ఞానానందకవి గారి ఆమ్రపాలి పరిశీలన) 1998
పిహెచ్.డి. (పరిశోధకుడుగా ఆరుద్ర) 2003

**పరిశోధన ఆసక్తి:**

సాహిత్య విమర్శ, సౌందర్య శాస్త్రం, మాదిగ సాహిత్యం.

**రచనల వివరాలు:**

1. మాదిగ చైతన్యం (కవితా సంకలనం - ఉప సంపాదకత్వం) 1997
2. సాహితీ మూర్తుల ప్రశస్తి (సహాయ సంకలన కర్త) 1997
3. డా|| యస్.టి. జ్ఞానానందకవి ఆమ్రపాలి పరిశీలన, (పరిశోధన గ్రంథం) 1999
4. దళిత తాత్వికుడు ( కవితా సంపుటి) 2004
5. సృజనాత్మక రచనలు చేయటం ఎలా? (అనువర్తిత విమర్శ) 2005
6. సాహితీ సులోచనం (పుస్తక సమీక్షా వ్యాసాలు) 2006
7. ఒక మాదిగ స్మృతి - నాగప్ప గారి సుందర్రాజు (మోనోగ్రాఫ్) 2007
8. దళిత సాహిత్యం: మాదిగ దృక్పథం (సాహిత్య విమర్శ) 2008
9. వీచిక (సాహిత్య విమర్శ) 2009
10. తెలుగు పరిశోధన: ఆరుద్ర దృక్పథం, (పరిశోధన గ్రంథం) ముద్రణలో ఉంది.

**పురస్కారాలు:**

కళాప్రపూర్ణ జయంతి రామయ్య పంతులు స్మారక బహుమతి - 1995
కందుకూరి వీరేశలింగం పంతులు, రాజ్యలక్ష్మి స్మారక బహుమతి - 1995
నండూరి వెంకటరామయ్య & కుటుంబలక్ష్మి స్మారక బహుమతి - 1995
భారతీయ సాహిత్య పరిషత్ రాష్ట్ర శాఖ, రాజమండ్రి - 1996
కళా విశిష్ట పురస్కారం- 2007
డా।। బి.ఆర్.అంబేద్కర్ ఫెలోషిప్ అవార్డ్-
భారతీయ దళిత సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ 2007

**సాధించినవి మరి కొన్ని:**

ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ వారి పరీక్ష ద్వారా స్లెట్ ఉత్తీర్ణత.
రాత పరీక్ష ద్వారా యు.జి.సి. వారి నెట్ ఃరీసెర్చ్ ఫెలోషిప్ సాధించడం.
ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ వారి పరీక్ష ద్వారా
గవర్నమెంట్ జూనియర్ లెక్చరర్గా ఎంపిక.
శ్రీ అనంత పద్మనాభ(యు.జి.సి. ఎయిడెడ్) కళాశాల,
వికారాబాదులోమూడేళ్ళపాటు తెలుగు లెక్చరర్.
ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం, యువవాణి విభాగంలో
కొంతకాలం పాటు క్యాంపియర్.
జాగృతి ఐ.ఏ.ఎస్. స్టడీ సర్కిల్ లో కొంత కాలం లెక్చరర్.

**ఇతర అంశాలు:**

సహాయ కార్యదర్శి, జ్యోత్స్న కళాపీఠం, హైదరాబాదు. (2003 వరకు)
ప్రధాన కార్యదర్శి, తెలుగు సాహిత్య వేదిక,హైదరాబాదు.
సంపాదక వర్గ సభ్యుడు, బహుజన కెరటాలు మాస పత్రిక.
మేనేజింగ్ ట్రస్టు గౌరవ సభ్యుడు: సొసైటీ & ఎడ్యుకేషన్ ట్రస్టు, హైదరాబాదు.
సబ్జెక్ట్ కో ఆర్డినేటర్, స్పెషల్ సెంటర్ ఫర్ ఇంటిగ్రేటెడ్ స్టడీస్,
తెలుగు శాఖ, స్కూల్ ఆఫ్ హ్యూమానిటీస్, హైదరాబాదు విశ్వవిద్యాలయం.

**మాదిగ సంస్కృతి వెబ్:**

మాదిగల సంస్కృతిని ప్రతిబింబించే రచనలు, వీడియోలు, ఫోటోలతో నడుపుతున్న వెబ్ (బ్లాగు) www.madigakavulu.blogspot.com



భారతీయ దళిత సాహిత్య అకాడమీ వారి డా॥ బి.ఆర్. అంబేడ్కర్ రీసెర్చ్ ఫెలోషిప్ అవార్డు స్వీకరిస్తున్న డా॥ దార్ల వెంకటేశ్వరరావు (ఫోటోలో ఎడమ వైపు)

పరిశోధకుడిగా పింగళి లక్ష్మీకాంతం గారి వరివస్యను మదింపు వేసినా, వల్లంపాటి వారి విమర్శ దృక్పథాన్ని విశ్లేషించినా, జ్ఞానానందకవి, మల్లవరపు జాన్ గార్ల పద్యకృతులను అనుశీలించినా, సాహిత్యంలోని ప్రాంతీయతలనూ, మానసిక స్థితిగతులనూ మూల్యాంకన చేసినా, నానీలూ, కథలూ, నవలలూ, అనువాద నవలల్లోని రూప వైవిధ్యాన్ని ఆవిష్కరించినా, దళిత వాద, స్త్రీ వాద, మైనారిటీ వాదాల నేపథ్యంలో ఆ యా రచనల విలువలను నిర్ధారించినా డా॥ దార్ల - తలస్పర్శి అవగాహనతో, నిష్పాక్షికతతో చేసి తన ఉత్తమ విమర్శక లక్షణాన్ని నిరూపించుకున్నారు. ఈ సంపుటిలోని ప్రతి వ్యాసమూ పాఠకుల అవగాహన పరిధులను విస్తరించేదే. ఏదో ఒక కొత్తదనాన్ని ఆలోచనాత్మకంగా అందించేదే. మామూలు మాటల్లో చెప్పాలంటే చదువరి శ్రమకు ప్రతి వ్యాసమూ గిట్టుబాటు అవుతుంది.

- ఆచార్య బేతవోలు రామబ్రహ్మం

